

**శ్రీ ఇవటూరి కామేశ్వరరావు**

జననం : 12.08.1923      లింగైక్యం : 13.10.2003

పశ్చిమగోదావరి జిల్లా, నరసాపురం తాలూకా మినుమంచిలిపాడు అగ్రహారంలో నైష్ఠిక లింగధారి నియోగి కుటుంబంలో వీరి జననం.

తండ్రి శివపూజాదురంధరులు, శ్రీ వీరేశలింగ భూషణరావు గారు, తల్లి సుందరమ్మగారు.

మదరాసులో వారి మేనమామ దగ్గర మెట్రిక్యులేషన్ వరకు చదువుకున్నారు. వీరు Directorate of Agriculture (Hyderabad) లో ఉద్యోగం చేసి పదవీవరణ చేసారు.

వీరికి తెలుగుసాహిత్యం పట్ల అభిరుచి, ప్రేరణ కలగడానికి వీరి మేనమామ గారైన **శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ** గారే కారణం.
(A great Epigraphical and Historical Research Scholar)

భారత్, పాకిస్తాన్, శ్రీలంకతో పాటు వివిధ దేశాల తపాల బిళ్ళల సేకరణ (Philatalist).

ఆత్మీయులు, బంధువులతో కలిసి వివిధ ప్రదేశాలలో ఛాయాచిత్రాలు (Photography) తీయడం వీరి అభిరుచులు.

ఇవటూరి కామేశ్వరరావు రచనలు

# ఇవటూరి కామేశ్వరరావు రచనలు



ఇవటూరి కామేశ్వరరావు రచనలు

ప్రథమ ముద్రణ : 2021

వెల : రూ. 250/-

పుస్తకాల కోసం : నెం. 1-2-215/డి, ఫ్లాట్ నెం. 510,
శివాస్ ప్యాలెస్, స్ట్రీట్ నెం. 10,
జి.హెచ్.ఎమ్.సి. ఆఫీస్ లేన్,
దోమలగూడ, హిమాయత్ నగర్
హైదరాబాద్ - 500029
సెల్ : 98490 76283

డి.టి.పి : మను గ్రాఫిక్స్
చిక్కడపల్లి, హైదరాబాద్
సెల్ : 93 93 83 40 50

ముద్రణ : సతీష్ గ్రాఫిక్స్
చిక్కడపల్లి, హైదరాబాద్
సెల్ : 96 42 14 44 22



గ్రంథకర్త ఇవటూరి కామేశ్వరరావు, శ్రీమతి విజయలక్ష్మి దంపతులు



కామేశ్వరరావుగారితో ఉత్పల సత్యనారాయణాచార్యగారు

మా తాత నాకు చిన్నప్పుడు పలకాబలపం తెచ్చి
ఓ చేతిలో నా తమ్ముడు అభిజిత్ని ఎత్తుకొని
ఇంకో చేత్తో నాకు ఓనమాలతో పాటు
శివలింగాకృతులు బొమ్మలుగా నాకు దిద్దించి
నేర్పించిన స్ఫూర్తితో నే గీసిన తాత, మామ్మ
Digital Painting మీ కోసం...



ప్రేమతో

మోహిత్ ఇనటూరి



## శ్రీ ఇవటూరి కామేశ్వరరావు

**జననం : 12.08.1923 లింగైక్యం : 13.10.2003**

పశ్చిమగోదావరి జిల్లా, నరసాపురం తాలూకా మినుమంచలిపాడు అగ్రహారంలో నైష్ఠిక లింగధారి నియోగి కుటుంబంలో వీరి జననం.

తండ్రి శివపూజాదురంధరులు, శ్రీ వీరేశలింగ భూషణరావు గారు, తల్లి సుందరమ్మగారు.

మదరాసులో వారి మేనమామ దగ్గర మెట్రిక్యులేషన్ వరకు చదువుకున్నారు. వీరు Directorate of Agriculture (Hyderabad) లో ఉద్యోగం చేసి పదవీవరణ చేసారు.

వీరికి తెలుగుసాహిత్యం పట్ల అభిరుచి, ప్రేరణ కలగడానికి వీరి మేనమామ గారైన **శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ** గారే కారణం.
(A great Epigraphical and Historical Research Scholar)

భారత్, పాకిస్తాన్, శ్రీలంకతో పాటు వివిధ దేశాల తపాల బిళ్ళల సేకరణ (Philatalist).

ఆత్మీయులు, బంధువులతో కలిసి వివిధ ప్రదేశాలలో ఛాయాచిత్రాలు (Photography) తీయడం వీరి అభిరుచులు.


Jnanpith Awardee
Dr. C. Narayana Reddy M.P.
M.A. Ph.d. D.litt.

CHAIRMAN
Andhra Pradesh State Cultural Council
Government of Andhra Pradesh
Kalabhavan, Hyderabad - 500 004.
Phone : (O) 3214603 (R) 3548451
Fax : (O) 3214603





జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఎం.పి.
ఎం.ఏ. పిహెచ్.డి. డి.లిట్.

అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు - 500 004
ఫోన్ (ఆ) 3214603 (ని) 3548451
ఫాక్స్ (ఆ) 3214603


4. 11. 03

హార్దిక సంతాపం

ఏళ్ల తరబడిగా నాకు ఎంతో ఆత్మీయుడుగా ఉన్న ఇవటూరి కామేశ్వరరావు గారు పరమపదించారని తెలుసుకుని విచారిస్తున్నాను.

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి మేనల్లుడుగా నాకు పరిచితులైన కామేశ్వరరావు గారు నాకు, మా కుటుంబ సభ్యులకు అత్యంత ఆప్తుడయ్యాడు. నిత్య దరహాసిగా, కవితాభిలాషిగా ఉన్న కామేశ్వరరావు గారి నిర్యాణం పట్ల నా హార్దిక సంతాపం తెలియజేస్తున్నాను.

కామేశ్వరరావు గారి శ్రీమతికీ, కుటుంబ సభ్యులకు నా సంతాపాన్ని అందిస్తున్నాను.

(signature)

మేము భక్తి ప్రచారం చేస్తున్న యూట్యూబ్ వీడియో

**channels & Blogs వీక్షించండి - షేర్ చేయండి**

**GITAMAKARANDAM**
**https://www.youtube.com/channel/UC3DYg27nM2FSLxGUoFVU1Ag**
**CHAITANYA SWARANJALI**
**https://www.youtube.com/channel/UCbOjdEsM-ydRNPOkK8x3gxg**
**BHARATH CHAITANYA JYOTHI**
**https://www.youtube.com/channel/UChepWHMrkfiHpu-bOPtVN9Q**
**JAI GIRIDHARI :**
**https://www.youtube.com/channel/UCpo1UiGElSogY_CN0Oh4rhg**
**HINDU BHAKTI DEVOTIONAL:**
**https://www.youtube.com/channel/UCBScnPxbLKRf7DDgQ36HDwQ**
**chaitanya bhagavadgita**
**https://www.youtube.com/channel/UCshDcQig7mm8Glgf_RhVHVg**
**https://telugudevotionalswaranjali.blogspot.com/2020/12/bhakti-links-2.html**
**https://gitamakarandam.blogspot.com/2020/08/bhakti-links-2.html**
**https://hindudevotionalswaranjali.blogspot.com/**
**https://sundaravignanagrandalayam.blogspot.com/**
**other blogs**
**https://telangana-gundechappudu.blogspot.com/**
**https://bharathrashtrasamithi.blogspot.com/**
**https://archive.org/details/@sudarshan_reddy330**

## విషయసూచిక

**నాటికలు :**



**కథలు :**



**వ్యాసాలు :**



**రాజకీయ సమీక్షలు :**



## శ్రీ ఇవటూరి కామేశ్వరరావు

**జననం : 12.08.1923 లింగైక్యం : 13.10.2003**

పశ్చిమగోదావరి జిల్లా, నరసాపురం తాలూకా మినుమంచలిపాడు అగ్రహారంలో నైష్ఠిక లింగధారి నియోగి కుటుంబంలో వీరి జననం.

తండ్రి శివపూజాదురంధరులు, శ్రీ వీరేశలింగ భూషణరావు గారు, తల్లి సుందరమ్మగారు.

మదరాసులో వారి మేనమామ దగ్గర మెట్రిక్యులేషన్ వరకు చదువుకున్నారు. వీరు Directorate of Agriculture (Hyderabad) లో ఉద్యోగం చేసి పదవీవరణ చేసారు.

వీరికి తెలుగుసాహిత్యం పట్ల అభిరుచి, ప్రేరణ కలగడానికి వీరి మేనమామ గారైన **శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ** గారే కారణం.
(A great Epigraphical and Historical Research Scholar)

భారత్, పాకిస్తాన్, శ్రీలంకతో పాటు వివిధ దేశాల తపాల బిళ్ళల సేకరణ (Philatalist).

ఆత్మీయులు, బంధువులతో కలిసి వివిధ ప్రదేశాలలో ఛాయాచిత్రాలు (Photography) తీయడం వీరి అభిరుచులు.

ముందుమాటలు


పద్మశ్రీ, జ్ఞానపీఠ్-మూర్తిదేవి స్వీకర్త
కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు, తెలుగుభారతి గ్రహీత
ఆచార్య కొలకలూరి ఇనాక్
ఆంధ్రాచార్యులు & సాహితీస్రష్ట

పూర్వ అధ్యక్షులు: ఆం.ప్ర. సాహిత్య అకాడమి, అమరావతి
పూర్వ ఉపాధ్యక్షులు: శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి
పూర్వ అధ్యక్షులు: శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ కళాశాల, అనంతపురం
e-mail: k.enoch@yahoo.com
సెల్: 94402 43433

4-282, యస్.ఎస్.నగర్, మీర్‌పేట్
హైదరాబాద్-500 097, తెలంగాణ &
జి.యఫ్-3, నీహారికా అపార్టుమెంట్స్
గాయత్రినగర్, తిరుపతి - 517 502
ఆంధ్ర ప్రదేశ్


# అభినందన

'ఇవటూరి కామేశ్వరరావు రచనలు' ముద్రింపజేస్తున్న శ్రీ ఇవటూరి మల్లికార్జున శాయి, పుస్తకం చేతికిచ్చి ముందుమాట వ్రాయమంటే ఆనందించాను.

శ్రీ శాయిని నా మిత్రులు డి.టి.పి చేసే శ్రీ కుదుపూడి భాస్కరరావు, సతీష్ గ్రాఫిక్స్ ద్వారా పుస్తక ముద్రణ కార్యక్రమాలు చేసే శ్రీ కమటం సతీష్ పరిచయం చేశారు.

ఈ గ్రంథం చదువుతుంటే మహోత్తమ మానవతా మూర్తి, కీ.శే.మల్లంపల్లి సోమశేఖర శర్మ పేరు చాలా సందర్భాలలో ఎదురయింది. ఈ గ్రంథకర్త వారి మేనల్లుడని, వారింట ఉండి చదువుకొన్నాడని, వీరికీ సాహిత్యస్ఫూర్తి వారివల్ల కలిగిందని మాత్రమేకాక, వారిపట్ల ఈ గ్రంథకర్తకు విశేష గౌరవం ఉందని, అనేక రచనలవల్ల అర్థమయింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు బి.ఏ ఆనర్సు చదువుకొన్న మాకు (1956-59) పాఠం చెప్పిన చరిత్ర అధ్యాపకుడు కీ.శే.మల్లంపల్లి సోమశేఖరశర్మ పేరుచూచి వళ్లు పులకించింది. అది మధురస్మృతి.

కీ.శే.ఇవటూరి కామేశ్వరరావు, కవిత్వం, కథలు, నాటికలు, బాలసాహిత్యం రచయితగా, రాజకీయ వ్యాసాల స్రష్టగా ప్రసిద్ధులు. భారతి మొదలైన పత్రికల్లో

రచనలు, ఆకాశవాణిలో నాటికలు విరివిగా వచ్చాయి. వాటిని, సేకరించి, ఈ గ్రంథం ముద్రిస్తున్న, గ్రంథకర్త పుత్రులు శ్రీ ఇవటూరి శాయి అభినందనీయులు. ఈ గ్రంథ రచయిత పట్ల ప్రేమతో వారి చిరంజీవులు బంధువులు, ఈ గ్రంథారంభంలో వాళ్ళ ముందు మాటల్లో తమ ఆత్మీయతను తెలపటం ఆనందదాయకంగా ఉంది.

కీ.శే.ఇవటూరి కామేశ్వరరావు 1953-54 సంవత్సరాలలో 'తెలుగు స్వతంత్ర'లో రాజకీయ వ్యాసాలు వ్రాసిన ప్రసిద్ధుడు. సమకాలీన సమస్యలమీద తన అభిప్రాయాలు ముక్కుసూటిగా వ్రాశాడు. ఈ విద్యావేత్త సమాజ అవగాహన ఆశ్చర్యం కలిగించేంత అభ్యుదయ కారకంగా ఉంది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే మద్రాసు పరిస్థితి ఏమిటి? బళ్ళారి ఏ రాష్ట్రంలో ఉంటుంది? రాయలసీమ అభివృద్ధి ఎలా జరుగుతుంది? రాజకీయ పక్షాల కుమ్ములాటలు ఎలా ఉంటాయి? ఆంధ్రరాష్ట్ర రాజధాని సమస్య ఏమిటి? శ్రీబాగ్ ఒప్పందం, కర్నూలు నిర్ణయం, మిశ్రా తీర్పు, పొట్టి శ్రీరాములు త్యాగం, చాలా శాస్త్రీయంగా, నిష్పక్షపాతంగా, ధర్మదృష్టితో, సత్యసందర్శనంగా, నిశితదృక్పథంతో పరిశీలించి వ్యాసాలు వ్రాశాడు. ఈ గ్రంథకర్త సమకాలీన సమస్యలమీద మంచి పట్టు ఉన్న ప్రఖ్యాతుడు ఈ రచయిత.

కీ.శే.ఇవటూరి కామేశ్వరరావు మంచి నాటికలు వ్రాసి, ఆకాశవాణి బాలానందంలో ప్రసారం చేయించాడు. ఇవి చారిత్రాత్మకంగా, పౌరాణికంగా, సమకాలీన జీవిత ప్రదర్శకంగా ఉన్నాయి. కుమారుని పెళ్ళి, గాలిమేడలు, కొంగకథ వంటి నీతి విషయాలు, దక్షారామం, శ్రీశైలం, కాళేశ్వరం వంటి స్థల మాహాత్మ్యాలు, అష్టావక్రుడు, నచికేతుడు, శ్రీకృష్ణుడు, గణేశుడు వంటి దైవాంశసంభూతులు బాలల నాటికల్లో ప్రముఖ పాత్రలు. నాటికా రచనలలో చేయితిరిగిన రచయిత. సంభాషణలు అలవోకగా నడిపాడు. చమత్కార స్ఫోరకంగా వాగ్వాదాలు కల్పించాడు. పాత్ర సృష్టిలో నైపుణ్యం చూపాడు. బాలానందం పసివాళ్ళకు సద్బుద్ధి నేర్పే దృష్టితో మంచి నాటికలు వ్రాశాడు. నాటికాశిల్ప మర్మం గుర్తెరిగి రచన కావించాడు.

భారతి, స్రవంతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికల్లో కథలు వ్రాశాడు ఈ గ్రంథకర్త. 'కొత్తగౌను' మంచి కథ.

సాహిత్య సృజనం ప్రారంభించినప్పటి నుంచి ఉద్యోగ విరమణ చేసిన తరువాత కూడా కవిత్వం వ్రాస్తూ వచ్చాడు కీ.శే.ఇవటూరి కామేశ్వరరావు.



'అమ్మ మాటలోన సకల
వేద సారములుండు' అనే సత్యం ఈ కవిని శాసించింది.
'అలిని హింసించి
తల్లికి అమ్ముడు బోయిన చవట'ను కూడా కవి చూశాడు.
'ఎర్రకోట ప్రాకార వేదిక
మువ్వన్నియ జండా నీడను' పరికించాడు... పలికించాడు కవి.

కీ.శే. ఇవటూరి కామేశ్వరరావు, కవితలు, కథలు, వ్యాసాలు, నాటికలు అనేకం వ్రాసినా, కవి ఆత్మ నాటికల్లో రాటుదేలింది. పరిణతి సాధించింది.

ఈ గ్రంథకర్త భావజాలంలో అభ్యుదయ దృష్టి, ఆచరణ యోగ్యమయిన ఆలోచన ప్రస్ఫుటంగా కనిపిస్తూ ఉండటం సంతోషదాయకం.

తండ్రిని, ఆరాధించి, భవిష్యత్తుకు భద్రపరచాలనుకొనే వీరి చిరంజీవులు ధన్యులు.

సమకాలీన సమస్యల మీద మంచి పరిష్కారం చెప్పిన వ్యాసాలు, గ్రంథకర్తను సమర్థుడుగా చూపించాయి. బాలబాలికల కోసం వ్రాసిన నాటికలు, పిల్లల భవిష్యత్తు ప్రదర్శించే అంత పటిష్ఠంగా ఉన్నాయి. ఇన్ని రచనల్లో వీరి నాటికలు చిరకాలం నిలుస్తాయి.

మంచి సాహితీమూర్తి కీ.శే. ఇవటూరి కామేశ్వరరావును మరల తలుచుకోవటం తెలుగు సాహిత్యానికి శుభదాయకం. శోభస్కరం.

శుభాకాంక్షలతో...

11.7.2021 **(కొలకలూరి ఇనాక్)**

# ఈ తరం గుర్తించాల్సిన ఓ మంచి రచయిత

**మ**ల్లంపల్లి వారి పాదులో మొలక శ్రీఇవటూరి కామేశ్వరరావు గారు. మధ్య తరగతి సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబం. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సోదరి కుమారులు వీరు. చిన్నతనం నుండే శర్మగారింటనే మద్రాసులో ఉన్నారు. నిత్యం శర్మగారింటికి వచ్చిపోయే సాహితీవేత్తలు, చరిత్రకారులను దగ్గరగా చూస్తుండడం, వాళ్ళ చర్చలను అర్థం అయీ కానీ స్థితిలో దూరంగా వింటూండడం వల్ల కామేశ్వరరావుగారికి సాహిత్యం పట్ల సాహితీ రచనల అధ్యయనం పట్ల ఆసక్తి కలిగింది. అదే వారితో పాటే పెరిగి రచనాశక్తిగా బయటపడింది అనవచ్చు. మధ్య తరగతి వారికి వీరిచే చాధోపశమనాలకు అటు సంగీత శ్రవణం కానీ, రచనా వ్యాసంగం కానీ తోడ్పడతాయి. వీరికి ఆ విధంగా తెలుగులో సృజనాశక్తి ఇదిగో ఇలా రచనలలో బయటపడింది.

కామేశ్వరరావుగారి రచనలలో నుంచి కొన్ని కవితలనూ, నాటికలనూ, కథలనూ, వ్యాసాలనూ కొన్నిటిని సేకరించి ఇలా ఓ సంపుటిగా వారి కుమారులు తెలుగు పాఠకుల కందిస్తున్నారు.

కామేశ్వరరావుగారు అనేక అంశాలను వస్తువుగా స్వీకరించి ఇలా వివిధ ప్రక్రియల ద్వారా వెలువర్చారు. వీరి దృష్టిలో సామాన్యుడే వీరి పాఠకుడు. అందుకని వీరు తీసుకున్న వస్తువేదైనా సామాన్యుడికి అర్థం అయ్యే భాషలో – ఆయా ప్రక్రియల్లో ఇమిడ్చారు. శబ్దాడంబరాలకు పోయిన దాఖలాలు లేవు. ఆర్ష సాంప్రదాయానికి చెందిన అంశాలను వస్తువుగా స్వీకరించిన సందర్భాల్లో అక్కడ కూడా గ్రాంథిక వాసనలు కనబడ్తాయి. అలా క్షేత్రమహాత్యాలను వివరించిన నాటికల్లో డాక్యుమెంటరీ పద్ధతిలో సాగిన రచనల్లోనూ అడపాదడపా పదాడంబరాలున్నాయి. సాంఘిక నాటికలన్నీ సూటిగా చక్కటి తెలుగుదనంతో పాఠకులను ఆకట్టుకునే విధంగా



నడుస్తాయి. వీరికి నాటికా రచనమీద మిగిలిన ప్రక్రియల కన్నా అభిమానం పట్టు ఎక్కువనిపిస్తుంది. ఇక్కడ సంప్రదాయ నాటికలో రచనలో వస్తువును అందించడం మీద శ్రద్ధ తీసుకున్నారు. తన భావాలను పాఠకులకందించడానికి రచయితకు నాటికే ప్రధాన వాహకం అన్న అభిప్రాయం ఉంది. అది నిజం కూడాను. "నాటకాంతం హి సాహిత్యం" అన్నారు కథా పెద్దలు. ఈ కోవలోని ఇందులోని చిన్న చిన్న రూపకాలు. చాలా వరకూ ప్రదర్శనయోగ్యాలు కూడాను.

ఇక కవితలను చూస్తే వీరి భావాలను గణాల మాత్రల మేకు బందీలు మధ్య చిదగొట్టలేదు. చాలావరకూ గాన యోగ్యాలే. ఇవటూరి వారికి 'సిరిసిరిమువ్వ' మీద అభిమానం ఉన్నట్టు అనిపిస్తుంది. సిరి అంటే సంపద అనీ, విషం అని కూడా అర్థం ఉండడం అందరకూ తెలిసిందే. వీరి కష్టసుఖాలకు ప్రతీకలని వీటిని భావించారనుకోవచ్చు. ఇందులోని ఓ వ్యాసంలో రచయిత ఈ మాటే అంటూ తానే సమయంలో రాసిన గాని గేయాల పంక్తుల్ని కూడా ఉదాహరిస్తారు. కళ్యాణగీతికల్లో వధూవరులనాశీర్వదిస్తారు. అన్నిటికన్నా రూపాయి విలువ పతనాన్నీ, దీని గత ప్రాభవాన్నీ 'పాపం– రూపాయి' అన్న గేయంలో చాలా వ్యంగ్యంగా రూపు కట్టించారు రచయిత. తన మేనమామగారి మీద ఉన్న భక్తి ప్రపత్తులనూ – గౌరవాన్నీ ఓ కవితలో ప్రస్ఫుటీకరించారు. గేయానికి మూలం గాయం అన్నారు. అందుకే రచయిత మనస్సులోని వివిధ సందర్భాల్లోని భావాలను గేయాల ద్వారా వెల్లడించారు.

కొన్ని కథలు సామాజికాంశాలను తడిమితే కొన్ని వ్యాసాలు ఆలోచింపచేసేవిలా ఉన్నాయి. ముఖ్యంగా గణేశచవితి అన్నదాంట్లో పండుగలు అందించడంతో తిలక్ లాంటి మహాత్ములూ జాతీయ ఉద్యమస్పృహను జనంలో ఆనాడు రగుల్కొల్పారో చాలా ఆసక్తి కలిగించేలా రాశారు.

వీరి రచనలన్నీ చాలా భాగం ఆత్మాశ్రయాలు. స్వీయానుభూతి ప్రదర్శకాలు. పాండిత్యం లేకపోవడం ఈ రచయితకు అందివచ్చిన ఒక వరం. అందుకే రచనల్లో పదాడంబరాలు లేవు. సమాసాల మస్కాలు లేవు. భాష వీలయినంత సరళంగా ఉంది. వచనంలో కానీ గేయంలో కానీ క్లుప్తత – స్పష్టతా సుబోధకతలను సంతరించుకున్నాయి. ఇలా ఈ నాలుగు ముక్కలూ రాయడాన్ని వెనుకడ చిన్నపాటి కథే ఉంది.

నేను 1980 లలో కొంపెల్ల జనార్ధనరావు జీవితం- సాహిత్యం మీద విషయ సేకరణ చేస్తున్న సందర్భంలో మల్లంపల్లి సోమశేఖరశర్మగారి కోడలిని విద్యానగర్‌లో సంప్రదించడం జరిగింది. వీరు మల్లంపల్లి వారి మేనల్లుడు కామేశ్వరరావు గారిని హిమాయత్‌నగర్‌లో కలవమని చెప్పారు. అలా ఇవటూరి వారితో నా పరిచయం మొదలై సుమారు రెండు మూడు సంవత్సరాలు కొనసాగింది. నేను వారింటికెళ్ళడం సాయంకాలాలు వారు మా ఇంటికి రావడం జరుగుతూ అనేకానేక ఆనాటి సాహిత్య రచన విశేషాలను గురించి ఆసక్తిగా చర్చిస్తూండేవాళ్ళం. వారు నా కంటే చాలాపెద్ద. కానీ వారి రచన గురించి చెప్పడమే కానీ నాకు చూపించలేడు. ఆనాటి భారతి, స్వతంత్రస్రవంతి గూర్చి ప్రముఖ పత్రికలలో వచ్చాయని అంటుండేవారు. ఆ కొద్దిపాటి మా పరిచయమే నా చేత ఈ ముందుమాట రాయించిందనవచ్చు.

తండ్రి రచనలను సేకరించి ఇలా సంపుటీకరించి ప్రచురించటం ప్రశంసించాల్సిన సందర్భం. వారి కృషిని పాఠకులు గుర్తిస్తూ ఓ మంచి రచయితను ఈ తరం పాఠకులకు పరిచయంచేస్తున్న ఈ గ్రంథానికి స్వాగతం పలుకుదాం. సాహితీ లోకంలో ఈ రచయిత స్థానాన్ని పదిలపరుద్దాం.

**-ఏటుకూరి ప్రసాద్**



# స్ఫూర్తిపథంలో దిక్సూచి

**'కీ.శే.** ఇవటూరి కామేశ్వరరావుగారు కిందటితరం రచయితల్లో పేరెన్నిక గన్నవారు. వారి రచనల సంకలనం ఇది. కుటుంబసభ్యుల కోరిక; ప్రత్యేకించి వారి నాలుగవ సంతానం (రెండవ కుమారుడు) మల్లికార్జునసాయి పూనిక ఈ సంకలనం వెలుగుకి కారణమౌతున్నాయి. దివంగత జనకునికి సమార్పమైనది వారి ప్రయత్న సాఫల్యం.

కుటుంబసభ్యుల నివాళి నుండి మనకు తెలిసి బాధకలిగించే విషయం-కామేశ్వర రావుగారు-మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబానికి చెందిన వ్యక్తిగా-చాలా కష్టజీవి అని! అయితే, సంతోషం కలిగించే విషయం ఏమిటంటే-వారు ఉత్తమ గుణశీలి అని; మానవీయ విలువల ఆరాధకులనీ, నూరుశాతం బాధ్యతగల పౌరులనీ తెలియటం. ఈ ఉన్నతమైన వ్యక్తిత్వం కల కామేశ్వరరావుగారు-తెలుగునాట చరిత్ర పరిశోధకులుగా, 'డిగ్రీలులేని చదువు'తో అధ్యాపక, అధ్యాపన పదవీనిర్వహణకే వన్నెతెచ్చిన విరాణ్మూర్తి మల్లంపల్లి సోమశేఖరశర్మగారి మేలనల్లుడు! శర్మగారింట ఉండి, చదువుకోవటమేకాక, వారి జ్ఞానవిజ్ఞాన వ్యక్తిత్వ సాహిత్య, సాంస్కృతిక సంపత్తిని అందుకోగలిగిన ధన్యులైనారు!

కామేశ్వరరావుగారు సృజనశీలిగా కవితల్నీ, నాటికల్నీ, కథలనూ, వ్యాసాల్నీ రాసి ప్రసిద్ధులైనారు. ఆనాటి పాఠకుల, రేడియో శ్రోతల అభిమాన రచయిత అయినారు.

ఈ సంకలనంలో కామేశ్వరరావుగారి గేయాలూ, కవితలూ నిరాడంబరశైలిలో, భావపుష్టితో ఉన్నాయి. 'మధ్యమధ్య మాట్లాడేదంతా యథార్థం / బాధ కలిగిస్తుందరికి /వేదన తీరనప్పుడు / బోధనలెన్నైతేయేం సిరిసిరిమువ్వా!' అని మొదలైన 'సిరిసిరిమువ్వ' పద్యాలు వాస్తవికతాదర్శనాలు.

'దూరాన్నుంచీ వచ్చిన ఉత్తరం' కవిత సార్వకాలీనమైన రచన. మరీముఖ్యంగా -ఈనాడు కనుమరుగవుతున్న ఉత్తరాల సందర్భంలో ఎంతో ప్రాసంగికతనీ, సంభావ్యతనీ సంతరించుకున్నది.

'ఉత్తరంలో ప్రాణం ఉంది
ఉత్తరంలో గానం ఉంది
ప్రాణంతో మరి గానంతో
కదిలే మెదిలే చైతన్యవిహంగం ఉత్తరం" అన్నారు!

అవును. ఆ చైతన్యవిహంగం అందించే ఊసులు, గోసలు, ఆనందవిషాద వృత్తాంతాలు-అన్నీ మనిషితనానికి ప్రేమైక చిహ్నాలు కదా!

ఉగాది కవితలు ఆనాటి సందర్భోచితవర్తమానతతో ఆలోచనీయంగా సాగాయి.

రూపాయి ప్రమాణం పడిపోవటం గురించి గాఢమైన సమాలోచనతో ఒక Elegy రాశారు కామేశ్వరరావుగారు!

కామేశ్వరరావుగారి నాటికలు / రేడియో నాటికలు వస్తురూప నిర్దిష్టతతో, భావితరాలు తెలుసుకోవలసిన అర్థస్ఫూర్తితో సాగాయి. సాంఘిక నాటకాలు-అప్పుల తిప్పలు, మోసాలు, పశ్చాత్తాపాలు (వర్తకుని మోసం); గాలిమేడలు కడితే పేలపిండిలా ఎగిరిపోతాయి (గాలిమేడలు); జాలరుల చేపలవేటలో భయంనీడే అయినా జీవికకి ఆ వృత్తి తప్పదు (భయం) వంటి సూక్తులు, హితోక్తులూ అందించారు.

ఆంధ్రజాతి వైతాళికులు 'ఆంధ్రరత్న' గురించీ, అపర అన్నపూర్ణ-డొక్కా సీతమ్మగారి గురించీ దిక్సూచికల్ని వెలయించారు.

పుణ్యక్షేత్ర దర్శనాన్ని కలిగిస్తూ – 'దక్షారామం', 'శ్రీశైలం', 'కాళేశ్వరం' విశేషాలు చెప్పారు. ఈ నాటికల్లో కామేశ్వరరావుగారి సంభాషణల రచనల్లో ఒక లయ, ఒక తూగు, ఒక ఉద్వేగం, ఒక మాధుర్యం తాండవించాయి. 'ఈ క్షేత్రంలో ప్రవాహం శివరూపం; ఇక్కడి శిలలన్నీ లింగరూపాలు; ఇసుక దేవతాస్వరూపం; మట్టి అమృతం; నదీతీరాలు బ్రహ్మవిష్ణు రూపాలు; వృక్షాలు మునీశ్వరులు, లతలు మునిపత్నులు' – ఇదీ రచనా విన్నాణం, శైలీనైపుణ్యం ఇలాంటి విశేషాలు కామేశ్వరరావుగారి సాహిత్య సంప్రదాయ విజ్ఞతకి దృష్టాంతాలు!

పౌరాణిక గాథాశకలాల్ని తీసుకుని చాలా నాటికల్ని పండించారు కామేశ్వరరావు గారు. 'అష్టావక్రుడు', 'నచికేతుడు', 'గురుభక్తి', 'ఉదంకుడు'-వంటివి చక్కని నాటకీయతతో, ఉత్కంఠభరితంగా రూపొందాయి.

రావుగారు 'కొత్తగౌను' అని చాలామంచి చిన్నకథనీ రాశారు.



ఈ సంకలనానికి వన్నెతెచ్చిన మరో రచనావిభాగం-రావుగారి వ్యాసపరంపర. వీటిని రాజకీయ సమీక్షలు అన్నారు. రాయలసీమ-ఆంధ్రరాష్ట్రం; ఆంధ్రరాష్ట్రం-మద్రాసు సమస్య; ఆంధ్రరాష్ట్రం వివిధ రాజకీయ పక్షాలు; కన్నడ సోదరుల వితండవాదం; శ్రీబాగ్ ఒడంబడిక-రాజధాని; కర్నూలు నిర్ణయం-మన నాయకుల పతనం; మిశ్రాతీర్పు; నవ్యాంధ్రలో ప్రజాస్వామ్య పునరుద్ధరణ?; ఆంధ్రలో మద్యనిషేధం రద్దౌతుందా? – అనే వ్యాసాల్లో రావుగారికి సామాజిక రాజకీయ ఆర్థిక విషయాలపైగల కూలంకష అవగాహన విశ్లేషణాధిషణ కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. ఆ రచనల్లో వారి సంవేదనాత్మ ప్రస్ఫుటమౌతుంది. అంతేగాక – రాగల, కాగల భవిష్యత్ దర్శనం కళ్లముందు నిలుస్తుంది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడబోయే ముందువెనుకల ఈ వ్యాసాలు తెలుగు స్వతంత్రలో ప్రచురితమైనాయి. ఈనాటికీ వాటిలోని చాలా అంశాలు, సమస్యలు అపరిష్కృతంగానే వుండి జనబాహుళ్యానికి ఆందోళన కలిగించటం చూస్తే-రావు గారి వంటి చిత్తశుద్ధిగల విశ్లేషకుల పౌరుల-ఆనాటి దార్శనికత ఎంతో గొప్పగా అనిపిస్తుంది. రావుగారి వ్యాసాల్లో మరో ఆణిముత్యం-అమరజీవి గురించి రాసినది.

ఇవటూరి కామేశ్వరరావుగారి రచనలు-సంఖ్యాపరంగా తక్కువే అయినా, వాసిపరంగా అవి అందిస్తున్న స్ఫూర్తి, ప్రేరణా ఎంతో ఎంతో ఎక్కువ!

తెలుగు సాహితీలోకం ఇలాంటి రచనల్ని ఆదరించి ప్రయోజనంపొందుతారని ఆశిద్దాం.

సాయిగారికీ, వారి తరపు వారందరికీ ధన్యవాదాలు, అభినందనలు. నేనీ ముందుమాట రాయటానికి కారణమైన మా భాస్కర్, సతీష్‌ల ప్రమేయానికీ నమస్సులు!

శుభాకాంక్షలతో...

-విహారి

హైదరాబాద్
20.07.2021

'ఉత్తరంలో ప్రాణం ఉంది
ఉత్తరంలో గానం ఉంది
ప్రాణంతో మరి గానంతో
కదిలే మెదిలే చైతన్యవిహంగం ఉత్తరం" అన్నారు!

అవును. ఆ చైతన్యవిహంగం అందించే ఊసులు, గోసలు, ఆనందవిషాద వృత్తాంతాలు-అన్నీ మనిషితనానికి ప్రేమైక చిహ్నాలు కదా!

ఉగాది కవితలు ఆనాటి సందర్భోచితవర్తమానతతో ఆలోచనీయంగా సాగాయి.

రూపాయి ప్రమాణం పడిపోవటం గురించి గాఢమైన సమాలోచనతో ఒక Elegy రాశారు కామేశ్వరరావుగారు!

కామేశ్వరరావుగారి నాటికలు / రేడియో నాటికలు వస్తురూప నిర్దిష్టతతో, భావితరాలు తెలుసుకోవలసిన అర్థస్ఫూర్తితో సాగాయి. సాంఘిక నాటకాలు-అప్పుల తిప్పలు, మోసాలు, పశ్చాత్తాపాలు (వర్తకుని మోసం); గాలిమేడలు కడితే పేలపిండిలా ఎగిరిపోతాయి (గాలిమేడలు); జాలరుల చేపలవేటలో భయంనీడే అయినా జీవికకి ఆ వృత్తి తప్పదు (భయం) వంటి సూక్తులు, హితోక్తులూ అందించారు.

ఆంధ్రజాతి వైతాళికులు 'ఆంధ్రరత్న' గురించీ, అపర అన్నపూర్ణ-డొక్కా సీతమ్మగారి గురించీ దిక్సూచికల్ని వెలయించారు.

పుణ్యక్షేత్ర దర్శనాన్ని కలిగిస్తూ - 'దక్షారామం', 'శ్రీశైలం', 'కాళేశ్వరం' విశేషాలు చెప్పారు. ఈ నాటికల్లో కామేశ్వరరావుగారి సంభాషణల రచనల్లో ఒక లయ, ఒక తూగు, ఒక ఉద్వేగం, ఒక మాధుర్యం తాండవించాయి. 'ఈ క్షేత్రంలో ప్రవాహం శివరూపం; ఇక్కడి శిలలన్నీ లింగరూపాలు; ఇసుక దేవతాస్వరూపం; మట్టి అమృతం; నదీతీరాలు బ్రహ్మవిష్ణు రూపాలు; వృక్షాలు మునీశ్వరులు, లతలు మునిపత్నులు' - ఇదీ రచనా విన్నాణం, శైలీనైపుణ్యం ఇలాంటి విశేషాలు కామేశ్వరరావుగారి సాహిత్య సంప్రదాయ విజ్ఞతకి దృష్టాంతాలు!

పౌరాణిక గాథాశకలాల్ని తీసుకుని చాలా నాటికల్ని పండించారు కామేశ్వరరావు గారు. 'అష్టావక్రుడు', 'నచికేతుడు', 'గురుభక్తి', 'ఉదంకుడు'-వంటివి చక్కని నాటకీయతతో, ఉత్కంఠభరితంగా రూపొందాయి.

రావుగారు 'కొత్తగౌను' అని చాలామంచి చిన్నకథనీ రాశారు.



ఈ సంకలనానికి వన్నెతెచ్చిన మరో రచనావిభాగం-రావుగారి వ్యాసపరంపర. వీటిని రాజకీయ సమీక్షలు అన్నారు. రాయలసీమ-ఆంధ్రరాష్ట్రం; ఆంధ్రరాష్ట్రం-మద్రాసు సమస్య; ఆంధ్రరాష్ట్రం వివిధ రాజకీయ పక్షాలు; కన్నడ సోదరుల వితండవాదం; శ్రీబాగ్ ఒడంబడిక-రాజధాని; కర్నూలు నిర్ణయం-మన నాయకుల పతనం; మిశ్రాతీర్పు; నవ్యాంధ్రలో ప్రజాస్వామ్య పునరుద్ధరణ?; ఆంధ్రలో మద్యనిషేధం రద్దౌతుందా?- అనే వ్యాసాల్లో రావుగారికి సామాజిక రాజకీయ ఆర్థిక విషయాలపైగల కూలంకష అవగాహన విశ్లేషణాధిషణ కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. ఆ రచనల్లో వారి సంవేదనాత్మ ప్రస్ఫుటమౌతుంది. అంతేగాక - రాగల, కాగల భవిష్యత్ దర్శనం కళ్లముందు నిలుస్తుంది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడబోయే ముందువెనుకల ఈ వ్యాసాలు తెలుగు స్వతంత్రలో ప్రచురితమైనాయి. ఈనాటికీ వాటిలోని చాలా అంశాలు, సమస్యలు అపరిష్కృతంగానే వుండి జనబాహుళ్యానికి ఆందోళన కలిగించటం చూస్తే-రావు గారి వంటి చిత్తశుద్ధిగల విశ్లేషకుల పౌరుల-ఆనాటి దార్శనికత ఎంతో గొప్పగా అనిపిస్తుంది. రావుగారి వ్యాసాల్లో మరో ఆణిముత్యం-అమరజీవి గురించి రాసినది.

ఇవటూరి కామేశ్వరరావుగారి రచనలు-సంఖ్యాపరంగా తక్కువే అయినా, వాసిపరంగా అవి అందిస్తున్న స్ఫూర్తీ, ప్రేరణా ఎంతో ఎంతో ఎక్కువ!

తెలుగు సాహితీలోకం ఇలాంటి రచనల్ని ఆదరించి ప్రయోజనంపొందుతారని ఆశిద్దాం.

సాయిగారికీ, వారి తరఫు వారందరికీ ధన్యవాదాలు, అభినందనలు. నేనీ ముందుమాట రాయటానికి కారణమైన మా భాస్కర్, సతీష్‌ల ప్రమేయానికీ నమస్సులు!

శుభాకాంక్షలతో...

-విహారి

హైదరాబాద్
20.07.2021



గ్రంథ కర్త తల్లిదండ్రులు :

**ఇవటూరి వీరేశలింగ భూషణ్‌రావు, సుందరమ్మ**



# శ్రీ ఇవటూరి కామేశ్వరరావు గారి జీవిత చరిత్ర

**అ**నగనగా ఓ చిన్న ఊరు. పంటపొలాలతో ఎంతో అందంగా ఉండే ఊరు. అదే మినిమించిల పాడు అగ్రహారం (శ్రీ కామేశ్వరరావుగారు 12.8.1923న జన్మించిన ఊరు). ఆ ఊరు రాజమండ్రికి దగ్గర. అక్కడే ఓ పెద్ద ఇల్లు. ఆ ఇంటి యజమాని ఇవటూరి వీరేశలింగ భూషణరావు గారు. ఆయన సతీమణి శ్రీమతి సుందరమ్మ గారు. దానధర్మాలకు పెట్టింది పేరు. పిల్ల పాపలతో కళకళలాడే ఇల్లు. శ్రీవీరేశలింగ భూషణరావు గారికి 8 మంది సంతానం. ముగ్గురు మగపిల్లలు, అయిదుగురు ఆడపిల్లలు. పిల్లలందరిని బాగా చదివించారు. శ్రీవీరేశలింగ భూషణరావు గారు (శ్రీకామేశ్వరరావుగారి తండ్రి) రాజమండ్రిలో ఉంటూ, మద్రాస్‌లో ఆయన బావ దగ్గర పిల్లలను ఉంచి బాగా చదివించారు.

**వారి సంతానం పేర్లు:**

1) శ్రీఇవటూరి పేర్రాజుగారు 2) శ్రీఇవటూరి కామేశ్వరరావు గారు

3) కందుకూరి ఉమాశంకరరావు గారు (దత్తత ఇచ్చేశారు)

4) ఇవటూరి రాజామణి గారు 5) వరలక్ష్మి గారు

6) సుబ్బలక్ష్మి గారు 7) క్రిష్ణవేణి గారు 8) విశాలాక్షి గారు

శ్రీవీరేశలింగ భూషణరావుగారి బావ శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ గారు ఆయన లెజెండ్ ఇవటూరి వారి కుటుంబానికి శ్రీ ఇవటూరి కామేశ్వరరావుగారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వద్ద ఉంటూ మద్రాస్ క్రిస్టియన్ కాలేజీలో ఎస్ఎస్ఎల్‌సి చదువుకున్నారు.

శ్రీ ఇవటూరి కామేశ్వరరావుగారికి నలుగురు సంతానం.

మొదటి సంతానం ఇందిరా వెంకట రమణ (రిటైర్డ్ సూపరింటెండెంట్ - డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్), రెండవ సంతానంగా అమర్‌నాథ్ (Retd. R.M (A.P.E.L), మూడవ సంతానం కామేశ్వరి, నాలుగవ సంతానంగా శ్రీనివాస యశోభూషణ మల్లికార్జున సాయి (ఐఎస్‌వైఎమ్ సాయి) జన్మించారు.



కామేశ్వరరావుగారు, మల్లంపల్లి ఉమామహేశ్వరరావు (రేడియో తాతయ్య)గారు,
పేర్రాజుగారు, మల్లపంల్లి సోమశేఖర శర్మగారు,





# నాన్న కల

ఎన్నో తీపిగుర్తుల లోగిళ్ళు
చిన్నబోయాయి ఈ రోజు
ఏమని చెప్పను
ఎలా చెప్పను
ఎవరికి చెప్పను
నీ పలకరింపులు -
నీ కవితా పతిమలు-
నీ చైతన్యపు కదలికలు -
నీ టపా సేకరింపులు
ఇంకా నా స్మృతిపథంలో మెదులుతూనే ఉన్నాయి.
ఏమని చెప్పను
ఎలా చెప్పను
ఎవరికి చెప్పను
నీ చిరు దరహాసము
నీ గంభీర స్వరము
నీ సాంస్కృతిక నీడలు
నీ అకుంఠిత దీక్షలు
ఇంకా నా కన్నుల ముందు నిలిచే ఉన్నాయి.
ఏమని చెప్పను
ఎలా చెప్పను
ఎవరికి చెప్పను
నీ కోపాలకు గిన్నెల తధిగిణ తోంలు
నీ షద్రుచులకు పడిన పాట్లు

కరువు బత్యం కోసం పడిన ఆందోళనలు
పింఛను కోసం బ్యాంకు చుట్టూ తిరిగిన రోజులు
ఇంకా ఆ ఘడియలు నాట్యం చేస్తున్నాయి నా ముందు.
ఏమని చెప్పను
ఎలా చెప్పను
ఎవరికి చెప్పను
నీ మంచితనపు నీడలు
నీ సహృదయత
నీ క్రమశిక్షణ
నీ స్వతంత్ర స్వభావాలు
అన్నీ మీ బిడ్డలను వెన్నంటి ఉంటాయి.
ఏమని చెప్పను
ఎలా చెప్పను
ఎవరికి చెప్పను
నీ నూలు చేతి సంచీ పూలకు
నీ చేతి కర్ర నీ ఊతంగా
నీ భూతద్దం చూడడానికి
నీ కలం కవితలు రాయడానికి
అన్నీ మీ ఆదర్శంగా ఉన్నాయి నాన్నా మాకు
ఎంత రాస్తేనేమి ఈ కాగితాలకు కలం సరిపోదు
ఇవే మీ బిడ్డల పాదాభివందనాలు
ప్లవ నామ సంవత్సరాన
కష్టసుఖాల కలయికలే
మా ఈ ఉగాది పచ్చడి నీకు పితామహ!
మమ్మ్ము దీవించు ఈ తోరణోత్సావాన!

**–ఇందిరా వేంకటరమణ**



# నాన్న గురించి నా మాట

**ముం**దుగా ఒక మాట. నాన్న వ్రాసిన కవితలు, గేయాలు, రేడియో నాటికలు, కథలు అలా పడి ఉంటే మా తమ్ముడు ..... సాయి. వాటిని ఒక పుస్తక రూపంగా ముద్రించడం ఎంతో గొప్ప విషయం. అందులో నాన్న గురించి నాలుగు ముక్కలు వ్రాయమని నన్ను అడగడం వాళ్ళ మనసు గురించి చెబుతుంది. ఇంతకూ నాన్న గురించి నేను వ్రాయాలి? నాకు ఊహ తెలిసిన సంవత్సరం 1962 మేము హైదరాబాద్‌కి క్రొత్తగా వచ్చిన రోజులు. ఆయన చెన్నై నుంచి వ్యవసాయశాఖకు మారడం వలన ఆంధ్రప్రదేశ్‌కి హైదరాబాద్ రాజధాని అవడం వలన అక్కడికి చేరాము. అప్పట్లో ఆయన జీతం 110 రూపాయలు (ఎల్‌డిసి జీతం) అది సరిపోక నాన్న ట్యూషన్‌లు చెప్పేవారు. సి.నారాయణరెడ్డి గారి నలుగురు కూతుళ్ళకు ఈయనే ట్యూషన్ చెప్పేవారు. ఆఫీస్ నుండి ఇంటికి రాగానే అమ్మ ఇచ్చిన కాఫీ త్రాగి ట్యూషన్ చెప్పడానికి వెళ్ళి రాత్రి 8 గంటలకు వచ్చేవారు. ఇంటికి వచ్చాక అక్కను, నన్ను దగ్గర కూర్చోబెట్టుకొని చదువు చెప్తూ ఆయన ఏదో వ్రాసుకొనేవారు. ఆయనకు తెలుగులో డిగ్రీ చేయాలని కోరిక. కాని అది ఆయనకు తీరని కోరికగానే మిగిలిపోయింది. ఆయనకు పుస్తకాలు, స్టాంప్‌ల సేకరణ చేయడం, క్రికెట్ ఆట అంటే ఎంతో ఇష్టం. ఆయన చిన్నప్పుడు చెన్నైలోని చపాక్ మైదానంలో క్రికెట్ (All A-1 leagues) ఆడేవారట. ఆయన దగ్గర 1942 నుంచి స్టాంప్‌ల సేకరణ చేసేవారు. ఆంధ్రప్రదేశ్‌కు రాకముందు కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికలలో పనిచేసేముందు చెన్నైలోని అమెరికన్ ఎంబసీలో తెలుగు అనువాదకుడిగా పని చేశారు. ఆలిండియా రేడియోలో, చెన్నైలో ఎన్నో నాటికలు, నాటకాలు, జగ్గయ్య, గుమ్మడి, లక్ష్మీరాజ్యం, న్యాయపతి రాఘవరావు, ఉషశ్రీ, ఉమా మహేశ్వరరావు వంటి వారితో కలిసి పాల్గొనేవారు. ఆయన హైదరాబాద్ వచ్చాక ఆల్ ఇండియా రేడియోలో ఆడిటెట్ ఆర్టిస్ట్‌గా ఎన్నో రేడియో నాటకాల రాసి నటించేవారు. ఆయన పుస్తక సేకరణలో దాదాపు 48 సం॥లు 1947నుంచి 1970 వరకు ముఖ్యమైనవి. ఇంపార్టెంట్ న్యూస్ పేపర్ కటింగ్స్,

అష్టదిగ్గజాల రచనలు, శ్రీనాథుని రచనలు, పోతన, ఎఱ్ఱన, తిక్కన, విశ్వనాథ, బాపిరాజు, గోపిచంద్ ఇంకా ఎంతో మంది రచయితల పుస్తకాలు, శ్రీనారాయణరెడ్డి గారి అన్నీ రచనలు, శ్రీశ్రీగారి రచనలు దాదాపు 4000 పుస్తకాలుండేవి. ఎంత జీతం వచ్చినా తృప్తిగా ఉండటం మాకు నేర్పారు. అలాగే సంస్కారం, అణకువ ఆయన వద్దే నేర్చుకున్నాము. నాకు గాని, మా అక్కకు గాని, స్కూలు మరియు కాలేజీలో ఏ ఎస్సే కాంపిటీషన్‌లో పాల్గొనాలన్నా మాకు వెంటనే ఆయన వద్ద కావాల్సిన సమాచారం దొరికేది. కప్పు కాఫీ కంటే ఒక పుస్తకం దొరికితే ఆయన సంతోషం. మా అందరి కోసం చందమామ పుస్తకాన్ని కొని 1960 నుండి 1990 దాకా 12 పుస్తకాలు బైండ్ చేసి పెట్టేవారు. ఆయనకు ఎప్పుడూ సంపాదన మీద ఇష్టం ఉండేదికాదు. ఆయనకి ఎప్పుడూ ఇద్దరి ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఎప్పుడు చేస్తానా అనే ఆదుర్దా ఉండేది. మా నాన్నగారి మేనమామ గారైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ఆంధ్ర సారస్వత పరిషత్ మీటింగ్ లకు విశాఖ నుండి వచ్చేవారు. ఆయన వస్తే మా ఇల్లు ఒక కవి సమ్మేళనంగా ఉండేది. శ్రీవిశ్వనాథ, దేవులపల్లి, బెజవాడ గోపాలరెడ్డి గారు, ఆరుద్ర, ఆచంట జానకిరామ్, సి.నారాయణరెడ్డి, ఇంకా ఎంతోమంది రచయితలు శర్మగారితో భేటీ అయ్యేవారు. వారితో నాన్న కూడా పాల్గొనేవారు. ఆయన ఏరోజు మమ్ములను కొట్టడం తెలియదు. కానీ ఆయనంటే మా అందరికీ భయం. మా కోరికలన్నీ అమ్మ ద్వారానే తీరేవి. ఆయన జీవితం అంతా సగటు మనిషి జీవితం అంటే Struggle for existence. భగవంతుడు ఏమి ఇచ్చాడో దానిని ఆయన సంతోషంగా అనుభవించాడు. ఎప్పుడూ దేనికీ ఆశపడలేదు. ఇంకా ఇంకా సంపాదించాలనే కోరిక కూడా లేదు. ఉన్నదానితో జీవితమంతా గడిపిన అభిమానవంతుడు మరియు ధన్యజీవి మా నాన్నగారు.

ఆయన రచనలను పొందుపరిచి పుస్తకరూపం ఇచ్చిన చిరంజీవి సాయి ధన్యుడు.

**-అమర్‌నాథ్**



# మరపురాని మనిషి మా నాన్న

**మా** నాన్న గురించి నాలుగు లైన్లు రాయమని మా తమ్ముడు చెప్పినప్పటి నుంచి మదిలో ఎన్నో ఆలోచనలు, చిన్నప్పటి జ్ఞాపకాలు గుర్తొచ్చాయి. ఎలా రాయాలో, ఎలా మొదలుపెట్టాలో తెలియట్లేదు. ఎంతో చెప్పచ్చు. ఎంతో రాయవచ్చు. ఎందుకంటే మా నాన్న ఒక మరుపురాని మనిషి. ఆయన 80 ఏళ్ళ జీవితం గురించి ఒక కథ రాయచ్చు.

ఆయన ఒక గుమస్తా పనిచేస్తూ, కవిత్వం రాయాలని, పిల్లలకి మంచి అలవాట్లు నేర్పాలని, వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడాలని, వాళ్ళని వృద్ధిలోకి తీసుకురావాలని అనుకున్నారు. ఆయన కొచ్చే కొద్ది జీతంతోనే ఎన్నో వ్యాపకాలు పెట్టుకున్నారు. ఉదాహరణకు కొన్ని రాస్తాను. పిల్లలకి ట్యూషన్‌లు చెప్పేవారు, ఫోటోలు తీసేవారు. చిన్న చిన్న నాటికలు, కవితలు, కథలు రాసేవారు. స్టాంప్స్ సేకరణ చేసేవారు. ఆఫీస్ ఫైల్స్ ఇంటికి తీసుకువచ్చి పనిచేసేవారు. మంచి మంచి గ్రంథాలు సేకరించేవారు. “నా లైబ్రరీ ఇది. ఇదే నా ఆస్తి” అనేవారు. అప్పుడప్పుడు బంధుమిత్రుల ఇంటికి వెళ్ళి వారి యోగక్షేమాలు తెలుసుకునేవారు. రోజుకి 24 గంటల్లో ఇన్నిపనులు ఎలా సాధ్యం అని నా కనిపిస్తుంది. ఆయనకుండే కొద్దిపాటి టైమ్‌లో, కొద్దిపాటి జీతంతో ఎంతో క్రమబద్ధంగా, నిరాడంబరంగా జీవితం వెళ్ళబుచ్చారు.

మా అమ్మగారి పేరు విజయలక్ష్మి. ఇక్కడ ఆవిడ గురించి చెప్పాలి. మానాన్నకు తగ్గ భార్య. మా అమ్మ జీవితంలో ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా ఆయనకు చేదోడువాదోడుగా ఉండి ఆయనకు సహకరించింది. మా కష్టసుఖాలు చెప్పుతున్నప్పుడు ఓర్పు వహించండి, ఓర్పు మిమ్మల్ని కాపాడుతుంది అనేవారు.

ఆయన దినచర్యలో శివపూజ ఒక భాగం. ఆ సర్వేశ్వరున్ని తలచుకుంటే అన్ని అవే సర్దుకుంటాయి అని నమ్మిన మనిషి. మా నలుగురికి కూడా శివపూజ అలవాటు చేసారు. ఆయన చదువుతుంటే విని నేర్చుకున్నాము. బుట్టతో పూలు తెచ్చి మా చేత పూజ చేయించేవారు. మా నలుగురికి పూజ ఒక అలవాటుగా మార్చి మాకు దైవభక్తి కలిగించారు.

ఇంకా ఎంతో చెప్పాలని రాయాలని ఉంది మా నాన్న గురించి. మా నాన్న అల్ప సంతోషి. ధన్యజీవి. మా నాన్న ఒక మరపురాని మనిషి. ఆయన లాగా కాలం వెళ్ళబుచ్చాలని నేను ప్రయత్నిస్తున్నాను. ఆయన ఆత్మ నా చుట్టు తిరుగుతూ నన్ను నడిపిస్తూ ఉంటుంది. ఆయన లింగైక్యము చెందినా ఆయన జ్ఞాపకాలు, గుర్తులు మా మనస్సులందు చిరస్థాయిగా నిలిచిపోయాయి.

నాన్న గురించి పుస్తకం ప్రింట్ చేస్తానంటే మా తమ్ముడిని ప్రశంసించకుండా ఉండలేకపోతున్నాను. మా తమ్ముడు వారిని చాలా బాగా చూసుకున్నాడు.

**- కామేశ్వరి**



# అన్నయ్య

ఇవటూరి వీరేశలింగ భూషణరావు గారు, సుందరమ్మగారు దంపతులు, ఆరాధ్యులు. ఇంట్లో నిరంతరం శివానందలహరి శ్లోకాలో లేక శివపూజ మొదలైనవి నిరంతరం ఇంట్లో ప్రతిధ్వనిస్తుండేవి. వారి రెండవ కుమారుడుగా ఇవటూరి కామేశ్వరరావు గారు జన్మించారు. కామేశ్వరీదేవి ఇంటి ఇలవేల్పు అవడం వల్ల వారా పేరు పెట్టడం జరిగింది. తగ్గట్టుగానే, నిరంతరం, సంధ్యావందనం, శివాభిషేకం తోపాటు ఎన్నో కవితలు, కథలు వ్రాయడం జరిగింది. ఆ ఆదర్శదంపతుల ఆఖరి కూతుర్ని నేను. మా కామేశ్వరన్నయ్య నిరంతరం కవితా సరస్వతిని ఉపాసిస్తుండేవాడు. కొంతకాలం ఆంధ్ర పత్రికలో పనిచేసిన తరువాత అగ్రికల్చర్ ఆఫీస్‌లో పనిచేశారు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మా మేనమామ. వారు ఆంధ్రదేశ చరిత్ర గురించి ఎన్నో పుస్తకాలు వ్రాశారు. వారు ఆంధ్రా యూనివర్సిటీలో లెక్చరర్‌గా పనిచేశారు. విశ్వనాథ సత్యనారాయణగారు, సి.నా.రె. అడివి బాపిరాజు గారు మొదలైన కవితామతల్లి పాదసేవకు లెందరో మామయ్యగారితో చర్చలు జరిపేవారు. ఆ విధంగా మా కామేశ్వరన్నయ్యకు కూడా కవితా సరస్వతి యొక్క కరుణ సహజంగా అబ్బింది. తెలుగు పత్రికల్లో కవితలు కథలు ఎన్నో ఎన్నెన్నో వ్రాసేవాడు. అన్నయ్యకు ఎందరో కవుల పరిచయం. ఎన్నో పుస్తకాలు కొని చదివేవాడు. ఆయన జీవితం కవిత్వానికే అంకితం. రెండోభాగం పరమేశ్వరార్పణం. జీవితంలో కొన్ని ఎగుడుదిగుడులు వచ్చినా ఆ పరమేశ్వర కృపాకటాక్షాలు ఎల్లప్పుడూ ఉండడంతో గట్టెక్కేవాడు. అందరూ ఆయన ఆప్యాయతకు నోచుకున్నవారే. ఎక్కడ కవి సమ్మేళనాలు జరిగినా వెళ్ళేవాడు. ఎక్కువగా నారాయణరెడ్డిగారు ఉత్పలవారు అన్నయ్య దగ్గరకు వచ్చేవారు. ఆ పరమేశ్వర కరుణాకటాక్షాల వల్ల పిల్లలు పెద్దవారవడం, పెళ్ళిళ్ళు, స్వంత కుటుంబాలూ అంతా క్షేమం. ఏవైనా కవితలు అవీ పేపర్లలో ప్రచురించినపుడు నాకు మా అన్నయ్యే గుర్తుకొస్తాడు. వారు ఎల్లప్పుడూ కైలాస శిఖరం పైనే ఉంటారని నా యొక్క ప్రగాఢ విశ్వాసం. మా అన్నయ్య చిరస్మరణీయుడు.

**- విశాలాక్షి**

# తాతతో శివుడి జ్ఞాపకాలు

**మా** తాత దగ్గర నుంచుంటే విభూతి వాసన... దూరం నుంచి చూస్తే చిరునవ్వు... ఇప్పుడు నా ముఖంలో నవ్వు, ప్రేమ, సంతృప్తి.... బహుశా అందరికీ ఇవే జ్ఞాపకాలేమో! కానీ, అందరిలాగా, నేను ఇద్దరు తాతల దగ్గర పెరిగే అదృష్టం నాకు దొరకలేదు. అందుకేనేమో–మా అమ్మవాళ్ళ నాన్న నాకు ప్రత్యేకం.

జేబులో రెండు పెన్నులు, బుజం నుంచి వేలాడుతున్న ఒక సంచీ, కుడిచేతిలో ఒక వంకీ కర్ర. ఈ చిత్రం నా మనస్సులో టాటూ లాగా ముద్రపడిపోయింది. బహుశ నాకు అలా సిగ్నేచర్ స్టైల్‌గా అవ్వాలని ఉందేమో... చూద్దామ్!

మా తాత నుంచి నేను గుర్తుపెట్టుకున్నది, మరి నా పిల్లలకి నేర్పించినది ఒక్కటే! If you cannot appreciate something dont criticise it. అబ్బ... ఆరోజు దేని గురించి చెప్పాడో ఆ సంగతి నాకు ఇంకా చాలా జ్ఞాపకం. ఆ సంగతి నాకు ఎంతో ముఖ్యమైన విశేషం అవ్వడం నాకు సంతృప్తి.

మరి, మనవళ్లు–మనవరాళ్ళు, వాళ్ళ పిల్లలు చూచి పెద్దవాళ్ళు ఆనందించటం కొత్తకాదు. కానీ, మా అందరికీ మా తాత గురించి మాట్లాడుకుని మురిసిపోవడం... ఎండాకాలంలో నల్లకుండని తెచ్చి నల్లద్రాక్ష అని పిలవడం మా అందరి పిల్లలకి గుర్తు.... నవ్వులు.

ఒక మనవడిగా మా తాత నుంచి నేను అనుసరించింది–Stamps and Stationary collection. చిన్నపిల్లలికి treasure hunt ఎంత excitementతో మా అందరికీ మా తాత writing desk stationary locker ఒక ట్రెజర్‌గా నిలిచిపోయింది. మా అందరికీ తెలిసింది ఏంటంటే ఆ Desk locker మా తాత sole. One can know about him from the things inside.

మరొకటి... మా తాత, మా అమ్మమ్మ ఒక సాన్నిహిత్యం గురించి చెప్పాలి. మా తాత ఒక simple tour, vegetable market కి వెళ్ళి next 2 రోజులకి కూరగాయలు తెచ్చి మా అమ్మమ్మతో clearcut expertation చెప్పడం ఏ vegetable ఎలా చెయ్యాలో ఏ vegetable ఎలాంటి పులుసులో వెయ్యాలో చెప్పడం, మురిసిపోవడం మాకు ఒక మరచిపోని సన్నివేశం.

మా తాత గురించి జ్ఞాపకాలు, మా తాత నుంచి నేర్చుకున్నవి... మా తాత నులిపెట్టిన నా చెవులు ఇంకా ఎర్రగానే ఉండాలని ఆశిస్తూ తాతకి ఎప్పటికి bye చెప్పలేని.............................................................. **శివ**



# నా జ్ఞాపకాలు

స్వచ్ఛమైన మనసుకి
స్పష్టమైన భావ ప్రకటన కి
మారు పేరు
మా కాముడు బాబాయ్ గారు!

బంధువైన మిత్రుడైన
నిండైన ఆప్యాయత తో
అనురాగం పంచిన వారు
మా కాముడు బాబాయ్ గారు!

కష్టాలకు కృంగక
సుఖాలకు పొంగక
స్థిత ప్రజ్ఞత తో మెలిగిన వారు
మా కాముడు బాబాయ్ గారు!

చెదరని చిరునవ్వు తో
చెఱకు తీపి పలుకులతో
చిన్నా – పెద్ద లను చేరదీసిన వారు
మా కాముడు బాబాయ్ గారు!

హాస్య చతురత లతో
సాహిత్య విషయాలతో
జ్ఞాన సంపద పంచిన వారు
మా కాముడు బాబాయ్ గారు!

భౌతికంగా మనకు దూరమైనా
నేటికీ మన మదిని వీడని
మనందరి ఆత్మీయుడు
మా కాముడు బాబాయ్ గారు!

అందుకే నాకు అనిపిస్తుంది
ఆయనకు సాటిలేరు ఎవ్వరూ
ఆయన ఆల్ - ఇన్ - వన్
కాముడు బాబాయ్ గారు ఓన్లీ - ది - వన్!!

**రామకృష్ణ**
**చంద్రమౌళి**



కవితలు

# పాపం! రూపాయి!

**అ**నాదలకూ ఆర్తులకూ ఆశారేఖవై,
కృపణులకూ విపణులకూ ఆశాజ్యోతివై,
వెలుగొందే మెరుగొందే కాణాచీ!
జగాన్నీ, జనాన్నీ శాసించే శ్రీరోచీ!

కాలపురుషుని కదనుతొక్కే
గుర్రపు డెక్కల పదఘట్టనల్లో
నీ శరీరం విలపించిందా?
నీ హృదయం కంపించిందా?

విరిగిన నీ రూపాన్ని,
తరిగే నీ ప్రమాణాన్ని,
కనుమరుగున పడిపోయే
నీ అమృత వీక్షణాన్ని,
తల్చుకొంటే గుండె బ్రద్దలవుతోంది
పోల్చుకోలేను నీ ముగ్ధరూపాన్ని.

నిక్షేపంలా వాసికెక్కే నీ రూపం,
ఆక్షేపణల పాలైందా, అయ్యో పాపం!
నీ బ్రతుకు బజారు కీడ్చారు,
నిన్ను శుద్ధాంతం నుంచి వెలికితీసి
రాద్ధాంతం పాలుచేశారు!

అందరికీ ఆత్మబంధువులా మెరసే-
నీ విశ్వరూపాన్ని ఎప్పుడు చూస్తాను తల్లీ!

కౌరవవీరులందరూ చుట్టుముట్టి,
నీకు మారణహోమం తలపెట్టి,
శివమెత్తిస్తున్నారామ్మా, శ్రీవల్లీ!

నీ గర్భంలో దాచుకొన్న
సుధాభాండాన్ని చిల్లులుపొడిచారా, తల్లీ!
మానవతా జనతా మందిరంలో,
హాలాహలాన్నే వెదజల్లారా?

నీ సంప్రదాయం చెడగొట్టి
ఏమి బావుకున్నాం, రూపాయీ!
నిన్ను మారిస్తే గుడ్డి గవ్వ కూడా
ఖరీదు చేయలేని
నిన్ను తీసుకెళ్లి నాయింట్లో
ఎవర్ని ఉద్ధరించును, చెప్పు తల్లీ!
కనువిప్పు తల్లీ!
ప్రపంచపటంలో ఎక్కడ వాలినా,
'పర్సు'లో నీవుంటే భరోసా,
నీ పరమార్థాన్ని ప్రార్థించే,
నా ప్రార్థన ఆలకించి-
విశ్వరూపం చూపించవా తల్లీ!
శాశ్వతంగా నిలిచిపోవా శ్రీవల్లీ!

*** 13-11-1966**



# దూరాన్నుంచి వచ్చిన ఉత్తరం

**దూ**రాన్నుంచి వచ్చిన ఉత్తరం
భారాన్ని మోసుకు తెచ్చిన పత్రం
మాటల కిటికీల్లో నుంచి
వాక్యాల ప్రాకారాల మీంచి
తొంగిచూచే ఆప్త హృదయాన్ని
దొంగిలించి తెచ్చిన ఉత్తరం.

కలత చెందిన ప్రేమికుల
కవికి చూపుల ప్రేమపుష్పం
దూరాన్నుంచి వచ్చిన ఉత్తరం
భారాన్ని మోసుకు తెచ్చిన పత్రం
ఉత్తరంలో ప్రాణం ఉంది
ఉత్తరంలో గానం ఉంది
ప్రాణంతో మరిగానంతో

కదిలే మెదిలే చైతన్య విహంగం ఉత్తరం
ఉత్తరంలో భాష్యం ఉంది
ఉత్తరంలో హాస్యం ఉంది
భాష్యంతో మరి హాస్యంతో
లాస్యం చేస్తుంది ఉత్తరం
ఉత్తరంలో జ్వాలలు ఉన్నయ్
ఉత్తరంలో జోలలు ఉన్నయ్

భగభగమండే
కణకణలాడే
జ్వాలత్తో రగులుతుంది ఉత్తరం
హాయి హాయిగా
జాయి జాయిగా
స్వోజాయని పాడుతుంది ఉత్తరం
ఉత్తరంలో పురస్కృతి ఉంది
ఉత్తరంలో తిరస్కృతి ఉంది
ఉత్తరంలో బహి(ష్కృతి) ఉంది
ఉత్తరంతో చమత్కరిస్తాం
ఉత్తరంతో యుద్ధాల్ చేస్తాం
ఉత్తరంలో అర్థాల్ తీస్తాం
ఉత్తరంతో మేడలు కడ్తాం
ఉత్తరంతో కూలగొడ్తాం

కల్యాణం కలకల్లాడే
లావణ్యం తొణికిసలాడే
సొగసు కన్నియనిగ్గు దేరిన బుగ్గలపై
సిగ్గు చిలికే చిన్నారి ఉత్తరం
దూరాన్నుంచి వచ్చిన ఉత్తరం
భారాన్ని మోసుకు తెచ్చిన పత్రం.

*** జనవరి, 1960**

**స్రవంతి సాహిత్య మాసపత్రిక**



# ఆగస్టు పదిహేను - 1975

**మ**ళ్లీ నా కన్నుల్లో మెదులుతోంది
ఒక ఆగస్టు పదిహేను
మళ్లీ నాగగనంలో రెపరెపలాడుతోంది
ఒక త్రివర్ణాంచిత పతాకం
మళ్లీ సమస్త జగతికి వినబడుతోంది
నా స్వాతంత్ర్యోదయ ఘంటారావం
సేతు శీతాచల వాసులారా
నవయుగోదయ నరనారీ జనులారా
భారత వీర ప్రజలారా
రారండి రారండి
కదను తొక్కుతూ
పదము పాడుతూ
రారండి రారండి.
మీమీ ఆత్మల మాలిన్యం కడిగేసుకుని
మీమీ ద్వేషాలను రోషాలను వదిలేసుకుని
మీమీ క్రోధాలను విరోధాలను పరిహరించి
మీమీ స్వార్థాలను అపార్థాలను మట్టుబెట్టి
మీమీ క్రమశిక్షణారాహిత్యాన్ని తరిమికొట్టి
దోబూచులాడుతున్న నంగనాచుల
రంగుమార్చే జంబుకాల ఆటకట్టించి
ఆతతాయుల కర్కోటకుల
పాతకులను వంచకులను
కీచకులను పాతాళంలో పాతిపెట్టి
నవభారత నిర్మాణానికి

సామ్యవాద మహాయజ్ఞానికి రారండి
మళ్లీ నా కళ్లలో మెదులుతోంది,
ఒక ఆగస్టు పదిహేను;

శేతుసీతా చలవాసులారా
నరనారీ జనులారా
అశేష ప్రజాకోటులారా
హితులారా భారతీయులారా
రారండి రండి రారండి
నవభారత నిర్మాణానికి రారండి
మళ్లీ నా కన్నుల్లో మెదులుతోంది
ఒక ఆగస్టు పదిహేను.





# సిరిసిరిమువ్వ

మధ్య మధ్య మాట్లాడే దంతా
యథార్థం బాధ కలిగిస్తుందందరికి
వేదన తీరనప్పుడు
బోధన లెన్నైతేయేం సిరిసిరిమువ్వ

కూతవాని తృళ్ళిపడినట్లు
తీతువా నీ విలయాలాపన
కతీతులౌ మనీషులకది
పాత గీతమెకాద సిరిసిరిమువ్వ

ప్రేమ ప్రేమ యన్న వారిలో
ప్రేమ యెక్కడిది? నిక్కపు
ప్రేమ యెదనుండి వచ్చు ఉరక
ప్రేమామృతముగ్రోలు రసికులు ప్రేమికులా సిరిసిరిమువ్వ!

గడ్డితిని మధుర క్షీరమిచ్చు ఆ
గడ్డియె అన్నమిచ్చు నానావిధమైన
గడ్డి తినెడు మనుజులయ్యొ
గడ్డి గవ్వంత చేయరు సిరిసిరిమువ్వ.

విటమినుల్లేని తిండేల
కుటిల పథగామి ఆలియేల
జటిల పదసమాసభూయిష్టమైన కావ్యమేల
కూటికి లేనివానికేల సంపెగలు సిరిసిరిమువ్వ!
పిల్లలు పిల్లలంచు వాపోయెదరా

పిల్ల లెందరున్న నేమి?
తల్లిదండ్రులకి సుఖమీయకున్న
పిల్లులో గుల్లలో పిడుగురాళ్ళో సిరిసిరిమువ్వ!

తుమ్మెద ఝుమ్మనెడి మ్రోత
కమ్మటి నేతిఘుమఘుమలు
ఇమ్ముగ జదిలేడి నోరు
నెమ్మనిఘోషించు కావ్యం కావాలి సిరిసిరి మువ్వ!

మాటలె కోటలు దాటా
మాటలె బీటలు దీయ! హృదయక
వాటము దెరుచు మాటలె
కోటికోటి ముత్యాల మూటలు సిరిసిరి మువ్వ!

చీటికి మాటే ప్రాణము
చీటికి మాటికి పిల్చిన విసు
గేటికి వధూటీ పోటీయే లేదునీ
మటుకు? మాటలేల సిరిసిరిమువ్వ!

మాటలు పవిత్రము మో
మాటము లేక తినవలె
మాటున దాగెడివి మాటలో మంచివి
మూటతెరచిన ముత్యాల మూటలు సిరిసిరిమువ్వ!

నల్లులె క్షణక్షణ ప్రవర్ధమానమై
కొల్లగొట్టె శోణిత భాండమ్మునే
తెల్లవార్లు మేల్కొంటి (నిజమిది)
గుల్లయాయె మేనెల్ల సిరిసిరిమువ్వ!



కష్టము కష్టమంచు బ్రతుకు చుందురు ఈ ని
కృష్ట జీవిత మహాంబుధిదాట విధి బలీయమైన
దృష్టి మసక యౌగాదె
కష్టములన్ని కలసి వచ్చు సిరిసిరిమువ్వ!

ఎప్పటికి వచ్చు చావంచు నిరీక్షించి నేల
ఎప్పటి కప్పుడె వెన్నంటి మృత్యు వుండ
అప్పుచేసి పప్పుకూడు తినెడు వారల
కెప్పుడైన నేమి... సిరిసిరిమువ్వ!

ఆహా చిత్రమేమి? భువన
మోహన రూపరసగంధముల జూడ
మోహావేశ పరవశులౌదుం
రహోక్షణిక సుఖాలేల సిరిసిరిమువ్వ!

మగువ లేక నింట గడువదొకక్షణమ్ము
మిగుల బుగులు జెందు నిజము సుమ్ము
రగడవల్ల యరిగి తగిలి వేయనాలి
రగులదె చిత్తక్షోభ యేరికైన సిరిసిరిమువ్వ!

అల్లరి చేయుట పసి
పిల్లలకె చెల్లు లేకున్న
పిల్లలౌదురే వారు చెట్టుకింద
పిల్లులో గుల్లలో మరి సిరిసిరిమువ్వ!
పిల్లలు యల్లరి ఓ పని
తలి దండ్రులు దండింతురా
పిల్లలె యెదుట లేకున్న గోడు
తల్లిదండ్రుల వర్ణించిటెట్లు సిరిసిరిమువ్వ!

తోటకు బాటే ప్రాణము
కోటీకి దూరమెంత? రామ్
కోటీయ దెక్కడ? ఎంతసేపు నా
కేటి కీవేట నీబాటల సిరిసిరిమువ్వ!

సంపదపై పన్ను రాబడి పన్ను
కొంపలపై పన్ను ఇంపైన దుస్తులపై నెంతో
సొంపుగ జీవించుచుంటె
రంపపు పెద్దా పన్నురా సిరిసిరిమువ్వ!

ఇమ్ముగ మిము జదివించిన నేమి ఫలము
నమ్మిన వాళ్ళిట్లు నట్టేట ముంచినన్
నెమ్మది దీని కూర్చుందమన్న నదెట్లు పొసగున్
మిమ్ములనేమందునిక సిరిసిరిమువ్వ!

కంద మ్మొక్కటి కూర్చి నేనుందున్నా
నందమ్ముగనిక నెందైన నాకిక
మందులేల మాకు నేల నీ వీటన్
విందులేల ఉండెద ఇందిరా మందిర
హృదయానందమ్ముగ సిరిసిరిమువ్వ!

బాబుల్ వచ్చి పోయెదరీ బడా
బాబున్నెవ్వరు చూచెదరింక నా
జేబుల్ ఖాళీ యైన వేళ నా బడా
బాబమ్మ యెదిక్కో శ్రీశైల లింగ సిరిసిరిమువ్వ!

మురిపెమ్ముగ నోయమ్మ మహా త్రి
పుర సుందరమ్మ నిన్ను గొల్చెదన్ ఫలపుష్ప సం



ధరితముకుళిత హస్తమ్ము నాయీ వేళలం
కరణం జూడగరావ సిరిసిరిమువ్వ!

చక్కగ బుద్ధి చెప్పిన నేమి బల్లగుద్ది
తిక్క మనిషి సాయి వీడు బహుకోపిష్టి
గుక్కెడు నీళ్లైన నివ్వడు నాకిం
కెక్కడి ధైర్యమోయమ్మ సిరిసిరిమువ్వ!

వెనుకమ్ముందు జూచి ఆలోచించి
కనకంబున్ కాసులున్ నమ్మి (గట్టెక్కితి నంచుండ)
దినమ్మొక చిత్తక్షోభరగిలె
వినయ వివేకముల్ నశించె నీది దిక్కు
సిరిసిరిమువ్వ!

బేజారైన నెట్లు పొసగున్
కూజాలో నీళ్లు వేలెకడుపది నింపన్
పూజామందిరమె శాంతి నిచ్చు ఓ
రాజామణి అభినందన లివె నీకు సిరిసిరిమువ్వ!

మేలును తలిచేటప్పుడు
నలుగురు కూర్చుని నవ్వేటప్పుడు
వెలగల వస్త్రం కట్టేటప్పుడు
తలవం డొక పరితప్పక సిరిసిరిమువ్వ!

చదువుకన్న సౌశీల్యం మిన్న
ఎదిగిన వయసుతొ బనియేమి
మదినెంతో కూరిమి నమ్మగ
విదివించెవిధి నన్ను సిరిసిరిమువ్వ!

రవి కిరణుడుండ యేల చింత
శివకామేశ్వరు ప్రసాదలబ్ధుండనే
నివటూరి వంశాబ్ధి సుధాకరుండనిక
భవత్పదాబ్జములెదిక్కో శ్రీశైలలింగ సిరిసిరిమువ్వ!

సంపదపై పన్ను
కొంపలపై మరి కొంత
ఇంపైన దుస్తులపై నింత నతనికి జీవించుటె
యెంతో పెద్ద పన్నురా సిరిసిరిమువ్వ!

సుబ్బలక్ష్మీ శయోశ్రీనివాస
అబ్బురంబుగ నివెశుభాకాంక్షలు
నిబ్బరంబుగ నుండు డేల చింత నీ
కబ్బముతోడ మిముదలతు సిరిసిరిమువ్వ!

ప్రవాసాంధ్రులు మీరు
నివాసం బేల మార్చుదురు?
కావాలి మనసులోకటే గాని
తేవాలి ప్రియమ్ము జయమ్ము సిరిసిరిమువ్వ!

బ్రతుకు మన చీకటిపోవలె ఉన్న
వెతలన్నియు మూటగట్టి పారవైచి మీరు
కొత్తపుంతలు త్రొక్కి దీప్తిచెందుడు
గతంబు మరచి సిరిసిరిమువ్వ!

గడ్డి తిని మధురక్షీర మిచ్చు
గడ్డియె అన్నమిచ్చు, నానావిధమైన
గడ్డితినెడు మనుజులయ్యో
గుడ్డి గవ్వంత చేయరు సిరిసిరిమువ్వ!



సంస్కృతి సంప్రదాయంతి
రస్కరించి బావుకున్న దేమిటి?
ఛీత్కారం పూత్కారంతప్ప
ఆక్స్‌ఫర్డ్‌కుహరి! ఓ సిరిసిరిమువ్వ!

సన్నివేశానికి తగిన వేషం వినా
బాహ్యప్రలోభంబుల్
యెన్నగ నేమి తెచ్చు చిచ్చుతప్ప
మిన్ను కెగర నేమి ఫలము సిరిసిరిమువ్వ!

విశాల రమణాంతరంగ! మీ
రీశాన సతీ దృక్కరుణాపేక్షు
లాశాకిరణ మువేరికైనన్
న్నశ్రాంతమరావలె సిరిసిరి మువ్వ!
పద్మజా శ్రీచరణ శైలజాహ్వా
త్పద్మ దళాయతాక్షి! విశాలాక్షి అల్లదే
పద్మబాంధవుడు దయించెన్నా
పద్మనాభుడిచ్చు శుభంబుల్ మీకు సిరిసిరిమువ్వ!

ఆలి కమ్ముతుబోయి
తల్లిదండ్రులను తృణీకరించిన చవట ఇతడు
ఏలనో ఈదుర్బుద్ధిబుట్టె ఉసురుత
గలకుపోదె సిరిసిరిమువ్వ!

ఆలిని హింసించి
తల్లి కమ్ముదుబోయిన చవట యతడు
ఏల తనకీ దర్బుద్ధి దాని ఉసురత
గలకపోదు సిరిసిరిమువ్వ!

ఆలి మొగుడు తామిరువురును
పూలు, పరిమళ మట్లుండ
ప్రళయ మేలవచ్చు
ప్రణయమేగాని సిరిసిరిమువ్వ!

అమ్మయిడిన తిండి నుంతైన నదియె
అమృతమై తోచు
పంచభక్ష్యమైన నేమి
పూటకూళ్ళలోన సిరిసిరిమువ్వ!

అమ్మమాటలోన సకల
వేదసారములుండు కార్చిచ్చు
అమ్మలేని బ్రతుకు చిచ్చుల
ఆశనిపాతమ్మురా సిరిసిరిమువ్వ!

పేరరాజుల వారొక
పెరియాళ్వారాయనవ్యంగ్యంబుల్
పెరుగుపుర్వెక్కి నట్లుండు
పెళుసుమాటల బీటలు సిరిసిరిమువ్వ!





## మహర్షి శ్రీమల్లంపల్లి కి లేఖ
## 'ప్లవ' ఉగాది

**శి**శిర ఋతువది ఆకుల
నురాల్చె వృక్ష రాజముల
న్నియు; ఫాల్గునారం
భమున దివ్య సందేశమందినట్లు

అదె దైవికముగ నాడు
శైవపీఠాధ్వర్యమును,
యేనాటి నుండి యొ ఆ
శించితిని–ఈ నాటిక

దినమకూడెను; ఆత్మ
లింగమె సాక్షాత్క
రించె; లింగధారణ దీ
క్షావిధి–శివాచార సర
ణి–వీరేశలింగ గురు
దేవులు కరుణించి మా
యుభయులకు జరిసి
యా శీర్వదించిరి మా
భాగ్యవశమున!

ఈ రోజున కామేశ్వ
రది యేదో మామూ
లేవ్రాసినాదని
యూహించకుడయ్య
వేగరండంతా సావధానులై
యానందితోత్సాహమ్ములు మి
మ్మావేశింపగా చదువు
డొడల్పుల్కరింప! నాడు
సెన్సను లెక్కలకై సెలవు
మర్నాడు పుస్తకములు తీ
సికొని భయము తోడనె
పాపముత్రోయగా వెళ్ళె!

రంగుల పండుగయట శు
ద్ధియయ్యెను పో! 'బాబు'కు మొ
న్న బడియందు వెల్లవేసి
పూసిరి నఖిశిఖ పర్యం

తము యీ పండుగ యెక్కడ
దాపురించెనో గద ఉ
న్నదే ఒక జతబట్టలవి
గూడ పాడొనరించిరి.

ముఖము నిండ రంగులద్ది
రి; బూడిద బుస్సన్నయై వె
ర్రి మొహమేసుకొని తిరిగి
వచ్చె! 'అమ్మబడిలేద'టంచు



రోడ్ల మొగలందు నిల
బడిరి రంగునీళ్ళు నిం
పిన సీసాలతో, యర
చేతినిండ నూనెకల
పినరంగు గుప్తపరచుకొ
ని, తెలిసినవారెవరై
నవత్తురాయని, పొంచి
పూతవేయుటకు, కాచి
కొనియుండిరదేమి చో
ద్యమొగాని, వెర్రివేయి వి
ధములన్నదియే నేమొ!
గాకమరేమని జెప్పుదు-
సెలవు దొరకె గదాయని
సరుకులు కొన్ని తెత్తుమంచు
అంగడియుందునొ లే
దొయని సందేహించుచు

నే నేగతిని, తెరచియు
న్ననేమి రంగులను మా
త్రమె విక్రయించునటునే
చేయునది లేక తిరిగి

వచ్చి వేయుచుండగా
దబ్బున వచ్చి చెంపనిండ
తట్టెడు రంగు చివాలున
పూచెనొక పంచరంగు
లపూత నఖ శిఖము పూ

చికొన్న యావివికృతా కా
రహస్యావతారహోలి
రసరాజ్య చక్రవర్తి పో
లీసులు నిట్రాయిల్వలె ని
లబడి యుండగా మొండిగా
దెభ్యమ్మొహోలవలె క
న్పడిరి ఉక్రోషము దహింప!

హోలీ పండుగ పొంగు
జాడలవి వీడలేదు-
కాలినకాముని మంట
లవి చల్లారనే లేదు-

వేరొక పెనుమంటను
రేకెత్తించి గాథ సం
తాపమున ముంచి వైచి
ప్రశాంత గంభీరుడు పంతు
గోవింద బల్లభు దేగె
నీ భువి నుండి దివికి

బెండు వోయిన జాతికి
అభయ మ్మొసంగ ఈ
దిగ్భ్రాంతిని భయమున్వీడి
శాంతి చెందుడటంచు
కల్గించు నట్టియన
భుజము తట్టి లేవనెత్తి
చరచరా కదలి వచ్చెను



వేరొక పండుగ దీని
జాడలే వేరు చైత
న్యము స్రవంతియై ప్రవహింప!

జనవరిలోను రాగల
వచు జాబు రాసితివి
నిన్నుంజూడ వలెనని
తహతహలాడెను మనసు!
ఉత్తరము చదువవినిరి
తాతయ్య కై ఎగిరి గంతి
డిరి పిల్లలు ఉప్పొంగితి
మి మేముభయులము గూడ!

ఇంతలోనే యేమోగాని
ఇప్పుడు వచ్చుటలేదని
వచ్చియుండె నొహజాబు
సాయంత్రము వచ్చి చూడ
నిరుత్సాహ పరచితి
వంచు పదే పదే యనుకొం
టిమి అంతా ప్రార్థించితిమి
నీ ఆరోగ్యముకై
ఔను జ్ఞాపకము వచ్చె
'శార్వరి' తొలి రోజులందు
మీటింగు కై వచ్చితివి,
చాల రోజులయ్యె చూచి,
'శార్వరి' నిన్నటి తోడ

నెమరలెను బరువుతీర
కాలచక్ర ప్రగతి ప
థము నందు 'ప్లవ' ఉగాది
పయనమై వచ్చె; సుమించె
నవజీవిత ఆశాంకు
రము లీ వసంతోత్సవ
వేళా విశేషమ్మున-

నవ యుగోదయ వాసం
త ప్రకృతి, పూలు చివుళ్ళు
పుష్కలించినవి, అంతా
కొత్త ఎటు జూచినను
నా భావమ్ములిట నిల్చుట
లేదు పరుగు పరుగున
నీదు చరణాబ్జముల ద
రికి ఏతెంచు నీవిగో-
సద్భక్తి నర్పింతు నమ
స్కారములు, నేటి ఉగాది
వేళ స్వీకరింపుడు
పుణ్యదంపతులు మీరు!
వికార విచారమ్ము లీ
ప్రాకారము నేడిపోవు
సుఖదుఃఖాత్మక ద్వంద్వ ప్ర
కృతి సూక్ష్మదృష్టికి నాకు
జూడయిది రసగుళిక



గా అవతారమెత్తి జీవి
తాశా సూత్రమ్మె నిల్చెనేమొ!
ఈ ఉగాది పచ్చడియందు!!
ఇరుగో పిల్లలు కూర్చు
న్నారు చేతులు జాపి
ప్లవాబ్దపు నవ ప్రసా
దము గోరుచు, రావయ్య
సోమశేఖర పూజ్య
శ్రీమల్లంపల్లి ఋషివర్య!
చెదరి యొక్కడొయున్న
తెలుగు సంస్కృతినంత
పోగు జేసి వన్నెచిన్నెలు
దిద్ది సంపుటీకరిం
చి నవ్యరూపము నిచ్చితివి
నీవంటి పూర్ణ పురుషుడిని
పూజించి సన్మానించు
టకేమి? ఈ మహాంధ్ర
దేశము గొడుబోయె
నా ఏమి? ముందుకు రా
రేరీ ఆయారంభ
శూరులు? ఈ ప్లవనవ
యుగారంభ వేళ! నా హృ
త్పీఠమే యలంకరించి
నేనొక్కడనె సన్మా
నింతురావయ్య

వసంతోద్యాన వనము
తిరిగి సేకరించితిని
మనోహర నవ మల్లికా
కుసుమముల్నెన్నిటినో!
పూసుకు తిరుగువారల
కె సన్మానమ్ములు జేసి శా
లువల్గప్పి 'పర్సు'లిత్తురీ
రోజులిటువంటివి పో!
ఏమందును? జగమెరిగిన
బ్రాహ్మణునకు జందె
మేమిటికి యనుకొందును
సంతృప్తి జెందితి గాని
మనస్సది ఊరకుండదు
ప్రగాఢమైన యావాంఛ
తీరని బాధయై మిగిలె

ఓ మకుటమే లేని
సాంస్కృతిక సామ్రాజ్య
చక్రవర్తి! సౌజన్యతా
మూర్తీ! గైకొనుమయ్య
శతసహస్రాధిక సీమ
స్మృతులు ఈ యుగాది ఆ
రోగ్యము చేకూర్చ, శాంతి
యున్సిరులు నీయ వలె
పుణ్యదంపతులు మీకు-



# నాన్న ఆశీరక్షతలు

పిలుపు ముసుగులో
అలిగి కూర్చున్న మహిళామణి
తెలిసి కూడా రాని నీ
విలువది ఇంతేనా! మరి సిరిసిరిమువ్వ!

మెట్టినింట పొన్నుదిగి
పుట్టినింటికి పిలవాలా!
బొట్టెట్టి; అట్టి ఓ బుల్లెమ్మా
నీస్టేటస్సుకి జోహారు సిరిసిరిమువ్వ!

ఔనులే! మీ ఇంట వెలిస
మిన్ను కెగసిన సభ్యతకు
అన్నముక్కై అలిగిన అలివేణీ
నిన్నేమందును సిరిసిరిమువ్వ!

ఎప్పటికెయ్యది ఉచితము
అప్పటి కది సేయవలె
ఎప్పుడు తప్పులు వెదకిన
తిప్పలు తప్పవు సుమి! సిరిసిరిమువ్వ

అంతస్థుల అవస్థలు
చింతాకంత వెట్టికి వేపకా
యంత మందు చాలదా ఇక
చింత లే మిగులు! సిరిసిరిమువ్వ!

# శుభకృతు ఉగాది సమ్మేళన సంచిక

కామేశ్వరి : ఈ నవ్య వత్సరారంభ శుభవేళ
ఈ దివ్య వసంతోదయ శుభకృద్వేళ
మామయ్యకు నమస్తే, అత్తయ్యకు నమస్తే
ఆదిత్యకు బెస్ట్‌విషెస్, గాంధీకి గ్రీటింగ్స్

మామయ్య : ఈ సంవత్సరాది శుభాదిన-
ఎవరిదా వినిపిస్తున్న కంఠం?
ఏమిటీ వినబోతున్న గేయం?
ఎక్కణ్ణుంచొచ్చిందీ ఉత్తరం?

ఎప్పుడొచ్చిందీ పత్రం?
ఒక్కరన్నా చెప్పలేదేం?
ఎక్కడుంది నా కళ్లజోడు?
ఇక్కడుండాలిగా ఇందాకను?

ఆదిత్య : ఇదిగిదిగో వస్తున్నా
తెస్తున్నా మీ కళ్ళజోడు
ఇస్తున్నాను మీ జోడు
ఇప్పుడే వచ్చిందా వుత్తరం
ఎక్స్ప్రెస్ డెలివెరిలో-పాడు
ఎక్స్ప్రెస్సది లేటవ లేదు-నేడు-



మామయ్య : ఓహొహొ నీవా ఉత్తరం వ్రాసింది
ఓహొహొ ఏమిటా వ్రాసింది

కామేశ్వరి : ఈ హృదయం-నాదేను
ఈ కంఠం నాదే విను
ఓ మామయ్య-మహిత సోమశేఖర సుహృన్మణీ
సంస్కృతీ సామ్రాజ్య చక్రవర్తీ శ్రీ మల్లంపల్లి

ఈ వాసంత శుభోదయ వేళ
సుప్రభాతం మామయ్యా ఇది
సుప్రజా భాస్వంతం, తేజస్వంతం
ఇది సుప్రజా సామంతం-

మామయ్య : ఇది వసంత ప్రభాత మోయీ!
ఇది అనంత వికాసము-
ఇది వత్సరాది, శుభాది
శుభకృత్ సంవత్సరాది-
నీ కలంలో ఏదో నవ్యత కనిపిస్తోంది
సవిలంలా పదాలన్ని కదలుతున్నాయి!

కామేశ్వరి : నిజం. నిజం-
నీవంటున్నది
నిజం నిజం

మామయ్య : విశేషాలేమిటో
విస్మయం లేకుండా
వివరించు, చూద్దాం

కామేశ్వరి : విస్మయం లేద్దే
విశేషమే లేదు
మదస్మిత వదనం
తోవిను
ఇటు కదిల్తే సోష్యలిజం
అటు మెదిల్తే కమ్యూనిజం
ఆ రోడ్డు వైపున స్వతంత్రం
ఈ గోడమీద జనసంఘం

మొన్నటి దాక పతాక లెగురవేచి
పటాటోపాలు ప్రకంపించి
మేనిఫెస్టోలు ప్రపంచించి
ఎన్నికలై ఱ్రుటించ

రాజకీయ వాజయపేయ
కలకలం లేవదీసి
హాలా హలం పారబోసి
ప్రజాస్వామ్యపు పెళ్లికోసం
ప్రజారథాన్ని ప్రగతి పథం పట్టించిన

హే ప్రజలారా, నా దేశ ప్రజలారా
ఆంధ్రదేశాధీశ్వరులారా, ప్రజలారా!



ముకుళిత హస్తాలతో
వికసిత నయనాలతో
చకచ్చకిత హృదయంలోంచి
మీకు నానమో వాకాలు

హే ప్రజలారా నా దేశప్రజలారా!
మీకు నా ధన్యవాదాలు
నా పూజా పుష్పాలు
నా ఆనందభాష్పాలు!!

మామయ్య : నీవంటున్నది బాగున్నది
నే వింటున్నది బాగున్నది – అయినా
చెప్పేదేమిటో సూటిగా చెప్పు
చప్పున; సంగతేమిటో వినాలిప్పుడు

కామేశ్వరి : సూటిగా చెప్పడంలోనే ఉంది కష్టం
మామయ్యా–అదే అందరికి నిష్ఠూరం

నీకు తెలియన్దేముందీ యుగాన
శ్రీమద్రామాయణ కల్పవృక్ష దుమారం దాటి,
'గెగారిన్' 'గ్లెన్'ల వియన్మండల విహారాలు సాధించి,
'గోవా' కవాటాలు తెరపించి
అష్టగ్రహ స్తోత్రాలు జపియిస్తూ
ఆ (యి)ష్టగ్రహ కూటాలు అధిగమించి,

నక్షత్రగ్రహ జాతకాలు రికార్డు చేసి,
మనవాండ్లందరూ మళ్లీ లేచి
మనో నేత్రాలు విప్పి
మంత్రాంగాలు విప్పి
మంత్రాంగాలు సాగించి
మొహమాటాలవలకు నెట్టి
మాంత్రిక పదవులను సాధించి
మంత్రి వర్గాలు చేపట్టి
మంత్రి వర్యులంతా సచివాలయంలో

వడి వడిగా అడుగు పెట్టారు,
చర చరగా వ్యవహారం సాగిస్తున్నారు;
స్థిమిత పడుతున్నాం మనం–
ఆశలు పెట్టుకున్నారు జనం.

మామయ్య : సహజంగానే జరుగుతోందిదంతా
వ్యవహారం పాకాన్నే పడుతోందిగా–
ఇంతకీ అసలు విషయం చెప్పవేం?
ఎంత సేపీ హస్కీ వుషస్సున?

అత్తయ్య : మీకంత ఖంగారైతే ఎల్లాగ
ఏమంత తేలికనుకున్నారా?
చరిత్రెంత కష్టమో
కవిత్వమూ అంతే,
వాడు చెప్పేదేమిటో చెప్పనీయండి
మిమ్మల్ని మెప్పించకపోతే పోయె!



కామేశ్వరి : బాగా చెప్పావు అత్తయ్యా–
మామయ్యా,
లోగడనే చెప్పినట్టు
అసలు విషయం చప్పున
చెప్పాలని యత్నిస్తున్నా.

ఎవో ఈ
తిప్పలూ తప్పులూ లేకుండా
అప్పులూ సొప్పులూ లేకుండా
తింటున్నది వంట పట్టే రోజు
లెప్పుడొస్తాయో గాని,
చడీ చప్పుడూ చేయకుండా
అందరి మెప్పు సంపాఇంచేలా
బ్రతుకుయాత్ర సాగిద్దామని

దీక్ష మళ్లీ స్వీకరిస్తున్నా
అంగీకరిస్తున్నా జీవితసవాలుని,
నట్టులూ గుట్టలూ దాటుకుంటూ
ముప్పయ్యొనిమిది వసంతాలు నిర్వహించి

కనిపెంచిన పెద్దలకు నమస్కరించి
విధి విధించిన గమ్యం చేరాలని
సాధనతో సౌమ్యం చూడాలని
జీవితంలో ఫస్టు మార్కు

తెచ్చుకుందుకు
బ్రతుకుతున్నా మామయ్యా
ప్రథిత సద్గుణ ధుర్యా,
శ్రీ సోమశేఖర వర్యా,
ప్రసన్న గంభీర హృదయా,
నేనీ ఎన్జీవోల కులంలో దిగబడి
'దాసోహమ్మే' మాకు 'హలం' అనుకుంటూ

ఎక్కడ వేసిన గొంగళీ
అక్కడ లాగ, ఎదుగు-
బొదుగూ లేకుండా
ఫైలూ, రిఫెరెన్సూ
మర్చిపోకుండా
ఈదుస్తున్నా నీ జీవాన్ని,
వ్రాస్తున్నా నా భావాన్ని

నిద్రపోతున్న నాలో
చైతన్యం రంగరించి
సాహిత్యం చిలకరించి
సంస్కృతీ నిధి వై దర్శనమిచ్చి
నా దేహం పులకరింప
నా ఊహలు వికసింప
భుజం తట్టి లేవదీసిన
మహితశ్రీ శ్రీ మామయ్యా,



జీవితంలో ఫస్టుమార్కు
తెచ్చుకొందు కు బ్రతుకున్నా

మామయ్య : ఏదో ప్రవాహంలా ప్రవహిస్తోంది
ఎంతో ఆవేశం కనిపిస్తోంది
ఆవేశం అదీ పనికిరాదు
ఫస్టుమార్కు సులభం కాదు
Vested interests ఉంటాయి జాగ్రత్త
క్రిష్ణాగోదావర్లలో నీళ్లుండవు తస్మాత్ జాగ్రత్త!

కామేశ్వరి : నిజం నిజం
నీవంటున్నది
నిజం నిజం
చేరవలసిన గమ్యం చాలా దూరం
నే చూడతగిన సౌందర్యం అపారం

కార్ఖానాలు వెలిసినా
ఖజానాలు నిండినా
ధన ధాన్యాలు పండినా
ధరల బరువు అధికమై
మొర లెవ్వరు వింటున్నారు?
కరువెవ్వరు తీరుస్తారు?

మామయ్య : తీర్చేవారున్నా సరే
లేకపోయినా సరే
ఆర్చేవాళ్లుంటారులే
ఎక్కడయినా సరే!
వ్యథ చెందడం పాడికి కాదు
వ్యథను మథించి వివేకం సంపాదించు
క్షుదను కుదించి ఆనందం ఆస్వాదించు

ఇవేనా ఆశీర్వాదాలు
ఇవేనా ప్రేమాదరాలు
లేనాయనా, కామేశ్వరి
ఇవేనా ఆశీర్వాదాలు-

కామేశ్వరి : స్వీకరించు నా ధన్యవాదాలు
ఉగాది అభినందనాలు
సుగంధ కుసుమ చందనాలు
'ఆనందాలు కలుగవలె
మీ ఆరోగ్యాలు వర్ధిల్ల వలెన'ని
ప్రార్థింతు, నాఇష్ట దైవము నర్థింతు
మా కామేశ్వరిని, సద్భ
క్తి నామెకు నమస్కరింతు!

5-4-1962



# 'శ్రీముఖ' ఉగాది

ఏమిటో చప్పుడు
ఎందుకో తిప్పలు
బ్రతుకుబాటల బీటల్లో
ఎప్పుడో ఎక్కడో
ఎలాగో గమ్యం
చెప్పు త్వరగా ఈ
చిక్కులన్నీ చప్పున ముడివిప్పి
చక్కగా చిక్కగా
ఉండేట్లు చెయ్యి ఉగాదీ!
గత డెభ్భైయ్యేళ్ల నుంచి
చూస్తున్నాగా నీవు యేటా

ఏదోక కొత్త పేరు పెట్టుకుని
అంతో ఇంతో కొత్త చైతన్యం పోస్తూ
ప్రత్యక్షమైనప్పుడల్లా
మరి నాకేదో ప్రాణంలే
చొచ్చినట్లుంటుంది - అంతేకాదు
నాకేదో కవితార సధార పొంగి
వస్తూంటుంది, యిలాగె నీ
ఆశీరక్షతలు వేయించుకుని
ఈ బ్రతుకులు స్ఫూర్తి తెచ్చుకుంటున్నా
అలాగే మళ్ళీ ఈ రోజున
ఈ నవయుగోదలు ప్రాతఃవేళలో
ఓ శ్రీముఖాభిధాన

నూతనాబ్దమా నీకు
సుస్వాగతం! ఘనస్వాగతం!!

ఔనులే! పేరులో ఏముంది
నీగర్భంలో దాచిన నా జీవిత
పరమార్థాన్ని కాస్తో కూస్తో
విశదీకరించి ఏదో ఒకలాగ

చీకటి లోంచి వెలుతురులోకి
దారిచూపి గమ్యం చేర్చవా?
ఏదో కాస్తోకూస్తో వేప (పూ)చేదూ
యింతో అంతో ఇక్షు(ఖండపు) తీపీ
కాపుకొస్తున్న మామిడి పులుపూ
ఏవేవో తల్కాల ఫలాలతో
మిశ్రితం చేసిన నింబ కుసుమ
రసరమ్య గీతాన్ని నీకందిస్తున్నాను
రుచిచూడు: మరి మా
కందరికీ నీ అభయహస్తం
చూపించవా ఉగాదీ!!

ఓ శ్రీముఖాభిధాన నూతనాబ్దమా!
రమ్ము రమ్ము! ఈ నా
గృహాంగణ రంగవల్లీ సంశోభిత
రమ్య భవన మందిర వేదిక
మీద విశ్రమించి పోదువుగాని!!
ఔనులే! నేనెంత నీ పాద



మంజీరాలు స్పృశించి
ఎండిపోతున్న ఈ తృణ
శకలాన్ని చిగురింపజేసి
నా చిరకాల ఆశయ
గృహగణాన్ని ఫలింప
జేయువా ఓ నవయుగాదీ

కరుణ జూపించి
దయ కురిపించి
కనికరించి చల్లగా
చూడు శ్రీముఖాభిదాన
నూతనాబ్బా మా నీకు
స్వాగతం! ఘనస్వాగతం!!

# కల్యాణ గీతిక

**మా**ని కొమ్మల రెమ్మల నేర్చి కూర్చి
పచ్చనాకుల తోరణములు కట్టిరి,
ముచ్చటైన రంగవల్లికలు దిద్దిరి
మేల్పట్టు పితాంబరములు చుట్టిరి

కల్యాణ కింకిణీ నిక్వాణమ్ములు నిండె
సిగ్గు బుగ్గల లే నవ్వులు చిందులాడె
ఆ మందార నవ మల్లికా సుధార్ణవబాల
మోమున నీ మహోత్సవ వేళ–

శ్రీ వీరభద్రాఖ్య భానుమతీ
పరిణయానంద శుభవేళ
కన్నుల పండువై దీప్తించే
ఉప్పొంగె నామది, ప్రాప్తించె
పాయసాన్నములు నేడు

ఓయి
నవ వధూవరులార
మధుర భావాల ప్రణయ
మాల లల్లుడిక–

ఓయి
నవ వధూవరులార
వేగుటు రా రండు–మీకై



ఏర్చి కూర్చితి నీ కల్యాణ గీతిక
మదీయ హృదయ
మందిరోద్యాన వనమ్ము
వికసించిన మందార సుగంధ
నవమల్లికా కుసుమాల–

మీ మూగ మనసులు విప్పి
మీ మధుర భావములు తెల్పి
అనురాగమాధురుల్ కిలిపి అన్యోన్యముగ
వర్థిల్లుడో నవ వధూవరులార
ఎనలేని సిరులతో నిండవలె
హిమ వన్నగాగ్ర – కైలాస స్థితులా
యాదిమదంపతులాశీ: సుమమ్ములే జల్ల!

మీ శ్రేయోభిలాషి
–ఇవటూరి కామేశ్వరరావు

# ఆశీరక్షతలు

చేమంతులు వికసించిన హేమంతపు పొలిమేరల పుంతలివి
సందీపులు పద్మజతో భాసించిన మార్గశిర బహుళ రోదిస్తులివి.

భాగ్యనగరు యెత్తివచ్చిన బంధు బృందపు శుభాశీస్సులివి
కల్యాణ కింకిణీ నిక్వాణపు అరుణారుణ ఓజస్సులివి

పచ్చనాకుల తోరణాల పసిడికాంతుల పుష్ప సౌరభాలివి
ముత్తైదువులు సింగారించిన బంగారపు కాంతుల మిలమిలలివి

మా హృదయాల కవాటాలు మీకై తెరచి జలజలరాల్చిన శుభాకాంక్ష లివి
సందేపుసి పద్మజను చల్లగ చూచు త్రిపురసుందరి జగదాంబల ఆశీరక్షతలివి.

ఆనందపుటంచులలో విహరించే ఆధునిక నూతన వధూవరులారా
మీరెల్లప్పుడు బాంధవుల మరువొద్దు సత్యధర్మశాంతి పథం వీడొద్దు.





# భారతరత్న

భారత స్వాతంత్ర్య
సమర పథంలో
పార్థుడవై విజయ
శంఖం పూరించిన
భారత రత్నానికిదే జోహార్

జాతిపిత అడుగుల్లో
విశ్వశాంతి చిహ్నమ్మై
సకల భారతావని
జాగరితమ్మొనరించిన
భారతరత్నానికిదే జోహార్

భారత భూమికి
వెలుగును జూపి
భావి తరాలకు
పునాది వైచిన
భారత రత్నానికిదే జోహార్

పీడిత జాతికి
ఊపిరి పోసి
నవభారత నిర్మాణానికి
నాందీ పురుషుడవై
నిలిచిన ధన్యజీవి

భారతరత్నానికిదే జోహార్.
దేశదేశాలలో
నీ సౌజన్యం చితికి
భరత ధాత్రిని
పునీతం చేసిన
భారత రత్నానికిదే జోహార్.

తెల్లటి షెర్వాణీ ధరించి
ఎఱ్రటి గులాబీ వికసించ
ఎఱ్రకోట ప్రాకార వేదిక
మువ్వన్నియ జండా నీడను
గర్జించిన, మృత్యువునే నిర్జించిన
భారత రత్నానికిదే జోహార్!





# జర్మని యందుండెను

## (పైడ్ పైపర్ ఆఫ్ హ్యామలిన్ తెలుగు అనువాదం)

జర్మని దేశమందుండె
హేమిలన్నను నగరము
'వీజరు' నదీ తీర మందున
అందుండెను ఎలుకలు, కొల్లలు

క్రిందు మీదు గాన కవి
లక్షలు లక్షలుగా కుక్షింభరులై
విచ్చలవిడి తిరుగసాగె
ఎల్లరకు విస్మయమ్మె గొలుప

కాలు చేయి కదపలేక
ఏమి చేయపాలు పోక
కపురమ్మట్లు హరించె నాహారమంతయు
నగర ప్రజలల్లాడి పోవ-

భయము లేక గియము లేక
రేయి పవలు విఱ్ఱవీగక

క్రొవ్వెక్కిన వాటి రూపుగని
మార్జాలమ్ములె భయమందిన
శునకమ్ముల మాట యేల? ఏమి
విపరీతమొ! చెప్ప శక్యమె వీటి
పరాక్రమమ్ము! పటాటోపమ్ము!!

ఇంట నెలుకలు, బయట నెలుకలు
యెటుబోయిన నెలుకల బారులు
కట కట మనిరి! ఇస్సురనిరి ప్రజలు
భీతావహులై జంకిరి వారలు -

ఊయలందు నిదురించెడి
పసికందును కరువజొచ్చె

నలుగురు గూడి తినుచున్న
కంచములందు జొరబడి
స్వాహా చేసెయన్నమంత
నదిలించగ నవి, గ్రుడ్లు
మిటకరించి ఎదిరించె-

ఏరి సిద్ధ పరచిన కమ్మటి
ఛాయ పప్పును యూడ్చి వైచె నన్న
ఉట్ల నిడిన కమ్మటి వెన్నముంతల
మాట ఏల? ఈ మూషికముల గోల!

అహెూ! ఏమి ఇది యేమి?
ఏమిటీ ఎలుకల జులుమని?
భోరున దురపిల్లిరి ప్రజాకోటి!

నింగినేల ఈనినట్లవి విహరించె
చెంగున దూకుచు కులుకుచు
ఇష్టారాజ్యమ్మె యూహించగ



కష్టకాలమె దాపురించె నా నగరమ్ము న -
చేయునది లేక హుటాహుటి జనిరి
ప్రజలందరు, నగరపాలకుని కడకు -
ఘోషించిరి తమ యెదదల బెడదల
భాషించిరి తమతమ బాధల గాథల-
మూషిక వాహనుల దుర్భరలీలల -
వారు చేతులెత్తి నమస్కరించి

"శాంతి గూర్చుడు మాకెల్లరకు
లేదా తొలగి పొండీ క్షణమె-
మీ పదవులను వీడి - అక్షయ
మయ్యెడి యెలుకల నరికట్టలేరా?
కక్ష గట్టి వాటి మదమణచరాదా?

ఓహెూ నగర యేలికలారా?
మా హృదయ సంక్షోభమార్పలేని
మీరలు మా నగర యేలికలా!
మీరలు మా నగర తక్షకులా?"

"నగర పాలక వర్గ మీ విషయమ్మె
చర్చించ సాగినది బాధ తీర్చెదము-

మాకున్నదీ ఇదే బాధ
బాధ లందరిది ఒకటె
కొంచె మోపిక పట్టుడు
చేత నైనంత చేసెదము-

వి(శ్రవీగెడు యా మూషికముల తోకల
కత్తిరించి వాటినిట్టె నిచిత్తు చేసెదము”
బదులు పలికె నమ్రతతొ నా
నగరాధ్యక్షు డపుడు -

ఇంతలోననె వచ్చె నచట
వింత మనిషి యొకడు -
దీర్ఘకాయుడు, జువ్వవలె నెదిగి
మువ్వవలె నెర్రని ముఖముతో

బల్ రంగుల దుస్తులను ధరించి -
మెడలోన వేళ్ళాడెడి యొక
పొడుగాటి ‘సన్నాయి’ తోడ

నగర పాలకుం ప్రశ్నలకా
కావి రంగుల వింత జోదనెను.
నేనొక పాటగాణ్ణి
సనాయి వాద్యగాణ్ణి
నేను, గానము సేతును -
మీ వీనుల విందొనరించగ
సకల ప్రాణులు సమ్మోహింపగ
నిఖిల ప్రజాకోటి వ్యామోహ
పరవశులై తృటి వివశులౌదురు
నా మధుర మంజుల గాన
రసా స్వాదన యందు -



నా శక్తి, నా యుక్తి, నా గాన
మాధురి ఈ సన్నాయిలోననున్నది
మే ఎలుకల ప్రాణముల, వాటి
చూడుడు మరి నా శక్తి, నా యుక్తి-

జీవనాడులను కరిగించెడు
నా శక్తి, నా యుక్తి, నా గాన
మాధురి ఈ సన్నాయిలోన నున్నది
చూడుడు మరి నా శక్తి, నాయుక్తి-

సమయమున కేతెంచిన
దేవుడవా? నీవు వారు
పంపించిన దేవదూతవా - ఈ
నగర మట్టుడికి పోవు చున్నది-

ఈ పాపిష్ఠి మూషికము లెముకలు కొరికి
ఈ నగర మహాజనుల బహుభుగల బాధించె-

శాంతి లేదు విశ్రాంతి ఇసుమంతయు లేదు మా
కెట్టి మనశ్శాంతి లేనేలేదు - నీ
సమ్మోహన మోహన గాన
మొకింత వినుపించి కనికరించి
కాచుము, మమ్మ”నె నగరాధ్యక్షుడపుడు -

సాయపడెద తప్పక రక్షించెద
ను మీ నగరమ్ము మూషికముల బారినుండి -

వేయి బంగారు దీనారములిందు
త్రుటిలోన జేసెద మీ కార్యమెల్ల
వట్టి భాషలుగావు వేగరారండు

మూషికముల వేషములు కట్టి వాటి
మూతులె బిగించి చిత్తుచేసెద
నమ్ముడు నా మాట వినుడు నా పాట -

వేయి దీనారము లేల దానికేమి-
బదివేలిత్తుము - కానిమ్ము -
మా వేదనా భరిత ప్రచలిత
యాత్మలకు శాంతి గూర్చుము -

ఈ విపరీత విపత్కర నగర సంక్షోభము
దీర్చి నీ బంగారు దీనారాములగొనుము-

సన్నాయి వాద్య తత్పరుడప్పుడు
వంగి వంగె సలాము జెసె నధ్యక్షునకు -

యా పాలక సభాంతర్గత వివిధ
పాలక సభ్యులకు వంగి సలాము జేసి -

తన ఈ బాధ్యతను స్వీకరించి
మూషికముల పీడ వదలింపగ -
నగర వీధుల గుండ చనెనతడు



మెడను వ్రేలెడి సన్నాయి సవరించె నపుడు -

విశ్వమోహన మురళి యూదినట్లు
(కాళియుని శిరసున కృష్ణుడాడినట్లు)
ఊదెను శ్రావ్యమ్ముగ (నందన మందారమె పూచినట్లు)
తిత్తి సరిజేసె, రాగ మాలపించె
కంఠము సవరించి ఊదెను

సన్నాయి ప్రజాహృదయ మోహనముగ
సన్నాయి ప్రజా శ్రవణ పేయమ్ముగ

ఎదో యొక వింత స్వరమె తోచెను
ఎదొ యొక అమరగానమై వచ్చెను
ఎదో చింత తీరినట్లాయెను
ఊదె నతడా సన్నాయి, బనాయించి
యూదెను కంఠమును బిగించి
యూదెను సనాయి సనసన్నగ నా సన్నాయి-

అల్లదే చూడుడా దృశ్యాన్ని
మెల్లమెల్లగ నవి రాసాగినవి
ప్రతి యొక గృహాంగణము నుండి
ప్రతి యొక బిలాంతరము నుండి

ఎలుకలు ఎలుకలు ఎలుకలు
చిన్నెలుకలు చిట్టెలుకలు
పొట్టెలుకలు పాడెలుకలు,

చుంచెలుకలు చుంబించుచు వచ్చె
సన్నాయి ధ్వని నాలకించి యాస్వాదించ
పోతరించిన పందికొక్కులు
పంతమాడుచు నల్దిక్కుల
ఫూత్కరిస్తూ ఛీత్కరిస్తూ
వచ్చె నవిబిలబిలమను చు
నింగినేల ఈనినట్లు
వంగి వంగి ఒయ్యారముగ
రా సాగినవి వేగ రాసాగినవి-

సన్నాయి రాగమె వినబడె నూరంత
ప్రతియింట, ప్రతిచోట, నా నగరమంత
సన్నాయి యె ప్రతిధ్వనించె నంత నంత

నగర ప్రజాకోటి పరవశమొందగ
సన్నాయి గానమె వినబడె నా నగర మంత

నా వాద్యగాడు సాగెను
మెలమెల్లగ సాగెను
నగరమంత దిరుగుచు దూరముగ సాగెను
ప్రజలందరు విస్తు పోవగ
హృదయములు తటతటమని కొట్టుకొనగ
వాద్యగాడు సాగెను దూరముగ సాగెను.

తమ కన్నులనె నమ్మలేక
ముక్కున వ్రేలిడికొని నమ్మలేక



నోళ్ళు తెరుచుకు చూడసాగిరి
కన్నులింత చేసుకు యా వింత

ఏ మాయెను ఏ మాయెను
ఎలుకలే మాయెను ఏమి జరుగునింక
యని యాతృతతో చూడసాగిరి
గేహముల వీడి వీధిని బడిరి
జనములు తండ తండములుగ
చూడసాగిరి వారా వింత-

ఎలుకలు బిడారుల వలె
కలుగులు వీడెనవి యా గానా
లాపనకు పరవశమెత్తి
శివమెత్తిన గణాచారివలె
సాగినవి తమ్ము తామె మరచి
తమ కుక్షిం భరత్వ వ్యాసంగమె మరచి
నిర్వ్యాసంగులై సర్వమె విడచి
సాగినవి సాగినవి -

ఒక మహా మూషిక సాగరమె
ప్రవహించినట్లు
కదిలినవి మెదిలినవి
వడివడిగ కదలినవి
చక చకా సాగినవి
అమృతగాన రసాస్వాదనా ప్రియులై
నవి సాగినవి

పరుగు పరుగున కదలిన యా
మూషికవాహినికి పారమేది?
అల్లదే చూడుడు, ప్రశాంత
గభీర వీజరు నదీజలములు
అలలు అలలై కదలసాగెను
మిలమిల లాడుచు జలములు

పరుగున పరుగున జరుగుచు
చర చర మని కదలుచు కులుకుచు
కిచ కిచ మని కికురించు

పడినవి పడినవి ఎలుకలు
బుడుంగున ఆ నదిలో
పడినవి పడినవి ఎలుకలు
దభాలున ఆ నదిలో

వీజరు నదీ గర్భమున
బుడుంగున మునిగినవి
బుడుంగున మునిగినవి

ప్రశాంత గభీర వీజరు నదీ జలముల
బుడి బుడుంగున మునిగినవి
వేయి రూప్యము లిండు
నా మాటను నిలుపుకొంటిని
నగరములోని ఎలుకలన్ని మాయమయ్యె



మా చింతలన్ని తీరె ఇక వేగమె
నా పారితోషిక విప్పింపుడని

ఏదో ఒక చిన్న పాట నాలపించి నందుకు
వేయి రూప్యము లిచ్చుట ఏమి?
ఏబది రూప్యములు చాలు అని
యా నగర పాలకాధ్యక్షుడనెను

విస్తుపోయె నా వాద్యగాడూ
రౌద్రాకృతి దాల్చెనతడు
ఎంత మోసము ఎంత మోసము!
మీర్నమాట మీరే దాటుదురా
మీ పెద్దరికమేల మీ మాటలేల?
ఏబది రూకలేల ఇదేమి భిక్షయా
చూడు డేమి చేసెదనో

మరల నా వాద్యమ శ్రావ్యముగ వినిపించెను
మరల మరల నెదో మధురోహస్వరమునూదెనో

అందున్న యాకర్షణ యేమొ గాని
ఆ నగరములోని బాలబాలికలందరు-
పసివారందరు ఒక్కరు లేకుండగ
అతని వెంటబడిరి పరుగులిడిరి
పోసాగిరి ఊరి చివరకు.

అల్లదే కనబడెను నొక పెద్దకొండ
కొండ నానుకుని యుండెను తలుపులు
గభాలున తెరచుకొనెను. వాద్యగాడో
లోనికేగెను- పిల్లలందరు అతనితో
వెడలిపోయిరి - తలుపులన్ని మూసు
కొనిపోయె - ఊరిలోని వారందరు
విస్తుపోయి చూచు చుండిరి
గగ్గోలు పడిరి - పరుగులెత్తిరి-

ఆ వాద్యగాడా పసికందుల నేమి చేసెనో
వారందరను వెరొక దేశమునకు
తీసికొని పోయె - నచట
వారందరు మరొక కొత్తజీవితము
నారంభించిరి.



# ఉత్తరం

దూరాన్నుంచి వచ్చిన ఉత్తరం
భారాన్ని మోసుకు తెచ్చిన పత్రం
మాటల కిటికీల్లో నుంచి
వాక్యాల ప్రాకారాల మీంచి
తొంగి చూచే ఆప్త హృదయాన్ని
దొంగిలించి తెచ్చిన ఉత్తరం.

కలత చెందిన ప్రేమికుల
కలికి చూపుల ప్రేమపుష్పం
దూరాన్నుంచి వచ్చిన ఉత్తరం
భారాన్ని మోసుకు తెచ్చిన పత్రం

ఉత్తరంలో ప్రాణం ఉంది
ఉత్తరంలో గానం ఉంది
ప్రాణంతో మరిగానంతో
కదిలే మెదిలే చైతన్య విహంగం ఉత్తరం
ఉత్తరంలో భాష్యం ఉంది
ఉత్తరంలో హాస్యం ఉంది
భాష్యంతో మరి హాస్యంతో
లాస్యం చేస్తుంది ఉత్తరం
ఉత్తరంలో జ్వాలలు ఉన్నయ్
ఉత్తరంలో జోలలు ఉన్నయ్

భుగభుగమండే
కణకణలాడే
జ్వాలత్తోరగులుతుంది ఉత్తరం

హోయి హోయిగా
జాయిజాయిగా
సోజాయని పాడుతుంది ఉత్తరం
ఉత్తరంలో పురస్కృతి ఉంది.
ఉత్తరంలో తిరస్కృతి ఉంది.

ఉత్తరంలో బహి(ష్కృతి) ఉంది)
ఉత్తరంతో చమత్కరిస్తాం
ఉత్తరంతో యుద్ధాల్ చేస్తాం
ఉత్తరంతో మేడలు కడ్తాం
ఉత్తరంతో కూల గొడ్తాం

కల్యాణం కలకల్లాడే
లావణ్యం తొణికిసలాడే
సొగసు కన్నియ నిగ్గుదేరిన బుగ్గలపై
సిగ్గు చిలికే చిన్నారి ఉత్తరం
దూరాన్నుంచి వచ్చిన ఉత్తరం
భారాన్ని మోసుకుతెచ్చిన పత్రం.

* 1960
ఆంధ్రప్రభ



నాటికలు

# కుమారుని పెళ్ళి

(ఉపోద్ఘాతం చెప్పేవాడు)

**కొం**త కాలానికి శంకరయ్య/ సోమదేవమ్మలకు ఓ కొడుకు పుడతాడు. అదేం చిత్రమో కాని ఆ పుట్టినవాడు ఒక నాగుబాము వాడిని చూసి ఆదంపతులిద్దరికీ చాలా భయమేస్తుంది. వాళ్ళ సన్నిహితులు ఈ కుమారుని ఎలాగైనా వదిలించేసుకోమని సలహా ఇస్తారు-కాని శంకరయ్య భార్య, సోమిదేవమ్మ వాళ్ళ సలహా పాటించకుండా వాడెట్టివాడైనా వాణ్ణి ఎంతో ప్రేమతో పెంచి/ స్నానం/ భోజనం/ అన్నీ పెట్టి పెంచసాగింది. వానికి ఒక బంగారుపెట్టె చేయించి అందులో నిద్రపుచ్చేది. ఇలాగే వాడు పెరిగి పెద్దవాడయాడు.

(ఒక రోజున శంకరయ్య గారింట్లో)

(విచారంతో)

సో.దే : మీ కెన్నిసార్లు చెప్పినా నా మాట పట్టించుకుంటేగా-

శంకరయ్య : నీవు చెబుతూనే ఉన్నావు. అయినా నీకు బాధకలిగించే పని నేనేం జేశాను?

సో.దే : నిమ్మకు నీరెత్తినట్లు ఊరకే కూర్చుంటే ఎలాగ -

శంక. : 'ఊరికే విసుక్కోవద్దు' సంగతేమిటో చెప్పితే బాగుంటుంది.

సో.దే : నే నంటేనూ, నా కొడుకంటేనూ ఇష్టం లేదు-

శంక. : ఆ మాటనొద్దు-స్వామివారికి అభిషేకాలు అర్చనలూ చేస్తూనే ఉన్నాను-నా యిష్టాయిష్టాల సంగతెందుకు-నేనేం చేయాలో దిగులుగానే ఉంది-

సో.దే : మన కుమారుని సంగతి యింక అశ్రద్ధా చేయొద్దు. వాడు పెద్దవాడయాడు.

శంక. : అయితే ఏం చేయమంటావు?

సో.దే : వాడికి పెళ్ళి చేయాలి-ఎంతకాలం ఇలా పెళ్ళిచేయకుండా అట్టిపెట్టుకుంటాము?

శంక : వీణ్ణెవరు పెళ్ళి చేసుకుంటారు?

సో.దే : నాకు రాత్రి కలలో పార్వతి పరమేశ్వరులు కనబడ్డారు. మన కుమారునికి పెళ్ళి చేయమనీ, మనకు శుభం కలుగుతుందని చెప్పారు-

శంక. : పార్వతీ పరమేశ్వరులు అభయం ఇచ్చారు. సరే-కాని నా కుమారునికి ఎవరు పిల్లనిస్తారు?

సో.దే : అల్లాగని-పెళ్ళీడువచ్చిన కొడుకుని ఎంతకాలం ఇలా ఉంచుకుంటాం -మంచి సంబంధం చూడండి-

శంక. : ఏ తండ్రి అయినా కుమార్తెను - ఇటువంటి నా కుమారునికి ఇచ్చి పెళ్ళి చేస్తారా-

సో.దే : మీరు ప్రయత్నం చేయండి ఆ భగవంతుని మీద భారం వేసి-

శంక : బాగుంది నీవనేది-లోకంలో ఇటువంటి పెళ్ళికి ఎవరూ ఒప్పుకోరు-ప్రయోజనం ఉండదు.

సో.దే : నా కుమారుని పెళ్ళి జరుగుతుందని నాకు ధైర్యం ఉందండీ.

శంక. : ఒకవేళ ఏ తండ్రి అయినా ఒప్పుకున్నా- ఆయన కుమార్తె ఒప్పుకోవద్దూ ఈ పెళ్ళికి-

సో.దే : (విచారం) ఇంక నేను బ్రతికి ఏం లాభం - ఏ నుయ్యో గొయ్యో చూచుకోవలసిందే-

శంక. : ఇటువంటి పనిమాత్రం చేయకు-నేను రేపే వెళ్ళి మనకు తెలిసిన బంధువులతో సంప్రతించి ప్రయత్నిస్తాను.

సో.దే : వెళ్ళిరండి- నాకు నమ్మకముంది. మీ ప్రయత్నం ఫలిస్తుందని-

(వీణానాదం)

(శంకరయ్యా ఎన్నో ఊళ్ళు తిరుగుతాడు- ఎందరో బంధువుల్ని కలుసుకుని కన్యాన్వేషణ కావిస్తాడు. ఏ కన్యా శంకరయ్య కుమారుని పెళ్ళి చేసుకునేందుకు సమ్మతించరు. తన దగ్గర బంధువైన సుబ్బయ్య చాలా బీదవాడు- అతని ఇంటికి కూడా వెడతాడు.)



సుబ్బయ్య : ఎన్నాళ్ళకి వచ్చావు! శంకరయ్యా అంతా క్షేమమేనా- ఏమిటిలా వచ్చావు-సంగతేమిటి.

శంక : అంతా క్షేమమే-నా కుమారుని పెళ్ళి చేయాలని సంకల్పించాను. పెళ్ళికుమార్తె కోసం ఏ సంబంధమైనా కుదురుతుందని.

సుబ్బ : ఈ సంగతి ముందే చెప్పలేదేం-నా సంగతి నీకు తెలుసుగా-నా కూతురు మీనాక్షి కి కూడా పెళ్ళీడు రానే వచ్చింది- నేనూ పెళ్ళి చేద్దామనే ఉంది- కాని..

శంక : కాని- ఎందుకాలశ్యం-

సుబ్బ : బోలెడంత డబ్బు కావాలి-నీకొడుక్కు పెళ్ళి చేద్దామనుకుంటున్నావు కదా-నా పిల్లనివ్వడానికి నాకేమీ అభ్యంతరం లేదు. మా మీనాక్షి నీ కొడుక్కిచ్చి పెళ్ళిచేసెయ్యి-

శంక : (ఆశ్చర్యంతో) నీ కూతురుని నా కొడుక్కిచ్చి పెళ్ళి చేసేముందు నా కొడుకుని చూచుకుని నిశ్చయం చేయడం మంచిది-

సుబ్బ : అవసరం లేదు- నీ సంగతి- మీ ఆవిడ సంగతి నాకు తెలియదా ఏమిటి? అమ్మాయి నా మాటకి అడ్డు చెప్పదు.

శంక : నీ ఇష్టమే నా ఇష్టం-

సుబ్బ : ఇక ఆలస్యమెందుకు-నా కూతురుని నీ వెంటబెట్టుకుని తీసుకెళ్ళి ఆమెకు శీఘ్రమే పెళ్ళి చేసెయ్యి-

(శంకరయ్యతో సుబ్బయ్య కూతురు మీనాక్షిని తన ఇంటికి తీసుకొని వెళ్ళిపోతాడు)

(శంకరయ్య ఇంట్లో)

సో.దే : ఏమిటీ- ఈ అమ్మాయి ఎవరు? వెళ్ళినపని అయిందా?

శంక : ఈ అమ్మాయే పెళ్ళికూతురు. సుబ్బయ్య గారి కూతరు-మన కొడుక్కిచ్చి ఈమెని పెళ్ళిచేయమని నాతో పంపించాడు.

సో.దే : చాలా సంతోషం-ముందు ముహూర్తం పెట్టించి పెళ్ళి పనులన్నీ చేసి-వివాహం చేసేద్దాం-

శంకర : ముహూర్తం పెట్టించి పెళ్ళి చేసేద్దాం–

(వీణానాదం)

(ఒక నాగుపాముకీ శంకరయ్య బంధువైన శ్రీ సుబ్బయ్య గారి కూతురికీ వివాహం జరుగుతోందని ఆ ఊళ్లో అందరికీ తెలిసిపోతుంది. అంతా ఆశ్చర్యపోతారు– ఒకరోజున సోమదేవమ్మ గారి స్నేహితురాలు జానకమ్మ గారు వచ్చి పెళ్ళికూతుర్ని పలుకరిస్తుంది.)

జానకమ్మ : ఏమమ్మాయి–మీనాక్షీ–పెళ్ళి కుమారుని గురించి తెలుసో తెలియదో –అని–

మీనాక్షి

పెళ్ళి కూ. : ఏమిటో చెప్పండి–

జానకమ్మ : ఈ సంబంధం నీ కిష్టమేనా? పెళ్ళి కుమారుడెవరో తెలిసే చేసుకుంటున్నావా – అతడొక నాగుపాము.

మీనాక్షి

పెళ్ళి కూ : అయితే యేం?

జానకమ్మ : ఇతన్ని చేసుకుని నీవేం సుఖపడతావు?

పెళ్ళి కూ. : మా తండ్రి నా పెళ్ళి నిశ్చయించారు. ఈయన కుమారునితో ఆయన ఎటువంటి వాడయినా సరే–నా భర్త– ఆయన్నే నేనారాధించుకుంటాను.

జానకమ్మ : నీయిష్టం– భగవంతుడే నిన్ను కాపాడుతాడు (నిష్క్రమిస్తుంది)

(వీణానాదం)

ఆ నాగుపాముకీ పెళ్ళికూతురు మీనాక్షికి యథావిధిగా పెళ్ళి జరిగిపోతుంది! బంగారు పెట్టెలో తన భర్తను ఒక వేదికమీద ఉంచుకుని తన గదిలో ఆయనకు భక్తితో సేవలు చేస్తోంది. ఆమె భర్త ఆ బంగారు పెట్టెలో నిద్రిస్తుంటాడు –ఒకరోజు మీనాక్షి గదిలో–

(వీణానాదం తరువాత)

మీనాక్షి : చాలాపొద్దుపోయిందీ రోజు. అబ్బ నాకు నిద్రవస్తోంది. ఇక పడుకుంటాను. (ఆశ్చర్యంతో) ఇదేమిటే–ఈ బంగారు పెట్టె తెరుచుకుని ఇందులోంచి ఆయనెవరో వస్తున్నారే– అమ్మో నాకేదో భయమేస్తోంది! ఈ గదిలోంచి బయటికి పారిపోతాను.

(బంగారు పెట్టెలోంచి ఒక అందమైన యువకుడు ఆమెను సమీపించి)

భర్త : నీవిక్కడ నుంచి వెళ్ళొద్దు – నేనే నీ భర్తను – నన్ను ప్రతిరోజూ సేవిస్తున్నావుగా–

మీనాక్షి : నేను పగలు సేవించేది నాగుపాము. మరి మీరు నా భర్త ఎలాగవుతారు–

భర్త : నా మాట నమ్ము–నేనిప్పుడు నా పూర్వ రూపం ధరించి మానవ రూపంలో నీకు దర్శనమిస్తాను.

(ఆమె భర్త తిరిగి బంగారు పెట్టెలో ఉన్న ఆ నాగుపాము శరీరంలోకి ప్రవేశించి తిరిగి మరుక్షణమే మానవరూపం ధరించి ఆమె ముందు ప్రత్యక్షమవుతాడు)

మీనాక్షి : (ఆశ్చర్యంగా) నేను నా కన్నునే నమ్మలేకుండా ఉన్నాను. నా భర్తకు మనుష్యరూపం వచ్చేసింది. మీకిదే నా నమస్కారం!

(ఆయన కాళ్ళకు నమస్కరిస్తుంది.)

భర్త : మీనాక్షి – నీవేమీ దిగులు పెట్టుకోకు. ఉదయం వరకూ నేనీ రూపంలో నీముందుంటాను తరువాత పగలు ఆ రూపంలో ఉంటాను. నీవేమీ బాధపడొద్దు.

మీనాక్షి : రాత్రి దర్శనమిస్తూండండి. అలాగే మీ సేవ చేసుకుంటాను–

(భర్త తిరిగి నాగరూపం ధరించి బంగారు పెట్టెలోకి జారుతాడు)

(వీణానాదం)

యిలా కొన్నిరోజులు గడుస్తుంటాయి– తండ్రి శంకరయ్యకు గదిలో ఎవరెవరో యువకుల మాటలు ప్రతిరోజూ రాత్రి వినబడుతూంటాయి. ఆయనకి చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఒకరోజు రాత్రి గదిలోపల జరిగేదేమిటో నిఘా వేసి ప్రక్క కిటికీలోంచి చూడసాగాడు. ఆ రాత్రి ఎప్పటి లాగే తన కొడుకు బంగారు పెట్టెలోని నాగ శరీరం విడిచి యువకుని రూపంలో కోడలు మీనాక్షితో ముచ్చటిస్తుంటాడు. శంకరయ్య ఇదంతా చూచి తలుపు తోసుకుని లోపలికి:

శంకరయ్య : కుమారా- ఏమిటీ వింత. ఈ నాగశరీరం నాశనం చేసేస్తాను-ఇది ఇక్కడుండకూడదు-

మీనాక్షి : ఏమిటి మామయ్యగారు - ఏమిటది ఈ నా భర్త శరీరాన్ని ఎక్కడికి తీసుకుపోతున్నారు- ఆగండి-

శంకరయ్య : అమ్మా మీనాక్షి నీకేభయం లేదు-ఈ నాగశరీరాన్ని అగ్నిదేవునికి ఆహుతి చేయాలి అపుడు నాకుమారుని నిజరూపం స్థిరపడుతుంది-

(అంటూ నాగ శరీరాన్ని కాల్చి బూడిద చేసి తిరిగి తన కుమారుని వద్దకు వస్తాడు)

కుమారుడు : ఓ నాన్నా-నా పూర్వ రూపాన్ని కాల్చేసి నాకెంతో మేలు చేశారు-

శంకరయ్య : నీ జన్మ నాగరూపంలోనే జరిగింది. అప్పటి నుంచీ-

కుమారుడు : నేనొక శాపంవల్ల ఈ రూపంలో ఉన్నాను. ఎవరైతే నా పూర్వ రూపాన్ని నా అంగీకారం లేకుండా భస్మం చేస్తారో అప్పుడే నా నిజరూపం సార్థకమవుతుంది-

ఈ రోజు నాకు ఆ శాప విముక్తి కలుగజేశారు.

(ఇంతలో భార్య సోమదేవమ్మ లోపలికి వస్తుంది)

శంకరయ్య : ఇదుగో నీ పుత్రుడు - వీనికి నిజరూపం వచ్చింది.

సో.దే : నా కల నిజమైంది. పార్వతీపరమేశ్వరులు నాకు శుభం కలుగుతుందని చెప్పారు.

మీనాక్షి : నా అదృష్టం ఫలించింది-

(మీనాక్షి అతని భర్త శంకరయ్యకీ సోమదేవమ్మకీ నమస్కరిస్తారు. వారు ఆశీర్వదిస్తారు)

-శుభం-

**✻ 13-9-1998**

**A.I.R**

బాలానందం



# కుశలబుద్ధి

కమల : ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నావేమిటి?

విమల : ఏముందీ మన నగరంలోని ఆ గొప్ప వర్తకశ్రేష్ఠి ఎన్నో దానధర్మాలు చేస్తున్నాడు.

కమల : అవసరమైనప్పుడల్లా అప్పులూ / దానాలూ ఇస్తున్నాడు గదా-ఇప్పుడేం జరిగిందేమిటి?

విమల : దేనికైనా హద్దూపద్దూ ఉండాలి. ఇలా ఇవ్వగా ఇవ్వగా చివరికి తన తిండికైనా కొంత ఉంచుకోవాలి కదా.

కమల : ఆ మాట నిజమే-దానంలోనూ కొంత విచక్షణ ఉండాలి. మరి - ఇంతకీ అతనికేం జరిగిందీ.

విమల : అదిగో వినుమరి

(వీణావాదన)

(ఒక రోజున ఆ వర్తక శ్రేష్ఠి ఇంట్లో అతని లేఖకుడు రత్నపురుషుడూ అతని సేవకుడూ)

రత్నపురుష : ఇంత తొందరగా వచ్చేశావేం-ఈరోజు మళ్ళా ఎవరైనా వచ్చారా అయ్యగార్ని అర్థించడానికి

సేవకుడు : వస్తూనే ఉంటారు-దానం చేసే మంచి బుద్ధి గలవాళ్ళుంటే పుచ్చుకునే వాళ్ళకేంలోటు?

రత్నపురుష : ఇంతకీ వాళ్లెవరు? వారికేం కావాలట?

సేవకుడు : మన నగరంలోనే బీదవాడలో ఉంటుందీమె-ఆమె భర్త చాలా కాలం క్రిందట చనిపోయాడట-ఈ మధ్య ఆమె కూతురు వివాహం నిశ్చయమైందట-వివాహం జరిపించడానికి డబ్బులేక అటమటించిపోతోంది- బయట వసారాలో వేచి ఉంది.

ర.పు : ఆమె బంధువులెవరూ లేరా?

సే : ఎవరో దూరపు బంధువులున్నారు-వాళ్ళేమీ పట్టించుకునే స్థితిలో లేరు కనుకనే ఆమెకీ తిప్పలు-

అదిగో అయ్యగారొస్తున్నట్లున్నారు-

(ప్రవేశం. మ ! భ)

మణిభద్రుడు: రత్నపురుషా ఏమిటీ విశేషం? ఎవరైనా మనసాయం కోసం వచ్చారా?

ర.పు : వచ్చారు - ప్రవేశ పెట్టమంటారా?

మ.భ : ప్రవేశ పెట్టు! (కుతూహలంతో)

అమ్మా నీకేం కష్టం వచ్చింది.

ర.పు : అయ్యా! వాళ్ళమ్మాయికి పెళ్లి నిశ్చయమైందిట. కాని తగినంత డబ్బులేక-పెళ్ళి ఆగిపోయే స్థితిలో ఉంది-

మ.భ : మరేం ఫరవాలేదు-యీమే అవసరానికి ఆదుకోపోతే ఎలాగ? ఆమెను లోనికి ప్రవేశపెట్టు-

(ప్రవేశం కనకలక్ష్మి)

క.ల : దండాలు దండాలు అయ్యగారికి నేను చాలా అవస్థలో పడ్డాను-నా కూతురుపెళ్ళి మీ చేతి మీదుగా జరిపించి పుణ్యంకట్టుకోండి-మీరే దిక్కు

మ.భ : మీ సంగతి విన్నానమ్మా-దిగులు పడకు - నేనున్నాగా నీకభయం ఇస్తున్నాను. రత్న పురుషా! ఈమెకు వెయ్యి వరహాలు ఇచ్చి పంపించు-

రత్న.పు : చిత్తం స్వామీ-(వెయ్యి వరహాలిస్తాడు)

క.ల : మీ మేలు మరువలేను-నేనెంతో కృతజ్ఞురాలిని- శలవు.

ర.పు : స్వామీ! ఒక విషయం చెప్పాలి

మ.భ : ఏమిటది - నిస్సందేహంగా చెప్పు!

ర.పు : మీకు తెలియందేముంది. నేటితో వచ్చింది రాగా/ ఇచ్చిందివ్వగా ఖజానా ఖాళీ అయింది స్వామీ! యిక రేపటి నుంచి చేసేదేమీ లేదు.



మ.భ. : నాకర్థమయింది-ఏం చేస్తాం-నాకేదో చాలా బాధగా ఉంది-

ర.పు : నాకూ ఏమీ పాలు పోవటం లేదు

మ.భ : అంతా దైవకృప - చూద్దాం ముందు ఏం జరుగనుందో మరి.

(వీణా వాదన)

(మణిభద్రుని శయ్యా మందిరం-అతడూ అతని భార్యా పండుకుని ఉంటారు-రాత్రి పొద్దుపోయింది)

మ.భ : తనలో! నాలో, బుద్ధీ ఓర్పూ అణగారిపోతున్నాయి. నక్షత్రాలులేని ఆకాశంలా ఏదో పెద్ద వెలితి ఏర్పడింది-

భార్య : దిగులు పడకండి - కష్టాలు వచ్చినపుడు ధైర్యంగా ఉండాలి.

మ.భ : జీవితంలో ఏదో అగాధం ఏర్పడింది-ఇల్లు గడవడమే కష్టమయింది-రేపటి సంగతి ఎలాగో మరి-

భా : అయినా ముందూ వెనకా చూచుకోకుండా-

మ.భ : ఇహ ఈ కటిక దారిద్ర్యంతో నేను జీవించి ప్రయోజనమేమిటి?

భా : మీరు ప్రశాంతంగా ఉండాలి-

మ.భ : నేను ఇక పస్తులుండి నా ప్రాణాలు వదిలేస్తాను. నాకిదే ఏకైక మార్గం-

భా : మీరు బాధపడకండి-మీరు కాసేపు నిద్ర పట్టించుకోండి-ఏదో మంచి జరుగుతుంది-

మ.భ.కు కునుకుపడుతుంది. ఆమెకూడా నిద్రపోతుంది-

(వీణావాదన)

(మణిభద్రునికలను సూచించే వీణావాదనలాంటి ధ్వనులు వినబడుతుండాలి.)

భిక్షువు : మణిభద్రా-నేనే ఆ భిక్షువుని: నీవు అమితంగా దానధర్మాలు చేసి పస్తులుండే స్థితికి వచ్చావు-దానంతో బాటు కుశల బుద్ధితో ప్రవర్తించు-

మ.భ : ఆహా - ఏమిటీ దివ్యకాంతి? ఎవరివీ మాటలు-

భిక్షు : నేనే మాట్లాడేది-నేనొక సన్యాసిని.

మ.భ : నాకళ్ళనే నమ్మలేకపోతున్నాను-

భిక్షు : ఈ సన్యాసి రూపంలో-రేపు ఉదయం భిక్షకోసం మీ యింటికి వస్తాను

మ.భ : రండి నా పాలిటి దైవమే మీరు-నేనే విధంగా మిమ్మల్ని సంస్కరించగలను? అశక్తుణ్ణి!

భిక్షు : నీ సత్కారం వద్దు. నేను వచ్చినపుడు నీవేమి సందేహించకుండా నా తలమీద కర్రతో పడగొట్టు.

మ.భ : అమ్మయ్యో! ఇదేమిటీ వింత కోరిక-నాకు సాధ్యంకాని పని-నేనెలా చేయాలి-నాకేదో భయం వేస్తోంది.

భిక్షు : నీవు సందేహించకుండా నా తల మీద కొట్టి నన్ను పడగొట్టు. తృటిలో బంగారు నాణేల రాశిగా నేను మారిపోతాను-నీ పాలిటి ధనలక్ష్మిని నీకింక ఏలోటూ ఉండదు. ఇక నుంచి బుద్ధికుశలతతో ప్రవర్తించు!!

(అదృశ్యమౌతాడు. మరుసటిరోజు ఉదయం మణిభద్రునికి మెలకువ వస్తుంది.)

మ.భ : రేపు ఎలా గడుస్తుందో అనేది గులుతో నిద్రించాను. అర్థంపర్థంలేని కల. ఆయన ప్రాణాలు తీయాలా జరగని పని.

భా : ఏమి జరిగింది స్వామీ-చెప్పండి.

మ.భ : నాకు గత రాత్రి ఒక కలవచ్చింది. ఎవరో భిక్షుకుడు ఇక్కడికి వస్తాడట. ఆయన తలమీద బలంగా నేను కొట్టాలట. వెంటనే ఆయన బంగారు నాణేల రాశిగా మారిపోతాడుట.

భార్య : అమ్మయ్యో! ఆయన తలమీద కొట్టటమే! ఎంత దారుణం-విచిత్రంగా ఉందే! బంగారు నాణేలా! మనకేమీ వద్దు! మీరు కొట్టనూ వద్దు!

మ.భ : ఔను బంగారునాణేలే: నీవీ కలను పట్టించుకోకు-ఇదంతా వట్టి కల.

* * *

(వీణావాదన)

(మరుసటిరోజు ఉదయం మణిభద్రుడు కాలకృత్యాలు తీర్చుకుని వసారాలోకి వస్తాడు అప్పుడు-)



భిక్షు : భవతి భిక్షాందేహి-

భవతి భిక్షాందేహి-

మ.భ : ఇదేమిటి ఈయన నా కలలో దర్శనమిచ్చిన భిక్షువేనే-ఏమాత్రం సందేహం లేదు-నాకేమీ తోచటం లేదు-ఆయన చెప్పినపని ఎలా చేయాలో?

(ధైర్యం తెచ్చుకొని సాహసంతో మూలనున్న కర్రతో ఆ భిక్షువు తలమీద బలంగా కొడతాడు)

అంతే భిక్షువుకు బదులు బంగారు నాణేలు పడిన చప్పుడు తృటిలో ఒక పెద్ద రాశిగా నాణేలు పడ్డాయి)

మ.భ : యేమిటీ వింత? యివన్నీ బంగారు నాణేలేనా-ఆహా ఏమి-ఈ వింత నా కళ్లని నేనే నమ్మలేకుండా ఉన్నాను-ఈ సమయంలో ఎవరా వచ్చిన వ్యక్తి!

(క్షురకుడు గుమ్మంలోంచి అక్కడ జరిగినది అంతా చూస్తాడు)

క్షురు : నేనే మణిభద్రా - ఏమిటీ వింత నీ అదృష్టం - బంగారు రాశి రూపంలో వచ్చింది - మిత్రమా

మణిభద్రుడు: నీవా! నా కష్టాలు ఈరోజుతో తీరాయి-బుద్ధికుశలతతో ప్రవర్తించి దానధర్మాలకే వినియోగిస్తాను ఈ నిధిని. నిరుపేద అయిన నీకే మొదటి దానం చేస్తాను. (అంటూ దోసెడు నాణేలను రాశిలోంచి తీసి క్షురకుని ఒడిలో పోస్తాడు-నాణేల చప్పుడు)

(క్షురకుడు సంతోషంతో నిష్క్రమిస్తాడు)

(వీణావాదన)

(క్షురకుని ఇంట్లో)

క్షుర : మణిభద్రుని లాగా నేనూ ఐశ్వర్యం ఎందుకు సంపాదించకూడదు? ఈ నగర పొలిమేర్లలో ఉన్న భిక్షుకున్ని మా యింట భిక్షకై ఆహ్వానిస్తాను-

(వీణావాదన దురాశాపరుడూ, మూర్ఖుడూ-అయిన ఆ క్షురకుడు అక్కడి మఠంలోని భిక్షుకుల్ని ఆహ్వానిస్తాడు. భిక్షకై వాళ్లు వస్తారు)

(క్షురకుని యింట్లో)

భిక్షుకులు : భవతి భిక్షాందేహి

భవతి భిక్షాందేహి

క్షుర : రండి సాములూ! యిలా లోనికి రండి-

(వారు లోనికి వస్తారు-క్షురకుడు అక్కడి దుడ్డుకర్రతో వారి తలల మీద బలంగా బాదుతాడు-ఆయువు పట్టుమీద తగిలిన దెబ్బలకి కొందరు బాధతో అక్కడికక్కడే చనిపోతారు. మిగిలిన వారు బాధతో పారిపోతారు)

క్షుర : ఇంతమంది చనిపోయినా ఏవీ సువర్ణరాశులు? కనబడవేం-ఏమిటీ చిత్రం-

(యిలోగా రక్షకభటులు వచ్చి క్షురకునికి సంకెళ్ళువేసి న్యాయధికారి ముందు నిలబెడతారు)

న్యాయాధికారి: నీ వింత ఘోరానికి పాల్పడినందుకు నీకు శిక్ష తప్పదు

క్షుర : యింత ఘోరం జరుగుతుందని అనుకోలేదు ప్రభూ! మణిభద్రుని లాగే సొమ్ము చేసికొందామని--

న్యా.అ : ఆ మణిభద్రుణ్ణి పిలిపించి ప్రవేశపెట్టండి.

(ఆ మరుసటిరోజు న్యాయాధికారి ఆ స్థానంలో మణిభద్రుణ్ణి ప్రవేశపెడతారు. మణిభద్రుడు తన స్వప్న వృత్తాంతం నుంచి జరిగినదంతా వివరిస్తాడు.)

న్యా.అ : ఈ మూర్ఖుడు మణిభద్రుని గ్రుడ్డిగా అనుసరించి అమాయక భిక్షువుల ప్రాణాలు తీసుకున్నాడు.

ఇతను ఘోర పాపం చేశాడు ఈతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తున్నాము.

అంతా నిష్క్రమిస్తారు

ఓం శాంతి శాంతి శాంతి:

**✱ 3-12-1995**

**A.I.R**

బాలానందం





ఆలిండియా రేడియో కార్యక్రమంలో గుమ్మడి, జగ్గయ్య, శారదలతో కామేశ్వరరావు గారు

# వర్తకుని మోసం

విమల : రవీ-ఏమిటీ- ఏదో చదువుతున్నావు

రవి : ఈవేళ ఖాళీ-ఏదీ తోచక కథలు చదువుతున్నాను.

విమల : ఇదిగో! మా స్నేహితురాలు రమ కూడా వచ్చేసిందే

రమ : ఏం! విమలా తీరిగ్గా కూర్చున్నా వేంచేస్తున్నావే!

విమల : ఈవేళ తీరిక దొరికింది-మా రవి ఏదో కథ చదువుతున్నాడే-మనం కూడా ఆ కథ విందామా?

రమ : విందాం!

రవి : అయితే వినండి-ఆ ఊళ్లో ఇద్దరు వర్తకులు బియ్యం వ్యాపారం చేసుకుంటున్నారు-వాళ్ళు మంచి స్నేహితులు- ఇద్దరూ ధాన్యం వర్తకం చేస్తున్నా - పోటీపడీపడకుండా ఎవరికి వారే తమ వర్తకం సాగిస్తుండేవారు. జన బాహుళ్యం చాలా ఎక్కువగా ఉండటంవల్ల - ఎవరికీ నష్టం లేకుండా వాళ్ళ వ్యాపారం సాగిపోతుండేది-ఓసారి ఏం జరిగిందంటే -

రమ : ఏం జరిగింది?

(వీణావాదన)

2వ వర్తకుడు-

రామయ్య : సుబ్బయ్యా-నాణ్యమైన బంగారు ఆభరణాలు అయిన కాడికి అమ్మకానికి వచ్చాయి.

సుబ్బయ్య : అల్లాగా - అయితే - ఏమంటావు?

రామయ్య : ఈ బేరం పోగొట్టుకోవడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. ఎంతో విలువైన ఈ బంగారు నగలని నేనే కొనేసి వాటిని నా భార్యకు ఇద్దామనుకుంటున్నాను.



సుబ్బయ్య : మంచి ఆలోచనే-అయితే బేరం పోగొట్టుకోకుండా వాటిని కొనేసే.

రామయ్య : కాని నా వద్ద అంత డబ్బులేదు-ఎందుకంటే ఈ మధ్య మా యిల్లు బాగుచేయడానికి చాలా ఖర్చయిపోయింది. అందుకని ఆ మొత్తం డబ్బు నీవు సర్దుబాటు చేయి. నీకు మళ్ళీ త్వరలో ఇచ్చేస్తాను.

రామయ్య : సరే-దానిదేముంది- తీసుకో రామయ్య. నీ దగ్గర డబ్బు ఎక్కడికి పోతుందిలే!

(అని లోపలికి వెళ్ళి 50 వేలు తీసుకువచ్చి రామయ్యకు ఇచ్చేస్తాడు)

(వీణావాదన)

(ఆ రోజు సుబ్బయ్య ఇంట్లో అతని భార్య లక్ష్మి)

లక్ష్మి : ఏమండీ. అంత పెద్ద మొత్తం రామయ్య గారికి ఇచ్చేశారు నోటిమాటగా-మరి మీరు ఏమైనా ఖరారు పత్రం వ్రాసుకున్నారా?

సుబ్బయ్య : ఏ పత్రం రాసుకోలేదు-యిన్నేళ్ళుగా అతను నా అంతరంగ మిత్రుడు-

లక్ష్మి : అతను మీ ఆప్తమిత్రుడే కావచ్చు-ఒకవేళ ఏ కారణం చేతనైనా యీ మొత్తాన్ని ఇవ్వకపోతే అప్పుడు మీరేంజేస్తారు? మీ వద్ద అప్పుతీసుకున్నాడని ఋజువు ఏదీ?

సుబ్బయ్య : అది అనవసరం. అనుమానం పెట్టుకోకు. యిన్నేళ్ల నుంచీ నా ఆప్తుడు. అయితే అన్యాయం ఏదీ జరగదు. అతన్ని నమ్మకపోతే నేనింకెవర్ని నమ్మాలి-

లక్ష్మి : డబ్బు విషయంలో జాగ్రత్తగా ఉండాలి అని మీరే కదా అంటూంటారు.

సుబ్బయ్య : ఊరకే ఏదీ చెప్పకు! అయినా మా ఇద్దరి మధ్య ఖరారు పత్రాలెందుకూ.

లక్ష్మి : మీ నమ్మకం మీది-సరే మీ యిష్టం. చూద్దాంగా-

(వీణావాదన)

రవి : ఇలా కొంతకాలం గడిచిపోయింది-రామయ్య తనంతటతానుగా డబ్బు సుబ్బయ్యకు వాపసు ఇవ్వలేదు. ఎప్పుడు ఇద్దరూ కలిసి వేరే విషయాలు

ఏవో చర్చించేవాడేకాని తానిచ్చిన మొత్తం తిరిగి వాపసు ఇవ్వడం సంగతే ఎత్తేవాడు కాదు రామయ్య.

(ఒకరోజు సుబ్బయ్య ఇంట్లో)

లక్ష్మి : నేనిదివరకు మీకేం చెప్పాను.

సుబ్బయ్య : నీవు చెప్పావనుకో-కాని నేను అతనే ఎప్పుడో వాపసు ఇస్తాడనుకున్నాను ఆ మొత్తాన్ని.

లక్ష్మి : ఇంకా ఆలశ్యం దేనికి - వెళ్లి అడగండి-అలా చూస్తారేం.

సుబ్బయ్య : అడుగుతాను.

(వీణావాదన)

(ఒకరోజు సుబ్బయ్య వద్దకు రామయ్య వెళతాడు.)

సుబ్బయ్య : ఏం రామయ్య-తీరిగ్గా కూర్చున్నావే.

రామయ్య : ఈ రోజున-వ్యాపారం బేరాలు రాలేదు-

సుబ్బయ్య : చాలా రోజులైంది-నా అప్పు మొత్తం ఇస్తే బాగుంటుంది-నాకు ఇప్పుడు చాలా అవసరం.

రామయ్య : అప్పా-నీవద్ద నేను అప్పు తీసుకుంటేగా!

సుబ్బయ్య : (ఆశ్చర్యం) ఇదేమిటి అలాగంటావు? బంగారం కొనడానికి 50వేలు ఇచ్చానుగా అప్పు

రామయ్య : నాకా! అప్పిచ్చావా! నేను నీ దగ్గర అప్పుచ్చుకుంటేగా-చిత్రంగా ఉందే - నీవనేది!

సుబ్బయ్య : నీకాశ్చర్యంగానే ఉంటుంది-ఇచ్చిన వాణ్ణి నేను-విలువైన బంగారం నగలు కొని మీ ఆవిడకు కట్టబెట్టటానికి అప్పటికప్పుడు ఏభైవేలు ఇస్తే-పుచ్చుకుని-ఇప్పుడు నాకేం తెలియదనడం-చాలా విడ్డూరంగా ఉందే-చాలా అన్యాయం.

రామయ్య : బాగా జ్ఞాపకం చేసుకో నీవెవరికిచ్చావో!



సుబ్బయ్య : చూద్దాం- (వెళ్లిపోతాడు)

(వీణావాదన)

రవి : చూశారా పాపం సుబ్బయ్యకి ఏం చెయ్యాలో తెలియలేదు. కాని ఏభైవేలు ఇలా వదలుకోవడమా అనుకున్నాడు. పైగా కష్టపడి వ్యాపారంలో వచ్చిన న్యాయమైన సొమ్ము.

విమల : మరి ఏం చేశాడు?

రవి : ఆ రోజుల్లో అక్బరు రాజావారి ఆస్థానంలో బీర్బలు అనే వ్యక్తి ఉంటూ ఉండేవాడు. అతను మంచి మేధావి. రాజా అక్బరు ఆంతరంగిక సభ్యుడు కూడాను-రాజుగారి కొచ్చిన సమస్య లెన్నింటినో చాకచక్యంతో పరిష్కరిస్తూ అక్బరు ప్రశంసలు పొందాడు. మన సుబ్బయ్య, బీర్బలు దగ్గరకెళ్ళి తన స్నేహితుడికిచ్చిన 50వేల మొత్తం అప్పు గురించి జరిగిన దంతా చెప్పి తన అప్పుగా ఇచ్చిన మొత్తాన్ని ఎలాగైనా రాబట్టుకొనే సాయం చేయమని ప్రార్థించాడు. బీర్బలు అతనికి ధైర్యం చెప్పి పంపించాడు.

(వ్యాపారస్తులిద్దరినీ రాజా అక్బరు ఆస్థానానికి పిలువబడ్డారు.)

బీర్బలు : రామయ్య-నీ మిత్రుడు నీకిచ్చిన ఏభైవేలు విషయంలో నీ వేమంటావు.

రామయ్య : ఈ అప్పు సంగతి అంతా అబద్ధం ప్రభూ నేనేం తీసుకోలేదండి.

బీర్బలు : సుబ్బయ్యా-నీవు ఇదివరకు చెప్పినదంతా విన్నాను. లిఖితపూర్వకంగా అప్పు సంగతి పత్రం ఏమీలేదు. నీవు అతనికి అప్పిచ్చినట్టు నీ వద్ద ఋజువు లేనప్పుడు-ఏమీ చేసేది లేదు-మీరు ఇక వెళ్ళవచ్చు-

రవి : మరుసటిరోజున బీర్బలు ఆ ఇద్దరి ధాన్యవర్తకుల్ని పిలిపించాడు.

బీర్బలు : మాకు కొందరు వర్తకులు కొన్ని ధాన్యం బస్తాలు ఇచ్చారు. వారికిదివరకు నేను ఏదో సాయపడ్డాను గనుక. కాని వీటన్నిటిని నేనేం జేసుకోను.

సుబ్బయ్య రామయ్య : మమ్మల్నిప్పుడేం చేయమంటారు.

బీర్బలు : మీ ఇద్దరు ధాన్యం వ్యాపారం చేస్తున్నారు గదా. ఒక్కొక్కరు ఒక్కో బస్తా తీసుకెళ్ళి వాటిని విక్రయించిపెట్టండి–

ఆ వచ్చిన లాభంలో చెరి ఒక్కరికి కొంత భాగం ఇస్తాను.

సుబ్బయ్య : అలాగే తీసుకెళ్ళి అమ్మిపెడతామండి.

రామయ్య

(బస్తాలతో నిష్క్రమిస్తారు)

(వీణావాదన)

విమల : తరువాత ఏం జరిగింది రవీ

రవి : ధాన్యం బస్తాలు ఇద్దరూ అమ్మేశారు–కాని బస్తా అడుగున ఇద్దరికీ చెరో బంగారు నాణెమూ దొరికింది. అప్పు ఇచ్చిన సుబ్బయ్య ఏమనుకున్నాడంటే పొరపాటున బీర్బలు అందులో బంగారునాణెం పడిపోయి ఉంటుందని, ఆ నాణేన్ని తీసుకెళ్ళి బీర్బలుకిచ్చేశాడు–కాని అప్పుపుచ్చుకున్న మన రామయ్య మాత్రం బంగారు నాణెం తన వద్దనే దాచేసుకున్నాడు. కొన్ని రోజులైన తరువాత ఇద్దరు ధాన్యం అమ్మిన డబ్బును బీర్బలుకిచ్చేయడానికి బీర్బలు ఉన్న ఆస్థానానికి వెళ్లారు.

బీర్బలు : ధాన్యం బస్తా అమ్మేప్పుడు దానిలో మీకేమీ దొరకలేదా?

రామయ్య : అబ్బే ఏమీ దొరకలేదే– (మీరు వెళ్లవచ్చు)

తరువాత బీర్బలు రాజుగారి బంట్రోతుని పిలిచి అతని చెవిలో మెల్లగా బజారులో ఉన్న రామయ్య ఇంటికి వెళ్లి ఆయన కొడుకునీ అతని వద్ద ఉన్న చిన్న ఖజానా పెట్టెనూ రాజుగారు వెంటనే తెమ్మన్నారని తీసుకురమ్మన్నాడు. రాజుగారి బంట్రోతు బీర్బలు చెప్పినట్లు కొడుకుని/ ఖజానాపెట్టెను తీసుకు వచ్చాడు. అప్పుడు రామయ్య సుబ్బయ్యను కూడా రప్పించాడు.

బీర్బలు (కొడుకుతో) అబ్బే–ఈ బంగారు నాణెం చాలా అపురూపమైంది. మరి మీ ఖజానా పెట్టెలోకల్లా వచ్చింది బాబూ!



కొడుకు : ఇది మా నాయనకు దొరికిందండి!

బీర్బలు : ఎక్కడ దొరికింది?

కొడుకు : ధాన్యం బస్తాలో అడుగున దొరికిందండి!

బీర్బలు : ఇది మీ నాయన నాకెందుకు తెచ్చి ఇవ్వలేదు–

కొడుకు : నేను చెప్పానండి–ఇది మీకిచ్చేయాలని కాని, ఆయన దొరికినవాళ్లకే ఇది చెందుతుందన్నారండి –

బీర్బలు : ఆవేదనతో) అయితే అప్పు తీసుకొన్న వాళ్ళకే ఆ అప్పు తీసికొన్న సొమ్ముకూడా చెందుతుంది కాబోలు–

బీర్బలు : ఏం రామయ్యా– ఇప్పుడు నిజం బయటపడిందా మరి–

రామయ్య : మన్నించండి ప్రభూ! మన్నించండి!

బీర్బలు : ఈ ఒక్క బంగారు నాణెమే మిమ్మల్ని పరీక్షించింది. ఒక్క బంగారు నాణెంతో నీవు మోసం చేసినప్పుడు ఇక ఏభైవేలు ఒక లెక్కా నీకు–

రామయ్య : క్షమించండి

బీర్బలు : సుబ్బయ్య వద్ద తీసుకున్న ఏభైవేల మొత్తాన్ని ఇప్పటికిప్పుడతనికిచ్చేయి– ఇటువంటి మోసాలు ఇక కట్టిపెట్టు.

రామయ్య : ఇచ్చేస్తాను–క్షమించండి.

సుబ్బయ్య : నాకు న్యాయం జరిగింది. బీర్బలు గారికి ధన్యవాదాలు.

(అందరూ నమస్కరిస్తారు)

**✻ 13-9-1997**

**A.I.R**

**బాలానందం**

# గాలిమేడలు

కమల : ఏమిటే ఏదో ఆలోచిస్తున్నావు రమా!

రమ : ఏముంది మన పరిస్థితికి తగ్గ విధంగా ఆలోచించి పనులు చేసుకోవాలి గాని-

కమల : ఇంతకీ ఏం జరిగిందేమిటి?

రమ : జరగడానికేముంది-ఏవో కొంపంత ఆశలు పెట్టుకుని గాలిలో ఊహాచిత్రాలు గీసుకుంటూపోతే చిత్రాలే మిగిలిపోతాయి గాని పని జరగదు.

కమల : ఆ మాట నిజమే-కాని ఎవరి సంగతేమిటి నీవనేది-

రమ : మన ఊళ్ళో ఉన్నారే ఆ పేరిశర్మగారే పాపం ఆయన గురించే ఆలోచిస్తున్నా చాలా బీదవాడు.

కమల : ఆయన ప్రతి ఇంటికీ వెళ్ళి దొరికినంత భిక్ష తెచ్చుకుని కాలంగడుపుతుంటాడు పాపం-

రమ : ఔనే-ఆయనే ఆ పేరిశర్మగారేపోతే ఏం జరిగిందో ఊహా సౌధాలు కట్టుకుంటూ..

కమల : ఏం జరిగిందేమిటి?

రమ : ఆయన ఒకరోజున భిక్షకోసం -

పే.శ : భవతి భిక్షాందేహి - అమ్మా ఇంత భిక్షంపెట్టు తల్లి-

ఆమె(1) : వెళ్ళిరండి - ఇప్పుడేం లేదు-

పే.శ : అయ్యో తల్లి - ఇక్కడ కూడా ఏమీ దొరకలేదే-మరో చోటికి వెడదాం-

* * *

పేరిశర్మ : అమ్మా-ఇంత భిక్షవేయండి తల్లి



ఆమె(2) : పోయిరండి - వేళాపాళా లేదు.

పే.శ : ఈరోజు ఏమీదొరకకేట్టులేదే-పొద్దెక్కిపోతోంది- ఈ రోజు గడవడం ఎలాగ-

* * *

పే : భిక్షాందేహి! భిక్షాందేహి తల్లీ అన్నపూర్ణమ్మ తల్లి-ఇంత భిక్ష పెట్టుతల్లీ నీకు పుణ్యముంటుంది.

ఆమె (3) : ఏముంది-నాయనా! ఇదిగో మా ఇంట్లో ఈ పేల పిండి చాలా ఉంది. దీన్ని పట్టుకెళ్ళి నీ ఆకలి తీర్చుకో

పే.శ : చాలుతల్లీ-దీంతో ఈరోజు గడుపుకొంటాను-

(పేరిశర్మ ఆ పేల పిండి కుండ తీసుకుని ఆ మధ్యాన్నవేళ తోటలో చెట్టుకింద రవ్వంత విశ్రాంతిగా కూర్చుని వెడదామనుకున్నాడు. పేలపిండి కుండను ప్రక్కకుపెట్టి పడుకున్నాడు- కునుకు పట్టింది-అతనికో కల వచ్చింది. ఆ కలలో వాణి కనబడుతుంది-

(వీణావాదన)

పే.శ : దేశంలో కరువు వచ్చేట్లుంది- ఈ పేలపిండిని ఇప్పుడే తినకుండా అలాగే ఉంచుతాను. కాటకం రోజుల్లో దీన్ని అమ్ముకుంటే బోలెడు డబ్బు వస్తుంది.

వాణి : ఆ డబ్బు వస్తే ఏంచేస్తావు.

పే.శ : ఆ డబ్బుతో కొన్ని మేకల్ని కొంటాను.

వాణి : నీ ఆలోచన బాగుందే-తరువాత

పే.శ : మేక సంతానం బాగా పెరిగి పెద్ద మందగా తయారవుతుంది.

వాణి : అయితే, వాటివల్ల నీకేం లాభం.

పే.శ : లాభం వస్తుంది- ఎందుకురాదూ-మేకల మందను అమ్మేస్తాను. ఆ వచ్చిన డబ్బుతో ఆవులూ, గేదెలూ కొంటాను.

వాణి : కొన్ని తరువాత -

పే.శ : ఈ పశుగణం కూడా బాగా పెరిగిపోతుంది-అప్పుడు వీటిని కూడా ఇంకా ఎక్కువ డబ్బుకు తిరిగి అమ్మేసి-

వాణి : ఈసారి ఏం కొంటావు-

పే.శ : ఈ డబ్బుతో వందలాది గుర్రాల్ని కొంటాను.

వాణి : తరువాత!

పే.శ : నా ఈ గుర్రాల సంపద కూడా బాగా పెరిగిపోతుంది-

వాణి : నీ కోరిక చాలా అమోఘంగా ఉందే-

పే.శ : ఇప్పుడు గుర్రాలతో వర్తకం చేసి నేను కోటేశ్వరున్ని అవుతాను--

వాణి : బాగుందే-

పే.శ : మేడలూ/మిద్దెలూ కట్టిస్తాను. పొలాలు కొని వ్యవసాయం చేసి, చాలా డబ్బు సంపాదిస్తాను.

వాణి : అన్నట్టు-నీకు పెళ్ళి కాలేదు కదా-మరి-ఇవన్నీ అనుభవించడానికి ఇంట్లో ఎవరైనా-

పే.శ : ఉండాలిగా. నా భాగ్యం చూసి ఊళ్ళో ప్రతిఒక్కరూ తమ, కన్యా రత్నాన్ని పెళ్ళిచేసుకోమని అడుగుతారు.

వాణి : వారిలో ఎవరు అందంగా ఉంటారో ఆ చక్కని చుక్కని -

పే.శ : ఆ అమ్మాయిని-పెళ్ళాడుతాను.

వాణి : చాలా బాగుంది-నీ పథకం

పే.శ : అప్పుడు నాకో కొడుకు కూడా పుడతాడు-

వాణి : నీవొక గొప్ప భాగ్యవంతుడౌతావు.

పే.శ : నాకొడుక్కి నామకరణం చేయిస్తాను. ఊళ్ళో అందర్నీ భోజనానికి పిలుస్తాను.

వాణి : వాళ్ళు నీ విందుకు వచ్చి తృప్తిగా భోంచేస్తారు. వాడికేం పేరు పెడతావు?



పే.శ : నా కొడుక్కి 'సోమశర్మ' అని నామకరణం చేస్తాను. పెద్దవాళ్ళందరికి కొత్తబట్టలు పెడతాను. తాంబూలాలిచ్చి సత్కరిస్తాను-

వాణి : భేష్. పేరిశర్మ-చాలా బాగుంది. ఇప్పుడే నేను వస్తాను-

పే.శ : తప్పక రావాలి మరి - ఈ లోపున నేను ఈ కుర్చీలో నడుంవాల్చి పుస్తకం చదువుకుంటాను-

వాణి : సరే - వస్తాను.

* * *

(పేరిశర్మ / అతని భార్య విశాలాక్షి)

పే.శ : ఏంజేస్తున్నావు/ ఇలా ఒకసారి వచ్చిపో -

విశా : ఎందుకు ఊరికే పిలుస్తారు-

పే.శ : విశాలాక్షీ! విశాలాక్షీ రావాలి-త్వరగా రావాలి.

విశా : చేతిలో పని వదిలి ఎట్లారావాలంటే-

పే.శ : బాగుంది వరస-త్వరగా రమ్మంటూంటే-

విశా : ఏమిటో ఆ పని- కొంచెం ఆగండి వస్తున్నానుగా-

పే.శ : సోమశర్మ ప్రాకుతూ వచ్చేశాడు-నా దగ్గరకి నే చదువుకుంటున్నా-

విశా : కాస్త చూస్తూండండి
నా పని అయిపోవచ్చింది.

పే.శ : వీడు గుమ్మం దాటేస్తున్నాడు

విశా : వస్తున్నా

పే.శ : పక్కనే గుర్రాల చావడి లోకి పోతున్నాడు-

విశా : నాకు చేతిలో పని ఉందండీ వచ్చేస్తున్నా!

పే.శ : చేతిలో పని ఉంది అంటే ఎల్లాగా నీ పని ఇలా కాదు (అంటూ కాలితో ఆమెను ఒక్కతాపుతన్నాడు-ఆ నిద్రలో ఉలిక్కిపడి లేచి)

పే.శ : అయ్యో-హతవిధీ-పేలపిండి కుండ ముక్క ముక్కలై పేలపిండంతా చెదిరిపోయి మట్టిలో కలిసిపోయింది-నాకేంగతి ఇక మీద

* * *

కమల : చూశావుగా పేరిశర్మ పరిస్థితి-

రమ : గాలిలో మేడలు కట్టుకుంటూ కోపానికి పోయి ఉన్నది కాస్తా బూడిద పాలైంది-

కమల : పేలపిండి మంచి గుణపాఠమే నేర్పింది-

పే.శ : గుర్రాల చావడిలోకి పోతే ప్రమాదం జరుగుతుంది-ఒక్కసారి రమ్మంటే ఏమిటీ తాత్సారం-నీ పని ఇలా కాదు.

(అంటూ ఒక్క తాపుతన్నుతాడు. ఇంతలో ఉలిక్కిపడి లేస్తాడు. ఆగాధమైన నిద్రలోంచి ఆశ్చర్యాన్ని సూచించే వాద్య సంగీతం)

పే.శ : అయ్యో! ఏం జరిగింది! నేనెక్కడున్నాను? (ఆశ్చర్యంతో) ఈ పేలపిండి కుండ ముక్క ముక్కలై పిండంతా చెదిరిపోయిందే-అంతా మట్టిలో కలసిపోయింది-ఇప్పుడిక నాగతేమిటి? రేపట్నుంచి నా బ్రతుకెలాగ గడుస్తుందో ఏమో! అదుగో ఎవరో ఇటువైపు వస్తున్నారే.

(ఇతని సహచరుడు విష్ణుశర్మ ఇటు వచ్చి)

వి.శ : ఏమయింది-శర్మా-ఇలా దిగాలుపడి కూర్చున్నావు. ఈ రోజు భిక్షకి వెళ్ళావా, భోజనం దొరకలేదు.

పే.శ : లేదు, భిక్షకై వెళ్ళాను. ఏమీదొరకలేదు. ఇల్లిల్లూ తిరిగినా ఏ తల్లీ ఇంత భిక్ష పెట్టలేదు-

వి.శ : ఇలాగైతే ఎలాగ-రోజూ ఈ అవస్థలోంచి బయటపడాలికదా

పే.శ : ఏం చేయమంటావు? గుళ్ళో మంత్రాలు పూజా విధానం తప్ప వేరే పని ఏం చేయను నేను?

వి.శ : ఈ పిండేమిటి-ఇలా మట్టిలో కలసిపోయింది

పే.శ : దాని సంగతికే వస్తున్నా-ఒక మహాతల్లి తన వద్ద ఏమీ లేదంటూ-



వి.శ : ఈ పిండిచ్చిందా-ఏం పిండి ఇది-ఇదేం చేసుకోవాలని?

పే.శ : ఇది పేలపిండి-ఏమీ లేనిదానికంటే ఇదే మేలని తెచ్చుకున్నాను.

వి.శ : దీంతో ఏం చేదామని?

పే.శ : ఏముంది-ఏ దోశలో వేసుకుని కొన్నిరోజులు జరుపుకోవచ్చని అనుకున్నాను-

వి.శ : మరి. ఈ పిండంతా ఇలా ఈ మట్టిలో పోశావేం-

పే.శ : భిక్ష తెచ్చుకుని వస్తూంటే తోటలో ఈ చెటుకింద రవ్వంత సేపు నడుం వాల్చుదామని ఉత్తరీయం వేసి పండుకున్నాను.

వి.శ : బాగుంది-పిండి ఈలా పడిపోయిందేం.

పే.శ : మంచి మిట్టమధ్యాహ్నవేళ అయినందువల్ల నిద్ర పట్టింది-నిద్రలో ఇటువైపుకు తిరిగి కాలితో తన్నినట్లు గుర్తుకొస్తోంది-

వి.శ : భలే పనిచేశావు- ఇంతకీ

పే.శ : ఆ తాపుతో పేలపిండి కుండకాస్తా పగిలిపోయినట్లుంది.

వి.శ : అదా సంగతి-

పే.శ : ఆ క్షణంలో నాకు మెలుకువచ్చింది-కండ్లు నులుముకుంటూ లేచి చూస్తిని గదా-పేల పిండి కుండ కాస్తా పగిలి పిండంతా నేలపాలై మట్టిలో కలసిపోయింది-

వి.శ : విచారించి ప్రయోజనం లేదు. ఇకముందు సంగతి ఆలోచించాలి కాని - ఇలా దిగాలుపడి కూర్చుని లాభం లేదు అయినా చేతిలో అర్చకీ పూజామంత్రాలుండీ కూడా-

పే.శ : నిద్రలో ఏవేవో గాలిలో మేడలు కట్టాను-ఏదేదో చేద్దామనుకున్నాను కాని-

వి.శ. : ఇలా అంతా వృథా అయిపోయింది-ఇంతకీ అసలు సంగతే చెప్పడం మరచాను-

పే.శ : ఏమిటా సంగతి విష్ణూ!

వి.శ : నీకు మంచి రోజులు వస్తున్నాయి-మన స్వామి వారి దేవాలయాధికారి

పే.శ : ఆయనే-మన సుబ్రహ్మణ్య శర్మగారేనా?

వి.శ : ఔను! ఆయనే నీవు కనబడితే వెంటనే పిల్చుకురమ్మన్నాడు!

పే.శ : ఎందుకట-

వి.శ : నీతో పనివచ్చింది-ఆయనకు దేవాలయంలో ఉండే ఆయన వెళ్ళిపోయాడట. అర్చకత్వానికి ఎవరూ లేరట ఇప్పుడు-

పే.శ : అందుకని నన్ను పిలిచాడా.

వి.శ. : ఔను - అర్చక పూజార్ల వ్యవహారాలు చేయడానికి నిన్ను అక్కడ కుదర్చడానికే-తక్షణం తీసుకురమ్మన్నాడు.

పే.శ : విష్ణూ! ఎంతమంచి మాట చెప్పావు!

వి.శ : నీకు పారితోషికం కూడా ఇస్తాడట- నీవు వేదం-అర్చక మంత్రాలు అన్ని తెలిసినవాడవు- గనుక ఆయన దగ్గరకి తీసుకెడతాను. నడుపోదాం

పే.శ : అవశ్యం-వస్తున్నా-

(వీణావాదన)

(ఆ వూరి శివాలయ ప్రాంగణంలో గంటల శబ్దం వినబడాలి.)

దేవాలయ

అధికారి: ఏం విష్ణుశర్మా! నిన్నెవరనో తీసుకు రమ్మన్నాను-

వి.శ : యిదిగో యీయన్ని తీసుకు వచ్చాను. ఈయనేనండి. మన పేరిశర్మ-అర్చన విధానం.

దే.అధికారి : ఇప్పుడేం జేస్తున్నాడు?

వి.శ : భిక్షాటనం చేసుకుంటున్నాడు. కాని రోజు గడవడం కష్టంగా ఉంది.

దే.అధికారి : ఇకముందు అతని కేం భయంలేదు. ఈరోజు నుంచి మన శివాలయంలో అర్చన చేయడానికి నియమిస్తున్నా!



పే.శ : చిత్తం-కృతార్థుణ్ణి స్వామి. ఈరోజు నుంచే పనికి వస్తాను స్వామీ.

దే.అధికారి : నీకు పారితోషికం రెండు రోజుల్లో ఖరారు చేస్తాను. పనులు సక్రమంగా చేసుకో.

పే.శ : చిత్తం స్వామీ-

(వీణావాదన)

కమల : చూశావుగా పేరిశర్మ పరిస్థితి-

రమ : వేదం అదీ చదువుకున్నా భిక్షాటనకు దిగి వాస్తవ పరిస్థితికి దూరమైయాడు.

కమల : భిక్షాటనే మేలు అనుకున్నా భిక్షాటనకు దిగి వాస్తవ పరిస్థితికి దూరమైయాడు.

రమ : గాలిలో మేడలు కట్టుకుంటూ కోపానికి పోతే తగిన శాస్తి ఎదురైంది-

కమల : ఇంతకీ పేలపిండె మంచి గుణపాఠమే నేర్పింది-వస్తాను.

# భయం

మహాసముద్ర ఘోష వినబడుతుంటుంది. దూరంగా సముద్ర కెరటాలు పైకి లేచి కిందపడుతూ ఒడ్డుకు చేరుతుంటాయి. సముద్ర తీరం ప్రక్కనే చిన్న పల్లె. అక్కడ కనపడేవన్నీ చిన్న పెద్ద గుడిశలే, వెదురు బొంగులతో కట్టుకున్న ఇళ్లే. అక్కడక్కడ పెద్ద ఇళ్లు కూడా ఉన్నాయి. ఎప్పటినుంచో ఆ గుడిశలల్లా వృద్ధి చెందుతూనే ఉన్నాయి. సుఖ దుఃఖాలు సమపాళ్లలో ఇముడ్చుకున్నదా చిన్నపల్లె. గుడిశెలలో కాపురముండే వారి తాతముత్తాతల నుంచీ వారి జీవితాల పెనవేసికొని పోయాయి. ఆ పల్లెలో ఓ గుడిశ ముందు-ఓ ఉదయం - వెంకయ్య-సుబ్బయ్య వాళ్లు బంధువుల పిల్లలు మాట్లాడుకుంటూంటారు...

రాములమ్మ : నాకు బాగా గుర్తొస్తోంది, మా తాతతోబాటు పెద్దవాళ్లందరూ కలసి పడవల్లో బయలుదేరి పొద్దున్నే చేపలు పట్టేందుకు సముద్రంలోకి వెళ్లే వాళ్ళు మరి.

గోవిందమ్మ : అవునవును! వాళ్లు కొంత దూరం వెళ్లాక వాళ్లతో తెచ్చుకున్న పెద్ద పెద్ద వలలన్నీ విశాలంగా సముద్రంలోకి విసిరేసేవాళ్లు.

రా : పాటలు పాడుకుంటూ చాలా సేపు ఆ పడవల్లో కెరటాల మీద తేలిపోతూ చేపల్తో నిండిన తమ వలల్ని పైకి లాక్కుని సంతోషంగా తిరిగొస్తూండేవాళ్ళట.

గో : ఈ పాటలన్నీ ఎవరిదగ్గర నేర్చుకున్నారో!

రా : ఎవరిదగ్గరేమిటి వారి తాతముత్తాతలు పాడుతుంటే విని నేర్చుకున్నవే.

గో : అసలు పాటలు ఎందుకు పాడతారు, చేపలు పట్టాలి కదా

రా : వారు పడే శ్రమ మరచిపోడానికి పాడుకుంటారు.

గో : అలాగని చేపలవేట మానరన్నమాట.



రా : అంతేగా అట్లా ఉరుములు మెరుపులు తరుముకవచ్చినా వాళ్లు ఆ అంతుపట్టని సముద్రంలోకి ధైర్యంగా దూసుకుపోతుండేవారట.

గో : మహాసముద్రమంటే వారికింతకూడా భయమేసేది కాదా?

రా : భయం గియం ఉండేది కాదు, ఈ సముద్రం మీద వారికి ఎంతో గౌరవమూ, నమ్మకమూనూ!

గో : ఉట్టి చేతుల్తో తిరిగొచ్చేవారే కాదట ఎప్పుడూను.

రా : చేపలన్నీ కుప్పలు కుప్పలుగా పోసి గంపల్లోకెత్తి అమ్మి డబ్బు సంపాదించే వైనం వాళ్లకి బాగా తెలుసుమరి.

గో : కాని ఒక్కొక్కప్పుడు ఏవీ దొరికేవి కావట.

రా : ఎప్పుడోగాని అలా జరిగేది కాదట. మరివాళ్ల సంపాదనతో ఇల్లూ, సంసారం సాగిపోతుండేది.

గో : అర్ధరాత్రి పొద్దుపోయినాసరే ఏ చీకూ చింతా లేకుండా చేపలవేటల్లో వారి జీవితాలు గడిచిపోతుండేవి.

రా : ఆ మహాసముద్రమే వాళ్ల ఇలవేల్పయిపోయింది-క్షణం తీరిక లేకుండా అలా శ్రమిస్తున్నారు.

గో : అటుగానే వాళ్ల కిష్టిగాడు యిలానే వస్తున్నాడూ, నాయుడు వాళ్ల బంధువు

(కిష్టిగాడు 10-15 ఏళ్ల వయసు వచ్చి)

కిష్టగాడు : ఏయ్ రాములమ్మో-ఎంటో తీరిగ్గా కూర్చొని కబుర్లాడుకుంటున్నారు ఏమిటి సంగతి.

రా : మన పెద్దోళ్ల సంగతే చెప్పుకుంటున్నాము. చేపల్ని వేటాడి తెచ్చే పని ఇక మనం కూడా చూసుకోవాలి గదా

కి : ఔను మరి మనం పెద్దవాళ్లమౌతున్నాంగా మరి-ఓసారి ఏం జరిగిందంటే కొన్నేళ్ల క్రితం.

గో : ఏం జరిగిందేమిటి?

కి : ఓసారి వీళ్ళు వెళ్లిన కట్టిదుంగలు మోకుతాళ్లు తెగిపోయాయట- దుంగలు వెళ్లి నీటిలో ఉన్న బండరాయికి కొట్టుకుని అంతా చెల్లాచెదురైపోయాయట.

రా : అప్పుడేమైంది.

కి : మిగతావాళ్లు దుంగల్ని అంటిపెట్టుకుని ఈత కొట్టుకుంటూ వచ్చారు. అయితే మా తాత బావమరిది ఒకాయన గల్లంతైనాడట.

గో : అయ్యో! ఎంతపని జరిగింది?

కి : వాళ్లంతా ఆయనపై ఆశ వదులుకున్నారు. ఉన్న వల్లో ఇంటికొచ్చేశారు.

గో : మరి ఆ పెద్దాయన పోయినట్టేనా?

కి : ఆ ఊసే చెబుతున్నా-యిల్లు గట్టుకువచ్చే వరకూ ఓ పెద్దకెరటం ఈ పెద్దమనిషిని ఒడ్డుకు విసిరేసిందట.

గో : అమ్మయ్యో ఎంత ఘోరం

కి : అప్పుడక్కడే ఉన్న తాతయ్య గుడిశకి తీసుకుపోయి వైద్యం చేయించినా అదివరకే ప్రాణం పోయిందట.

రా : నీకిదంతా ఎవరు చెప్పారుట.

కి : మా అమ్మ చెబుతుంటే విన్నాను. ప్రాణంపోయినా ఆయన ధైర్యానికి మెచ్చుకోవాలి.

రా : సముద్రాన్ని నమ్ముకున్న మనకి అది అన్యాయం చేయదని.

కి : అలాగంటే నేనొప్పుకోను-మంచీ ఉంది ఒక్కొక్కప్పుడు చెడూ జరుగుతుంటుంది. వారి వారి కర్మలను బట్టి- సుబ్బయ్య తాత గారి పెద్దవాళ్లని సముద్రం తన పొట్టలో పెట్టుకు దాచుకోలేదూ!

గో : అంటే!



కి : అంటే ఏముందీ ఇకవాళ్లు మనకండ్ల బడరన్నమాట!

గో : వాళ్ల సంసారంలో ఎంతకష్టమొచ్చిందో పాపం-ఇవన్నీ వింటుంటే నాకేదోలా ఉందే!

రా : ఏదోలా వుండడమేమిటే?

గో : నా మనసులో ఏదో గుబులుగా ఉంది.

రా : నీవు పిరికివాడవు. వాళ్ళోల్లు పోయినా మళ్లీ వారి బంధువులు చేపలవేట మాత్రం మానలేదే!

కి : ఎవరి నమ్మకాలు వారివి... లోకం తీరే అంత. వారి అనుభవాన్ని బట్టి వాళ్లు నమ్మేది చేస్తుంటారు.

రా : వాళ్ల జీవితాలకి నమ్మకమేమూలం. మరి ఆ నమ్మకమే లేకుంటే బ్రతకలేం.

కి : ఇంత మహా సముద్రం మీద వాళ్లకు అంత గట్టి నమ్మకం ఉంది.

గో : పొద్దుపోతోంది-వెడదామే!

రా : పదండి పోదాం

(సముద్రపు హోరు వినబడుతుంటుంది)

రా : ఏమిటేపిల్లా! నీ మొహం అల్లా పెట్టావేమిటీ-ఏమైందే.

గో : మా పక్క గుడిశలో వెంకయ్య మామ తండ్రిని గురించి తల్చుకుంటే ఏడుపొస్తోంది నాకు.

రా : అవును నాకు బాధగానే ఉంది. సముద్రంలో పెద్ద తుపానూ రేగిందట. వెంకయ్య మామ, ఇక చాలా మంది ఆయనకూడా ఉన్నారట.

గో : వుంటే ఏం తుపాను వస్తే ఎవరు తట్టుకోగలరు? ఇంకా నయం ఆయనొక్కడే దాటిపోయాడు. మిగతావాళ్లంతా బయటపడ్డారట.

రా : ఇంట్లో ఏడుపులూ పెడబొబ్బలూను. ఏం చెయ్యాలో ఎవరికీ తోచలేదు. వాళ్ల పరిస్థితి చూస్తే చాలా బాధగా ఉంది.

గో : సముద్రం వాళ్ల సంసారంలో ఇంత కల్లోలం రేపింది. అయితే చేపల్ని పట్టి తేవాలనే తాపత్రయం మాత్రం తగ్గలేదు.

రా : మళ్లీ దుంగలు బిగించి వలలు తీసికొని బయల్దేరుతూనే ఉన్నారు.

గో : వాళ్ల ధైర్యాన్ని మెచ్చుకోవాలి. కాని నాకు భయం వేస్తోంది.

రా : అందుకు నీ అజ్ఞానమే కారణం అని చెప్పాలి.

(సముద్రపు హోరు వినబడుతుంటుంది)

గో : నిన్నటి సంగతి విన్నప్పటి నుంచి బాధగా ఉంది.

రా : నిన్నటి సంగతి అంటే మన...

గో : ఔను, పల్లె చివర సుబ్బయ్యగారి తండ్రి చనిపోయాడట.

రా : అయ్యో పాపం వాళ్లనోసారి మనం వెళ్లి చూద్దామే-

* * *

(సుబ్బయ్య, వెంకయ్య అతని తల్లి శాంతమ్మ, రాములమ్మ, గోవిందమ్మ, కిష్టయ్య వగైరా బంధువులు)

వెంకయ్య : మేమెంతో ప్రయత్నం చేశాం కాని నాయుడు కెరటాల్లో కొట్టుకుపోయారో పాపం!

శాంతమ్మ : ఏం చేస్తాంబాబు-నారాత ఇలాగుంది (విచారంతో)

వెం : పడవని ఎంతో కష్టంమీద ఒడ్డుకు లాక్కొచ్చాం

సుబ్బయ్య : మా నాయన లేకుండా పడవొచ్చేసింది. ఇదంతా నా కర్మ (ఏడుస్తాడు)

శాంతమ్మ : మనం ఏడ్చి మొత్తుకున్నా అయ్య తిరిగిరాడు, ఏడవకు బాబూ

(వీణావాదన)

(సుబ్బయ్య, కిష్టిగాడు కలసి కొత్త వలలు కొందామని సంతకి వెడతారు ఆరోజున. అక్కడ వాళ్లకి ఆ పల్లెలో ఉండే పెద్ద రైతు సుబ్బయ్యని పరామర్శిస్తాడు)



పెద్ద రైతు : ఏం సుబ్బయ్యా ఇలా వచ్చావు? మా నాయన-అదే నాయుడు పోయాడని విన్నా!

సుబ్బ : అవునండి ఘోరం జరిగిపోయింది

పె.రై : సంతకొచ్చారెందుకు?

సుబ్బ : చేపల వల కొందామని-మోకు తాళ్లుకూడా కావాలి.

పె.రై : నాయుడు పోయాడు అప్పుడే బయల్దేరావా సముద్రంలోకి? నీకు భయం వేయడం లేదా?

సుబ్బ : ఆయనకీ సముద్రం మీద చేపలవేటే కదా!

పె.రై : మీ తాత కూడా అందులోనే కలిసిపోయాడనుకుంటా!

సుబ్బ : ఒక్క మా తాతేమిటి మా ముత్తాతలు అంతా కూడా సముద్రానికే చెల్లిపోయారు.

పె.రై : ఇంత జరిగినా వేరే దారి చూసుకోవచ్చుగదా?

సుబ్బ : ఎందుకు? మా తాతలు / వాళ్ల మేనమామలు, వాళ్ల అల్లుళ్లు అంతా ఈ పెద్ద సముద్రంలోతులకి వెళ్లి ముత్యాలు తెచ్చేవాళ్లట. అయినా వాళ్లు ఏమీ భయపడలేదు-ప్రాణాలు తెగించి వెళ్లేవాళ్లు.

పె.రై : ఈ సముద్రాన్ని గురించి ఆలోచిస్తుంటే నీకు లేకపోయినా నాకు భయమేస్తోంది సుబ్బయ్యా.

సుబ్బ : పగలనక రాత్రనక వెడుతుంటాం. ధైర్యంగా దాన్నే నమ్ముకున్నాం. ఉండాలండి.

పె.రై : కొందరికి చీకటంటే భయం / దయ్యాలన్నా పిశాచాలన్నా భయం. బలవంతుడంటే బలహీనుడికి భయం-

సుబ్బ : అసలు భయం అంటే ఏమిటండి-మనలో జరిగే వింత ప్రవర్తనే భయం. మిమ్మల్నో సంగతి అడుగుదామనుకుంటున్నా ఎప్పటి నుంచో.

పె.రై : దేన్ని గురించి.

సుబ్బ : అదివరకు మీ తాతగారు చనిపోయారు గదా! మరి ఆయన ఎక్కడ పోయారు?

పె.రై : మా ఇంట్లోనే చనిపోయారు. పెద్ద వయసులో ఉన్నాయనే!

సుబ్బ : అంటే బాగా జబ్బుచేసిందా? ఎల్లాపోయాడు?

పె.రై : ఏదో జ్వరమూ గుండె నొప్పితో బాధపడుతుండేవాడు, వైద్యం చేయిస్తూనే ఉన్నాం. పొద్దున్నే మా పనివాడు, రోజూమల్లేనే ఆయన్ని లేపాడు. కాని ఆయన లేవలేదు-తరువాత నన్ను పిలిస్తే నేను వెళ్లాను. కాని అప్పటికే ఆయన చనిపోయాడు.

సుబ్బ : ఈ ఇంట్లోనే మీ తాతగారు పోయారన్నారు-అంతకు క్రితం మీ అమ్మమ్మగారు పోయారని, మా రాములమ్మ చెప్పింది. ఆవిడ ఎక్కడపోయింది?

పె.రై : ఆవిడ కూడా ఈ ఇంట్లోనే చనిపోయింది.

సుబ్బ : అయితే మీ పూర్వీకులందరూ ఒక్కొక్కరే ఇప్పుడున్న ఇంట్లోనే పోయారన్న మాట!

పె.రై : అవును. పెద్దపెద్దవాళ్లందరూ ఈ ఇంట్లోనే చనిపోయారు.

సుబ్బ : ఇంతమందీ ఈ ఇంట్లోనే చనిపోయినా మళ్లీ ఎవరైనా చనిపోతారేమోనని ఈ ఇల్లంటే మీకు భయం వేయలేదా? ఈ ఇల్లు వదలి వేరే ఇంట్లోకి వెళ్లేప్రయత్నం చేయలేదా?

పె.రై : భలేవాడువోయి సుబ్బయ్యా!

✻ 12-1-1991

A.I.R

బాలానందం



# కొంగ కథ

పిల్లలు జ్ఞాపక శక్తిని పెంచేందుకు మన పెద్దవాళ్లు అంటే తాతయ్య! అవ్వ, అమ్మమ్మ గాని నాయనమ్మ గాని- ఎవరో ఒకరు ఏవేవో చిన్న చిన్న కథలు చెబుతుంటారు. వీటిలో వచ్చే మాటలూ వాక్యాలూ మళ్లీ మళ్లీ అంటూండడంవల్ల పిల్లల్లో ఉత్సాహమూ, దీంతోబాటు ముందు ఏం జరుగుతుందో అనే ఆదుర్దాతో కథను వింటుంటారు-

ఈ కోవకు చెప్పుకోదగ్గ కథలు ఉన్నాయి. వీటిలో కొంగ కథ ఒకటి. వినండి. మరి ఈ కథ విన్న తరువాత ఇందులో ఏమీ మరచిపోకుండా మళ్లీ చివరివరకూ మరొకరికి చెప్పగలరేమో ప్రయత్నించి చూడండి. చూద్దాం!

అనగా అనగా ఒక కొంగ ఉండేది. అది ఒక రోజున ఊరంతా తిరిగి మినపప్పు తెచ్చుకుని, రుబ్బి, రొట్టి కాల్చుకుంటుంది. చింతచెట్టు మీద కూర్చొని ఆ రొట్టె ముక్క తింటూంటుంది. మినపరొట్టె తింటూంటే ఏం జరిగిందంటే, పాపం! ఆ రొట్టెముక్క కాస్తా ఆ చింతచెట్టు తొఱ్ఱలో పడిపోతుంది. అది చాలా విచారంతో అప్పుడా కొంగ ఒక వడ్రంగి వాని వద్దకు వెడుతుంది. అప్పుడా వడ్లావాడు ఏమన్నాడంటే-

వడ్లావాడు : ఓ హొహొ కొంగ! ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ! కూర్చో - అన్నాడు.

కొంగ : ఏం కూర్చోను బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్ప కూర్చోనా! ఈ చింతచెట్టు తొఱ్ఱలో నా రొట్టెముక్క కాస్తా పడిపోయింది: చింత కొట్టేవాడు వడ్లావాడా! వడ్లావాడా! చింతచెట్టు కొట్టుతావా? నా రొట్టె తీసుకుంటాను" అంటుంది.

వడ్లావాడు : మా చింత నేనెందుకు కొడతాను-అన్నాడు వాడు.

అప్పుడా కొంగ ఆవూరి రాజుగారి దగ్గరకు వెళ్లింది. ఆ రాజుగారు కొంగను చూచి-

రాజు : ఓ హెూహెూ కొంగ ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ! కూర్చో' అన్నాడు.

కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా! ఈ చింత చెట్టు తొఱ్ఱలో రొట్టెముక్క కాస్తా పడిపోయింది. చింత కొట్టేవాడు వడ్లావాడు! వడ్లావాణ్ణి కొట్టేవి నీవు (రాజు) నా రొట్టె కోసం వడ్లావాణ్ణి కొట్టివా?" అంది. అప్పుడా రాజుగారు-

రాజు : 'మా వడ్లావాణ్ణి నేనెందుక్కొడతాను' అన్నాడు. చేసేది లేక అప్పుడా కొంగ ఒక ఎలుక దగ్గరకు వెడుతుంది. అప్పుడా ఎలుక-

ఎలుక : ఓహెూహెూ కొంగ! ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ కూర్చో!

కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా! చింత చెట్టు తొఱ్ఱలో నా రొట్టెముక్క కాస్తా పడిపోయింది; చింత కొట్టే వాడు వడ్లావాడు; వడ్లావాణ్ణి కొట్టేది రాజు! రాజు సింహాసనాన్ని కొరికేది ఎలుక - అందుకని ఓ ఎలుకా! నా రొట్టెముక్క కోసం రాజు సింహాసనం కాస్త కొరకవా? అంది.

అప్పుడా ఎలుక ఏమంటుంది?

ఎలుక : అదేమిటి? మారాజు గారి సింహాసనాన్ని నేనెందుకు కొఱుకుతాను! అంటుంది.

చేసేది లేక అప్పుడా కొంగ ఓ పిల్లి వద్దకు వెడుతుంది!

పిల్లి : ఓహెూ హెూ కొంగ! ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ! కూర్చో.

కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా! ఈ చింతచెట్టు తొఱ్ఱలో రొట్టె పడిపోయింది. చింతకొట్టేవాడు వడ్లావాడు! వడ్లావాణ్ణి కొట్టేది రాజు! రాజు సింహాసనాన్ని



కొరికేది ఎలుక-ఎలుకను పట్టేది పిల్లి! అందుకని ఓ పిల్లీ! నా రొట్టెముక్క కోసం ఎలకను కాస్త పట్టవా? అంది. అప్పుడా

పిల్లి : మా ఎలకను నేనెందుకు పడతాను? అంటుంది.

చేసేది లేక ఆ కొంగ ఒక ముసలి అవ్వ వద్దకు వెడుతుంది. అప్పుడా ముసలి అవ్వ ఏముంది-

ముసలి అవ్వ: ఓహెూ హెూ కొంగ! ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓకొంగ కూర్చో! అంటుంది.

కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా? చింత చెట్టు తొఱ్ఱలో నా రొట్టెముక్క కాస్తా పడిపోయింది-మరి చింతకొట్టే వాడు వడ్లావాడు!

చింతకొట్టే వాడు వడ్లావాడు!

వడ్లావాణ్ణి కొట్టేది రాజు!

రాజు సింహాసనం కొఱికేది ఎలుక!

ఎలుకను పట్టేది పిల్లి!

పిల్లికి వేడిపాలు ఇచ్చేది అవ్వ! అందుకని ఓ అవ్వా!

పిల్లికి వేడిపాలు పొయ్యవా అంటుంది. అప్పుడు అవ్వ...

అవ్వ : మా పిల్లికి నేనెందుకు వేడిపాలు పోస్తాను! అంటుంది.

చేసేది లేక అప్పుడా కొంగ

ఓ తాత దగ్గరకు వెడుతుంది.

తాత : ఓహెూ హెూ కొంగ! ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ! కూర్చో! అంటుంది.

కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా! ఈ చింత చెట్టు తొఱ్ఱలో నా రొట్టెముక్క పడిపోయింది. చింత కొట్టేవాడు వడ్లావాడు!

వడ్లావాణ్ణి కొట్టేది రాజు!

రాజు సింహాసనాన్ని కొరికేది ఎలుక!

ఎలుకను పట్టేది పిల్లి!

పిల్లికి వేడిపాలు ఇచ్చేది అవ్వ!

అవ్వని కొట్టేవాడు తాత! అందుకని

ఓ తాతా! నా రొట్టెకోసం అవ్వని కాస్త కొట్టవా? అని కొంగ అడుగుతుంది.

తాత : మా అవ్వని నేనెందుకు కొడతాను అంటాడు. చేసేది లేక కొంగ ఒక ఆవు వద్దకు వెడుతుంది: అప్పుడు

ఆవు : ఓహెూహెూ కొంగ! ఎప్పుడూ రాని కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ కూర్చో! అంటుంది.

కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా! ఈ చింత చెట్టు తొఱ్ఱలో నా రొట్టె ముక్క పడిపోయింది.

చింతకొట్టేవాడు వడ్లావాడు!

వడ్లావాణ్ణి కొట్టేది రాజు!

రాజ సింహాసనాన్ని కొరికేది ఎలుక!

ఎలుకని పట్టేది పిల్లి!

పిల్లికి వేడిపాలు ఇచ్చేది అవ్వ!

అవ్వని కొట్టేది తాత!

తాతని పొడిచేది ఆవు! అందుకని

ఓ ఆవూ! తాతని ఓసారి పొడవవా

రొట్టె తీసుకుంటాను అంటుంది.

అప్పుడా ఆవు-

ఆవు : ఇదేమిటీ! మా తాతని నేనెందుకు పొడుస్తాను అంటుంది.

చేసేది లేక అప్పుడా కొంగ

దాని దూడ వద్దకు వెడుతుంది.

దూడ : 'ఓహెూ హెూ కొంగ! ఎప్పుడూ రానీ కొంగ! ఎలా వస్తివి కొంగ! కూర్చో ఓ కొంగ కూర్చో!' అంటుంది.



కొంగ : ఏం కూర్చోను! బూడిద కూర్చోనా! బుగ్గి కూర్చోనా! రాయి కూర్చోనా! రప్పు కూర్చోనా! ఈ చింత చెట్టు తొఱ్ఱలో నా రొట్టె ముక్క పడిపోయింది.

చింతకొట్టేవాడు వడ్లావాడు!

వడ్లావాణ్ణి కొట్టేది రాజు!

రాజ సిఅంహాసనాన్ని కొరికేది ఎలుక!

ఎలుకని పట్టేది పిల్లి!

పిల్లికి వేడిపాలు ఇచ్చేది అవ్వ!

అవ్వని కొట్టేది తాత!

తాతని పొడిచేది ఆవు!

ఆవును పొడిచేది దూడ! అందుకని

ఓ దూడా కాస్త ఆవుని పొడవవా అంటుంది!

ఆ సమయంలో ఆవుపాలు తాగుతున్న ఆ దూడ చటుక్కున ఆవుని ఓ పోటుపొడుస్తుంది.

అప్పుడు ఆవు వెళ్లి తాతను పొడుస్తుంది! తాతవెళ్లి అవ్వని కొడతాడు!

అవ్వ వెళ్లి వేడిపాలు పిల్లి పోస్తుంది!

పిల్లి వెళ్లి ఎలకను పడుతుంది!

ఎలక వెళ్లి రాజు సింహాసనాన్ని కొరుకుతుంది!

రాజు వెళ్లి వడ్లావాణ్ణి కొడతాడు!

వడ్లావాడు వెళ్లి చింతను కొడతాడు!

అప్పుడా చింతచెట్టు తొఱ్ఱలోని

రొట్టె తీసుకుని కొంగ హాయిగా సంతోషంగా తిందామని ఎగిరిపోతుంది.

**✻ 10-8-1991**

**A.I.R**

బాలానందం

# అపర అన్నపూర్ణ
# డొక్కా సీతమ్మ

జో రవికుల శుభాంగ జో సన్నుతాంగ
లాలి శ్రీ రఘురామ లారి లిపు భీమా
పాలలోచన వీర భద్రావతారా కలకాల గిరీశ కంది తూణీరా
లాలి గరుడా తురంగ లావిభవలింగా లాలి సీతాసంగవాలి వేదాంగా

వేడ్క నెలసిన మీ ప్రభావము విష్ణులోకము నందునా
పల్లవించిన ఇంద్రలోకము బ్రహ్మలోకమునందునా
మొల్లముగ కైలాసమందున మూడు లోకములందునా
చెల్లునమ్మ త్రిలోక పావని శ్రీ గిరిభ్రమరాంబికా

పాపాయి కన్నులు కలువరేకుల్లు పాపాయి జున్నలు పట్టుకుచ్చుల్లు
పాపాయి దంతాలు మంచి ముత్యాలు పెక్కలు మొక్కజొన్నపొత్తులు
పాపాయి చెక్కులు పసివెన్నముద్దల్లు వన్నెలు పసినిమ్మపండులు
పాపాయి పలుకులు పంచదార చిలకల్లు "చిత్రేలు బాలకృష్ణులు"

జానకి : మన ఆంధ్రదేశం అన్నదాత. కృష్ణా గోదావరి పెన్న వంశధార తుంగభద్ర లాంటి నదులు ప్రవహించే దేశంలో ఎందరో అన్నపూర్ణలు వెలిశారు. ఎందరో మహానుభావులు.



సీత : అవును–మనం పుట్టిన ఈ తెలుగు గడ్డ. ఎందరో మహానుభావులకు నిలయం. అయితే ఎవర్ని గురించి నీవు చెపుతున్నావ్ ప్రస్తుతానికి.

జానకి : ఎవర్ని గురించేమిటే- సీతమ్మగార్ని గురించి – ఆవిడ సంగతి ఏమన్నా విన్నావా? ఎప్పుడైనా లేదా?

సీత : నాకు ఎవరో జ్ఞాపకం రావటంలేదే-ఎవరు చెప్పు! ఆవిడ?

జానకి : ఆవిడది కూడా నీ పేరేనే ఆవిడే మనం వినే డొక్కా సీతమ్మ గారు–

సీత : ఎక్కడో ఎప్పుడో తాతయ్య చెబుతుంటే ఆవిడ పేరు విన్నట్టు గుర్తు– ఆవిడ నిత్యాన్నదానం చేసేదని చెపుతుండేవాడు తాతయ్య.

జానకి : అవునవును ఎల్లప్పుడూ 'అన్నం లేదు' అనేమాట ఆవిడ అనేది కాదట.

సీత : ఆవిడది ఏవూరు? ఏంచదువుకుందే?

జానకి : గోదావరి మండలం కోనసీమలో గన్నవరం అనే గ్రామం ఉంది. ఆ వూళ్లో డొక్కా జోగయ్య అనే బ్రాహ్మణ గృహస్థు ఉండేవాడు. ఆయన భార్య పేరే సీతమ్మ. ఆవిడ 1841 సంవత్సరంలో పుట్టిందిట.

సీత : ఆమె ఏమైనా పెద్ద చదువులు చదివిందా చెప్పావే కావు?

జానకి : ఆ కాలంలో, ఇప్పుడున్నట్లు ఆడపిల్లలకి చదువుకునే అవకాశ మెక్కడున్నాయే వాళ్ళ వాళ్ల తల్లిదండ్రులు చెప్పే పురాణ కథలూ, పద్యాలూ పాటలే చెబుతూ నీతి నియమాలు బోధించేవాళ్లు.

సీత : అదే అప్పుడు పెద్ద చదువనుకో!

జానకి : అవును ఆమె ఎంతో శుచీ, శుభ్రత గల ఇల్లాలు, మరి

సీత : ఈ కాలంలో ఆడపిల్లలను చూస్తుంటే నాకు ఏడవాలో నవ్వాలో తెలియటంలేదే- మొగాళ్లనే అనుకరిస్తూ ఆడ మగా తేడా తెలిస్తేగా!

జానకి : మరి మన సీతమ్మగారు చిన్నప్పటి నుంచీ తల్లి నుండీ, తరువాత ఆమె అత్తగారి నుండీ నేర్చిన మంచి ఆచారాలనూ కట్టుబాట్లూ ఆమె చక్కగా పాటిస్తూండేదట.

సీత : అందుకనే ఆవిడకు ఈ దానగుణం అబ్బింది.

జానకి : అంతేమరి. వంటవార్చి పెట్టటంలో ఆమెకు అలుపూ సొలుపూ లేదంట్ట నమ్మ. అన్నార్తులై వచ్చిన అతిథులకు కడుపునిండా ఇంత అన్నంపెట్టి పంపేదట ఆ పుణ్యాత్మురాలు.

సీత : ఆవిడను అందుకనే అన్నపూర్ణ అన్నారు మరి-

జానకి : అసాధారణమైన ఆమె ఆదరణ, దయ వల్లనే దానంలో అగ్రపీఠం అలంకరించిన పుణ్యాత్మురాలు.

ఒక రోజున ఏం జరిగిందంటే వినుమరి...

(వీణావాదం)

(దూరాన్నుంచి)

"సీతమ్మ గారండీ! ఓ సీతమ్మ తల్లీ- ఇంత అన్నంపెట్టి ప్రాణం నిలబెట్టు తల్లీ"

"ఆకలేస్తోందమ్మా, మామీద దయలేదా తల్లీ"

"ఆకలి తీర్చు తల్లీ! ఓ సీతమ్మ తల్లీ"

(సీతమ్మగారింట్లో)

డొక్కా సీతమ్మ : ఇంత రాత్రి అయింది ఎవరో పిలుస్తున్నట్లున్నారే! ఏమండీ మీకు ఆ పిలుపులు వినబడ్డం లేదూ?

డొక్కాజోగయ్య: అవునినబడుతున్నాయే ఎటువైపు నుంచో జనం నిన్ను పిలుస్తున్నట్లున్నారే!

డొ.సీ : పాపం ఎవరికి ఏం బాధ కలిగిందో-తలుపు తీసి చూస్తానుండండి!

డొ.జో : పగలంతా వంటావార్పూ సంతర్పణ చేసి అందరికీ పెట్టావు గదా- ఇక రాత్రంతా మేలుకొంటే శ్రమ...

డొ.సీ : నిద్ర చెడిపోతుందని-ఆకలితో వచ్చేవాళ్లని పొమ్మంటామటండీ- అటువంటి పని నావల్ల కాదు.

డొ.జో : నీ ఇష్టమే నా ఇష్టం. నాకు తోచిన పని నేనూ చేయడానికి సిద్ధమే.

(Repeat voices)



డొ.సీ : వాళ్లకు ఎంత బాధగా ఉందో తలుపు తీసి చూస్తానుండండి.

(ఓ పెద్ద జనం గుంపు ఇరవై ముప్పైమందికి పైగా ఆడామగా ఉండొచ్చు - గుమ్మముందు పారలు, గునపాలూ, తట్టలూ పట్టుకొని వచ్చి నిలబడ్డారు.)

గుంపులో ఒక మగకంఠం : అమ్మా సీతమ్మ తల్లీ, కూలీలం కాయకష్టం చేసుకుని బ్రతికేవాళ్లం- త్రవ్వడం మా వృత్తి.

స్త్రీ కంఠం : పొద్దుటేళ నుంచీ పని దొరక్క రోజంతా పిల్లలతో దూరాన్నుంచి వస్తున్నాం తల్లీ! నా పిల్లలు ఆకలికి...

మగకంఠం : ఇంత అన్నం పెడతావన్న ఆశతో ఇంతరాత్రి అయినా నిద్ర లేపేము తల్లీ!

డొ.సీ : నాకేం కోపం లేదర్రా- మీరంతా నా బిడ్డలు కదూ దిగులు పడొద్దు- ఇదిగో క్షణంలో మీకందరికీ అన్నం వండి పెడతానుగా!

మగకంఠం : అలాగే తల్లీ

డొ.సీ. : మీరందరూ ఆ బావి దగ్గర కెళ్ళి కాళ్ళూ మొహాలు కడుక్కుని ఈ వసారాలో కూర్చోండి - మీకందరికీ వేడివేడి అన్నం పప్పు, పులుసూ, మజ్జిగా పెడ్తానుగా

స్త్రీ కంఠం : "అలాగే తల్లీ-నీ కడుపు చల్లగా!

(సీతమ్మగారు వంటగదిలోకి వెళ్ళి దీపం వెలిగించి పొయ్యి త్వరగా అంటించి ఎసరు గుండెగను ఎక్కించింది. అన్నంతోబాటు పప్పు, పులుసు తయారుచేసి పట్టుకు వచ్చి వసారాలో కూర్చున్నవాళ్ళందరికీ వడ్డించింది)

డొ.సీ. : మీరందరూ కడుపునిండా భోంచేయండి!

గుంపులో అందరూ : మా ఆకలి బాధ తీర్చావు తల్లీ!

మగ కంఠం: అమ్మా మాలాంటి పేదవాళ్లను కాపాడడానికి మీరు కలకాలం వర్ధిల్లు తల్లీ!

డా.సీ. : మీరంతా మా అరుగుమీద నడుం వాల్చి కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని మరీ వెళ్లండి.

డా.జో. : అందరూ తృప్తిగా తిన్నారా ఇంకా ఎవరైనా మిగిలిపోయారా!

డా.సీ. : అందరూ తిన్నారు. పదండి లోపలికి కాసేపు విశ్రాంతి తీసుకొందాం. తెల్లవార వస్తోంది!

జానకి : విన్నావుగా ఆవిడ ఎంత పుణ్యాత్మురాలో మరి.

సీత : ఆవిడ ఓర్పుకు, దయకూ మెచ్చుకోవాలి.

జానకి : ఆవిడకు, కులమత వివక్షత లేదంటేనమ్మా. అందరికీ సమంగానే ఆదరించి పెట్టేది.

సీత : అంటే పూరి జనులూ వగైరా కులాల వారిని కూడా ఏమీ వివక్షత లేకుండా అడిగినవారికి లేదనకుండా అన్నంపెడుతుండేది- మరి ఓసారి ఏమైందో తెలుసా. గోదావరికి వరద వచ్చింది-విపరీతమైన వర్షం.

* * *

(వర్షం, గాలి సూచించే ధ్వని సముదాయం. మెరుపులు గాలివాన -వచ్చింది గోదావరి లంకలు ఒక్కొక్కటీ మునిగిపోసాగింది - లంకలో ఉన్న హరిజన గిరిజనులందరూ భయభ్రాంతులై తిండిలేక బాధపడుతున్నారు)

వాన చినుకుల చప్పుడు-

(జోగయ్య గారిల్లు- లోపల డొక్కా సీతమ్మగారు ఏదో ప్రార్థన చేసుకుంటూ ఉంటుంది)

నేపథ్యంలో -

"వేద్క వెలసి నమీ ప్రభావము విష్ణులోకము నందునా



పల్లవించిన ఇంద్రలోకము బ్రహ్మలోకము నందునా

మొల్లముగ కైలాసమందున మూడు లోకమునందునా

చెల్లునమ్మా త్రిలోకపావని శ్రీగిరి భ్రమరాంబికా"

డా.జో. : అవతల హోరున వర్షం కురుస్తోంది. గాలివాన ఏకమై బయట నానా బీభత్సంగా ఉంది-గోదావరి లంకలు.

డా.సీ. : మునిగిపోతున్నాయన్నారు- పాపం అక్కడ ఉండే బీదా బిక్కీ వాళ్ళు పాపం ఎలా ఉంటున్నారో.

డా.జో. : పెద్ద లంకకు చుట్టూ నీరు నిండినా మెరకపై ఉన్న గుడిసెలు మాత్రం మునగలేదట.

డా.సీ. : ప్రజలు అక్కడి వారి సంగతి మరచిపోయి ఉంటారు- ఎల్లాగండీ వాళ్ళ సంగతి.

డా.జో. : రాత్రి పొద్దుపోయింది-పెరటి తలుపేసేసిరా!

(నేపథ్యంలో)

"సీతమ్మ తల్లీ - మేమంతా ఇక్కడ వరదలో చిక్కుకొని పోయాము పొద్దుటి నుంచీ తిండిలేక మాడిపోతున్నాం తల్లీ!"

డా.సీ : చూశారా ఆ కేకలు- గాలివాటున వినబడుతున్నాయి.

డా.జో : అవును నాగ్గూడా వినబడుతున్నాయి. పాపం వాళ్ల ప్రాణం అరచేతిలో పెట్టుకుని ఉంటారు. (మళ్లీ సీతమ్మతల్లీ అనే కేకలు వినబడతాయి)

డా.సీ : ఆ కేకలు మన పొలం చేసే వెంకట్రాముడు, వాళ్ల పిల్లల కేకండి.

డా.జో : ఇప్పుడేం చేద్దామంటావు.

డా.సీ : ఏం చేయడమేమిటి వాళ్లను ఎలాగైనా ఆదుకోవాలి- అవతల వర్షం పడుతోంది కూడాను.

డా.జో : అన్నం మిగిలిందా వాళ్లకు పెట్టడానికి?

డా.సీ : నేను మిగలకుండా వండనెప్పుడూ. కానీ పట్టుకువెళ్లి వాళ్లకు పెట్టడం ఎలాగ? అని ఆలోచిస్తున్నా!

డా.జో : గోదావరి ఇవతల చిన్న పాయేకదా-తరువాత పెద్దలంక వచ్చేస్తుంది. వర్షం అయితే నేం?

డా.సీ. : అయితే తప్పేల నిండా పులుసు అన్నం, పెరుగు అన్నం దానితోపాటు ఊరగాయ పొట్లాన్ని, బొంత అరటిపండ్లూ వీటినన్నిటిని పెద్ద అంగవస్త్రంలో కట్టి తలకు చుట్టి జాగ్రత్తగా ఈదుకుని పట్టుకువెళ్లి వాళ్లకు వడ్డించి, తిన్న తరువాత మరీ రండి.

డా.జో : అలాగే త్వరగా మూటకట్టి ఇచ్చెయ్యి వెడతా!

(జోగయ్య ఆ మూటను నెత్తిన కట్టుకుని నదిని ఈదుకుంటూ పోతాడు)

గోదావరి నీళ్లలో ఈదిన చప్పుడు-నీటి ఎఫెక్ట్స్ వినపడాలి)

డా.జో : అమ్మయ్య! పెద్దలంక వడ్డుచేరుకున్నాం! (గట్టెక్కి గుడిసెల వద్దకు వెడుతాడు)

ఒరేయ్ వెంకట్రాముడు, మీరూ, మీ భార్యా పిల్లలూ, అంతా క్షేమంగా ఉన్నారా?

వెంకట్రాముడు

భార్య : (వణుకుతూ) పంతులుగారొచ్చారు. ఏయ్ వెంకమ్మ బయటకు రా! మనం బతికిపోయాం.

డా.జో : ఇదిగోనర్రా అన్నం మూట! సీతమ్మ తల్లి అన్నం, ఊరగాయ, పులుసు అరటిపండ్లు పంపిందర్రా! లోపల కూర్చుని నెమ్మదిగా భోంచేయండి.

వెంకట్రాముడు

భార్య, పిల్లలు: అలాగే బాబూ అని అంతా కూర్చుని శుభ్రంగా భోంచేస్తారు.

వెంకట్రాముడు: బాబూ పంతులుగారూ మీ సీతమ్మతల్లి, మీ దయవల్ల పోయిన ప్రాణం లేచి వచ్చింది బాబూ!నా చర్మం వలిచి దాంతో తమకు చెప్పులు కుట్టించి ఇచ్చినా మీ ఋణం తీర్చుకోలేము-

డా.జో : మీరంతా మా పిల్లలు. మీ కష్టం చూడలేము-మీరు సంతోషంగా ఉంటే అదే మాకు ఆనందం.



వెంక. : వర్షం తగ్గిన తరువాత అమ్మగార్ని కలుసుకుని దండాలు పెట్టుకుంటామని చెప్పండి బాబూ!

డా.జో : అలాగేరా! వెళ్ళొస్తాను.

(మళ్లీ ఈదుకుంటూ ఇంటికి చేరుకుంటాడు)

డా.సీ : ఏమండీ వాళ్లంతా అన్నంతిన్నారా?

డా.జో : ఆ తిన్నారు. వాళ్లంతా నీకు దండాలు చెప్పమన్నారు. వర్షం తగ్గాక వస్తారట. ఆ గుడిశల వెంకట్రాముడూ వాళ్ళూను.

డా.సీ : అమ్మయ్య - ఇక రాత్రి నిద్రపడుతుంది.

జానకి : చూచావా - సీతమ్మ, జోగయ్య గార్ల ఔదార్యం.

సీతమ్మ : ఇందులో ఎంతో దయారసం ఇమిడి ఉంది.

జానకి : ఈవిడ చేస్తున్న ఈ దానధర్మాలు ఆనాడు బ్రిటిషు ప్రభుత్వం వాళ్లకు తెలిసిందట. అప్పటి గవర్నరుగారు ఆవిడ చేసిన విశిష్టమైన సేవను శ్లాఘిస్తూ ఆమెకు ఒక ప్రశంసాపత్రాన్ని ఒక బంగారు పతకాన్నీ బహుకరించాలని నిశ్చయించారట.

సీత : మరి ఆవిడ పుచ్చుకుందా ఈ పతకాన్ని

జానకి : ఒకరోజున ఏం జరిగిందంటే...

డా.సీతమ్మ : బయట ఎవరో పిలుస్తున్నారు చూడండి-

పోస్ట్ (పోస్ట్‌మేన్)

డా.జో : టపా వచ్చింది కాబోలు తీ.

పోస్ట్‌మాన్ : పంతులుగారు మీ ఉత్తరం తీసుకోండి!

డా.జో : ఇలా ఇయ్యి బాబూ!

(కవరు చించి లేఖ చదువుతాడు)

డా.సీ : ఎవరు వ్రాశారండీ? ఈ ఉత్తరం

డా.జో : ఇది గవర్నరుగారి నుంచి వచ్చింది- నిన్ను సన్మానిస్తారట- ఇందుకోసం

ఉత్సవం ఏర్పాటు చేశారట. ఆ తేదీకి రాజధాని నగరం (మద్రా
వచ్చి ఈ సన్మానం అందుకోవాలట.

డా.సీ : ఇదిగో చూడండి–అంతదూరం ప్రయాణం చేయలేనండి–అయినా ఆ పత్రం కోసం పతకం కోసం అంత దూరం ప్రయాణం చేయలే ఈ వృద్ధాప్యంలో

డా.జో : ఇది ఆషామాషీ కాదు. గవర్నరు గారి నుంచి వచ్చింది.

డా.సీ : అయితే ఏం? అందుకోసం వెడితే ఇక్కడ అన్నార్తులై వచ్చిన వాళ్లకు ఇంత వండిపెట్టే దిక్కు ఎవరు?

డా.జో : ఈ మాట నిజమేనే–

డా.సీ : ఇంతకీ ఏం ఘనకార్యం చేశానని నాకు ఈ సన్మానం చెప్పండి!

డా.జో : అయితే ఏం చేయమంటావు

డా.సీ : నేను రాలేనని బదులు రాసెయ్యండి– దైవానుగ్రహంవల్ల మనకున్నదేదో తోటి వాళ్లకు పెట్టగలుగుతున్నాం–అన్ని విధాలా మీరు కూడా నాతో సహకరిస్తున్నారు అంతేచాలు.

డా.జో : ఎవరెప్పుడు వచ్చినా లేదనకుండా వండివడ్డించే ఓపిక దేవుడీయాలనే నాకోరిక.

డా.సీ : దేవుని దయ ఉంటే అంతేచాలు.

సీత : అయితే, ఆమె ఈ సన్మానం రాజధాని నగరం వెళ్లి అందుకోలేదన్నమాట.

జానకి : ప్రభుత్వం అంతటితో ఊరుకోలేదే. ఆ పతకాన్నీ, ఆ పత్రాన్నీ అక్కడి మండలాధికారికి పంపించి ఆమెకు అందజేయమన్నారుట.

సీత : తరువాత ఏంజరిగింది?

(గన్నవరం మండల కార్యాలయ ప్రాంగణంలో పెద్ద సభ. జనం నిండిపోయారు. జనంలో ఎంతో సందడి సంతోషం వెల్లివిరిసింది. అక్కడ వేదికమీద బల్ల అమర్చి వాటిచెంత కుర్చీలు పూదండలూ అమర్చి ఉంచారు. కొంచెం సేపట్లో మేళతాళాలతో డొక్కా జోగయ్య



గార్ని, భార్య సీతమ్మగార్ని ఆ మండలాధికారి తీసుకు వచ్చి కుర్చీలో కూర్చోబెట్టారు)

సభలో...

డొక్కా జోగయ్య గారికి, సీతమ్మతల్లికీ జయ్– అన్నపూర్ణమ్మ తల్లీ నీవు కలకాలం వర్ధిల్లు తల్లీ!

సీతమ్మ తల్లి వర్ధిల్లాలి

సీతమ్మ తల్లి చల్లగా ఉండాలి.

మండల అధికారం : ఈరోజు మనకందరికీ శుభదినం. గర్వకారణం కూడాను. ప్రభుత్వం మన సీతమ్మ తల్లికి బంగారు పతకం, సన్మానపత్రం ఇచ్చారు. వాటిని వారికి అందజేస్తున్నాను, నా కూతరు కమలమ్మ ఆమెకు దండవేసి సత్కరిస్తుంది

(కరతాళ ధ్వనులు)

డా.సీ : నా బంగారు తల్లే! ఎందుకీ ఈ సత్కారాలు పతకాలు నాకు నేను ఏంచేశాననీ!

కమలమ్మ : అలా అనకు అమ్మమ్మా! నీ చేతి అన్నం తిని ఎందరెందరో అన్నార్తులు తృప్తిచెందారు. నీవు మా కందరికీ అన్నపూర్ణవు. ఈ పతకం తీసికొని/ ఈ పత్రం అందుకో తల్లీ.

డా.సీ : నీవెంత గడుసుపిల్లవే తల్లీ – ఇలా ఇయ్యి నిన్ను ఎందుకు కష్టపెట్టాలి?

మండల అధికారి : మీలాంటి పెద్దల్ని సత్కరించటం ప్రభుత్వం కనీస ధర్మం తల్లీ– గ్రామస్తులారా అంతా అన్నపూర్ణమ్మ తల్లికి జేజేలు పలకండి.

సీతమ్మ తల్లి వర్ధిల్లాలి!

సీతమ్మ తల్లి వర్ధిల్లాలి!

జానకి : ఆనాటి ఆ సభ అలా ముగిసింది-మన తెనుగు గడ్డ ఋణం తీర్చుకుంది ఆ తల్లి!

సీతమ్మ : బాగా చెప్పావే- మరి ఆవిడ-

జానకి : ఆవిడ ఈ సన్మానం జరిగిన తరువాత కూడా ఇంకా ఆరేళ్లవరకు ఆవిడ అన్నదాతగానే తన పేరు సార్థకం చేసుకొని 1909లో స్వర్గస్థురాలైంది.

సీతమ్మ : ఈ నాటి మన చెల్లాయిలు, పిల్లలు కూడా ఆవిడకు మల్లె మంచి పేరు తెచ్చుకోవాలి.

జానకి : ఎందరో అన్నపూర్ణలు - అందరికీ వందనాలు-

-సర్వేజనాః సుఖినోభవంతు

* 10-12-1989

A.I.R

బాలానందు



"ఆంధ్రరత్నం"

# శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

(సీత, జ్యోతి స్నేహితులు, ఒకరోజున జ్యోతి ఇంట్లో)

జ్యోతి : హాయ్ సీతా రా ఇలా వచ్చావేమిటి ఇంత పొద్దున్నే.

సీత : కాలేజీకి సెలవు ఇచ్చారు గదూ-ఒకటే బోరుగా ఉందే అందుకని-నువ్వేమిటి ఏదో దీర్ఘంగా తిరిగేస్తున్నావు పుస్తకాలు, పేపర్లూ అదీని-

జ్యో : మా ఇంట్లో పుస్తకాలకేం కొదవ- నాన్నగారు ఏవేవో పుస్తకాలు తెస్తుంటారు - ఏదో ఒకటి చదువుకుంటే మంచిది కదా-

సీ : ఎవరిదే ఈ బొమ్మ అంతపెద్ద కుంకుమ బొట్టు, మెడలో రుద్రాక్ష దండ కర్రతోపాటు వీపుమీద ఓ మూటా ఎవరో రామదాసులాగ ఉన్నారే!

జ్యో : ఈ తరం మన విద్యార్థుల్లో లోకజ్ఞానం తగ్గిందేమో అనిపిస్తోంది-మా నాన్నగారైతే బొమ్మను చూచే ఈయన ఫలానా అని చెప్పేస్తారు.

సీ : ఎందుకే ఇంత ఉపోద్ఘాతం! ఈయనెవరో చెబుతూ సస్పెన్సులో పెట్టక.

జ్యో : యీయన్ని గురించి చెప్పడానికేం బోలెడంత ఉంది. వినేవారంటూ ఉండాలి కదా!

సీ : వింటానుగా నీకా దిగులక్కరలేదు అదిగో మీ స్నేహితుడెవరో వస్తున్నారే-

జ్యో : యితనా - జగన్నాథం-రావోయి కూర్చో (జగన్నాథం వచ్చి కుర్చీలో కూర్చుంటూ)

జగన్నాథం : ఏమిటీ-సీత కూడా ఇక్కడే వుందే-ఏమిటో విశేషం-

సీ : విశేషమేముందీ-సెలవుల కెక్కడికీ వెళ్లలేదుగా!

జ్యో : ఏమిటి యిల్లా వచ్చావు జగన్నాథం - ఏమైనా పనుందా-

జ. : ఊరికేనే ఏమీ తోచటంలేదు-ఆ పుస్తకం ఎవర్ని గురించీ

జ్యో : ఈయన్ని గురించే సీత అడుగుతోంది-ఈయన..

జ. : ఎక్కడో ఎప్పుడో చదివినట్లే ఉంది కాని మరచిపోయా-

జ్యో : ఆయనే మన "ఆంధ్రరత్నం" బిరుదాంకితుడు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు

సీ : ఆంధ్రదేశంలో అవతరించిన ఏ మహాపురుషుడో అయి ఉండాలి - ఎవరిచ్చేరే ఈ బిరుదు?

జ్యో : ఈయన చూపించిన త్యాగదీక్ష దేశ సేవలు గుర్తించి అప్పటి (గుంటూరు మండల) ఆంధ్ర మహాసభ వారు ఆంధ్రరత్న బిరుదునిచ్చి సత్కరించారు.

సీ : దేశస్వాతంత్ర్యం కోసం కూడా పోరాడే ఉంటాడు మరి!

జ్యో : ఔను. ఈయన శాసనధిక్కార నేరం మీద అప్పటి గుంటూరు జిల్లా కలెక్టరు "రూథర్‌ఫోర్డు" దొర ఈయన్ని శ్రీకృష్ణ జన్మస్థానానికి (1921) పంపించాడు.

సీ : ఈయన ఏ ఊళ్లో పుట్టారు. ఈయన తల్లిదండ్రులెవరు. ఆ వివరాలేమిటి?

జ్యో : 1889 జూన్ 2వ తేదీన కృష్ణాజిల్లా నందిగ్రామ తాలూకా పెనుగంచి ప్రోలులో పుట్టాడు.

తల్లిదండ్రులు కోదండరామస్వామి; సీతమ్మ.

ఈయన పుట్టిన మూడో రోజునే తల్లి చనిపోయింది.

సీ. : అయ్యోపాపం!

జ్యో : అంతటితో పోలేదు. ఇతని మూడో యేటే తండ్రి కూడా పోయారు.

సీ. : మరి ఈయన్ని ఎవరు పోషించారు?



జ్యో : ఇతని పినతండ్రి, పినతల్లి పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధులు నేర్పారు.

సీ : జూన్ రెండో తేదీన పుట్టారన్నావు కదూ. అంటే నిన్నటికి ఆయన పుట్టి సరిగా నూరేళ్ళు దాటాయన్నమాట.

జ్యో : ఔను. ఆయన్ను మనం నేటికీ స్మరిస్తున్నాము. గాంధీ మహాత్ముని స్వరాజ్యోద్యమంలోనూ, ప్రజాసేవలోను నిస్వార్థంగా పాటుబడిన ఆంధ్ర రత్నం.

సీ. : ఈయన చదువు ఎక్కడ.

జ్యో : గుంటూరు / బాపట్లలో చదువుకొన్నాడు. ఎఫ్ఏ తరువాత ఇతని స్నేహితుని సాయంతో ఇంగ్లాండు వెళ్లి ఎం.ఏ చదివి 1917లో స్వదేశానికి తిరిగి వచ్చారు.

సీ : తరువాత ఎక్కడైనా ఉద్యోగం చేశారా?

జ్యో : రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో చరిత్ర ఉపన్యాసకులుగా కొంతకాలం పనిచేశారు.

సీ : తరువాత.

జ్యో : ఉద్యోగంలో జేరారేగాని ఈయన సహజంగా ఉన్న స్వతంత్ర దృక్పథం వల్ల అప్పటి పాఠశాల నియమాలు, నిబంధనలు నచ్చలేదు.

సీ. : అందుకని...

జ్యో : ఒక రోజున ఏం జరిగిందంటే-

(కాలేజీలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు హిస్టరీ క్లాసుకు వస్తారు.)

దు.గో : పిల్లలూ! ఈరోజు మీ పాఠ్యపుస్తకాలు అలా ఉంచండి.

విద్యార్థులు : మరేం చెబుతారండి?

దు.గో : ఈ రోజున బొబ్బిలియుద్ధం ఎందుకు జరిగింది? దాని పర్యవసానం-ఇంకా ఇతర సంగతుల గూర్చి చెబుతాను.

విద్యా : అల్లాగే.

దు.గో : ఎటువంటి చారిత్రక ఘట్టాలు వింటే మీకు ఆంధ్రుల శౌర్య ధైర్య సాహసాలు తెలుస్తాయి.

విద్యా : చెప్పండి.

(ఆయన ఆ కథంతా బోధిస్తారు)

మరుసటిరోజు కళాశాల ప్రిన్సిపాల్ రాస్ (ROSS) దొరగారి గదిలో మరో అధ్యాపకునితో)

రాస్ : గోపాలకృష్ణయ్య కళాశాలకు ఆలశ్యముగా ఎందుకు వస్తున్నాడు?

సీనియర్ అధ్యాపకుడు: ఆయన ఇంట్లోంచి వచ్చేప్పటికే ...

రాస్ : మీరేమి చేస్తున్నారు? ఆయనకు ఆలశ్యంగా రాకూడదని చెప్పలేదా?

అధ్యా : చెప్పారు... ఇంతేకాదు ఆయన పాఠాల్ని వదలి పూర్వ చరిత్రలోని కథలు గాథలూ చెప్పి Subjects deviate చేస్తున్నాడండి.

రాస్ : ఇది మంచి పనికాదు-ఇది ఆయన స్వంత యిల్లా-ఆయన్ని పిలవండి (ఆయన్ను పిలుస్తారు)

(గోపాలకృష్ణయ్య వస్తాడు)

రాస్ : ప్రతిరోజును నీవేల ఇట్లాలస్యముగ వచ్చుచున్నావు?

9.45a.m - 12.30p.m, 2 -4p.m ఎందుకు పాటించటం లేదు? ఏమీ పని ఉన్నా లేకపోయినా కళాశాలలో ఉండవలెనని చెప్పితిని గదా

దు.గో : "మా ఇంట వంట ఆలశ్యమగును. దైవతార్చన వగైరాలునూ ఆలశ్యమగును"

రాస్ : రేపటి నుంచి సకాలములో రావలెనో-లేదా గేట్టు మూయిస్తాను. వెళ్లండి.

* * *

(మరుసటిరోజు ఉదయం రాస్‌గారు టైము అయిన తరువాత గేట్టు మూయిస్తారు. ఆయన ఎదురుగా క్లాసులోంచి చూస్తూంటారు)



దు.గో : ఏమిటి తలుపులు మూసేశాడే ప్రిన్సిపాలు! (గోడదూకి వెడతాడు ప్రిన్సిపాల్ అది చూచి ఆయన్ని ఆపుతాడు.)

రాస్ : ఏమీపని చేశావు నీవు. నేను నీ మీద యాక్షన్ తీసుకుంటాను.

దు.గో : నిన్ననే చెప్పాను కదా మా ఇంట్లో వంట ఆలశ్యమవుతుందని.

రాస్ : "నేను యిపుడు చెబుతున్నాను మీ ఇంటివారిని త్వరితముగ వంట చేయాలని నీవేల చెప్పవు వారికి?

(ఈవిధంగా తన ఆడవాళ్ళి హెచ్చరించడం ఆయనకు కోపం వచ్చింది)

(చొక్కా చేతులు పైకిలాగి) "రాసాసురా! మా ఆడవార్ని ఆక్షేపిస్తావా? నిన్ను ఏం చేస్తానో చూడు...

రాసుదొర రివ్వున పక్కగదిలో దూరి దాగుకొనెను. క్లాసులో యిదంతా గమనిస్తున్న విద్యార్థులు. దొరగారి ధైర్యమునకు గోల చేసిరి.

విద్యార్థులు : హై హై రాస్ హై హై రాస్: జైజై గోపాల క్రిష్ణయ్య జైరజైజై"

"మరుసటిరోజు అధ్యాపకుని ద్వారా ఉద్వాసన కాగితాన్ని అందజేస్తారు

దు.గో : ఏమిటీ కాగితం?

సీనియర్ అధ్యా: ఇక నుండి మీ ఉద్యోగం మాకు వద్దని ఉపన్యాసక పదవి నుండి తీసేశారు.

దు.గో : నేనేమి చేశాను

సీ.అధ్యా : మీరు సభలు ఉపన్యాసాలు దేశం గురించి చెబుతూ విద్యార్థుల్ని రెచ్చగొట్టుతున్నారు కదా

దు.గో : నా ధర్మం నెర నీ ఉద్యోగానికి జై. నష్టపోయింది మీరే, నాకేమీ ఫరవాలేదు.

* * *

సీత : బాగుందే! ఆయన స్వాతంత్ర ధోరణి

జగ : ఈ మేధావంతుడికి కళాశాల నియమాలేవీ నచ్చలేదు మరి,

జ్యో : అవును. ఆయన తరువాత బందరు జాతీయ కళాశాలలో కూడా కొద్ది కాలం పనిచేసి దాన్ని కూడా వదలి వెళ్ళిపోయారు.

(ప్రజలు ఈయనికి కొన్ని ఎకరాల భూమి పేరాలలో ఉచితంగా ఇచ్చారు. దానికి శ్రీరామనగరం అని పేరుపెట్టి అక్కడ ఉంటూ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటూ వచ్చారు)

సీ : చీరాల పేరాల ఉద్యమం అంటారు. అక్కడేం జరిగిందే మరి?

జ్యో : ఇవి రెండు చిన్న గ్రామాలు. వీటి జనాభా 18 వేల దాక ఉండేది. ప్రజలకి వ్యతిరేకంగా వీటిని పురపాలక సంఘంగా మార్చాలనుకుంది ప్రభుత్వం.

సీ : అది మంచిపనేగా.

జ్యో : గుంటూరులో ఉంటున్న వీటిని మునిసిపాలిటీగా చేస్తే మరి ప్రజలమీద పన్నుల భారం పెరిగిపోతుంది గదా-

సీ : అందుకని..

జ్యో : ఇక్కడి ప్రజలు ప్రతిఘటించారు. వీరు బీదవారు. ఉండేవన్నీ పూరిపాకలే. నూతుల్లో బారెడు లోతున నీళ్లు అందేవి-ఇపుడు ఏ ఐదు వేలో కట్టుకునే పన్నులు, 50 వేలు పెరిగిపోతాయి అందుకని వీరంతా ఈ నిర్ణయాన్ని వ్యతిరేకించారు.

సీ : ప్రభుత్వం తమ నిర్ణయాన్ని మార్చుకోలేదా?

జ్యో : మార్చుకోలేదు. ఆయన పన్నులు కట్టొద్దని పెద్ద సహాయ నిరాకరణ ఉద్యమం లేవదీశారు-ప్రజలు పన్నులు కట్టడం మానేశారు.

సీ : కథ చాలా దూరం వెళ్లిందన్నమాట.

జ్యో : ఇదే సమయంలో ఆయన రామదండును కూడా ఏర్పాటు చేసి ప్రజల్లో సంఘీభావాన్ని, నైతిక శక్తిని పెంచడానికి ఎంతో కృషి చేశారు. గాంధీజిని కూడా అక్కడకు రప్పించి ఉపన్యాసాలిప్పించారు. ఆయన తమ నాయకుడు చెప్పినట్లు ఐక్యతగా సత్యాగ్రహం చేయండని ఆశీస్సులందించారు గాంధీజీ.



సీ : గాంధీగారు కూడా అక్కడికి వచ్చారన్న మాట!

జ్యో : ఔను. 'అప్పుడు వేరే గత్యంతరం లేక ప్రజల్ని పురత్యాగం చేయించారు మన ఆంధ్రరత్న.

సీ : పురత్యాగం అంటే ఏమిటే-

జ్యో : ఏముందీ చీరాల పేరాల వాసులందరూ తమ తాతతండ్రుల నుంచి ఉంటున్న ఇళ్లూ వాకిళ్లూ సమస్తమూ వదలిపెట్టి ఊరి సరిహద్దుల్ని దాటి, మంగళావాద్యాలతో, కాగడాలతో రామదండు కేకల్తో తాము కట్టుకున్న కొత్త పాకల్లోకి వెళ్లిపోయారు. చీరాల పేరాల ఊళ్లు నిర్మానుష్యం అయిపోయాయి.

మహాత్మాగాంధీకీ జై అనుకుంటూ...

సీ : ప్రజల దీక్ష పట్టుదల అమోఘంగా ఉందే!

జ్యో : మన ఆంధ్రరత్న పన్నుల నిరాకరణోద్యమ ప్రబోధంతో దేశం దద్దరిల్లిపోయింది. గర్భిణీ స్త్రీలు/బాలింతలు పసిబిడ్డ తల్లులు ముసలోళ్లు శిశువులు రోగులు అంతా వెళ్ళిపోయారు.

సీ : ప్రజలు చాలా కష్టపాలయి ఉంటారు. ప్రభుత్వం ఊరుకుందా?

జ్యో : ఎంతోమంది ప్రజల్ని జైల్లో పెట్టారు. చీరాల పేరాల కార్యదీక్ష అట్లా ఉంచి-అంతా తిండిలేక అవస్థలు చూచి ఆంధ్రరత్న ఊరూరా సంచారంచేసి డబ్బు, వస్తు సామగ్రి ప్రోగుచేసి వాళ్లందరికీ సాయం చేశాడు.

సీ : ఇవన్ని చెబుతుంటే ఆశ్చర్యంగా ఉంది.

జ్యో : మన ఆంధ్రకేసరి ప్రకాశం/శ్రీనివాసయ్యంగారు మొదలైన మహానాయకులంతా తమకు చేతనైనంత సాయంచేశారు. ఆంధ్రరత్న ఇచ్చే ఉపన్యాసాలకు ప్రభుత్వం మండిపడింది.

సీ : ఏం చేశాయి.

జ్యో : జిల్లా కలెక్టరు 'రూథర్ ఫోర్డు' ఆయనకు యేడాదిపాటు జైలుశిక్ష విధించారు.

సీత : చివరికి...

జ్యో : యింతే కాదు, రాజద్రోహ నేరానికి కూడా మరో 9 నెలలు జైలుశిక్ష విధించారు.

సీత : ఆయన్ని ఏ జైలులో పెట్టారు.

జ్యో : యీయనను తిరుచునాపల్లి జైలులో నిర్బంధించారు.

సీ : యిందాక 'రామదండు'ను ఏర్పాటు చేశారన్నావు-దీని ఉద్దేశం ఏమిటి?

జ్యో : రామదండు వారంతా, స్వాతంత్ర దీక్షను తీసికోవాలి. తమ సర్వస్వాన్ని అర్పించడానికి సిద్ధపడాలి. ప్రజాసేవే పరమావధిగా ఉండాలి.

సీ : అంటే వాలంటీర్ల మాదిరిగా అన్నమాట-

జ్యో : ఔను. అందరూ నీర్కావిరంగు పంచెలూ, చొక్కాలు తలపాగ కుంకుమ బొట్టు రుద్రాక్షలు ధరించాలి-దేశ సేవ చేయాలి.

సీ : ప్రజలు దీంట్లో చేరారా?

జ్యో : వేలకువేలు 18-50 వయసున్నవారనేకులు చేరారు. దేశంలో కరువు వచ్చినపుడు గాని మరే ఇతర అవసరాలకైతే నేమి ఈ రామదండు వారు వెళ్లి నిస్వార్థంగా సేవచేసేవారు.

సీ : వాళ్ళు కూడా జైలుకెళ్ళే ఉంటారామరి.

జ్యోతి : ఎందుకెళ్లలేదు, చాలామంది జైలుపాలైనారు. ఊరూరా ప్రచారం చేసి ప్రజల్లో ఐక్యతను పెంపొందిస్తూ వచ్చారు. గ్రామంలో అంతఃకలహాలు రాకుండాను, వచ్చిన పేచీలను పరిష్కరించడంలోనూ ఊరిపెద్దలతో పంచాయతీలు పెట్టి సేవ చేశారు.

సీ : తరువాత.

జ్యో : 1921లో బెజవాడలో AICC సమావేశాలు జరిగాయి. దాసు, నెహ్రూ, లజపత్రాయి, ఆలీ సోదరులు మొదలైన మహానాయకులు సమావేశాలకు వచ్చారు. లక్షలాది ప్రజలు వచ్చారు. అక్కడ మహాతీర్థమైపోయింది. కాంగ్రెసు వలంటీర్లకు జనాన్ని ఆపలేకపోయారు.



సీ : మన ఆంధ్రరత్న కూడా కాంగ్రెసు సమావేశాలకు వెళ్లారా?

జ్యో : ఆయన వెయ్యి మందితో ప్రత్యేక రైల్లో రామదండును బెజవాడ తీసుకెళ్లి సమావేశాల్లో క్రమశిక్షణతో ప్రజలకి ఎంతో సేవ చేసి సభల్ని జయప్రదంగా జరిపించి గాంధీ ప్రభృతుల మన్ననలు పొందారు.

సీ : ఆయన దూరదృష్టి మహత్తరమైంది.

జ్యో : మరుసటి సంవత్సరం ఆయన 'గయ'లో జరిగిన AICC సమావేశాల క్కూడా సతీసమేతంగా వెళ్లారు.

ఆయన్ని తిరుచునాపల్లి జైల్లోంచి విడుదలైనప్పుడూ జైలు గుమ్మం వద్ద శ్రీమాన్ రాజగోపాలాచారి / వివియస్ ఆళ్వారు, డా.శంకర అయ్యర్, ఇ.వి.రామస్వామినాయకర్, కె.సంతానమ్ ప్రభృతులు ఈయన్ని పుష్పమాలలతో ముంచెత్తి సత్కరించారు.

సీ : తరువాత ఏంచేశారే?

జ్యో : గాంధీమహాత్ముని అడుగుజాడల్లో ఆయన నిర్దేశించిన కార్యక్రమాల్ని అమలు చేస్తూ వచ్చారు. ధర్మప్రబోధాన్ని ప్రచారం చేశారు. అస్పృశ్యత నివారణకు నడుంకట్టారు. ఈయన సంస్కృతాంధ్రాలలో గొప్ప కవి.

సీ : చాలా మంచి విషయాలు చెప్పావే.

జ్యో : క్షయతో బాధపడి, చివరికి 10-6-1928న గుంటూరులో దివంగతులైనారు.

సీ : అందుకే ఆయన మనకిప్పటికీ చిరస్మరణీయుడు.

జ్యో : భగవద్భక్తినీ దేశభక్తిని రెండింటిని మేళవించి జాతిని జాగృతం చేసిన మహా పురుషుడాయన.

**✻ 7-6-1990**

**A.I.R**

**బాలానందం**

# దక్షారామం

(బస్సు నడుస్తున్న ధ్వని, బస్సు హారన్ మధ్య మధ్య వినబడుతూంటుంది)

భార్య : ఎన్ని బస్సులు వేసినా ఏం లాభం? ఎంత రద్దీగా ఉందో చూడండి.

భర్త : మరి తీర్థ యాత్రంటే ఏమనుకున్నావు?

భా : ఇంతకూ ఎంతదూరమండీ దక్షారామం?

భ : దగ్గరకే వచ్చేస్తున్నాం. అంత తొందర పడితే ఎలాగ?

భా : అదుగో అటువైపు చూడండి–ఈ పరిసర ప్రాంతాలన్నీ ఎంత మనోహరంగా ఉన్నాయో– అదుగో అటువైపు ప్రవహించే ఆ నది పేరేమిటండీ?

భ : దాన్నే వృద్ధ గౌతమి అంటారు. దక్షారానికి ఓవైపు తుల్యభాగ వేరేవైపు యెలా నది–అంతటా చక్కని దేవాలయాలు, సరస్సులు, ఎంత నయనాభిరామంగా ఉందో చూస్తున్నావుగా?

భా : ఆ చూస్తున్నాను. ఈ ఆరామాలు అవీ చూస్తుంటే ఏదో ఒక పవిత్రానుభూతి ఉట్టిపడుతోంది!

భ : కాదుమరీ! ఏమనుకున్నావు. దీన్ని దక్షిణకాశి అని వూరికే అన్నారా? వారణాసి ఉత్తరకాశి అయితే, దక్షారామం దక్షిణకాశి. కాశిలో మరణిస్తే జీవి ఉత్తర జన్మలో శివాకృతి పొందుతాడట– దక్షారామంలో మరణిస్తే ఆ జీవికి ఇక పునర్జన్మే లేదంటారు పండితులు.

భా : అంత మహత్తు ఉందన్నమాట ఇంతకీ అసలు దక్షారామం శంకరుడు ఎలా వెలిశాడండీ!

భ : అలా అడుగు చెబుతా – పూర్వం సుబ్రహ్మణ్యేశ్వరస్వామి తారకాసురుణ్ణి సంహరించాడు. అప్పుడు అతని మెడలోని శివలింగం ఆయన



శూలప్రహారానికి పంచశకలాలై, ఐదు ప్రదేశాల్లో పడిందట. ఆ విధంగా అక్కడ శివుడు వెలిశాడు.

భా : ఆ ప్రదేశాలేవండీ?

భ : ఆ ప్రదేశాలు ఇప్పుడు పంచారామాలుగా విలసిల్లుతున్నాయి. అవే ఒకటి–సామర్లకోట వద్ద నున్న చాళుక్య భీమవరం; రెండోది క్షీరారామం అంటే పాలకొల్లు; మూడోది పశ్చిమగోదావరి జిల్లాలోని గుణపూడి భీమవరం; నాలుగోది గుంటూరు జిల్లాలోని అమరావతి, ఐదోది మనం చూడబోయే దక్షారామమూను, మరి పంచారామాలేవిటో తెలిశాయా ఇప్పుడు?

భా : తెలిశాయి. వీటి వెనుక ఇంతటి అద్భుత గాథ ఉందన్నమాట. అది సరేకాని–మరి దీన్ని దక్షవాటిక అని కూడా అన్నారు! ఆ పేరెలా వచ్చిందండీ?

పూర్వం ఈ ప్రదేశమంతా దక్ష ప్రజాపతి యజ్ఞం చేసిన చోటుట. అందుకనే దీన్ని దక్షవాటిక అంటారు.

భా : దక్ష ప్రజాపతి యజ్ఞం చేశారాండీ?

భ : అవును. కాని ఆయన యజ్ఞం నిర్విఘ్నంగా జరగలేదు. ఆ యాగ విధ్వంసం జరిగింది. మరో విషయం–ఈ ప్రదేశమంతా దక్షుని ఆరామ భూమి కావడం చేత దీన్ని దక్షారామం అని కూడా అన్నారు.

భా : దక్షయాగం ఎందుకు విధ్వంసం అయిందండీ చెబితే వినాలని ఉంది.

భ : బాగుంది. నన్ను ఈ పరిసరాలన్నీ చూడనిచ్చేట్లు లేవే అయినా నీవడిగినప్పుడు చెప్పక తప్పుతుందా? నేనిందాక చెప్పినట్లు. ఆ దక్షుడు బృహస్పతి అనే మహాయజ్ఞాన్ని చేయ సంకల్పించాడు. బ్రహ్మాది దేవతల్ని, సిద్ధసాధ్య, విద్యాధర గంధర్వులనీ, యక్ష కిన్నెర కింపురుషాది మహనీయుల్నీ ఆహ్వానించాడు. నారద, కశ్యప అగస్త్య పరాశరాది మహామునీంద్రులంతా పిలువబడ్డారు–అంతా వచ్చారు.

భా : వచ్చి

భ : మధ్యలో అడ్డురాక - అయితే అల్లుడైన శంకరుణ్ణీ, కూతురైన సతీదేవిని ఈ మాటుకు ఈ యజ్ఞానికి పిలువలేదు-

భా : శంకరుడే రానప్పుడు మిగతావాళ్లెలా వచ్చారండీ?

భ : చెబుతున్నానుగా విను మరి పరమేశ్వరుడికి ఆహ్వానం పంపకపోవడం మునీశ్వరులకు ఏమీ నచ్చలేదు! దక్షుడికి ఏదో అపాయం ఉంటుందని వారు గ్రహించారు. కాని దక్షుని ఆహ్వానాన్ని తిరస్కరించలేకనూ ఆయనకు భయపడీ వచ్చారు. పాపం దాక్షాయణి తన తండ్రి పిలువకపోయినా ఆ మహా యజ్ఞాన్ని కళ్లారా చూడాలనే కుతూహలంతో, పరమశివుడు వారించినా వెడుతుంది. తనను అవమానించడానికే, ఈ యజ్ఞాన్ని తలపెట్టాడనీ, తనకా యజ్ఞ హవిర్భాగాన్ని లేకుండా చేయ సంకల్పించాడనీ, పిలవని పేరంటానికి వెడితే పరాభవం జరగవచ్చనీ ఆయన మరొకసారి హెచ్చరించినా దాక్షాయణి వినక తన పుట్టింటికి వెళ్లడానికి పిలుపెందుకని తెగించి వెడుతుంది.

భా : అపుడేం జరిగిందీ! చాలా చిత్రంగా ఉందే-

భ : జరగవలసిందంతా జరిగింది. అక్కడ తన్ను ఎవరూ కన్నెత్తి చూడనైనా లేదు. సరిగదా-తన్నూ తన భర్త శంకరుణ్ణీ దక్షుడు తృణీకరించి అవమానిస్తాడు.

భా : ఆఁ ఎంతపని జరిగిందండీ!

భ : ఈ అవమానాన్ని భరించలేక దాక్షాయణి అక్కడికక్కడే యోగాగ్ని జాలల్లో పడి భస్మీభూతమైపోతుంది.

భా : అమ్మయ్యో ఎంత ఘోరం తరువాత ఏమైంది?

వీణావాద్యం. కైలాసంలో శివుని లయతాండవాన్ని సూచించే ధ్వనులు. మృదంగ ధ్వని హెచ్చుస్థాయిలో వినబడుతూంటుంది)

* * *



ప్రమాధగణాలు లయతాండవ నృత్యాన్ని తిలకిస్తుంటారు. మృదంగధ్వనులూ వీణా వాద్యం తగ్గిన తరువాత నారదుడు ప్రవేశిస్తాడు.

* * *

నారదుడు : (ఖంగారుగా) హరహర మహాదేవా
హరోంహర హరోంహర
శంభో శంకరా శరణు

* * *

శంక : ఏం జరిగింది? నారదా ఏం జరిగింది?

నార : శంకరా భక్తవ శంకరా ఏం చెప్పను-నాకేదో భయంగా ఉంది. శంభో శంకరా శరణు.

శంక : నీకేం భయం లేదు నారదా! నేను అభయమిస్తున్నాను. నిర్భయంగా విశదీకరించు-ఏం జరిగింది.

నార : అంతా జరిగిపోయింది. ఇంకేముంది! దాక్షాయణి దగ్ధమైపోయింది; దారుణం జరిగిపోయింది.

శంక : ఆఁ దాక్షాయణి దగ్ధమైందా? ఎంత ఘోరం! ప్రమథులేం చేస్తున్నారు? భృంగీ, నందికేశుడెక్కడున్నాడు, సతి ఏమైంది?

నార : ఇక నేనెలా విన్నవించను ప్రభూ! ఆ దక్షుడు మిమ్మల్ని దూషించాడు, దాక్షాయణిని అవమానించాడు. ఆ కోపంతో దాక్షాయణి అక్కడే యోగాగ్ని జ్వాలల్లో-

శంక : చాలు నారదా చాలు! దక్షునికింత కండకావరమా? దాక్షాయణికోరి తెచ్చుకుంది. ఈ ఘోరవిపత్తును ఈ పరాభవాన్ని నే సహించలేను. నందీ, భృంగీ, చండీ, రండి మీరంతా రండి. ప్రతీకారం! ప్రతీకారం!!

* * *

(పరమశివుడు క్రోధాగ్రహావేశుడై హుంకరిస్తూ తన జటనొకదాన్ని పెరికి పర్వతం మీద కొడ్తాడు. అప్పుడా జటనుండి భయద మంగళమూర్తి అయిన వీరభద్రుడు భద్రకాళీ సమేతంగా ఉద్భవిస్తారు)

–సన్నని వీణానాదం–

శంక : అహ్హహ ఇదుగో వీరభద్రుడు వేయిహస్తాలతో ఖడ్గాలతో – ఓయీ వీరభద్రా! అవశ్యం నీవు మీ ఆవేదన భరించలేను!

వీర : మీ హృదయం గ్రహించాను! తండ్రీ ప్రణామాలు వెంటనే ఆన తియ్యండి! సకల చరా చర భువనాలను తృటిలో శకలాలుగా చేసి మీ చరణ సన్నిధిలో ఉంచుతాను. పరమశివునే ధిక్కరించిన ఆ పరమ కిరాతకులను చీల్చి వేస్తాను. ఆ దక్షుని శిరస్సును ఖండించి ఆ రక్తాన్ని ఆజ్యంగా యాగాగ్ని గుండంలో క్రుమ్మరిస్తాను–ఆన తియ్యండి తండ్రీ వేగంగా ఆజ్ఞాపించండి.

శంక : శభాష్! వీరభద్రా శభాష్! వెళ్లు శీఘ్రంగా వెళ్లూ! ప్రమధులకు సాయకుడవై హుటాహుటి తరలి వెళ్లు!! ఇదిగో త్రిశూలము నిన్ను కన్నెత్తి చూడలేరు నందీ! భృంగీ! వెళ్లండి మీరంతా దక్షుని యజ్ఞం ధ్వంసం చేసి ప్రతీకారం తీర్చుకోండి ఆహూతులను దండించండి వెళ్లండి! (మృదంగ ధ్వని)

వీర : అవశ్యం వెడుతున్నాం.

నేపథ్యంలో: జయవీరభద్రా జయభద్రకాళీ వీరభద్రా అల్లర్ల వీర జయ వీరభద్రా!

(కోలాహల ధ్వనులు వినబడుతూంటాయి. సింహాలను పూన్చిన రథాలెక్కి నందీశ్వర చండీశ్వర భృంగిరెటాది సమస్త గణ సమూహ నివహాలతో దక్షుని యజ్ఞవాటికకు వెడతారు గంటల మ్రోతలు; శంభారావాలు వినబడుతుంటాయి)



–దక్షుని యజ్ఞశాల ప్రాంగణంలో–

నీతీ విచక్షణలేని ఆదక్షుడేది?

వీర : ఏడీ ఆ దక్షుడు? అహ దిక్పాలకులేరి? నా తల్లి దండ్రులను అవమానించిన ఆ దక్షుడేడి? దాక్షాయణిని తృణీకరించి ఆ పరమకిరాతకుడు ఏడీ? వాని దర్పం అణిచేస్తాను. నందీ! పోనీయకండి నా రుద్రమూర్తినే పరిహసిస్తావుగా! ఈ యజ్ఞవాటికను రుద్రభూమిగా చేసేస్తాను. ఈశ్వర ద్రోహులయిన వారి నందరినీ పోనీయకండి–పట్టుకోండి–తరిమి కొట్టండి వెంటాడండి–

దక్షుడు : ఆc వీరభద్రుడే! అష్టదిక్పాలకులారా! రక్షించండి రక్షించండి అయ్యో–యాగాగ్నులు రక్తసిక్తమైపోతున్నాయి. యజ్ఞశాల బీభత్సమయిపోతోంది. నా యజ్ఞదీక్షభగ్నమైపోతోంది! రక్షించండి!

వీర : ఓరీ దక్షా! ఇంకెక్కడిది యజ్ఞదక్ష నీకు? నీకింత దర్పమా! నీపాలిటి మృత్యువును: సకల లోక పూజ్యుడైన భక్తవశంకరుని లెక్కించక నా తల్లిని అవమానిస్తావా? అహ్హహ్హా! నీకిదేశాస్తి! నీ అహంకారంతో నీ కన్నులు మూతపడ్డాయి–రా ఈ జగభయంకర త్రిశూలానికి నీ శిరస్సును భలిచేస్తాను–అహ్హహా–

(effects)

(హాహా కారాలు! కోలాహల ధ్వనులు!!)

(దక్షుని శిరస్సు క్రింద పడిపోతుంది. హాహాకారాలు)

జయ భద్రకాళీ వీరభద్రా! కేకలు నేపథ్యంలో వినబడుతుంటాయి. జయ జయ వీరభద్ర రుద్రాముద్రిత భయద వీరభద్రా

జయవీరభద్రా అల్లల్ల వీర
జయవీరభద్రా అశ్వరభ శురభ!
అల్లల్ల వీర అశ్వరభ శరభ!
అల్లల్ల వీర అశ్వరభశరభ

జయ జయ భద్రకాళీ వీరభద్ర

జయజయ

కోలాహలం తగ్గిన తరువాత

వీణానాదం!

భ : ఆ విన్నావా మరి అదీ కథ! దక్షుని యాగ విధ్వంసం ఈ ప్రాంతంలోనే జరిగింది. కనుకనే దీన్ని దక్షవాటిక అన్నారు.

భా : తరువాత ఏమైందండీ!

భ : ఆరంభించిన యాగం పూర్తికాకపోతే ప్రపంచానికి అనావృష్టి వస్తుందనే భీతితో ఉత్తరదిశ నుంచి గొఱ్ఱెతల తెచ్చి దక్షుని మొండేనికి తగిలించి అతన్ని బ్రతికించి శివునికి యజ్ఞభాగం ఉండేలాగ ఆ యాగం పూర్తి చేస్తారు. శంకరుడు దక్షుని క్షమిస్తాడు. ఇదీ గాథ.

భా : అబ్బో ఎంతగొప్పగా ఉందండీ ఈ గాథ.

భ : ఇదుగో వచ్చేశాం-ఇదే దక్షారామం

(నేపథ్యంలో భీమేశ్వరాలయంలో అభిషేక మంత్ర పఠనం వినబడుతుంటుంది-భక్తుల కోలాహలం గుడి గంటల చప్పుడు)

భ : సత్రంలో సామాన్లు పెట్టేశాం గనుక ఇక రవ్వంత సేపు దేవాలయం చూసి వద్దాం. నడు ముందుకు-

భా : అలాగే పదండి-స్నానాలు కూడా పూర్తి చేసుకోవాలి

(గుడిలో ప్రవేశిస్తారా నేపథ్యంలో యాత్రికుల మాటలు భీమేశ్వరార్చనలు వినబడుతుంటాయి)

భా : అదుగో ఆ గోడలమీద అక్షరాలేవో చెక్కారే అవేమి తెలియబరుస్తాయండీ!

భ : అదొక శాసనం. అనవేమారెడ్డి గారు భీమేశ్వరస్వామి వారి ఆరాధన నిమిత్తం అనేక అగ్రహారాలిచ్చిన దాన శాసనం.

భా : వారి ఔదార్యం ఎంత మహత్తరమైంది-ఈ గోడలమీద కనిపించే ఈ శాసనమేమిటండీ?



భ : యిది కుమారగిరి రెడ్డి ప్రభువులు గోదావరీ తీర ప్రాంతాన్ని జయించిన తరువాత తన కుమారునితో తులాపురుష దానం చేయడాన్ని తెలిపే దాన శాసనం.

భా : అయితే ఇంకా ఏయే వంశాల వారు ఈ విధంగా దానాలు చేశారు.

భ : అనేక వంశాల వారున్నారు. పూర్వ పశ్చిమ చాళుక్యులు; వెలనాటి చోళులు; కాకతీయులు; బహు విధములయిన దానాలు చేసి స్వామి అనుగ్రహ ప్రసాద లబ్ధులయినారు.

భా : చూశారా! ఈ రావిచెట్టు ఎంత పెద్దదో! చాలా పురాతనమైనదిగా ఉందే!

భ : అవును. ఇది ఎన్నో వేల సంవత్సరాలనాటి అశ్వత్థ వృక్షము. దీని క్రింద వెలసిన శ్రీ శంకరనారాయణ స్వామి వార్ని పూజిస్తున్నారు చూడు-

భా : అవును.

భ : మరి ఈ మహా వృక్ష రాజానికి ప్రదక్షణం చేసి మ్రొక్కు-నీ మనోరథం సఫలీకృతమౌతుంది.

(ఇద్దరూ ప్రదక్షిణం చేసి నమస్కరిస్తారు.)

భా : ఆ కనిపించే ఆ శిలామంటపమేమిటండీ!

భ : దాన్ని కాటమ వేమారెడ్డి గారనే సేనాధిపతి కట్టించారట.

భా : ఇంతకీ యీ దేవాలయాన్ని ఎవరు కట్టించారో చెప్పరే

భ : దీన్ని చాళుక్య భీముడనే రాజు కట్టించినట్లు చరిత్రకారులు చెబుతారు.

భా : ఆ ప్రాకారాల మీద కనబడే ఆ శిల్పాలేమిటండీ!

భ : అది ఒళ్లు పులకరించే కిరాతార్జునీయ గాథ.

* * *

భా : అదిగో శంకరుడు అర్జునునికి పాశుపతాస్త్రం ఇస్తున్నట్లు ఎంతో మనోహరంగా శిల్పం చెక్కారో

భ : అవును ఇవన్నీ చూపించాలనే గదా ఇక్కడికి తీసుకొచ్చాను నిన్ను

భా : అపుడే మనం తూర్పుగోపురం దగ్గరకు వచ్చేశాం-

భ : అవును. అటు చూశావా-అదే రుద్రగంగ, శివగంగ-భక్తజన సమూహం ఎక్కువవుతోంది, త్వరగా పద-కనపడేదే సప్తగోదావరీ తీర్థం-మనం కూడా ఇక స్నానం ముగించుకుని భీమేశ్వరస్వామి వారికి అభిషేకం చేయిద్దాము-

భా : అలాగే-దీన్ని సప్తగోదావరి తీర్థమన్నారే-దీని మహత్యమేమిటో మరి-

భ : ఇక్కడి సప్తగోదావరి తీర్థంలో స్నానం చేసి భీమేశ్వర స్వామివారి నారాధిస్తే సప్తజన్మల్లో చేసిన పాపం పోతుందట-స్నానానికి నడు.

భా : నేడెంత పుణ్యదినమండీ-మీతోబాటు ఈ పవిత్ర క్షేత్రానికి తీసుకువచ్చి పుణ్యం కట్టుకున్నారు!

భ : లేకపోతే ఊరుకుంటావా, అర్ధాంగి వైతివాయె మరి!

భా : బాగుందండీ-మీరనేది-అడగడం మరచాను-ఈ తీర్థానికి సప్తగోదావరి అని ఎందుకంటారండీ- ఆ విషయం కాస్త చెబుదురూ!

భ : దీనికి ఒక గాథ ఉంది మరి. పూర్వం సప్త ఋషులు ఈ దక్షారామంలో భీమేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించే నిమిత్తం ఒక ముహూర్తం పెట్టుకున్నారట. అయితే సూర్యోదయమయే లోపుగా స్వామివారి అభిషేకానికి గోదావరిని తీసుకురావాలనే ఉద్దేశంతో గౌతముణ్ణి ప్రార్థించడానికి గోదావరీ తీరం వద్దనున్న ధవళేశ్వరానికి వెళ్లారట!

భా : తరువాత ఏంజరిగిందండీ!

భ : గౌతముడు వారి ప్రార్థనలను అంగీకరిస్తాడు. గోదావరి ఏడు పాయలై వారిని వెంబడించి వస్తోంది. కాని తుల్య మహాముని అప్పుడు తాను చేస్తున్న యాగాన్ని ఆటంకపరచడానికి ఇంద్రుడు వేసిన యెత్తుగడ అని ఆ ప్రవాహాన్ని ఆపుచేస్తాడు.

భా : చాలా ప్రమాదం జరిగిందే మరి! అటు తర్వాత-

భ : అప్పుడు సప్త ఋషులూ, వ్యాసమహర్షీ ఆయనకు అసలు విషయం



చెప్పగా దైవకార్యం నిర్విఘ్నంగా జరుగుతుందని అభయమిచ్చి తుల్యమహాముని గోదావరిని అంతర్వాహినిగా దక్షారామ భీమేశ్వరాలయం వద్ద పుష్కరింపజేస్తాడు.

భా : ఆయన ఎంత దయాసముద్రుడో

భ : అపుడు అత్యంత మంగళప్రదమైన ఆ సూర్యోదయవేళ భీమేశ్వరుడావిర్భవించడమూ, సూర్యునితో బాటు, సప్తఋషులూ, భీమేశ్వర ప్రతిష్ఠాపకులై పూజార్హులౌతారు. గోదావరి ఇక్కడ పుష్కరిణిగా ఇక్కడ ప్రత్యక్షంగా అవతరించి సప్తగోదావరియై చరితార్థమైంది. బ్రహ్మ విష్ణు మహేంద్రాది సిద్ధసాధ్యులు ప్రత్యక్షమై భీమేశ్వర స్వామికి అభిషేకం చేస్తారు.

భా : అయితే, అప్పటి నుండి ఈ తీర్థానికి సప్తగోదావరమనే పేరు వచ్చిందన్న మాట!

భ : అవును. అభిషేకానికి గంగ ఇలాగే –పై అంతస్తు ఎక్కితే ఇదే భీమేశ్వర మహాలింగము! అభిషేకం చెయ్యి-జన్మ చరితార్థమౌతుంది:

అష్టమానువాకః : ఓం నమస్సోమాయచ రుద్రాయచ

నమః స్తామ్రాయచారుణాయచ

నమశ్శఙ్గాయచ పశుపతయేచ

నమ ఉగ్రాయచ భీమాయచ

నమో అగ్రేవధాయచ దూరేవధాయచ

నమో హన్త్రేచ హనీయ సేచ

నమో వృక్షేభ్యో హరికేశేభ్యః

నమస్తారాయ నమశ్శమ్భవేచ మయో భవేచ

నమశ్శఙ్కరాయచ మయస్కరాయచ

నమశ్శివాయచ శివతరాయచ

నమస్తీర్థ్యాయ చ కూల్యాయచ నమఃపార్యాయ చావార్యాచ

నమః ప్రతరణాయ చోత్తరణాయ చ నమ ఆతార్యాయచా

లాద్యాయ చ

నమిశ్శష్ప్యాయచ ఫేన్యాయచ

నమస్సికత్యా యచ ప్రవాహ్యా యచ

* * *

బృందగానం: జగత్సం భార కుంభ కల్పనా కుంభకారా ॥జయజయ॥

కుంభీనస భూషణ భూత ప్రేత పిశాచ శాకినీ

ఢాకనీ ప్రౌఢ పరీవార ! ॥జయ జయ॥

రెండో కంఠం: వియద్వాయు ధరణీ తరణి / శీత భాను

బృహద్భాను / సలిల యజమాన మూర్తీ / ॥జయ జయ॥

కల్పితాష్ట భేద / ప్రపంచిత విశ్వప్రపంచ

వదన పంచాక్షరీ / మూలమంత్ర కారణ ॥జయ జయ॥

పాంచ భౌతిక వ్యవహారా !

జయ! జయ !!

నిర్మల జ్యోతిర్లింగ మయ మంగళాకారా ॥జయ జయ॥

మూడో కంఠం : జయ జయ సప్త పాతాళ / భువనవిష్కంభ

నిర్భేదన / సమానాదితా / విర్భావ

భావజ సలహారా / జయ / జయ!!



సర్వ మంగళా కుచ కలశ పాలి కేళీ /

తూలికా కార మకరికా ముద్రికా

భీమ ముద్రితోరః ప్రదేశ మహేశా ॥జయ జయ॥

నాలుగోకంఠం: జయ జయ! భక్త భావనా / సులభ స్వభావ

నాతీత పావనాకార

ధానళ్యవిగ్రహో / జయ జయ

శ్రీమన్మహాదేవ ! దేవ దేవతారాధ్య

దక్షవాటే పురాధ్యక్షా

ఆపద్ధ్వాంత దివాకరా !

పరమదయా కరా!

జయ జయ శ్రీ భీమేశ్వరా

నమస్తే నమస్తే నమః !

ఓం శ్శాంతిః శ్శాంతిః

✱ **A.I.R**

# శ్రీశైలము

(పురాణగాథలు, కథలు ఆధారంగా శ్రీశైల వైశిష్ట్యాన్ని రేఖామాత్రంగా చిత్రించే రూపకం )

బృందగానం :

"నల్లవో నల్లవో నగ రాజ రాజ
మల్లయ్య మల్లయ్య మహనీయ తేజ
సిరిగిరి మల్లన్న శరణన్న జాలు
పరమ పాతక కోట్లు భస్మమైపోవు
సిరిగిరి శరణు శ్రీగిరినాథ శరణు
చేదుకో చేదుకో శ్రీశైల నిలయ
చేదుకో మల్లయ్య చేదుకో" వయ్య!

(భక్తజన సమూహాల కోలాహలమును సూచించు ధ్వనుల సమ్మేళనము; మధ్య మధ్య చేదుకో చేదుకో మల్లయ్యా అనే స్తోత్ర పాఠాలు వినవస్తూ ఉంటాయి. వివిధ శృతులలో శంఖారావాలు గంటల గణగణలు హెచ్చుస్థాయిలో వినబడుతుంటాయి. అవి క్రమేపీ తగ్గిన తరువాత)

భార్య : బస్సులు వేసినా శ్రీశైల ప్రయాణం ఇప్పుడే ఇంత కష్టంగా ఉంటే పూర్వం ఇంకెంత కష్టంగా ఉండేదో!

భర్త : ఇప్పుడేం కష్టం? కష్టమంతా పూర్వపు రోజుల్లోనే. ఇదంతా కాకులు దూరని కారడవి. శివరాత్రికి యాత్రవచ్చే నిమిత్తం అడవికొట్టి దారి చేసేవారు రాత్రిళ్ళు క్రూరమృగాలు రాకుండా నెగళ్ళు వేసి మజిలీలు చేస్తూ శ్రీశైలం వెళ్లేవారు.

భార్య : పూర్వం శ్రీశైలం వెళ్ళడం కాశీయాత్రంత కష్టమన్నమాట



భర్త : ఆమాటకొస్తే కాశీయాత్రే సులభం.

భార్య : పూర్వం ఈ కొండలెల్లా ఎక్కేవారో. ఒకటా రెండా? ఇప్పుడే నా కాళ్ళు పడిపోతున్నాయి.

భర్త : అందుకోసమే పూర్వపు రోజుల్లో కొండవీటి వేమారెడ్డి గారూ రాచకొండ సింగమనాయుడు గారు యాత్రికుల సౌకర్యం నిమిత్తం శ్రీశైలానికి మెట్లు కట్టించారు. ఆ ప్రభువులు మెట్లు కట్టించిన తరువాతే ఈ యాత్ర భక్తజన సులభమయింది.

భార్య : ఏమో! ఏం సులభమో! ఇప్పటికే కాళ్ళు పడిపోతున్నాయి. కొండ దిగడం సులభంగాని, ఎక్కడం చాలా కష్టం.

భర్త : దిగడమెంత కష్టమో అదీ తెలుస్తుందిలే పాతాళగంగకు వెళ్ళేటప్పుడు.

భార్య : ఇంకా ఎంతదూరమున్నదండి మల్లికార్జునాలయం!

భర్త : ఇదిగో భక్తజన కోలాహలం దగ్గరగా వినబడటం లేదూ! ఒక్క అడుగెయ్యి శ్రీశైల శిఖరం అదే. "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" శ్రీశైల శిఖర దర్శనం చేసిన వారికింక జన్మలేదట. ఈ శ్రీశైల శిఖర దర్శనం కోసం నా ప్రాణం ఎంతగా పరితపించి పోయింది!

భార్య : ఆ శిఖరమే, మల్లయ్య తండ్రి దేవాలయ శిఖరమే

భర్త : అదే - రా - ఈడిగలబడకు, ఇంకెంత వచ్చేశాం

భార్య : చేదుకో చేదుకో! శ్రీగిరి మల్లయ్య! చేదుకో చేదుకోవయ్య హరహర మహదేవ శంభో!

(హరహర మహాదేవ శంభో అని వరస నినాదం వినబడుతుంటుంది)

భర్త : ఈ ప్రదేశాన్నీ, ఈ భక్త సమూహాన్నీ, ఈ ఆలయాలన్నీ చూస్తూంటే ఒళ్ళు పులకరిస్తోంది. ఎంతకాలం నుంచో స్వామి దర్శనం చేయాలన్న కోరిక నేటితో తీరింది.

భార్య : కాలం కలిసొస్తే గాని ఏదీ సాధ్యం కాదు. దేనికైనా ప్రాప్తముండాలి. అమ్మయ్య వచ్చేశాం.

భర్త : స్వామీ! మల్లయ్యా!

ఈశ! గిరీశ! నరేశ పరేశ

మహేశ బిలేశయ భూషణభో

సాంబ సదాశివ శంభో శంకర

శరణం మే తవచరణ యుగం"

భార్య : నమోస్తు రుద్రాయ కపర్దినే తే

నమో మహాదేవ నమశ్శివాయ.

(హరహర శంభో అనే కేకలు గంటలు వినబడును.)

భర్త : అరుగో భక్తులు ధూళి దర్శనం చేసుకొంటున్నారు. పద.

భార్య : కాళ్ళూ చేతులూ మొహమూ కడుక్కోకుండానే?

భర్త : ఆహా, ఇక్కడి ఆచారం ఇది. నడచి వచ్చిన పాదధూళి పాదాల నుండగనే స్వామి దర్శనం చేసి, నీ దర్శనానికి వచ్చాం స్వామీ! శ్రీగిరి మల్లయ్యా! అని స్వామికి నివేదించి మ్రొక్కాలి- రా.

భార్య : జనం సందులేకుండా ఉంది ఎల్లాగండి రావడం?

భర్త : అల్లాగే సందు చేసుకుని రావాలి. రాణిగారివి వచ్చావని దారియ్య రెవ్వరూ ఇక్కడ. స్వామి సన్నిధిని పేదసాద అందరూ సమానమే, నా చేయి పట్టుకో. శివనామస్మరణ చేస్తూరా. అదిగో మ్రొక్కు- అదే శివమహాలింగం హరా! మహాదేవా! (గంటలు మ్రోతలు స్తోత్రపాఠాలు) స్వామి దర్శన మయిందా?

భార్య : ఆఁ! అయింది.

భర్త : రా! భక్తులు మళ్ళీ గుంపుగా వస్తున్నారు- బయటపడాలిరా

భార్య : గర్భగుడిలోనుంచి ఇవతలికి వచ్చేసరికయింది నాపని.

భర్త : అల్లా ఎక్కడికి. ఇక్కడికి ముందు ఈ సాక్షి గణపతిని సేవించాలి.

భార్య : సాక్షి గణపతి ఏమిటండీ?



భర్త : ఇక్కడికి వచ్చిన భక్తులు పేర్లన్నీ తన జాబితాలో వ్రాసుకొంటాడు. మనం ఇక్కడికి వచ్చినందుకు సాక్షి ఈ గణపయ్య మనం ఇక్కడికి వచ్చినా ఈయన్ను చూడకపోతే రానట్టే లెక్క.

భార్య : అదా సంగతి! పదండి చూద్దాం

(విరామము సూచించు వాద్యసంగీతము)

(పాతాళ గంగకు వెళ్ళేదారి. అక్కడి తీర్థపూజ ఆ 900 మెట్లు ఎక్కేవాళ్ళూ దిగేవాళ్ళూను. మంగళ స్నానాలు చేసే స్త్రీలు పురుషులు, వృద్ధులు యావన్మందీను. స్నానఘట్టం వద్ద నీళ్ళు పోసుకుంటున్న ధ్వని. స్నానం చేసేటప్పుడు చదివే మంత్ర పారాయణలు, పాత్రలతో నీరు ముంచుకుంటున్న చప్పుడు స్పష్టంగా వినవస్తుంటాయి. కొంచెం దూరాన.)

భార్య : అబ్బ ఇంక ఎన్ని మెట్లున్నాయండి

భర్త : అదిగో అదే పాతాళగంగ. మెల్లగారా.

భార్య : కాళ్ళు తడబడుతున్నాయి. ఎక్కడమే కష్టమనుకున్నా. దిగడమూ కష్టమే సుమా!

భర్త : స్నానం చేసి స్వామిని దర్శించాలి. ఇంకా పొద్దెక్కితే గుళ్ళోకి వెళ్ళలేము. రావాలి.

భా : వస్తున్నా, గంగమతల్లీ రక్షించు - రక్షించు తల్లీ

భ : రా వచ్చేశాం. ఇదిగో కృష్ణవేణమ్మ తల్లి.

భా : నీరు ప్రవహిస్తున్నట్లు లేదే.

భ : అవును. శ్రీగిరి మల్లయను విడిచిపెట్టలేక ఇక్కడే ఆగిపోయి నట్టుంది. దిగు స్నానం చెయ్యాలి. త్వరగా! మెట్లు జాగ్రత్త లోతు సుమా. ఇహ ముందుకు వెళ్ళకు-

(నీళ్ళు పోసుకుంటున్న చప్పుడు)

భా : ఏమండీ! మిమ్మల్నే - (స్నానం చేస్తూ., హరోం హరహర)

భ : వచ్చేస్తున్నా - ఇదిగో నా స్నానం కూడా అయిపోయింది.

భా : స్వామివారి అభిషేకానికి ఈ మరచెంబునీళ్ళు చాలుగదా మనకు.

భ : చాలు

(విరామమును సూచించు సంగీతము ఆలయ పరిసరాల్లో)

భ : అభిషేకానికి కొంచం వేచి యుండాలి. జనసమ్మర్థం చాలా ఎక్కువగా ఉంది.

భా : అలాగే – ఈలోగా ఇవన్నీ చూద్దాం పదండి.

భ : ఎంత బాగున్నాయో ఈ శిల్పాలన్నీ- చక్కగా తీర్చిదిద్దారు.

భా : ఇవన్నీ పరమశివునికి సంబంధించిన పురాణగాథలు. అది పార్వతీ పరిణయ గాథ. అది శివుడు కిరాత వేషం ధరించి అర్జునుని పౌరుష పరాక్రమాలు పరీక్షించి అతనికి పాశుపతాస్త్రం ప్రసాదించిన గాథ. ఎంత రమణీయంగా చెక్కారో.

భా : ఔను గానండి! ఈ స్థలానికి ఇంత మహత్తు ఎలా వచ్చిందంటారండీ.

భ : పూర్వము శిలాదుడనే మహర్షి భగవధ్యాన తత్పరులైన పుత్రుల కోసం తపస్సు చేశాడట. ఈ మహర్షికి ఈశ్వర ప్రసాదం వల్ల నందీశ్వరుడు, పర్వతుడు పుట్టారట. ఈ కుమారులిద్దరు కొంత జ్ఞానం కలిగాక పరమశివుణ్ణి గూర్చి తపస్సు చేశారు. నందీశ్వరుని కోరిక ప్రకారం తాను ఆ మహాదేవుని వాహన భాగ్యం లభింప జేసుకొని తన పేరిట నందిమండలాధిష్ఠాన దైవతమై మహానంది వద్ద వెలిశాడు.

భా : అయితే ఆ పర్వతుడేమైనట్లు?

భ : నందీశ్వరుడికి తీసిపోయేవాడు కాదు పర్వతుడు అతడూ చాలాకాలం ఘోరమైన తపస్సు చేశాడు.

భా : ఆ తరువాత ఏం జరిగిందండీ?

భ : పరమశివుడు భక్తజన సులభుడు! పంచాక్షరీ మంత్ర జప పరాయణులు పాలిటి కల్పవృక్షం. అదుగో అటు విను.

(వాద్య సమ్మేళనము : పర్వతుని తపస్సు)



పర్వతుడు: ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!

ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!

(పరమేశ్వరుని సాక్షాత్కారము సూచించు వాద్య సంగీతము)

శంక : వత్సా! పర్వతా!

పర్వ : నా స్వామి సదాశివుడే- మహేశ్వరుడే, నా జన్మ ధన్యమైంది నా తపస్సు ఫలించింది. (దండకము)

జయజయ శ్రీ మన్మహా దేవదేవా వేదాంతవేద్యా,

భవవ్యాధి వైద్యా శ్రీసచ్చిదానందమూర్తీ కృపాస్ఫూర్తీ, అపన్నరక్షా వివక్షా, జగత్రాణదక్షా; త్రిలోక ప్రదీపా, నమస్తే నమస్తే.

శం : నీ తపస్సుకు మెచ్చాను. నీ యభీష్టమేమి.

పర్వ : మహాదేవా! నీ సాన్నిధ్యం తప్ప నాకు కావలసిందేముంది? నా శిఖరిపై అధివసించి నన్ను గ్రహించుస్వామీ! సమస్తతీర్థాలకు ఇది శిరోభూషణం కావాలి. సమస్త దేవతలకు ఇది సేవ్యమైన పవిత్రక్షేత్రం కావాలి. ఈ వరమనుగ్రహించు దేవదేవా! నీవు వెలసిన నా పర్వత శిఖరాన్ని దర్శించినవారికి పునరావృత్తి రహితమైన మోక్షాన్ని ప్రసాదించు ప్రభూ! ఇదే నా కోరిక.

శం : అనుగ్రహించాను. శ్రీగిరివని భూలోకంలో ప్రసిద్ధి వహిస్తావు. నీ శిఖరదర్శనం చేసిన మాత్రాన పునరావృత్తి రహిత శాశ్వత శివసాయుజ్యం లభిస్తుంది భక్తులకు. నీ కోరిక నెరవేరుతుంది.

పర్వ : ధన్యోస్మి! ధన్యోస్మి జయజయ పర్వతలింగమూర్తీ!

శ్రీశైల నివాస భక్తాభీష్ట వరప్రదాయకా! జయజయ!

“దేవగణార్చిత భూసురలింగం, సురవన పుష్పమర్చిత లింగం

సంచిత పాప వినాశనలింగం, దినకరకోటి ప్రభాకరలింగం”

(పరమశివుడు అంతర్ధానము చెందును. వివిధ వాద్యము సమ్మేళనము)

భర్త : మరి తెలిసిందా– శ్రీశైలంమహత్తు?

భార్య : అబ్బా, దీనికింత గాథ ఉందన్నమాట.

భర్త : ఇక్కడి శిలలన్నీ లింగాలు, ఇక్కడ శ్రీగిరికి రాత్రులు ప్రదక్షిణం చేసే సంచార వృక్షాలున్నాయట; ఇక్కడి భక్తులందరూ ప్రమధులు. ఇది సాక్షాత్తు కైలాసమే. ఇక్కడ అమ్మవారు భ్రమరాంబగా వెలసింది. అదిగో అమ్మవారు, చల్లని తల్లి.

భార్య : జన్మ ధన్యమైంది. కన్నులున్నందుకు శ్రీశైలం చూడడానికి వీలుపడింది.

భర్త : ఔనౌను, అదుగో లింగాకారంలో ఉన్న మల్లికార్జునస్వామి శిరస్సు మీద ఆ మల్లికాదామం; శరత్కాల చంద్రికలకు వంకలు దిద్దుతోంది, చూస్తున్నావా?

(గంటల చప్పుడు, నమక చమకాలు వినిపిస్తుంటాయి)

స్వామి : శంకరా! భక్తవశంకరా! శరణు శంభో!

భార్య : పరమశివునికి ఆ మల్లికాదామ మేమిటండీ?

భర్త : దానికీ ఓ కథ ఉంది.

భార్య : అదేమిటండీ.

భర్త : బాగానే ఉంది. చంద్ర వంశజుడైన చంద్రగుప్తుడనే రాజు పూర్వం ఈ ప్రాంతాన్ని పాలిస్తుండేవాడు. ఈ కృష్ణ కవతలి ఒడ్డు సమీపంలోనే అతని కోట ఉంది.

భార్య : రాను రాను భక్తి అతిశయించి చెలులతో వచ్చి స్వామి సన్నిధిని ఉండగా ఒకనాడు –

(వివిధ వాయిద్య సమ్మేళనము)

చంద్రావతి: (భక్తి పారవశ్యంతో)

జయ జయ నాగాభరణా!

జయ జయ గౌరీ రమణా!



శివ శంకర పావన జయ –

నవమల్లిక మాలాభరణా!

చెలికత్తె: అమ్మా! చంద్రావతీ! ప్రొద్దెక్కింది, పోదాం చంద్రగుప్త నగరానికి, రా!

చంద్రా : ఇక్కడి నుండి నాకు కదలిరా బుద్ధి పుట్టడం లేదు.

చెలి : ఇంక నీకేం చెప్పనమ్మా! నా మాట విను తల్లీ!

చంద్రా : నేను రానుపో, పరమేశా! దయరాదా! భక్తావన పరతంత్రా దీనురాలిని కరుణజూడవా? జగదీశా, భక్తజన సులభు డవన్నారే! ఇవన్నీ కల్లలేనా? నా సేవలు నీకు నచ్చలేదా? నీవే పరదైవమనుకొన్నానే! నీ యనుగ్రహం లేని నా బ్రతుకు ఎందుకు, ఈ శిలకు నాతల బ్రద్దలు కొట్టుకొని చచ్చిపోతాను– (శివుని సాక్షాత్కారము సూచించు వాద్య సంగీతం)

శం : ఆగు, ఆగు చంద్రావతీ! నీ దీక్షను పరీక్షించడానికే ఇంతకాలం వేచి యున్నాము.

చం : (ఆత్రంతో) ఆ నాగభూషణుడు ప్రత్యక్షమైనాడా? స్వామి – నా స్వామి! నా నోములు ఫలించినవి, నా జన్మ తరించింది.

శంక : నీకు కావలసిన వరం కోరుకో చంద్రావతీ!

చం : పరమేశ్వరా! నేను భక్తితో అర్పిస్తున్న ఈ మల్లికాదామం ఎల్లప్పుడూ మీ శిరస్సు మీద ప్రకాశించేటట్లనుగ్రహించండి స్వామీ! నన్ను మీ భక్తురాలినిగా, పాదదాసిగా అనుగ్రహించి నాకు మీ సాయుజ్యం ప్రసాదించండి ప్రభూ!

శంక : నీ అభీష్టం సిద్ధించుగాక! భ్రమర కీటన్యాయమున నీవు భ్రమరాంబవై వర్ధిల్లు.

(పరమేశ్వరుని అంతర్ధానమును సూచించు వాద్య సంగీతము)

భార్య : ఈ గాథలు ఒకదాని నుంచి ఒకటున్నాయే– మరి మల్లికార్జునుడని స్వామి కెందుకు పేరు వచ్చిందో చెప్పారు కారు!

భర్త : చెపుతున్నా విను. ఆ చంద్రావతి సమర్పించిన మల్లికార్జునదామం అర్జున కాంతితో విరాజిల్లుతూ ఉండడం చేత స్వామికి మల్లికార్జునుడనే పేరు వచ్చింది.

భార్య : అదా సంగతి, తెలిసింది.

భర్త : ఇప్పటికే చాలా పొద్దుపోయింది కూడా జాగరణ చేసినట్లే.

భార్య : ఐతే – మహాశివరాత్రి అని అసలు ఎందుకన్నారండీ! దీని ప్రత్యేకత ఏమిటండీ!

భర్త : నీ వడిగినప్పుడు చెప్పొద్దూ మరి! ఒకప్పుడట, మహాప్రళయం ఏర్పడింది. జీవరాశి అంతా పిండరూపములో ఏకమై చాలా కాలం లయస్థితిలోనే ఉండిపోయారట. అప్పుడు 'సర్వమంగళ సార్థక నామధేయురాలైన పార్వతీదేవి పరమేశ్వరుని జూచి, జీవరాశి ప్రపంచంలో ఉండే స్వల్పకాలంలో లయకారుడైన తన్ను సేవించి తరించడానికి అనుకూలమైన సమయాన్ని నిర్ణయించమని ప్రార్థించింది. ప్రళయం రాత్రివేళ జరిగినందున తన ఆరాధన కూడ రాత్రి సమయంలోనే జరగాలని నిర్ణయించారు. ఈ మాఘ బహుళంలో వచ్చే శివరాత్రే 'మహాశివరాత్రి' అని చెప్పబడుతుందనీ, ఆనాడు నియమంతో ఉండి శివారాధన చేసి రాత్రి జాగరణ చేసినట్లయితే శివానుగ్రహము కలుగుతుందనీ, ఈ శివరాత్రి వ్రతాచరణం వల్ల సమస్త పాపాలు నశించి, శివసాయుజ్యం లభించగలదని తెలియజేశారు.

భార్య : ఎంత పుణ్యప్రదమైనదీరోజు, శ్రీశైలానికి నన్ను తీసుకువచ్చి మీరు పుణ్యం కట్టుకున్నారు.

భర్త : స్వామికి మహా రుద్రాభిషేకం జరుగుతోంది. పద చూద్దాం. ఎక్కడ చూచినా జేగంటలవారూ, శంఖాలవారూ శివపూజా నిరతులూ, శివ శధాభిరతులూ, శివస్తోత్ర పరాయణులూ, ఓహ్, ఏం జనం! ఏం జనం! ఇదే కైలాసం, ఇంతకంటే కైలాసమేముంది! జన్మ తరించింది.



(దూరంలో అర్చకుల అభిషేక స్తోత్రాలు వినవస్తుంటాయ్– ఓం నమశ్శంకరాయ! శశాంక మూర్ధాలంకారాయ! ఓం సంధ్యానటాయ! చండికాధిపతయే!" ఇత్యాదులు వినపిస్తుంటాయ్)

బృందగానం :

"గురులింగ గురులింగ మల్లికార్జునలింగ...

శరణయ్య, శరణయ్య శరణు లింగయ్య

మాతల్లి భ్రమరాంబ! మా తండ్రి మల్లయ్య

కరుణతో మమ్ముల కాపాడుడయ్య

మల్లికా దామంపు శోభతో వెలుగు

ఆదిమ దంపతుల్ శరణులు మీకు."

ఓం శాంతి; శాంతి; శాంతిః

✳ శ్రీశైలప్రభ

# కాళేశ్వరం

(పురాణ గాథలు, కథలు ఆధారంగా కాళేశ్వర వైశిష్ట్యాన్ని రేఖా మాత్రంగా చిత్రించే రూపకం)

(బస్సు నడుస్తున్న ధ్వని, బస్సు హారన్ మధ్య మధ్యలో వినబడుతుంటుంది)

భార్య : ఎన్ని బస్సులు వేసినా ఏం లాభం? ఎంత రష్షుగా వుందో కదండీ బస్సు!

భర్త : మరి తీర్థయాత్రంటే ఏమనుకున్నావు!

భా : ఇంతకీ ఇంకా ఎంతదూరమండీ కాళేశ్వరం?

భ : దగ్గరకే వచ్చేస్తున్నాం. కాళేశ్వరము ఈ మంథెన గ్రామానికి సుమారు ఇరవై మైళ్ల దూరంలో ఉంది. కాస్త ఓపిక పట్టు. ఈ క్షేత్రాన్ని ఆనుకునే గోదావరి తూర్పుగా ప్రవహిస్తోంది.

భా : అయితే చాలా పవిత్రమైన క్షేత్రమన్నమాట. దీన్ని పంచవేణీ సంగమం అని అంటారుటగా?

భ : అవును. ప్రయాగ త్రివేణీ సంగమైతే, ఇది పంచవేణీ సంగమ తీర్థ మయింది. ఇక్కడ స్నానం చేస్తేనే పంచప్రాణాలూ లేచివస్తాయంటారు. ముప్పైమూడు కోట్ల దేవతలూ మధ్యాహ్న కాలంలో ఈ సంగమ స్థలంలోవచ్చి ఉంటారట!

భా : అంత మహత్తు ఉందన్నమాట!

భ : ఆహా! ఈ క్షేత్రంలోని ప్రవాహం శివరూపం; ఇక్కడి శిలలన్నీ లింగ రూపాలు; ఇసుక దేవతా స్వరూపం; మట్టి అమృతం; నదీతీరాలు బ్రహ్మ విష్ణు రూపాలు, వృక్షాలు మునీశ్వరులు, లతలు మునిపత్నులు.



భ : అందుకనే దీన్ని దక్షిణ కాశి అంటారు. కాళేశ్వరంలో ముక్తేశ్వర దర్శనం స్మరణం వల్లే ఇక జన్మలేదని పెద్దలు చెబుతారు.

భా : బాగుందండి! కాళేశ్వరంలో అధిష్ఠాన దేవుడు ముక్తేశ్వర స్వామి వారు కదా– మరి కాళేశ్వరమని పేరెలా వచ్చింది?

భ : ఆ సంగతికే వస్తున్నాను. ఈ సంగమ ప్రదేశంలో భక్తులపాలిటి కల్పతరువులై కాళేశ్వర ముక్తేశ్వరులు ఏక పీఠస్థులై భక్తులను పాలిస్తున్నారు–

భా : ఇది చాలా చిత్రంగా ఉందే. దీనికేదైనా కారణం ఉందా?

భ : లేకేం ఉంది. పూర్వం యమధర్మరాజు పాపాత్ములందరూ తనను దూషిస్తున్నారని విచారపడి స్వర్గలోకంలాగానే ఒక పట్టణాన్ని తనపేరిట విశ్వకర్మచే కట్టించి, ఈ క్షేత్రానికి వచ్చిన వారందరికీ ముక్తి పొందేట్లు ఈశ్వరుని వల్ల వరం పొందాడట.

భా : అలాగా!

భ : అప్పటినుంచీ ఈ క్షేత్రానికి వచ్చేవారందరు ముక్తేశ్వర స్వామివారి దర్శనం వల్లే ముక్తి పొందుతూండటం వల్ల యమలోకమంతా ఖాళీ అయిపోయి, ఇక దాని అవసరమే లేకుండా పోయిందిట– అప్పుడేమైందంటే–

భా : Flash Back : (గతం)

భ :

(వీణావాద్యం సన్నగా వినబడుతుంటుంది. అది యమలోకం సింహాసనము మీద యమధర్మరాజు ఆసీనుడై ఉగ్రుడై ఉంటాడు. కాలపాశాలతో యమకింకరులు భిన్నులై అక్కడక్కడ నిలచిఉంటారు. వేరొక ప్రక్క చిత్రగుప్తుడు యథోచితా సనము నలంకరించి ఉంటాడు. మధ్య మధ్య సన్నగా మృదంగ ధ్వని వినబడుతుంటుంది. ఇంతలో అక్కడికి నారదమునీంద్రుడు ప్రవేశిస్తాడు.)

నారదుడు : నారాయణ! నారాయణ!

య.ధర్మరాజు: నారదమునీంద్రులకివే నా ప్రణామాలు.

నా : అభీష్ట సిద్ధిరస్తు! యమధర్మరాజా! ఈ యమలోకమంత ఇంత నిశ్శబ్దంగా ఉందేమిటి? పాపాత్ముల హాహాకారాలు వినిపించటంలేదు! నీవు చూడబోతే ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్లున్నావు ఏమి జరిగిందేమిటి?

య.ధ : జరగరానిదే జరిగిపోయింది మునీంద్రా! సకలజీవులూ ఈ ప్రదేశంలోని యమకుండంలో స్నానం చేసి ముక్తేశ్వరునికి మ్రొక్కిన మీదట అంతా ముక్తులై శివసాయుజ్యం పొందుతున్నారు.

ఇక స్వర్గ నరకాల మాటే లేకపోయింది. వారి వారి పురాకృత పుణ్య విశేషాల వల్ల ఇంకా ఎక్కడైనా కొందరు స్వర్గప్రాప్తులైనారేమో కాని...

నా : అయితే యమలోకంలో, నీవూ నీ అనుచరులూ తప్ప మరెవరూ లేరన్నమాట!

య.ధ : యథార్థంగా అంతే నాకిది ఒక భరింపరాని సమస్య అయింది.

నా : పరమేశ్వరుడు నీకిచ్చిన వరంవల్లే నీ యమలోకాధిపత్యానికి కీడు వాటిల్లింది. కోరి తెచ్చుకున్నదేగా-

య.ధ : గత్యంతరమే లేదా మునీంద్రా!

నా : మళ్లీ ఆ భక్తజన సులభుడు; సకలదేవతా సార్వభౌముడైన ముక్తేశ్వరునే వేడుకుంటే నీకు తరుణోపాయం దొరక్కపోదు.

య.ధ : అవును నేను భక్తవశంకరుణ్ణే వేడుకుంటాను-ఇక నాకు ఆయనే దిక్కు!

'వీణావాద్యము మృదంగధ్వనులు

సన్నగా వినబడుతుంటాయి.'

కాళేశ్వర క్షేత్రంలో యమధర్మరాజు తపోనిష్ఠాగరిష్ఠుడై ఏకాగ్రధ్యానంతో పరమేశ్వరుని గూర్చి తపస్సు చేస్తుంటాడు)

(సన్నగా వీణావాద్యము వినబడుతుంటుంది)



య.ధ : ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ

ఓం నమ శ్శివాయ ఓం నమశ్శివాయ

ఓం నమశ్శివాయ

(ముక్తేశ్వర సాక్షాత్కారమును సూచించు వివిధానేకవాద్యముల సమ్మేళనము మృదంగధ్వని)

శంకరుడు : వత్సా! యమధర్మరాజా! ఎందులకీ కఠోర తపస్సు

య.ధ : ధన్యోస్మి! కబుితపుణ్యోస్మి! దేవదేవా! శరణు శరణు!

శంకరుడు : ఏమి నీ కోరికా

యమ : మీ యనుగ్రహమువలన నాకే లోటు లేదు, స్వామీ

శంకరుడు : (మందహాసము) సందేహించక చెప్పు, వత్సా!

య.ధ : యమలోకము పాడుపడింది స్వామీ! నా యధికారము వ్యర్థమయింది. ఒక్క జీవిక గూడ యమలోకపు ఛాయ తాకుటలేదు! దేవదేవా! సకల జీవులు ముక్తేశ్వర దర్శన మాత్రము చేతనే మోక్షప్రాప్తులౌతున్నారు.

ముక్తే : అర్థమయింది, నీ ఆవేదన నాకర్థమయింది యమధర్మరాజా!

య.ధ : ఇక ఈ యమలోకాధిపత్యాన్ని త్యజించి దీన్ని తమకే అప్పగించి నేనే యేకాంతములోనో కూర్చుని తపస్సు...

ముక్తే : యమధర్మరాజా! చింతింపకుము: నీవు కాలుడవు, నేనూ కాలకాలుడను-ఈ పుణ్యక్షేత్రంలో నా పానువట్టము నందే కాళేశ్వర లింగమను పేర ఒక లింగాన్ని ప్రతిష్ఠించు ఇక ఇప్పటి నుంచీ నీవు ప్రతిష్ఠించిన లింగాన్ని పూజించకుండా నన్ను పూజించిన వారికి నరకం తప్పదు, నీకోరికా నెరవేరుతుంది.

య.ధ : అవశ్యం స్వామీ!

ముక్తే : తథాస్తు

(అంతర్ధానమును సూచించి వాద్య సమ్మేళనము)

* * *

భా : ఆహా: శంకరుని మహిమావిశేషమే ఇందంతా నన్నమాటు

భ : ఔను. మరి తెలిసిందా! ఇదే కాళేశ్వరము, దిగు బస్సు దిగు ఆ సామానులు ఇలాతే - అటు వెళ్ళాలి-అదే ముక్తేశ్వరాలయం

(సంగమ తీర్థ స్నానానికి వెళ్లే ప్రజాసమూహం-మంగళస్నానాలు చేసే స్త్రీలు, పురుషులు వృద్ధులు చిన్నపెద్దలు యావన్మందీను స్నాన ఘట్టం వద్ద నీళ్ళుపోసుకుంటున్న ధ్వనులు, సంకల్పము మధ్య మధ్య మధ్య వినబడుతుంటాయి. మంత్ర పారాయణులు, పాత్రలతో నీరు ముంచుకుంటున్న చప్పుడు వినవస్తుంటాయి)

1వ కంఠం : శుభశోభనముహూర్తే శివ శివ శంభో రాజ్ఞయా, ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణం ద్వీతీయ పరాచేధ.

2వకంఠం : "శ్వేత వరాహక కనె వైవస్వతమన్వంతరే

3వ ధ్వని : కలియుగే ప్రథమరిదే జంబూద్వీపే

భరతవర్షె, భరత ఖండే మేరే దక్షిదదిగ్భా నే శ్రీ

3వ కంఠం : మమోపాత్తదుంతక్షయం ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం... సంగమ తీర్థేషట్కోణమధ్యే కాళేశ్వర, ముక్తేశ్వర స్వామి చరణ సన్నిధౌ

భా : స్నానం చేస్తూ హరోంహర హరోంహర మహదేవ

భ : "శ్రీ ముక్తినాథ ముభయప్రద మాది దేవం
కాళేశ్వరం చ కన్నిదోషహరం మహేశః
వందేహం మార్త జనశోకహరం దయాళుం
ఆయుర్యశోధనసుతా భయ ముక్తికామం
హరోంహర హరోంహర.

భా : త్వరగా కానీయండి స్నానం- అభిషేకానికి మరచెంబుతో నీళ్లు ముంచి పట్టండి-షట్కోణమధ్యే అంటున్నారు సంకల్పంలో అంటే



భ : ఇక్కడ ప్రాణహిత నదీ తీరాలు రెండు, గోదావరి తీరాలు రెండు, సంగమ తీరాలు రెండు కలసిన ప్రదేశం కదా- అందుకని షట్కోణ మధ్యే అని సంకల్పం చెబుతారిక్కడ విన్నావుగా- నడు దేవాలయానికి బయలు దేరుదాం.

(దేవాలయం వద్ద)

(జనుల కోలాహలం, నాగస్వరం మేళతాళాల సందడి మధ్య మధ్య నమశ్శివాయచ, శితతరాయచ అన్న మంత్రాలు దగ్గరగా వినబడుతుంటాయి- దేవాలయ ఘంటలు ఘణఘన మ్రోగుతుంటాయి-హరహర శంకర భక్తవశంకర అంటూ భక్తుల ప్రార్థనలు కూడా వినబడుతుంటాయి-గర్భాలయ ప్రాంగణంలో- వీణనాదం, మృదంగధ్వనులూ సన్నగా వినబడుతుంటాయి)

భా : ఈ ప్రతిమ ఎంత అద్భుతంగా చెక్కారో చూడండి-జీవం ఉట్టిపడుతోంది-

భ : అది లోకబాంధవుడు శ్రీ సూర్యనారాయణమూర్తి విగ్రహం. సప్తాశ్వరథ సమారూఢుడై అనురసారథితో బాటు ఎంత రమణీయంగా మలిచారో-మరే

భా : అందుకనే జీవమున్న మనిషికన్న
శిలలే నయమనిపించును
అనే కవిపాట జ్ఞాపకమొస్తోంది.

భ : బాగా చెప్పావు. అదిగో అటువైపున్న విగ్రహమే మహిషాసురు మర్దినీదేవిది.

భా : ఎంతబాగుందో-యిటువైపు పదండి.

భ : స్వామి వారికి దక్షిణ భాగంలో మహావిష్ణువు, ముందువైపు చతుర్ముఖ బ్రహ్మేశ్వర లింగము వీరికి అభిముఖంగా ఉండేదే సరస్వతీ అమ్మవారు.

భా : ఈ శిల్పాలన్నీ ఎంత చక్కగా ఉన్నాయో మరి

భ : ముందు అటునడు

భా : ఏమిటీ అలా దూరివెడుతున్నారు-జనం

భ : మనం కూడా దూరాలి-ఈ ప్రాంగణంలో ఉన్నది యమకోణమంటారు-నాల్గుసార్లు తలవంచుకొని భక్తులందరూ అందులోంచి అటూ ఇటూ దూరి వెళ్లాలి.

భా : ఎందుకండీ

భ : ఇలా దూరివెళితే ఇక యమబాధలుండవట-

భా : ఆ స్తంభాన్ని కౌగలించుకుంటున్నారే ఎందుకు?

భ : అదే అగ్నిస్తంభం-భక్తులందరూ దాన్ని కౌగిలించుకోవాలి-యమలోకపు అగ్ని సంస్కారాలూ, దుర్గములు ఉండవు.

భా : మొదట నే మళ్లీ వచ్చి స్నానం చేశాం. ఇందాకనే అవి.

భ : అదే యమకుండమని చెప్పానుగా వైతరిణీ నదిని ఇకదాటనవసరం లేదని అంటారు-ముందుకు నడు ఇంకా ముందు చాలా చూడాల్సిన విశేషాలున్నాయి మరి.

* * *

(వీణావాదన)

(భక్త జనసమూహాల కోలాహలమును సూచించు ధ్వనుల సమ్మేళనము)

భా : ఈ దేవాలయం ఎప్పటి నుంచీ వుందో!

భ : ఇది చాలా పురాతనమైందని చెబుతారు. ఈ క్షేత్రం రెండు వేల యేండ్ల నాటిదని అంటారు. పూర్వం ఇదంతా అడవి ప్రదేశం. ఆరవ శతాబ్దంలో ఆంధ్ర రాజైన విష్ణువర్ధనుడనే మహారాజు ఈ ప్రాంతాన్నంతటినీ జయించి వేంగీదేశంలో కలుపుకున్నారని చరిత్ర కారులు చెబుతారు.

భా : అల్లాగా-ఆ ప్రత్యేక మందిరాలు ఏమిటండీ?

భ : అవే జయవిజయుల విగ్రహాలు-



భా : ఇక్కడ వాళ్ళ విగ్రహాలెందుకున్నాయండి?

భ : ఒకనాడు వాళ్ళిద్దరికీ తగాదా వచ్చిందట-కాశీ ఎక్కువా కాళేశ్వరమెక్కువా అని-సర్వంతర్యామి అయిన సూర్యభగవానుణ్ణి తీర్పు చెప్పమన్నారట.

భా : ఆయనేమని చెప్పాడు.

భ : ఆయన తక్కెడలో రెండింటినీ పెట్టి తూచాడట. వరిముల్లువాసి కాళేశ్వరమే ఎక్కువని చెప్పాడు. కాశీయే ఎక్కువ అన్నందువల్ల జయుడు తలవంచుకున్నాడట.

భా : ఆయన అన్నట్టుగానే సరిగా తలవంచుకునే ఎలా చూస్తున్నాడు.

భ : ఔను ఇందుకు సాక్షిగా అన్నపూర్ణా సమేతంగా నందివాహనంపై ఇదిగో ఇక్కడే వెలసిన విశ్వేశ్వరుడు "ఇదం సత్య మిదం సత్యం' అని పలికారట.

భా : ఎంత పవిత్రమైనచోటండీ ఈ ప్రదేశం

భ : కాశీ అన్నపూర్ణాసహితంగా గణపతి సూర్యభగవానుడు తగాదా పడ్డ జయవిజయులు శిల్పరూపాలు ఎంతో జీవంపోసినట్లున్నాయో చూడు.

భా : ఈ మూర్తు లేవిటండీ

భ : ఆయనే బాల రాజేశ్వరస్వామి-ఈ లింగానికెదురుగా నందీశ్వరుడు-

భా : అబ్బ-ఈ నందివిగ్రహము చూస్తే ఎంతో ముచ్చటగా ఉందండీ

భ : నందీశ్వరుని మెడలో ఆ నాగబంధపు ముళ్ళు, మెడలో ముడతలు, గంటలు, గజజలమువ్వలు, కాటుక పెట్టినట్లు కనబడే కళ్ళు, ఆ మూపుపై కూర్చి అలంకారాలు-ఎంత నయనమనోహరంగా ఉన్నాయో ఈ శిల్ప ప్రావీణ్యం చూస్తుంటే నభూతో నభవిష్యతి అనిపిస్తోంది.

భా : నందీశ్వరుడు లేచి నడచివస్తున్నట్లుంది! ఈ ప్రక్కనే మరో లింగమూర్తి ఉందే-దీన్నే మంటాయి-దీని వెనుక గూడ ఏదో గాథ ఉందేమో మరి!

* * *

భ : ఇక్కడ లింగమూర్తులకేం కొదవ- ముందే చెప్పానుగా ఇక్కడి ప్రతిశిలా లింగరూపమని-ఇదే సురాభాండేశ్వరలింగము.

భా : సూరాభాండమంటే?

భ : సుర అంటే సారాయి. భాండమంటే కుండ-అన్నమాట

భా : ఇదేమిటో చిత్రంగా ఉందే

భ : చిత్రమేమరి, ఏమనుకున్నావు?

భా : ఈ చిత్రమేమిటో కాస్త పరిష్కరించి చెప్పండి-

భ : అనగా అనగా ఒక ఈడిగ ఆమె వుండేదట. ఆమె మహాపతివ్రత. తన భర్తపై ఎంతో భక్తి ప్రపత్తులతో ఉంటూండేదట. పరమేశ్వరుడామెను పరీక్షించాలనుకుని ఒక తాపసుని రూపంలో వస్తాడుట.

భా : వచ్చిం తరువాత....?

* * *

(ఈడిగా వాసము వద్ద)

వీణావాదన

మ.భా : అయ్యా ఇది మీకు తగని పని, మీరు తాపసోత్తములు ఈ విధంగా ఇచ్చి.

తా : వీల్లేదు, కోమలీ! నిన్ను చూచిన క్షణం నుంచీ నా మనసు నీయందే లగ్నమైంది.

మ.భా : ఇది చాలా అనుచితమైన పని-నేను శివదీక్షాపరురాలను

తా : నీ ముఖారవిందం అత్యంత శోభాయమానంగా ఉంది. ఆహా ఏమి నీ సొగసు! నిన్ను వదలి పెట్టి ఎలా వెళ్లేది?

మ.భా : ఇక్కడి నుంచి వెళ్లిపొండి ప్రభూ! మీ బోటి మునీశ్వరులు ఇలా హద్దుమీరీ ప్రాంతానికే అసలు రాకూడదు. ఇలా వచ్చి ఎవరైనా చూస్తే

తా : తలోదరీ ఆగ్రహావేశంతో నన్ను తృణీకంచవద్దు-నా మీదయుంచి నా కోర్కె తీర్చు అలివేణీ



మ.భా : మిమ్మల్ని మళ్ళీ మళ్ళీ ప్రార్థిస్తున్నాను-నాతో వాదించకండి. దయచేసి వెళ్లిపొండి-నా పొందుకోరుట మహాపాతకం నా శీలాన్ని విడువడం వినాశహేతువు. ఈ పాపానికి మరణమే శరణ్యం అయ్యో శంకరా

తా : నా విరహబాధ శృతిమించిపోతున్నవి-నీతో సుఖించిన తరువాత కాని నేనిక్కడ నుంచి కదలను నా కోరిక తీర్చు కోమలాంగీ

మ.భా : మీ వంటివారికి నా మీద మరులుకొనడం విడ్డూరంగా ఉందే! సూర్యాస్తమయిపోతోంది. నా మగాడు వచ్చే వేళ అయింది. పోండి స్వామీ?

తా : నేనిక్కడి నుంచి వెళ్లేది లేదు. నా కోరికతీరిస్తే గాని వెళ్లేదిలేదు-నీతోవాదన దేనికి ఆఖరిసారిగా చెబుతున్నాను-అర్థిస్తున్నాను. నా కోరిక తీర్చకపోతే నేనిక్కడే అగ్నికి ఆహుతి అయిపోతాను ఇది ముమ్మాటికీ నిజం-ఆ పాపం నీవేమూటగట్టుకుంటావు-

మ.భా : పరోపకారః పుణ్యాయ-పాపాయ పరపీడనం (తనలో) ఈ విరహంతో ఉన్న ఈ తాపసోత్తముణ్ణి తృప్తిపరచడం కంటే వేరేగత్యంతరం లేదు (తరువాత అతన్ని సుఖకేళిలో తలుస్తుంది)

* * *

(తరువాత కొంతసేపటికి మధువిక్రయుడు వచ్చి తన భార్యను పిలుస్తాడు)

మ.వి : లోపల ఏం జేస్తున్నావు? రేపటికి కల్లమ్మడానికి భాండాలన్నీ సిద్ధంగా ఉన్నాయి గదా!

(ఇంటిలోపల నుంచి)

మ.భా : అన్ని సిద్ధంగా ఉన్నాయ్! కుండలన్నీ అమరిగ్గా సద్దుకుంటున్నా - వచ్చేస్తున్నా.

(ఆమె తత్తరపాటుతో భర్త కంటబడితే తన ప్రాణాలు దక్కవని భయపడి ఆ తాపసుణ్ణి ఒక సురాభాండంలో దాచి మూకుడుతో మూసేస్తుంది. తెల్లవారుతుంది. మద్యం కోసం వచ్చినవాళ్లు కల్లడుగుతారు. రాత్రి

మూసిన కల్లుకుండ మూతతెరచి చూస్తుంది. ఆమె ఆశ్చర్యానికి మేరలేదు-అందరూ హడావుడిగా గుసగుసలు చేస్తారు. ఇంతలోపల నుంచి మ.వి.వస్తాడు)

మ.వి : ఏమిటిదంతా-కుండలో ఏముంది (చూచి)

ఆ ఇందులో లింగమూర్తి వెలిశాడే (ఆశ్చర్యం)

అసలేం జరిగింది-వివరంగా చెప్పుకోలేకపోతే నిన్ను పాతేస్తాను.

మ.భా : నేను కల్లు ఇంటికి తీసికొస్తుంటే ఈ దొంగ తాపసయ్య నా వెంటబడి నన్ను...

మ.వి : ఏం చేశాడు? చెప్పు-నీ ప్రాణం

మ.భా : ఏమని జెప్పను. నామానం తీసేసినాడు-నాముఖమెలా చూపించను. నీకంటబడితే ఈ తాపసయ్యని చంపెస్తావని ఈ కల్లుకుండలో పెట్టి మూసేసినా-అంతే.

మ.వి : ఎంత మోసం! నీ బుద్ధిపాడుగాను-నిన్ను నమ్మినందుకు నన్ను నట్టేట్లో ముంచి ఇంటికి మచ్చతెచ్చావు.

మ.భా : ఇక నాకా పరమేశ్వరుడే దిక్కు

మ.వి. : చూడు నిన్నేంచేస్తానో ఈ కల్లు కత్తితో నీ పీకనరికేసి గంగలో పారేస్తాను. (అంటూ కత్తితీసి తన భార్యను నరకడానికి సిద్ధమౌతాడు)

(శంకమని సాక్షాత్కారమను సూచించు - వివిధ వాద్య సమ్మేళనము)

శం : భక్తాగ్రేసరులారా! నీవంత అఘాయిత్యానికి దిగవద్దు. ఇదంతా నా లీలావిశేషము. ఈమె భక్తి ప్రపత్తికి మెచ్చాను. మీరుభయులు గంధర్వులు కారణజన్ములు-నీవు నీ పత్నీ సుతసహితంగా కైలాసంలో నాకు సన్నిహితులై నివసించెదరు గాక.

మ.వి.
మ.చా : మహాప్రసాదం



ఇతరులు : (అంతా కలసి) నమోరుద్రాయ, నీలాయ భీమాయ పరమాత్మనే కపర్దినే
సురేశాయ వ్యోమకేశాయవైనమః
వృషధ్వజాయ సోమాయ సోమనాథాయ శంభవే
దిగంబరాయ భర్గాయ ఉమాకాంతాయ వైనమః
తపోమయాయ భవ్యాయ శివశ్రేష్ఠాయవిష్ణవే
వ్యాళప్రియాయ వ్యాళాయ వ్యాళానా పతయేనమః

* * *

భా : చాలా చిత్రంగా వుందే ఇదంతా-

భ : గనుకనే ప్రతిరాయికీ ఒక చరిత్ర ఉంటుంది-ప్రతి మూర్తి ఓ కథ చెబుతుంది మరి-నడు అభిషేకానికి వేళ అవుతోంది-

(కాళేశ్వర ముక్తేశ్వరస్వామికి అభిషేకం చేసే ఘట్టం)

భ : అభిషేకం చేయి! ముందు కాళేశ్వరస్వామికీ తరువాత ముక్తేశ్వర స్వామి వారికి చేయి-నేను చేస్తున్నట్టు-

* * *

వినబడుతుంటాయి (నమక చమకాలు) జయజయ ధ్వానాలూ నేపథ్యంలో నమో హిరణ్య బాహవే సేనాన్యే దిశాచపతయే నమో
నమోవృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయే నమో
నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయే నమో
నమస్సస్పింజరాయ త్విషీమతే పథనాంపతయేనమో

నమోహరికేశాయోపవీతినే పుష్టానాంపతయేనమో
నమోరుద్రాయాతతాలినే క్షేత్రాణాంపతయేనమో

బృందగానం: జగత్సంభార కుంభ కల్పనా కుంభాకారా! జయజయ !

కుంభీనస భూషణ భూత ప్రేతపిశాచ
శాకినీ ఢాకినీ ప్రౌఢ పరీవారా! జయజయ !

2వ కంఠం : వియద్వాయు ధరణీ తరణి శీతభాను
బృహద్భానుసలిల యజమానమూర్తీ జయజయ !!

3వ కంఠం : జయజయ సప్తపాతాళ భువనావిష్కంభ
నిర్భేదన సమా సాదాదితావిర్భావ
భావజసంహారా! జయ!జయ

4వ కంఠం: భక్త భావనా సులభస్వభావా!
ధావళ్య విగ్రహా జయ జయ
శ్రామన్మహాదేవ దేవతారాధ్య
కాళేశ్వరపు రవరాధ్యక్షా
ఆపద్ధ్వాంత దివాకరా జయ జయ.

* 6-3-1992
A.I.R



# ఉదంకుడు

పూర్వం గురుకులంలో చదువుకోడానికి వచ్చే విద్యార్థులు ఆశ్రమాలలోనే గురువుగారి సన్నిధానంలోనే ఉంటూ ఆయన సేవచేస్తూ వినయవిధేయతలతో వేదవేదాంగా విద్యలు, ఉపనిషత్తులు నేర్చుకుని గొప్ప పండితులయ్యేవారు. గురువులు విద్యార్థుల్ని తమ బిడ్డలుగా చూసుకుంటూ వారి విద్యాభిరుచుల్ని బట్టి విద్యనేర్పేవారు.

అటువంటి గురుకులంలో పైలుడనే మహామునీశ్వరుని వద్ద ఉపమన్యువు, ఆరుణి, వేదుడు మొదలైన వారెందరో సమస్త విద్యలూ నేర్చుకున్నారు. అట్టి మునికుమారులలో ఉదంకుడనె విద్యార్థి ఒకడు. ఉదంకుని అపార గురుభక్తీ, అతడు గురుదక్షిణ సమర్పించడం సూచించే గాథ ఇది.

గురుకులం ఒక చోట శిష్యులు ఉపనిషత్తులు అధ్యయనం చేస్తూ ఉంటారు. ఒక శిష్యుడు ఉపనిషత్తు పాఠం చదువగా మిగతా శిష్యులు దానిని వల్లిస్తూంటారు. మరో శిష్యుడు దాని అర్థం చెపుతుంటారు - సన్నగా వీణానాదం వినిపిస్తూంటుంది-

కామేశ్వరి : ఈ నవ్య వత్స

1వ శిష్యుడు: అన్నం న నింద్యాత్ తద్వ్రతం
ప్రాణోవా అన్నం శరీర మన్నాదం
పాణే శరీరం ప్రతిష్ఠితం
శరీరే ప్రాణః ప్రష్ఠితః
తదే తదన్నమన్నే ప్రతిష్ఠితం॥

2వ శిష్యుడు: అన్నమును నిందింపరాదు. అదివ్రతము. ప్రాణమే అన్నము. శరీరము అన్నము దినునది ప్రాణమందు శరీరము నిలిచియున్నది. శరీరమందు

ప్రాణమునిలిచియున్నదో ఇటియన్నము-అటువంటి యన్నమందు నిలిచియున్నది-

1వ శిష్యుడు: అన్నం పరిచక్షీత తద్వ్రతం అపోవా అన్నంజ్యోతి రన్నాదం అప్సు జ్యోతిఃప్రతిష్ఠితం జ్యోతిష్యా పఃప్రతిష్ఠితాః తరే దన్నమన్నే ప్రతిష్ఠితం॥

2వ శిష్యుడు: అన్నమును విడిచిపెట్టరాదు. అదివ్రతము నీరే అన్నము. జ్యోతిస్సు అన్నమును తినునది. నీటియందు జ్యోతి నిలిచియున్నది. జ్యోతిస్సునందు నీళ్ళు నిలిచియున్నది. ఆ యీ యన్నము అగ్నియందు నిలిచి యున్నది-

(వీణావాదన)

(అక్కడ ఒక వేదిక మీద పైలమహాముని ఆసీనువై ఉంటారు. ఆయన ముందు విద్యార్థులు కూర్చుని ఉంటారు. ఉదంకుడనే ముని కుమారుడు విద్య పూర్తి చేసుకుని ఆచారం ప్రకారం గురువుగారి వద్ద సెలవు తీసుకొనే సమయంలో)

ఉదంకుడు : ఆచార్యా- మీ కృపవల్ల అణిమాది సిద్ధులతో గూడిన విజ్ఞానం నేర్చుకున్నాను.

పైలుడు : ఎంతో నియమ నిష్ఠలతో విద్య సంపాదించావు.

ఉదంకుడు : గురుదేవా! మీకు గురుదక్షణగా ఎదైనా సమర్పించాలని నా కోరిక. మీకేం కావాలో సెలవిస్తే-

పైలుడు : నాకే గురుదక్షిణా ఇయ్యనక్కరలేదు-నీవంటి శిష్యుడు దొరకడం నా అదృష్టం భక్తిశ్రద్ధలతో విద్య నేర్చుకున్నావు- అంతే నాక్కావలసింది-

ఉదంకుడు : మీరు కోరిన గురుదక్షిణ ఇవ్వడం నా ధర్మం అది మా వంశాభివృద్ధికి తోడ్పడుతుంది. సందేహించకండి-గురుదేవా? అడగండి.

పైలుడు : నాయనా! ఇంతకాలంగా నీవు చేసిన సేవకుమించిన గురుదక్షణ ఏముంటుంది-నీవు తప్పదంటున్నావు గనుక ఆశ్రమంలో మీ అమ్మగారు ఏమికోరుకుంటారో అడిగి ఆ ప్రకారం చెయ్యి-

(వీణానాదం)



(ఉదుకుడు ఆశ్రమంలోనికెళ్ళి గురు భార్యను సమీపించి, నమస్కరించి)

ఉదంకుడు : తల్లీ... నమస్కారం... ఇంతకాలం మీ బిడ్డలా చూసుకుని అన్నంపెట్టి పోషించారు. మీవద్ద సెలవు తీసుకోవడానికి వచ్చాను. గురుదక్షణగా మీరు ఏంకావాలో సమర్పిద్దామని నా కోరిక. గురువుగారు మిమ్మల్ని అడగమన్నారు-మీకేంకావాలో చెప్పండి-చేస్తాను.

గురుభార్య : చాలా సంతోషం. ఇది వరకు పౌష్యుడనే విద్యార్థి విద్యనేర్చుకున్నాడు. ఆ రాజు భార్య ధరించే రత్నకుండలాలు తెచ్చిపెట్టు.

ఉదంకుడు : (ఆనందంతో) తప్పక తెస్తాను-

గురుభార్య : నాయనా-నేనొక వ్రతం చేయతలపెట్టాను. వ్రతారంభానికి ఇక నాలుగురోజులే గడువు ఉంది. ఈలోపుగా ఈ రత్నకుండలాలు నాకందాలి-ఆలస్యం చేయకుండా తెచ్చిపెట్టాలి.

ఉదంకుడు : చిత్తం! తల్లీ-మీరు కోరినట్లు రత్నకుండలాలు ఈలోపు నే తెచ్చి మీకందిస్తాను-

గురు భార్య : శుభం-

(వీణావాదన)

ఉదంకుడు బయలుదేరి కొండలూ, కోనలూ దాటుకుంటూ అరణ్యాలు దాటుకుంటూ సాగిపోతున్నాడు. ఇలా వెళ్ళగా వెళ్ళగా ఒక నిర్జీవ వనంలో ఒక దివ్య పురుషుడు ఎద్దునెక్కి ఎదురౌతాడు.

దివ్యపురుషుడు: ఏం మునికుమారా! చాలా దూరం ప్రయాణం చేసి వస్తున్నట్టున్నావు దేనికోసం-నీ అన్వేషణ-

ఉదంకుడు : అయ్యా-నా పేరు ఉదంకుడు-నమస్కారం-నేను పైలమహాముని శిష్యుణ్ణి. గురుదక్షణగా పౌష్యమహారాజపత్ని ధరించే రత్నకుండలాలు తెచ్చేందుకు వెడుతున్నాను.

ది.పురుషుడు: అది చాలా కష్టసాధ్యమైన పని-నీ వెక్కడ-ఆరాజపత్ని రత్నకుండలాలెక్కడ-

ఉదంకుడు : కష్టమైనా నిష్ఠురమైనా గురుదక్షిణగా రత్నకుండలాలను తెచ్చి ఇస్తాను. మీరెవరో మహానుభావులు. నన్నాశీర్వదించండి-

ది.పురుషుడు: నాయనా నీ సంకల్పం అమోఘమైంది. నేనెక్కిన ఈ ఎద్దు విసర్జించిన పేడను భక్షించి వెళ్ళు. నీ సంకల్పం నెరవేరుతుంది.

ఉదంకుడు : ఇదేమిటి స్వామీ - ఈ గోమయాన్ని...

ది.పురుషుడు: సందేహించకు-దీన్ని భక్షించు-

ఉదంకుడు : అలాగే స్వామీ (ఆ పేడను భక్షిస్తాడు)

ది.పురుషుడు: అభీష్టసిద్ధిరస్తు. నీకు సౌష్యరాజ సందర్శనం సిద్ధిస్తుంది-వెళ్ళునాయనా-ఎద్దు నెక్కిన దివ్యపురుషుడు నిష్క్రమిస్తాడు-ఉదంకుడు ప్రయాణం సాగిస్తాడు-ఇంతలో అతనికి సౌష్యరాజధాని సమీపిస్తాడు. ముందుకు సాగి రాజసౌధంలో ప్రవేశిస్తాడు.

అది పౌష్యమహారాజు ఆస్థానం. మహారాజు ఉదంక ముని కుమారుని సాదరంగా ఆహ్వానించి ఆసనమిస్తాడు-

(వీణానాదం)

పౌష్యమహారాజు: మునికుమారా- మీ రాక వల్ల మా జన్మ ధన్యమైంది. మీరేం పనిమీద వచ్చారో సెలవీయండి.

ఉదంకుడు : రాజా! నేను పైలమహాముని వద్ద విద్య నేర్చుకున్నాను. మా గురుపత్ని ఒక పుణ్యవ్రతం తలపెట్టింది. గురుదక్షిణగా ఆమెకు రత్నకుండలాలు అవసరం. మీ రాజపత్ని ధరించిన కుండలాలు కావాలి. వాటిని ఇప్పించి నన్ను కృతార్థుణ్ణి చేయండి ప్రభూ!

పౌ.మ : మీ కోరిక తప్పక తీరుస్తాను. మీరే స్వయంగా అంతఃపురానికి వెళ్ళి మహారాణిని అడగండి ఆవిడ సంతోషంగా ఇస్తుంది మీకు-

(వీణావాదన)

(ఉదంకుడు అంతఃపురానికి వెళ్ళి)

ఉదంకుడు : ఇది అంతఃపురం-రాజపత్ని కనబడ్డంలేదే- ఎందువల్లో-

(మహారాజును సమీపించి)



ఉదంకుడు : మహారాజా అంతఃపురంలో రాజపత్ని కనిపించడం లేదే-ఎందువల్ల

పౌ.మ : మునికుమారా! క్షమించాలి, అపవిత్రులకు ఆమె కనబడదు-మీరు పవిత్రులై-

ఉదంకుడు : గుర్తువచ్చింది-రాజా-నేను ఇప్పుడు శుచియై వెడతాను-

(శుచియై వెడతాడు)

(వీణావాదన)

ఉదంకుడు : అమ్మా నమస్కారం. నేను ఉదంకుణ్ణి. మా గురుపత్ని ఒకవ్రతం నిమిత్తం మీరు ధరించిన రత్నకుండలాలు అవసరమైనాయి. రాజుగారు మిమ్మల్ని అడగమన్నారు.

మహారాణి : మీ కోరిక తీర్చడం మా విధి. ఇవిగో నా రత్నకుండలాలు తీసికోండి-

ఉదంకుడు : మహాప్రసాదం (అంటూ వాటిని తీసికొంటాడు)

మహారాణి : మునికుమారా ఈ రత్నకుండలాలను చాలా జాగ్రత్తగా తీసుకువెళ్ళాలి. వీటిని దొంగిలించాలని తక్షకుడనే నాగరాజు వేచి ఉన్నాడు. అప్రమత్తంగా ఉండు-నీకు శుభం కలుగుతుంది.

ఉదంకుడు : అల్లాగే తల్లీ! సెలవు!

(మహారాజు వద్ద అనుజ్ఞ పొంది ఉదంకుడు నిష్క్రమిస్తాడు)

ఉదంకుడు కుండలాల్ని తీసుకుని వెడుతుంటే అతన్ని ఒక ముసలిబిచ్చగాడి రూపంలో నాగరాజు వెంబడిస్తాడు. సాయంకాలమయే సరికి ఒక చెరువు దగ్గరకు చేరి రత్నకుండలాల్ని ఒడ్డున పెట్టి సూర్యనమస్కారం చేస్తున్నాడు.

ఉదంకుడు : "నమః సవిత్రే జగదేక చక్షుషే
జగత్ప్రసూతి నాశపే-తనే
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే"

(సూర్యభగవానునికి అర్ఘ్యం విడుస్తాడు.)

ఉందకుడు : అయ్యో-రత్నకుండలాలు తీసుకుపోతున్నారు. ఎవరు వారు - ఆగండి ఆగండి- ఎంత ఘోరం జరిగింది-ఇప్పుడేంగతి.

(ఆయన. వెంట పరుగెత్తుకుంటూ పోతాడు. ఇంతలో ఆ ముసలి బిచ్చగాడు ఒక పాము రూపం ధరించి ప్రక్కనే ఉన్న బిలములో దూరి చరచరా పోతాడు.)

ఉదంకుడు : అయ్యో! ఈ బిలాన్ని ఎంత తవ్వినా దారి కనబడటంలేదే-ఏమిటీ విపరీతం - రక్షించండి- గురుదేవా! రక్షించండి-

అప్పుడక్కడికి ఒక దివ్య పురుషుడు వస్తాడు.

ది.పురుషుడు: ఉదంకా అధైర్యపడకు-నా ఆయుధం తీసికో దీనితో ఈ బిలాన్ని విశాలం చేయి-నీకు నాగలోకంలోకి దారి కనబడుతుంది. శీఘ్రంగా వెళ్ళు-

ఉదంకుడు : చిత్తం స్వామీ!

(దివ్య పురుషుడు నిష్క్రమిస్తాడు. ఆయుధంతో ఉధంకుడు ఆ బిలాన్ని విశాలం చేసి నాగలోకం చేరుకుంటాడు.)

(వివిధ వాద్య సమ్మేళనము వీణా నాదము వినబడుతుండాలి.)

(నాగలోకంలో)

ఉదంకుడు : "నాగరాజా! ఎక్కడున్నావు స్వామీ. నా మీద దయ యుంచి రత్నకుండలాలు నాకిచ్చి పుణ్యం కట్టుకో స్వామీ-"

"అదేమిటి అక్కడ ఇద్దరు స్త్రీలు తెలుపు నలుపు దారాల్తో వస్త్రం నేస్తున్నారే-చిత్రంగా ఉందే - ఇదంతా అయోమయంగా ఉందే-

(మెల్లగా వివిధ వాద్యసమ్మేళనం వినబడుతుండాలి)

ఉదంకుడు : "అదేదో నేతచక్రాన్ని ఆరుగురు తిప్పుతున్నారే దానికి పన్నెండు ఆమేలున్నాయే-చిత్ర విచిత్రంగా ఉందే-అదేమిటి-ఆయన ఎవరో గుఱ్ఱంమీద, ఆ పురుషుడెవరో-

ఓ మహానుభావా! మీకు నా నమస్కారాలు-నా మీద దయ యుంచండి-



ది.పురుషుడు: మునికుమారా! నీకేం కావాలో వరం కోరుకో ఇస్తాను.

ఉదంకుడు : ఈ నాగలోకం నా వశమయేట్లు అనుగ్రహించండి-నాగరాజు అపహరించిన రత్నకుండలాలు కావాలి-

ది.పురుషుడు: తథాస్తు: ఉదంకా-ఈ గుఱ్ఱం చెవిలో గట్టిగా ఒకసారి ఊదు నాయనా"

(ఉదంకుడు గుఱ్ఱం చెవిలో గట్టిగా ఊదుతాడు)

ఉదంకుడు : అగ్నిజ్వాలలు అలుముకుపోతున్నాయి-నాగలోకమంతా జ్వాలా జ్వలితమౌతోంది-

(మంటలు వ్యాపించిన శబ్దాలు-నాగుల హాహాకారాలు వినబడాలి)

ఉదంకుడు : ఆయన ఎవరో-నావైపే వస్తున్నారు రత్నమయ కిరీటధారి-

తక్షకుడు : మునికుమారా! నేనే నాగరాజు తక్షకుణ్ణి- ఇవిగో నీ రత్నకుండలాలు-సమర్పిస్తున్నాను. వీటిని తీసికొని నీ గురుదక్షిణ నెరవేర్చు-నన్ను క్షమించు అని పాదాలమీద పడతాడు.

ఉదంకుడు : రత్నకుండలాలు ఇచ్చి నన్ను కృతార్థుణ్ణి చేశావు సెలవు ఇక వ్యవధిలేదు -వీటిని గురుపత్నికి ఈ క్షణంలో ఎలా అందించగలనో!

(దివ్య పురుషుడు దర్శనమిస్తాడు)

ది.పురుషుడు: ఓయీ! ఉదంకా - ఈ దవళాశ్వాన్ని అధిరోహించు. క్షణంలో మీ గురు ఆశ్రమాన్ని చేరుకోగలవు (నిష్క్రమిస్తాడు)

(గుఱ్ఱం మీద ఉదంకుడు ఎక్కి కూర్చుంటాడు-మరుక్షణంలో ఆశ్రమం వద్ద గుఱ్ఱం దిగి లోనికి వెడతాడు. గురుపత్ని పూజా కార్యక్రమం ఆరంభం చేయబడుతోంది)

ఉదంకుడు : తల్లీ! నమస్కారం. ఇవిగో పౌష్య ధర్మపత్ని ఇచ్చిన రత్నకుండలాలు స్వీకరించండి-

గురుపత్ని : వీటికోసం ఎదురుచూస్తున్నా- తెచ్చావా నాయనా! చాలా సంతోషం. రత్నకుండలాలిచ్చి నా వ్రతం సఫలీకృతం చేశావు-నా ఆశీర్వాదం మీ గురువుగార్ని కలుసుకుని వెళ్ళు నాయనా!

(ఉదంకుడు గురువుగార్ని కలుసుకుంటాడు )

ఉదంకుడు : ప్రణామాలు గురుదేవా-

పైలుడు : ఆలశ్యం అయిందేం నాయనా! రత్నకుండలాలు అమ్మగారికి ఇచ్చావా!

ఉదంకుడు : ఇప్పుడే ఇచ్చి వస్తున్నా గురుదేవా! వీటిని తేవడంలో దివ్య పురుషుడు, ఎద్దు, నాగలోకంలో ఇద్దరు స్త్రీలు తెలుపు నలుపుదారాలు -చక్రము, ఆరుగురు- ఆ గుర్రం-ఇవన్నీ ఏమిటో వీటి అంతరార్థం బోధించండి గురుదేవా.

పైలుడు : నీ కెదురుపడిన దివ్యపురుషుడు దేవేంద్రుడు. వృషభం ఐరావతము. గోమయం అమృతం. అది భక్షించకపోతే నీవు నాగలోకంలో జీవించవు. నాగలోకంలోని స్త్రీలు ధాతవిధాతలు! నలుపు తెలుపు దారాలు రాత్రింబవళ్ళు చక్రాన్ని తిప్పే ఆరుగురూ ఆరు ఋతువులు. పన్నెండాకులూ పన్నెండు మాసాలు-ఆ చక్రం కాలచక్రం. ఆ గుర్రం అగ్నిహోత్రుడు-ఇంద్రుడు నా ప్రాణమిత్రుడు నీవు నా శిష్యుడవు కనక నీకు అపాయం జరగకుండా కాపాడి, నీ సంకల్పం నెరవేర్చారు. ఇక నువ్వు మీ ఇంటికి వెళ్ళు-నీకు సమస్త శుభాలు కలుగుతాయి.

ఉదంకుడు : ఆచార్యా సెలవు- వెళ్ళి వస్తాను.

*** 1-3-1996**

**A.I.R**

బాలానందం



# గురుభక్తి

**పూ**ర్వం అరణ్యంలో ధౌమ్యుడు అనే ముని ఆశ్రమం అది, అందులో ఆయన శిష్యులు చాలామంది వేదాలు / ఉపనిషత్తులు అధ్యయనం చేస్తూ ఉండేవారు. అయితే ఆయన శిష్యులలో కొందరు అధ్యయనం తోపాటు గురువు గారికి ఆయన ఆదేశించిన సేవలు కూడా చేస్తూండేవారు. అట్టివారిలో ఉపమన్యుడు , ఇంకా ఇతర శిష్యులు. ఒకరోజున ఈ నేపథ్యంలో వేదఘోష వినబడుతుంటుంది.

* * *

ధౌమ్యుడు : ఉపమన్యూ నీ అధ్యయనం చేసుకున్న తరువాత నీవు మన ఆశ్రమంలోని పశువుల్ని పచ్చిక బీళ్లకు తోలుకుపోయి తీసుకువస్తూండాలి.

ఉపమన్యు : చిత్తం! గురువర్యా-మీ అభీష్టానుసారం అలాగే చేస్తాను.

ధౌమ్యుడు : ధధీచీ ! ధధీచీ!

ఉపమన్యుడు: పిల్చుకువస్తాను స్వామీ

(పోయి పిల్చుకువస్తాడు)

ధధీచి : స్వామీ! ఎందుకు పిల్చారు స్వామీ?

ధౌమ్యుడు : ధధీచీ, నీవు వెళ్లి మన ఆశ్రమానికి కావాలసిన వంట చెరకు ప్రోగుచేసుకుని తీసుకురావాలి.

ధధీచి : అల్లాగే స్వామీ! మరి

ధౌమ్యుడు : ఏమిటో అడగబోతున్నావు. నమో బ్రహ్మణే నమో అగ్న్యగ్నయే నమః పృధివ్యై నమ ఓష దీభ్యంః !

నమో వాచే నమోవాచ స్పతయే నమో విష్ణవే బృహతేకరోమి!!

ఓం శాంతిః శాంతిః శాంతిః

గురువు ధౌమ్యులవారి ఆజ్ఞానుసారం ఉపమన్యుడు ఎప్పటిలాగా ప్రతిరోజూ పశువులను బీళ్లకు తోలుకుపోయి సాయంత్రం ఆశ్రమానికి వస్తాడు. ఆ సమయంలో అక్కడే ఉన్న గురువు గారు

ధౌమ్యుడు : ఉపమన్యూ! పశువుల్నన్నిటినీ తోలుక వచ్చావా నాయనా!

ఉపమన్యు : పశువులన్నిటినీ ఇప్పుడే తోలుకవచ్చి పశువుల శాలలో పెట్టేశాను.

ధౌ : అడగడం మరచాను-పశువులు మేతకు తీసుకు వెడుతున్నావు, ఆశ్రమంలో ఉండవు-మరి నీ మధ్యాహ్నం పూట ఆహారం సంగతి ఏం చేస్తున్నావు నాయనా!

ఉప : స్వామీ! పశువుల మేసే సమయంలో సమీపంలో ఉండే పల్లెలకు పోయి భిక్షమెత్తుకుని లభ్యమైన అన్నం తింటున్నాను.

ధౌ : ఉపమన్యూ! నా అనుమతి లేకుండా దాన్ని ఎలా తింటున్నావు-ఇది తప్పుకాదా నాయనా!

ఉప : అవును స్వామీ! ఇక మీద అలా చేయను స్వామీ!

వీణావాద్యం

(మరుసటి రోజు సాయంత్రం)

ఉప : స్వామీ! ఇదిగో భిక్ష పట్టి తెచ్చిన ఆహారం

ధౌ : ఇలాతే ఉపమన్యూ! ఇక నీవు వెళ్లవచ్చు.

(ఉపమన్యుడు ఆ భిక్షంలో తనకు కొంత ఇస్తే

అది తాను తినవచ్చు అనుకున్నాడు.

కాని గురువుగారు అలా ఇవ్వలేదు. ప్రతిరోజూ భిక్ష ఇస్తూ వచ్చాడు.

(సాయంత్రం పాలు పితుకుతూ)

ఉప : ఆవులను పిండి వేయగా-మిగిలినవి త్రాగి ఆకలి తీర్చుకుంటాను.)

మరోశిష్యుడు: ఏదోవిధంగా ఆకలి తీరాలి కదా

ఉపమన్యు : రేపటికి మరికొంత ఓపిక వస్తుంది.

మరో కొన్ని రోజులైన తరువాత ధౌమ్యుడు. ఉపమన్యుని పిల్చి-

ధౌ : ఉపమన్యూ నీవు పాలు పిండిన తరువాత మిగిలిన పాలను త్రాగుతున్నావటకదూ!



ఉప : చిత్తం స్వామీ ప్రతిరోజూ ఆ మిగిలిన పాలచుక్కలతో ఆకలి తీర్చుకుంటున్నాను.

ధౌ : మిగిలిన పాలనెలా తాగుతున్నావు? ఆవులవద్ద మిగిలిన పాలన్నీ వాటి దూడల సొత్తుకదా దూడలను ఏమార్చి ఆ పాలు త్రాగకూడదు!

ఉప : ఇక నుంచి ఆ మిగిలిన త్రాగను స్వామీ!

(మరికొన్ని రోజుల తరువాత)

ధౌ : ఉపమన్యూ! దూడలు ఆవు వద్ద పాలుతాగగా వాటి మూతులకు అంటిన నురుగు నీవు తీసుకుంటున్నావట-నిజమేనా

ఉప : ఔను స్వామీ! ఆకలి బాధకు ఆ నురుగు తీసుకుంటున్నాను.

ధౌ : ఇక ముందు ఆ నురుగును కూడా తీసుకోకూడదు. నీమీద ప్రేమ కొద్దీ అవి నీకోసం ఎక్కువ నురుగు వదలవచ్చు గదా!

ఉప. : అలాగే స్వామీ-ఇక మీద ఆ నురుగును కూడా ముట్టను. యిలా మరికొన్ని రోజులు సాగిపోయాయి. కాని పాపం! "ఉపమన్యు ఆకలి బాధకు తట్టుకోలేక అక్కడి తోటలలోని ఏవేవో చెట్ల ఆకులు తినసాగాడు ఒకరోజున ఏం జరిగిందంటే-

ఉప : ఈ ఆకులు నా ఆకలిని కాపాడుతున్నాయి. జానెడు పొట్టకు గుప్పెడు ఆకులు చాలు - అయ్యో! ఇదేమిటి ఈ రసం ఆకుల నుంచి కారి నా కళ్లలో పడింది- మంట. కళ్లు మండిపోతున్నాయి.

(కళ్లు నులుముకుంటాడు)

అయ్యో-ఏమిటిది అంతా చీకటి ఏమి కనబడటం లేదేం. నా కళ్లు పోయాయి. ఇప్పుడెలాగ గోవులు తోలుకపోవడం ఎలాగ-గోవులు పరుగెత్తి పోతున్నాయే-దారెటో తెలియటం లేదు! ఎక్కడో పడ్డాను. ఇదేదో ఆగాధం లా ఉందే! గురుదేవా! అమ్మో మాట కూడా రావటం లేదు-ఈ కోనలో పడిపోయాను-నాకు దిక్కెవరు?

(మూలుగుతుంటాడు-ఇలా ఉపమన్యుడు కోనలో పడి అతని దుర్బలత్వం వల్ల తిరిగి పైకి ఎక్కలేక, సహాయం కోసం అరవలేక కిందపడి ఆ దుబ్బుల్లో పడి మూల్గసాగాడు.)

ఆశ్రమ ప్రాంతం. గోవులు ఆశ్రమానికి తిరిగి వచ్చేశాయి.

ధౌ : గౌతమా! ఓయి గౌతమా! ఉపమన్యు రాలేదా నాయనా!

గౌతముడు : ఈరోజు ఇంతవరకూ ఉపమన్యు రాలేదు స్వామీ! ఏమైనాడో స్వామీ గోవులైతే తిరిగి వచ్చేశాయి!

ధౌ : ఏమై ఉంటుంది-బాగా పొద్దుపోయింది.

గౌ : ఔను స్వామీ! నిన్న ఉపమన్యు చాలా నీరసంగా ఉన్నాడు. ఏదో కొన ఊపిరితో మాట్లాడుతున్నాడు స్వామీ!

ధౌ : అలాగా! నడవండి ఈ కాగడా తీసుకుని నా వెంట రండి, ధధీచిని కూడా పిలవండి.

(అంతా కలసి వెతుక్కుంటూ బయల్దేరి వెడతారు. చివరికి ఒక పర్వత కోనలో పడి ఉన్న శిష్యుని మూలుగు వినిపించింది. జరిగినది తెలుసుకుని)-

ధౌ : ఉపమన్యూ! దేవతల వైద్యులైన ఆశ్విని దేవతల్ని ప్రార్థించునాయనా!

ఉప : (హీనస్వరంతో) ఓయి! అశ్వినీ దేవతలారా నన్ను కనికరించి నాకు చూపు ఈయండి. మా గురువుగారి ఆజ్ఞలు సక్రమంగా నిర్వర్తించ లేకపోతున్నాను-

నా మీద దయ ఉంచండి! నాకు శక్తినిచ్చి చూపు ప్రసాదించండి-

(అశ్వినీ దేవతలు అతని సమీపంలో ప్రత్యక్షమౌతారు.)

ధౌ : ఆహా! ఏమిటో ఈ కాంతి! వారే అశ్వనీ దేవతలకు స్వాగతము-

అశ్వనీ : కుమారా! ఉపమన్యూ 'లే నాయనా! నీ కష్టాన్ని గ్రహించాను. ఇవిగో ఈ ఆహారం తిను నాయనా

నీ గుడ్డితనం పోతుంది.



ఉప : హే అశ్వినీ దేవతలారా- మీరు నాయందు దయ ఉంచి ఆహారం ఇచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. కాని దాన్ని నా గురువుగారి అనుమతి లేకుండా నేను తినరాదు స్వామీ! దేవతలు సంతోషించి-

అ.దే : ఉపమన్యూ! నా చేయి ఊతగా లేచి నిలబడు మాతో కూడా రా నాయనా- ఈ ప్రక్కనే మీ గురువుగారు ఉన్నారు నాయనా!

ఉప : గురువర్యా-నమస్కారం గురువర్యా-ఈ మహానుభావులు ఇస్తున్న ఆహారాన్ని మీరు అనుమతిస్తే తీసుకుంటాను స్వామీ!

ధౌ : ఉపమన్యూ! ఆహారం తీసుకో నాయనా!

అ.దేవతలు : ఆహారం తీసుకో నాయినా!

(ఆహారం తింటాడు)

ఉప : ఈ ఆహారం అమృతంలా ఉంది స్వామీ. నా మీద మీకు ఎంత దయ! నాకు మహానుభావులు మా గురువుగారు, అశ్వినీ దేవతలు కనబడుతున్నారు. మీ కందరికీ నా వినమ్రత శీర్షాంజలి స్వామీ

ధౌ : సకల విద్యా ప్రాప్తిరస్తు.

అశ్వ : ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు. తథాస్తు.

*** 8-2-1992**

**A.I.R**

**బాలానందం**

# ‘అష్టావక్ర’ మహాముని

అష్టావక్రుడు ఎనిమిది వంకలు గల శరీరంతో అంటే వంకరైన ముక్కు చేటంత చెవులు, వంకరనడుము (గూని) వంకర కాళ్లు, వంకర చేతులతోను పుట్టాడు. ఇతని శరీరం అష్టవంకరలు తిరిగి ఉన్నందువల్ల ఇతనికి అష్టావక్రుడనే పేరు వచ్చింది.

వేదవేదాంగవిదుడు ఏకపాదుడనే మునీశ్వరుడు, ఇతని తండ్రి, మాతృగర్భస్థుడైవున్న ఈ శిశువుని అతిఘోరంగా ఇతని తండ్రి శపించడంవల్ల ఇతడింతటి వికృతరూపంతో పుట్టడం జరిగింది.

ఏకపాదముని ఆశ్రమానికి చాలామంది మునికుమారులు వచ్చి విద్యాభ్యాసం చేస్తుండేవారు. ఉపనిషత్తులు, వేదవేదాంగాలు, బ్రహ్మసూత్రాలు అధ్యయనం చేస్తుండేవారు. ఒకరోజున తన శిష్యులకు చెప్పే పాఠాన్ని త్వరగా ముగించాలనే ఉద్దేశ్యంతో హడావుడిలో, మునిచెప్పే శ్లోకంలోని కొన్ని చరణాలు తప్పుగా ఉచ్చరించాడాయన. ఆ ప్రక్కగా కూర్చుని పనిచేసుకుంటున్న ఆ మునిభార్య గర్భస్థశిశువు తప్పుగా ఉచ్చరించబడిన ఆ శ్లోకాన్ని విని, ‘తండ్రీ! అధ్యయనసమయంలో తప్పుగా చెబుతున్నావు. ఈ పై చరణాలు ఇలా చదవాలి’ అని వాటిని తిరిగి చదివి వినిపించాడు. సక్రమంగా ఏకపాదుని శిష్యబృందం ఆ ధ్వనిని విని సంభ్రమాశ్చర్య చకితులయ్యారు. ఇంకా పుట్టకముందే, తల్లి గర్భస్థ శిశువు వేదాలను సుస్వరంతో ఉచ్చరించడం విని వారికి ఎంతో విస్మయం కలిగింది.

ఏకపాదమునీశ్వరుని ముఖం కోపంతో జేవురించింది. ఇంకా జన్మించకుండానే తల్లి గర్భంలో ఉన్న శిశువు, అందులో తనకు పుట్టబోయే కొడుకు, తన్నీవిధంగా ఇంతమంది శిష్యుల సమక్షంలో విమర్శించిచెప్పడం అతనికెంతో అవమానంగాను, తలవంపుగాను తోచింది.

ఇంకేముంది, ఏకపాదుడు ఆగ్రహోదగ్రుడై మాతృగర్భంలోని శిశువు నుద్దేశించి ‘అష్టవంకరలుగల శరీరంతో జన్మిం’చమని తీవ్రంగా శాపం విధించాడు.

చిత్రమేమిటంటే ఆ శిశువు జన్మించిన సమయంలో, తండ్రి దగ్గర లేనేలేడు.



మిథిలానగర సార్వభౌముడైన జనకుని సహాయమర్థించడానికి వెళ్లాడు. జనకమహారాజు ఆ సమయంలో ఒక యజ్ఞం చేస్తున్నాడు. వేదాలు, ఉపనిషత్తుల పఠనము, పాండితీ పరీక్షలు ఆ సమయంలో అక్కడ జరుగుతున్నాయి. మహారాజు సాయం అర్థించేముందు ‘వంది’ అనే తన ఆస్థానపండితుడితో ఒకరోజున పాండితీ పరీక్ష జరిగింది. ఈ వాగ్వివాదంలో ఏకపాదుడు పరాభవింపబడి నగరప్రాంతంలో ప్రవహించే ‘సమంగ’ అనే నదిలోకి నెట్టివేయబడి ప్రాణాలుకోల్పోయాడు. ఈ విధంగా ఇంతకు ముందు ఎందరో మహాపండితులు ఓడింపబడి ఆ నదీగర్భంలో కలసిపోయారు. ఏకపాదుడేమయాడో, ఎక్కడున్నాడో అనే సమాచారం మరో పన్నెండేళ్లవరకూ ఎవరూ పట్టించుకోనేలేదు. ఎవరికీ తెలియనేలేదు.

ఏకపాదమహాముని గురువుగారు ఉద్దాలకమహర్షి. ఏకపాదునికి మామగారు కూడా. ఏకపాదుని మరణవార్త విని తన కూతురు సుజాతనూ, మనవడైన అష్టావక్రుణ్ణి తీసుకువెళ్లి తన వద్ద వారికి ఆశ్రయమిచ్చాడు. సమానవయస్కుడైన ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు. వీరిద్దరికీ సమస్తవిద్యలూ నేర్పుతూ వచ్చాడు ఉద్దాలకుడు. ఉద్దాలకమహర్షే తన తండ్రియని ఇంతకాలం అనుకుంటూ పెరిగాడు. అక్కడి శిష్యవర్గములోని వారెవరూ కూడా ఉద్దాలకుడు తన తండ్రికాదనీ, తాను తండ్రిలేని బిడ్డడనీ నిజం చెప్పడానికి వారూ సాహసింపలేదు.

ఒకరోజు అష్టావక్రుడు తన తాతగారి తొడమీద కూర్చొని వేదపాఠాలు వల్లెవేస్తున్నాడు. అప్పుడు అక్కడికి వచ్చి, అదిచూచిన శ్వేతకేతువు సహించలేక కోపంతో, ‘నా తండ్రి తొడమీద కూర్చోడానికి నీకు హక్కులేదు. మీ తండ్రివద్దకు పో’ అన్నాడు. ‘ఏందుకు లేదూ? నాకూ హక్కు వుంది. ఆయన నాకు మాత్రం తండ్రికాడా?’ అన్నాడు అష్టావక్రుడు. ‘ఆయన నీకు తండ్రికాదు’ అన్నాడు శ్వేతకేతువు. అష్టావక్రుడు ఉద్దాలకుని వైపు చూస్తూ ‘నేను నీకుమారునికానా’ అని ఎంతో ఆదుర్దాతో ప్రశ్నించాడు.. ‘కాదు నాయనా! నీవు...’ అని అంటూండగానే అష్టావక్రుడు ఇంక అక్కడ ఒకక్షణంకూడా ఆగలేదు. హుటాహుటిన తన తల్లివద్దకు వెళ్లి ‘అమ్మా, నాతండ్రి ఎవరు? ఆయన ఎక్కడ ఉన్నారు?’ అన్నాడు ఎంతో ఉద్వేగంతో. మాతృమూర్తి సుజాతకు ఇక తన కుమారుడికి నిజం చెప్పడంకంటే వేరే గత్యంతరం లేకపోయింది. తన తల్లిద్వారా ఇది వరకు జరిగిన సంగతి అంతా సావధానంగా విని ‘అమ్మా ఇక

నీవు విచారించవద్దు. త్వరలోనే నేను మా నాన్నగార్ని తీసుకువస్తాను' అన్నాడు ధైర్యంగా.

నీవు తీసుకురాలేవు నాయనా! నీతండ్రి మళ్లీ ఎలావస్తారు? అసంభవం అంది సుజాత. 'నేను నా తండ్రిని తప్పకతీసుకు వస్తాను. ఆ సార్వభౌముని ఆస్థానవిద్వాంసుడైన వందిని జయించి ఆ నదీ దేవతకు అర్పిస్తాను' అన్నాడు.

అష్టావక్రుని సరిగా చూడనందుకు శ్వేతకేతువు చాలా బాధపడ్డాడు. అష్టావక్రా! నన్ను క్షమించు అని చేతులుపట్టుకుని వేడుకున్నాడు. మరేమీ ఫరవాలేదు అన్నాడు అష్టావక్రుడు. నీవు నిజం చెప్పి నాకు మేలే చేశావు. ఇప్పుడు నేనొక పథకం వేశాను. నీవు నాతో సహకరించాలి అన్నాడు. ఏమిటా పథకం? అన్నాడు శ్వేతకేతువు. మనం మిథిలానగరం వెళ్ళి జనకమహారాజుగార్ని చూడాలి. నీవూ నాతో వస్తావా? అన్నాడు అష్టావక్రుడు. 'అక్కడికెందుకు వెళ్లాలనుకుంటున్నావు. మీ నాన్నగారు అక్కడ లేరు. ఆస్థాన పండితుడు వంది మీ తండ్రిని నదిలోకి త్రోసివేసి పన్నెండేళ్లయింది. అప్పటికి నీవింకా పుట్టనేలేదు' అన్నాడు శ్వేతకేతు.

అష్టావక్ర : ఆస్థానపండితుడైన ఆ వందిని ఒకసారి దర్శనం చేసుకోవాలి, పైగా జనకమహారాజు ఇపుడు ఒక యజ్ఞం చేస్తున్నారు. యజ్ఞవిశేసాలన్నీ కూడ చూడవచ్చు.

శ్వేతకేతు: నీ ఆలోచన బాగుంది. మనమక్కడి యజ్ఞహెూమాదుల్ని చూచి సంతోషంగా గడపవచ్చును.

అష్టావక్ర: వేదవేదాంగాది శాస్త్రాలను జనకమహారాజు సమక్షంలో పఠించవచ్చు. మన పాండిత్యాన్ని ప్రదర్శించనూ వచ్చు. ఆయన మెచ్చుకుంటే ఆ పారితోషికాలను బహుమతులను అన్నిటినీ తాతగారికి తీసుకువచ్చి సమర్పించవచ్చును.

శ్వేతకేతు: నాన్నగారు చాలా సంతోషిస్తారు. జనకమహారాజంటే ఆయనకెంతో ప్రీతి.

అష్టావక్ర: అయితే అక్కడికి వెడదాం త్వరగా నడు.

మరుసటి రోజున అష్టావక్ర, శ్వేతకేతువులు బయల్దేరి కొద్ది రోజులలో మిథిల చేరుకున్నారు. వారు ఉదయం నుంచీ మిథిలానగర రాజవీధిలో విశేషాలు చూస్తూ



పోతున్నారు. సరిగా అదే సమయానికి జనకమహారాజు నగర సంచారం చేస్తూ అటే రాసాగారు. రాజభటులు అష్టావక్రుణ్ణీ, శ్వేతకేతువునీ దారివిడిచి వెళ్లండని కేకలు వేస్తున్నారు. ఇంతలో ఓ రాజభటుడు అటువైపు నడుస్తున్న అష్టావక్రుడిని చూచి;

రాజభటుడు: ఓయ్! వంకరటింకర కుర్రాడా! మహారాజుగారు వచ్చే సమయమైందని తెలియదా? త్వరగా అవతలవైపుకి దాటిపో.

అష్టావక్ర: ఈ రాజమార్గంలో నడిచేందుకు రాజావారికెంత హక్కు ఉందో మాకూ అంతే వుంది.

రాజభటుడ: ఏమంటున్నావు? మాకు సమాధానం చెప్పేంతటి ధైర్యం ఉందా నీకు?

అష్టావక్ర: ఇందాకన్నదే మళ్లీ అంటున్నాను. రాజమార్గంలో నడిచే అధికారం రాజుగారికి మళ్లే మాకూ ఉంది.

అదే సమయంలో మహారాజుగారు అక్కడికి రావడము, ఆ కుర్రవానితో ఎందుకు వాదిస్తున్నారని ప్రశ్నించడము జరిగింది.

మహారాజు: ఎవరీ కుర్రవాళ్లు?

అష్టావక్ర: అయ్యా, మీరాజభటులు మమ్మల్ని రాజమార్గంలో నడవనీయటంలేదు.

మహారాజు: మీరెందుకు అలా అనుకుంటున్నారు?

అష్టావక్ర: ముందు గ్రుడ్డివాళ్లు, తరువాత కుంటి, పిమ్మట స్త్రీలు. అటుతర్వాత ఎక్కువ బరువుమోసే కార్మికులు; తరువాతనే రాజుగారు నడవాలి. అయితే ఇంతలో ఓ బ్రాహ్మణుడు రావడం తటస్థిస్తే ఆ బ్రాహ్మణుడు రాజుగారి కంటే ముందుగా పోవచ్చు. ఈ విధంగా శాస్త్రాలు చెబుతున్నాయి. మేము బ్రాహ్మణులం...

రాజుగారు ఈ మాటలు విని అతన్ని మెచ్చుకుంటూ–

మహారాజు: ఇంతకీ నీవెవరు? అతనెవరు చెప్పు నాయనా–

వాళ్ళు తామెవరో ముందు చెప్పకుండా–

అష్టావక్ర: అయ్యా ఇక్కడ జరిగే యజ్ఞాన్ని చూడటానికి వచ్చాము. వేదపండితుల పాండితీ ప్రకర్షను చూడడానికి వచ్చాము, మహారాజా!

మహారాజు: వేదపండిత సభలు, ఆ వాదనలు, అవన్నీ పెద్దపెద్ద పండితులక్కి, ఆ వేదచర్చలు మీకే అర్థం అవవు.

అష్టావక్ర: మాకు బాగా అర్థమవుతాయి. మహావేదపండితుడు, ఆస్థానవిద్వాంసుడు అయిన ఆ వంది మహాశయులను చూడాలని ఉంది.

మహారాజు: వంది పండితుడు నీలాంటి కుర్రాళ్లతో మాట్లాడడు. పైగా ఆయన వేదచర్చలు జరిగేప్పుడు మీలాంటి పిల్లలకు అక్కడకు ప్రవేశమే నిరాకరిస్తారు.

అష్టావక్ర: నేను ఆ వందిమహాపండితునితో వేదచర్చలు జరపాలని ఉత్సాహపడుతున్నాను.

మహారాజు: ఏమిటి? వంది పండితునితో చర్చించడం అంత సులభమైన విషయం కాదు. అతనిముందు నీవెంత? నీవు కన్నుతెరిచేలోపలనే నిన్ను తృటిలో ఇక్కడి నదీమతల్లికి ఆహుతి చేయగలడు.

అష్టావక్ర: (ముకుళితహస్తాలతో) నాకు చిన్న అవకాశం ఇవ్వకుండానే ముందు జరిగేది నిర్ణయించి చెప్పడం మహారాజుగార్కి న్యాయమేనా? నేను గనుక ఓడిపోతే తత్పర్యవసానమేమిటో నాకు పూర్తిగా తెలుసు ప్రభూ!

మహారాజు: నీవు వయసులో చాలా చిన్నవాడివి, నీ శరీరము...

అష్టావక్ర: నా శక్తి నాకు తెలుసు. నా శరీరమే అష్టావక్రంగా ఏర్పడి ఉంది. అయినా పాండిత్యానికీ వయసుకీ సంబంధం ఏమిటి? వయసులో పెద్దవాళ్లందరూ మేధావులేనా? ప్రతికుర్రవాడూ మూఢుడూ, మందబుద్ధీ అవుతాడా?

మహారాజు: నీవు పెద్దవాడవు కాదుగదా? నీవు చిరుతవయసులో ఉన్న బాలకుడివి.

అష్టావక్ర : నా వయసుతో పనేమిటి? మహాపండితుడైన వందితో నేను వాదప్రతివాదము చేయగలను. నన్ను ప్రయత్నించనీయండి ప్రభూ!

మహారాజు బాలకుని ముఖంలోకి చూశారు. ఆ కుర్రవాడేదో గర్వంగా మాట్లాడుతున్నట్లు కనబడలేదు.

మహారాజు: అయితే-ముందు నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను.

అష్టావక్ర: నేను సిద్ధంగా ఉన్నాను ప్రభూ.



జనకమహారాజు తన దృక్పథంలో మెదిలే అతిక్లిష్టమైన ప్రశ్నలు కురిపించారు. వాటన్నింటికీ అష్టావక్రుడు సునాయాసంగా బదులుచెప్పేశాడు. అతని పాండిత్యప్రపత్తికి మహారాజుగారికి ఎంతో ఆశ్చర్యం కలిగింది.

మహారాజు: చిన్న కుర్రవాడివైనా నీవు మానవమాత్రుడివి కాదు. అనన్యసామాన్య ప్రజ్ఞావంతుడివిలా ఉన్నావు. నీ వెవరు? నీ పేరేమిటి?

అష్టావక్ర: ఏకపాద మునీంద్రుని కుమారుణ్ణి-నా పేరు అష్టావక్రుడు.

మహారాజు: మంచిది, అయితే పండితుడైన వందిని కలుసుకుని నీ పాండిత్య ప్రకర్షని ప్రదర్శించు, చూద్దాం!

వంది విద్వాంసుడు అష్టావక్రుణ్ణి చూచి మహారాజా వారు దారితప్పి ఈ గూనిబాలకునికి అవకాశం ఎందుకిచ్చారా అనుకున్నాడు.

కాని ఆస్థానపండితుడైన వంది మహాశయుడు వేసిన ప్రశ్నలు అన్నింటికి సునాయసంగా బదులు చెప్పేశాడు. కాని అష్టావక్రుడు వేసిన ప్రశ్నలకు వంది పండితుడు ఉక్కిరిబిక్కిరైపోయాడు. ప్రతిప్రశ్న శరపరంపరలాగ అమ్ములపొదిలోనుంచి యుద్ధభూమిలో దూసుకువచ్చినట్లు సంధించాడు అష్టావక్రుడు. సభికులందరూ నిర్విణ్ణులైపోయారు. ఇటువంటి దృశ్యమెప్పుడూ ఇదివరకు వాళ్లు తిలకించనే లేదు. బాలుడు వేసిన ప్రతిప్రశ్న వందిని వేధించసాగింది. మొదటి ప్రశ్నతోనే ప్రత్యర్థులను ఓడించడానికి అలవాటుపడ్డ వంది మహాశయుడు వేదవేదాంగాదులలోని అతిక్లిష్టమైన సమస్యల పరిజ్ఞానము మరచిపోయాడు; స్మృతి, శృతులతోటి పరిజ్ఞానము కొంచం మరుగైపోయింది. అష్టావక్రుడు వేసిన ప్రశ్నలకు సమాధానం దొరకటం లేదు. చివరికి వాదనలో ఘోరపరాజయం పొందాడు. సభ్యులందరూ పెద్ద పెట్టున హర్షధ్వానాలు చేశారు. ఎవరో ఒక చిన్న బాలకుడు వచ్చి ఇంతటి మహావిద్వాంసుణ్ణి సునాయాసంగా తృణీకరించడం వారికెంతో విడ్డూరమనిపించింది.

జనకమహారాజు చివరికి-వంది మహాపండితునికి ఇవ్వవలసిన శిక్ష ఏమిటి? అని తీవ్రకంఠంతో గర్జించారు.

ఈ పండితుడు పరాజయం పొందుతాడని ఎవరూ ఊహించలేదు. అందులోనూ పన్నెండేళ్ల కుర్రవాడి చేతిలోనా!

అష్టావక్ర: మా తండ్రినీ, ఇతర మహావిద్వాంసుల్నీ పారేసినట్లు, నదిలో త్రోసివేసినట్లు వంది విద్వాంసుణ్ణి కూడా ఈ నదిలో పారేయండి.

ఆ తీర్పువిని వంది ముఖంలో ఏదో సన్నని చిరునవ్వు గోచరించింది.

వంది: ఈ శిక్షతో నాకేంభయం లేదు. నేను వరుణదేవుని కుమారుణ్ణి-నా నివాసమెప్పుడూ నీటిలోనే.

అష్టావక్ర: మిగతా పండితులందరూ కూడా అక్కడేనా?

వంది: వాళ్ళందరూ తిరిగి వస్తారు. వారిలో ఎవరూ చనిపోలేదు.

మహారాజు: ఏమిటీ వింత! ఎవరూ మరణించలేదా?

వంది: లేదు ప్రభూ! నేను వారిని నదిలోకి త్రోసిన వెంటనే మా తండ్రిగారి దూతలు, వారినందరినీ మా పితృదేవుల రాజసౌధానికి తీసుకొనివెళ్ళారు. మా తండ్రి కూడా ఇప్పుడొక మహాయజ్ఞం జరిపిస్తున్నారు. నదిలో త్రోసివేయబడిన మహావిద్వాంసులందరూ ఆ యజ్ఞంలో వారికి సాయపడుతున్నారు ప్రభూ! ఇపుడా యజ్ఞం అయిపోయింది. మా తండ్రి ఇక ఇప్పుడీ విద్వాంసులనందరినీ తానే పంపించివేస్తారు.

ఈ మాటలు ఉచ్చరించిన వెంటనే ఆ నదిలో నుంచి ఏకపాదమునీంద్రుడు, అతనితోపాటు మిగతా విద్వాంసులందరూ నది నుంచి లేచి నడచివచ్చారు.

ఇది వరకెప్పుడూ చూడని తన తండ్రిని చూచి అష్టావక్రుడు ఆయన పాదములమీద వాలి సాష్టాంగనమస్కారం చేశాడు. మునీంద్రుడు తన కొడుకుని లేవనెత్తి కౌగలించుకొన్నాడు. అష్టావక్రా! ఈ నదిలో స్నానంచేసి రా నాయనా! అని ఏకపాదముని ఆజ్ఞాపించాడు. వెంటనే అష్టావక్రుడు నదిలో మునిగి లేచాడు. అష్టవంకరలతో ఉన్న తన గూనిశరీరం మాయమైపోయింది. కుంటితనమూ అంతరించింది. అయినా అతని పేరు అష్టావక్రుడనే సార్థకమైపోయింది.

తండ్రితోపాటు అష్టావక్రుడు, శ్వేతకేతువు అక్కడి మహారాజుల, ఇతరపండితుల శెలవు తీసుకొని తమ ఆశ్రమానికి చేరుకుని అక్కడివారినందరినీ ఆశ్చర్యచకితుల్ని చేశారు.

*** 19-01-1986**

**'సుపథ' సాంస్కృతిక మాసపత్రిక**



కథలు

# సంగంవారి వీధి

**ఆ** వూళ్లో చంగల్రావ్ హొటలుకు వచ్చే జనం ముచ్చటించని సంగతంటూ లేదు. దైనందిన వ్యవహారాలనుంచి, కాంగ్రెసు ఎలక్షనులు బ్లాకు మార్కెటు, సమ్మెలు-అబ్బో ఒక టేమిటి సమస్త సంగతుల గురించి ప్రస్తావించడం పరిపాటి. వూళ్లో ఏదైనా చావు సంభవిస్తే ఆ ప్రస్తావం అక్కడే.

పెళ్లిళ్లు, పేరంటాలు జరిగితే వాటి వార్తలు అక్కడకు వెంటనే జేరుకుంటాయి కదా. కోర్టులో ఏదైనా మంచి కేసు విచారణకు వస్తే దాని ఫలితాలను గురించి ఇక్కడ చర్చ జరిగి తీరుతుంది గదా. బళ్లో మాష్టారుగారు ఎవరినైనా నుంచోబెట్టారంటే ఆ విషయం అక్కడ చర్చించుకోవలసిందే గదా. ఆరోజు సంతలో మిరపకాయ ధర హెచ్చిందంటే దానిని గురించి అక్కడ ప్రస్తావన జరగవలసిందే. ఇలాగా చిత్రవిచిత్రంగా సాగిపోతుంటాయి సంభాషణలు. చెంగల్రావు కూడా ఏతత్ సంభాషణల మధ్య తనకు తోచినట్టు ఒక్క ముక్క విసురుతూండడం పరిపాటి.

చంగల్రావు కొట్టుకు అనుదినమూ హాజరు వేసుకునే వాండ్లలో-ఆ ప్రక్క ఫ్యాక్టరీ ఫోర్మెన ఒకడూ, అగ్రహారంలో వుండే శాస్త్రుల వారొకరూ, గవర్నమెంటు గ్రాంటు ఇచ్చిన ఎయిడెడ్ స్కూలు అయ్యవారు, అయ్యవారమ్మానూ, ఒక ఇన్స్యూరెన్స్ ఏజంటు ఒకాయన. వీళ్లు హాజరు కావలసిందే. అలా వర్షం కురవనీయండి-ఇలా ఎండలు ముదిరి గాడ్పులు వేయనీయండి-ఏదో ఒక సమయంలో హాజరు వేసుకుని పిచ్చపాటి మాట్లాడుకొని పోతుంటారు.

తరచు సుబ్బన్న కూడా ఆ దుకాణంకు రావడం కద్దు. మోతుబరి సుబ్బన్నంటే ఆ వూళ్ళో చాలమందికి తెలుసు. ఘరానామనిషి. నిత్యమూ ఇతని కూడా ఇద్దరో ముగ్గరో తోకల్లా తిరుగుతూనే వుంటారు. తన మాటకు అడ్డం వస్తే సహించే ఘటం కాదు. వాడితోపాటే వాడి అనుచరులు కూడా ఒకే మాట. అతనితో ఘర్షణ పడితే ఏం విపత్తు సంభవిస్తుందోనని సౌమ్యంగా పోతుంటాడు చెంగల్రావు. ఎందుకంటే వెనుక ఒకటి రెండుసార్లు అక్కడ కొట్లాటలు కూడా జరిగి తలలు పగులగొట్టుకునేంత

పని జరిగింది. అందులో మోతుబరి సుబ్బన్నతో చేయి చేసుకుంటే ఆ రోజు నెత్తురు చూశారన్నమాటే.

యథావిధిగా ఫ్యాక్టరీ ఫోర్మను పోతూ పోతూ తమ మామూలుగా కూర్చొనే బల్లమీద కూర్చుని ఇంత కారపప్పుస తింటున్నాడు పెట్టించుకొని. గ్రాంటు స్కూలు బడిపంతులు, అయ్యవారమ్మ బడి తలుపు బిగించుకొని రవంత యేమైనా తినిపోదామని చంగల్రావు దుకాణానికి చక్కావచ్చి ఫ్యాక్టరీ ఫోర్మసు ఎదురుగుండా ఉన్న బల్లమీద కూర్చుని చెరొక ప్లేటు బూంది తినసాగారు.

ఫ్యాక్టరీ ఫోర్మను యుద్ధం నుంచి తిరిగి వచ్చిన వ్యక్తి. లావుగా పొట్టిగా ఉంటాడు. పిల్లికళ్లు. జుట్టు ఎప్పుడూ ముందరకు నుదిటి మీదకు వస్తుంటే పదేపదే వెనక్కు తీసుకుంటాడు. ఇన్స్యూరెన్సు కంపెనీ ఏజంటు బక్క పలచగా పొడుగ్గా ఉంటాడు. ఇతగాడు 24 ఘంటలూ సైకిలుమీదే తిరుగుతూంటాడు. ఓ పది నిమిషాలు తీరిక చిక్కిందంటే చెంగల్రావు కొట్టులో ఉండి తీరవలసిందే. ఇహ పోతే అయ్యవారూ, అయ్యవారమ్మది బలే అదృష్టం. వీళ్లది అసలు దానవాయి పేటలో మకాం. మాలవాడంతా వీళ్ళంటే విపరీతమైన గురి. ఇద్దరూ గూడా ట్రైనింగ్ అయినారేమో చెరో 50 రూపాయలు సంపాదించుకుంటున్నారు. ఇప్పుడంటే ఉద్యోగాలు సంపాదించుకుంటున్నారు, ఇప్పుడంటే ఉద్యోగాలు సంపాదించారుగాని, వెనుక వీళ్ళ తాత ముత్తాతలు పురపాలక సంఘంలో వీధులు ఊడ్చి తమ పొట్టలను వెళ్ళబోసుకునేవారు. కాని నేటి గాంధియుగంలో 'మాల' అనే పదం పోయి దాని స్థానంలోనే హరిజన అనే పేరు రావడంతోటే పరిస్థితులన్నీ తారుమారై పోయాయి.

ఇంతకీ విషయ మేమిటంటే ప్రక్కన రెండు ఫర్లాంగుల దూరంలో ఉన్న దూపాటివారి వీధిలో బ్రాహ్మణ దొడ్డమ్మగారు ఆ క్రితంరోజు పోయారట. 60 ఏండ్లుంటాయట.

ఫోర్మన్ : పాపం చాలా ధర్మాత్మురాలట. అనేక ధర్మాలు కూడా చేసిందిట.

ఏజంటు : ఆమె ఎవరినో పెంచుకుందట, అతను తాలూకాఫీసులో పనిచేస్తున్నాడట. ఆ లోగిలీ 4 ఎకరాలు భూమి అతగాడికి వ్రాసి ఇచ్చేసిందిట.

అయ్యవారమ్మ: ఏం జబ్బుటండీ. పాపం హఠాత్తుగా పోయిందట?



ఫో : గుండె జబ్బుట. అందులో ఈ గుండె జబ్బు చాలా విపరీతమైనటువంటిది. మాట్లాడుతూనే ప్రాణం పోవడం, పడుకుని తెల్లవారేసరికల్లా హంస లేచిపోవడం, స్నానం చేస్తూనే హరీ అంటూండడం' ఈలోగా కర్ణకఠోరంగా వుంటూంటాయి; ఈ గుండె జబ్బు కేసులు.

అయ్యవారు : ఏ వీధిలో నండీ ఆమె నివసిస్తున్నది?

ఇ.ఏ : ఏ వీధేమిటి- (ఇక్కడే దగ్గరలోనే) దూపాటివారి వీధి - అంటే...

ఫో : అంటే ఆ పెద్ద రావిచెట్టు ఉన్నది కదా-

ఏ : అది కాదయ్యా. అది సగం వారి వీధి, ఎక్కడో చర్చిదగ్గర ఉన్నదాన్ని తీసుకువచ్చి ఇక్కడ ఇరికిస్తావేంటి?

ఫోర్మను: సంగం వారి వీధిలోనూ రావిచెట్టు లేదనుకున్నారా?

ఏ : ఉంది. నేనన్నది పెద్ద రావిచెట్టు. సంగం వారివీధిలో ఉన్నది దీనికంటె చిన్నది.

అయ్య : ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుంది నీకు తెలుసా?

అయ్యవారమ్మ: సంగం వారి వీధే తెలియదట. నే బళ్లో చదువుకునే రోజుల్లో మా అమ్మ నిత్యమూ ఈ వీధిలో కమ్మవారింటికి ఏదో పనిమీద వస్తూండేది.

అ : అచ్చు ఆఫీసు వుండే దాని ప్రక్క వీధే. 'ఇంతకీ' ఫ్యాక్టరీ ఫోర్మను కళ్లు చిట్లించుకొంటూ గొంతుక సవరించుకొంటూ 'సంగంవారి వీధినే అష్టవంకర్లవీధి అంటారు. అసలు కోణంగిపేటలోంచి వచ్చే వీధి సంగం వారి వీధిలో కలుస్తుంది.'

అయ్య : అబ్బే. ఎక్కడ కోణంగిపేట ఎక్కడ సంగంవారి వీధి? సంగం వారి వీధి మన పాత సినిమా ఉంది దాని వెనకాల వీధి. దాని ఉత్తరం వైపున చర్చి కూడా ఉంది. అంతేకాని ఈ ఫోర్మను గారికి అసలు-

ఫోర్మను : అందుకుని-నాకు తెలుసండీ. అబ్బ. సంగం వారి వీధి ఎక్కడుందో నాకు తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదు.

ఇ.ఏ : అబ్బే. బ్రాహ్మణపేటకు ఐ మూలగా రైలుగేటుకు ఇవతల ఉందండీ. ఏమిటో నాకు తెలియనట్లు మీరు వాదిస్తారు.

అయ్యవారమ్మ: (చేతులు కడుక్కుంటూ) అబ్బ ఏమిటీ గొడవ. ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు.

ఇంతలో చెంగల్రావు లోపల నుంచి వచ్చి-సంగం వారి వీధిని గురించేనా మీరు అనుకొనేది. నా చిన్నతనంలో మా ముసలమ్మవాళ్లు ఆ వీధిలోనే కాపురం ఉండేవాళ్లట. మా తండ్రికి ఋణం ఉండడం చేత ఇల్లూ వాకిలీ వాళ్ల పరమైపోయింది. లేకపోతే నాకీ అద్దెకొంపే మొచ్చె. అది అచ్చాఫీసుకు తూర్పువైపున ఉంది.

అగ్రహారంలోని ముసలాయన ఎప్పుడు వచ్చాడో వచ్చి, తాము మామూలుగా కూర్చునే చోటునుంచి ఈ సంభాషణ వింటున్నాడు. అయినా సంగంవారి వీధి ఎక్కడుంటే తనకేం గావాలి, ముందు తన పొట్ట నిండాలి గాని-ఈ విధంగా సంగం వారి వీధి ఉత్తరంవైపున ఉందని ఒకరూ, చెర్చికి వెనుకభాగంలో ఉందని మరొకరూ, అచ్చు ఆఫీసు వెనకాల ఉందని వేరొకరూ ఇలాగా వాళ్ళు అనేక విధాలుగా తర్కించుకొంటూ ఇంకా నిర్ధారణకు వచ్చేలోపున సుబ్బన్నా మరో యిద్దరు వ్యక్తులు లోపలికి వచ్చి వీరందరికి కుడివైపున కూర్చొని యిన్ని వేడిపకోడీలు ఆర్డరిచ్చారు.

ఇన్సూరెన్స ఏజంటు సుబ్బన్నను చూచి 'యిదుగో పాతకాపు సుబ్బన్న వచ్చాడు. ఇతనికి తెలియందేముంది గనుక. యేమోయ్ సుబ్బన్నా సంగం వారివీధి ఎక్కడుందో చెప్పు.'

సు. : సంగం వారి వీధే తెలియదూ పిచ్చోడా? నాకు బాగా తెలుసు. ఎందుకంటే మా అత్తగారు వెనుక జబ్బుచేసి ఆ వీధిలోనే పోయింది. కాలవకు దక్షిణంగా ఉంది. ఆ వీధిలోనుంచే రైలు గేటుకూడా కనిపిస్తుంటుంది. ఇంతవరకూ ఆ ప్రసంగంలో జోక్యం కల్పించుకోని ముసలాయన లేచి అబ్బే మీరంతా చెప్పినది అసలే తప్పు. క్రైస్తవుల దేవాలయానికి ఆనుకుని ఉన్న వీధే సంగంవారి వీధి.

సుబ్బన్న : మహా చెప్పావు లేవయ్యా, పొడుగాటి ముక్కూ నువ్వూను. నే నెక్కడుందో చెప్పానుగా. మళ్లీ నువ్వు అది కాదంటావేటయ్యా. అయినా ముసిలోడవ్ నీకెందుకు ఈ గొడవ. నీవు నీ పొడుంకాయేమిటో నీ వేమిటో అంతేకాని-



ఘోర్మను : అయితే నే చెప్పింది తప్పంటారా. భలేవాళ్లు! అసలు సంగంవారి వీధికే అష్టవంకర్లవీధి అని పేరు. కోణంగి పేటలోంచి అచ్చు ఆఫీసువద్ద కలిసేదే అంటే మీకు నమ్మకం.

మో.సు : నీవు చెప్పిందల్లా నమ్మాలి అని ఉందా ఏమిటి? సంగమోరి వీధిని గురించి నీకేం తెలుసు. నిన్న గాక మొన్నటి వరకూ యుద్ధంలో ఏడుస్తూ-

ఘో : ఫలానాచోటున ఉందని తెలపడానికి నాకు స్వాతంత్ర్యం ఉంది. మధ్య నువ్వేమిటి? ఏడుపూ గీడుపూ రానీయకు. మాటలు సరిగా రానియ్యి ఏమనుకున్నావో.

సు : ప్రతీదీ నీకు తెలుసునని వాదిస్తావేమిటి? మహా తెలిసినట్టు. ఏంజేస్తావేమిటి? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకుని మరీ మాట్లాడు. అట్టే మాట్లాడితే...

ఏ : అట్లే మాట్లాడితే ఏం జేస్తావేమిటి? ఘోర్మను ఒక్కడే అనుకుంటున్నావేమో. మీద చెయ్యిపడితే ఊరుకునేది లేదు. జాగ్రత్త అన్నాడు.

అసలు దెబ్బలాట ఆగిపోను గాని ఇంతలోకి

అయ్యవారమ్మ: ప్రతీదీ వీళ్లకు తెలుసుననుకుంటారు. ఈ సుబ్బన్న మరీని. అబ్బ! ఇంతటి మొండివాణ్ని ఎక్కడా చూడలేదు.

సుబ్బన్న వళ్లు వేడెక్కి ఘోర్మనూ, సుబ్బన్నా కొట్టుకోవడం ప్రారంభించారు. గ్లాసులు విసిరేసుకున్నారు. ప్రక్కనే ముసిలాయన కర్రపెట్టుకుంటే అది ఊడబెరుక్కుని వీపుమీద వేశాడు సుబ్బన్న. ఘోర్మను కుర్చీ పైకెత్తి విసిరాడు, దెబ్బతప్పించుకుని, ఇటువైపుకు వచ్చి ఒక తాపు తన్నాడు సుబ్బన్న. ఆ దెబ్బతో ఘోర్మను వెనక్కువెళ్ళి గుమ్మం నుదుటికి తగిలి రక్తం ప్రవహించసాగింది. సుబ్బన్నతో ఉన్న తతిమ్మా ఇద్దరూ అయ్యవారినీ, అయ్యవారమ్మనీ కర్రతో నాలుగుతికి ఒక్కతోపు తోశారు. అయ్యవారమ్మకు దెబ్బతగిలి పడిపోయింది. ఆ పడడంలో గ్లాసుమీద పడిందేమో బద్దలయిన గ్లాసు అంచు తగిలి మోచెయ్యి గీసుకుపోయింది.

తన లొంగుబాటులోకి తీసుకురాలేక చంగ్రావ్ వీధిలోకి పోయి వారినీ వీరినీ కేకలు పెట్టడం ప్రారంభించాడు. ఈ కొట్లాట తృటికాలంలో జరిగిపోయింది. ఆ గలాభా ఈ కేకలు విని బీటుతిరుగుతున్న పోలీసు కానిస్టేబులొకడు అక్కడకు వచ్చాడు. కాని ఈలోగా సుబ్బన్నా-వాడి అనుచరులు అక్కడి నుండి దాటుకున్నారు. దెబ్బలుతిన్న వాండ్లకు నెత్తురు కారుతుంటె ఖంగారెత్తి చూడలేక మ్యునిసిపలు ఆసుపత్రికి తీసుకొనిపోయి వాండ్లకు కట్టుకట్టించడం నిమిత్తం చంగ్రావు ప్రక్కనే ఉన్న బండిని పిలవడానికి వెళ్లాడు. ఇంతలో ఈ కొట్లాట విషయం పొక్కి జనం గుమిగూడి చివరికి సబ్ ఇన్‌స్పెక్టరూ సిబ్బందీ తయారైనారు. జరిగిన సంగతంతా చంగ్రావు వద్ద నుంచి సంజాయిషీ తీసుకున్నారు. అక్కడ వున్న అందరిస్టేట్ మెంట్లు పుచ్చుకొన్నారు. వాండ్లను ఆస్పత్రికి తగిన చికిత్సకై పంపించారు.

మూడు రోజులపాటు ఈ వీధేమిటి-ఆ వీధేమిటి ఊరూవాడా గాలించేశారు సుబ్బన్న కోసం. ఈ సందట్లో ఆ రాత్రి మరి ఎలా అంటుకుందో ప్రక్కనే ఉన్న హార్మోనీ కొట్టు అంటుకుని కొన్ని వందల రూపాల నష్టమైపోయింది. కొట్టులో హార్మోనీలు, ఒకటి రెండు మంచి వీణలు, ఇతర సామానులు అన్నీ భస్మమైపోయాయట. వాకబు చేయగా తెలిసిందేమిటంటే అది ఫోర్మను స్వంత అన్నగారి కొట్టు అనీ, ఫోర్మనుపై కోపం చేత సుబ్బన్న ఆ రాత్రే అందినమటుక్కి డబ్బు తీసుకొని ఆ కొట్టుకు నిప్పంటించి తగలబెట్టాడని చెబుతారు.

## 2

దొమ్మీకేసు కోర్టుకు ఎక్కి మేజిస్ట్రేటు సదాశివరావు గారి ఎదుట విచారణకు వచ్చింది. దొమ్మీ కేసును గురించీ, అందుకు సంబంధించిన వ్యక్తుల వాంగ్మూలాలను గురించి ఇతర పరిశీలనలను గురించి కొంతసేపు చర్చ జరిగింది. పిమ్మట దొమ్మీ జరిగిన రోజున కాఫీహొటలులో మొట్టమొదట ఈ దొమ్మీ ఏవిధంగా ఆరంభించినదీ దాని విచారణ జరుగుతోంది.



లా చదివిన ధర్మారావు అదివరకే కోర్టులో మాంచి పేరు సంపాదించుకున్నాడు. క్రాస్ ఎగ్జామిన్ చేయడంలో అతడి కతడే సాటి. అతని విచారణలో చాలా కేసులు చిక్కువిడి తీర్పుకు వచ్చాయి.

ధర్మా : సంఘటన జరిగిన సాయంత్రం నీవు అయ్యవారూ, ఆ ఫ్యాక్టరీ ఫోర్మనూ హొటలు యజమాని చంగ్రావు-ఇంకా ఎవరో ముసలాయన టిఫిను పుచ్చుకుంటూ అక్కడ వున్నారట నిజమేనా?

అయ్యవారమ్మ: నిజమేనండి.

ధర్మా : మీరు ఆ రోజున దేనిని గురించి మాట్లాడుకుంటున్నారో మేజిస్ట్రేటు గారితో చెప్పుతారా?

అయ్య : రోగాలను గురించి మాట్లాడుకుంటున్నామండి.

ధర్మా : సంభాషణలో ఎవరికైనా భేదాభిప్రాయాలు వచ్చాయా?

అ.అమ్మ : సంగం వారివీధి ఎక్కడ వున్నదీ అనే విషయాన్ని గురించి మేము తర్కించుకోవడంలో.

మేజ : సదాశివరావుగారు తల ఉటంకించి, కళ్ళజోడు బల్లమీద నుంచి తీసి అద్దాలు తుడిచి గొంతు సవరించి,

'దేనిని గురించీ' అన్నారు న్యాయమూర్తి.

సాక్షి : అది సంగం వారి వీధి ఎక్కడ వున్నదనే విషయాన్ని గురించి తర్కించుకుంటున్నారు.

మేజ : సంగం వారి వీధా?

'చిత్తంసార్'

'అయితే ఏదీ ఆ సన్నటిసందు ఉన్నదే-అదేనా-ఆ సినిమా థియేటరు ప్రక్క గుండా వెళ్ళే సందేనా?

ధర్మారావుకు ఒక విధమైన నవ్వు వచ్చింది. మేజిస్ట్రేటుగారు చెప్పిన అంశం కొద్దిగా సత్యదూరంగా వున్నది.

ధ : 'చిత్తం తమరు నడివిన వీధిని గురించే సాక్షి చెపుతున్నది. తమరు అనుమతిస్తే ఆ వీధి పరిసరాలను గురించి తెలుపడానికి అవకాశమిస్తారని మనవి.

మే : 'ఏమిటా పరిసరాలు' అన్నారు మేజిస్ట్రేటు.

ధ : 'చిత్తం మీరు చెప్పిన దానికంటే ఆ వీధి మరో ఫర్లాంగు ఎగువన వున్నది. రైల్వే గేటుకు దగ్గరగా ఉంది. ఇంత బాగా జ్ఞాపకం ఉండడానికి కారణం నా చిన్నప్పుడు మా బాబయ్య గారు తరచు రైల్వే గేటు వద్దకు నన్ను తీసుకు వస్తూండేవారు.

మేజిస్ట్రేటు గారు ధర్మారావు మాటలను ఖండిస్తూ-

నేను నీ ఈడులో ప్రతిరోజూ ఆ వీధిలో వెడుతూండేవాణ్ణి. నే చెప్పిన విషయాన్ని ఖండించడం నీకు అనవసరమనుకుంటాను' అన్నారు కొంచెం కఠినంగా.

లాయరు తల వంచుకొని నమ్రత చూపాడు.

న్యాయాధికారితో తగవులాట పెట్టుకోవడం ఎందుకు. అయినా అప్రస్తుతమైనట్టి విషయం మీద ఎందుకు విపరీతమైన తర్కం.

ఇంతలో కోర్టులో మరో ముసలి లాయరుగా రొకాయన లేచి

'మీ అనుమతితో రెండు మాటలు సార్, నేను కూడా చాలా భాగం ఆ వీధంబడే పోతూండేవాణ్ణి-ఈ వీధిని గురించి నేను చాలా పరిశోధన చేయగా-నాకు తేలిందేమంటే ఈ సంగంవారి వీధి అచ్చు ఆఫీసుకు కుడివైపున ప్రారంభమై సినిమా వెనుకతట్టు చివర అంతమౌతుంది.

'అబ్బే సరికాదు' అన్నాడు ధర్మారావు.

మేజిస్ట్రేటు సదాశివరావుగారు అసలు ఈ విషయానికి కేసుకు ప్రస్తుతం ఏమీ సందర్భం లేదనీ, దాన్ని గురించి ఇక తర్కించనవసరం లేదనీ అన్నారు. ఈ దొమ్మీకేసు విచారణ ఫలితం ఏమైందనే విషయం మనకు అప్రస్తుతం, ఫోర్మనూ, ఇన్సూరెన్సు ఏజంటూ, అయ్యవారూ, అయ్యవారమ్మా



తమతమ గాయాలు మానడం వల్ల సుబ్బన్న మీద కఠిన చర్య తీసుకొని తీరాలని పట్టుపట్టనూ లేదు. అయినా సుబ్బన్న విషయం వారి కెందుకు?

దుష్టులను వెతికి పట్టుకుని దండించడం పోలీసు వారి విధి. కేసు విచారించి న్యాయాన్యాయాలు తేల్చడం కోర్టువారి విధి. ఈ లావాదేవీలలో తమ కెందుకు అని యథారీతిగా వారు వెనక్కు తగ్గుకున్నారు.

మేజిస్ట్రేటు గారి బావమరిది చంద్రశేఖరం గారు ఆ క్రితం రోజే వెళ్లి వ్యవహారాలు మాట్లాడుకునేందుకు చెల్లెలు గారింటికి వచ్చాడు. చంద్రశేఖరం కొడుకు రామచంద్రమూర్తి ఈ మధ్యనే బి.ఏ. పాస్ అయ్యాడు. ఇతను చూడడానికైతే బాగానే వుంటారు కాని మనిషి కొంచెం నలుపు. పొడుగ్గా, నవనవలాడే నవయవ్వనంలో ఉన్నాడు. చంద్రశేఖరం తన కొడుక్కి చెల్లెలు కూతరు శారదను వివాహం చేయాలని కుతూహలపడుతున్నాడు.

కాని, అసలు ఈ పెండ్లి విషయం ఇది వరకు ఒకటి రెండుసార్లు మేజిస్ట్రేటుగారి ప్రత్యక్షంలో నయితేనేమి, పరోక్షంలోనయితే నేమి నలిగిన విషయమే. కాని చంద్రశేఖరానికి గ్రామంలో పని తొందర వల్ల ఈ విషయం ఆలోచించేందుకు రవ్వంత కూడా వ్యవధి లేకపోయింది. పైగా ఇప్పుడు తన కొడుకు చదువుకూడా పూర్తి అయింది గనుక, పెళ్లిగూడా అయితే ఆ బరువు తీరిపోతుందని-వివాహం స్థిరపర్చుకుని-తాంబూలాలు పుచ్చుకుని తరువాత జరుగవలసిన తతంగంకోసం ప్రయత్నం చేసుకోవాలని కుతూహలపడుతున్నాడు.

ఇంతకీ రామచంద్రమూర్తి వెనుకే కొంచెం నలుపైనా తీసిపారేసే అంత సులువుకాదు. చిన్నప్పటి నుంచీ గొప్పవాళ్ల రచనలన్నా వారి ఉపన్యాసాలన్నా, వారి గ్రంథాలన్నా అతగాడికి ఆసక్తి మెండు. విశ్వవిద్యాలయంలో పట్టం పుచ్చుకున్న తరువాత ఇటీవల నవ్య సాహిత్య కారుల రచనలను చదివి బాగా అవగాహన చేసుకున్నాడేమో ఇక

బావ : అదికాదండీ. చూశారూ, అచ్చాఫీసు వుంది-దాని ప్రక్క వీధే సంగం వారి వీధి. ఈ మాత్రం నాకు తెలియదూ?

మే.భా : రామాయణంలో పిడకలవేట, సంగవారి వీధి ఎక్కడుంటే ఏం? మంగలి వారి వీధి ఎక్కడుంటే యేం?

మేజ : ఆc, నేను పాతసినిమా థియేటరు ప్రక్కగుండా వెళ్లే సందే సంగం వారి వీధి అంటున్నా. మీ అన్నగారు అది కాదంటున్నారు.

మే.భా : మా అన్నయ్య చెప్పిందే రైటు. అచ్చాఫీసు ప్రక్కవీధే అని మా ముత్తవతల్లి చెబుతుంటే విన్నాను.

మేజ : ఆవిడకేం తెలుసు. అయినా తెలిసీతెలియని వాదన లెందుకు నీకు?

మే.భా : బాగుందండి మీ రనేది. ఇక మీ కొక్కరికే గాబోలు ఊరుసంగతి తెలిసినది.

మేజ : నా చిన్నతనమంతా, చదువు ఈ వూళ్లో పూర్తి అయింది. ఏమిటో నాకు తెలియనట్లు, మీకు మహా తెలిసినట్లు మాట్లాడతారేమిటి!

మే.భా : ఆయన మాటలకేంగాని-

మేజ : నీవు మహా చెప్పొచ్చావులెద్దూ. లోపలికిపో, అయినా ఊళ్లోకి నెలకోసారి, ఏడాదికోసారి వస్తూ-వూరు సంగతి ఏం తెలుసు మీరు ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువెళ్లి ధూపాటివారి వీధి అంటే ఎవరైనా నమ్మాలా అక్కర్లేదా?

బావ : మా తండ్రిగారి హాయాంలో ఏవో పుస్తకాలు అచ్చువేసే సందర్భంలో అచ్చాఫీసుకు పంపేవారు. అచ్చు ఆఫీసుకు ప్రక్కనుంచే సంగంవారి వీధి తెలుస్తుండేది. నాకు బాగా గుర్తు. లేదంటారేమిటండీ.

శారద : ఏమిటండీ- ఈ గొడవ. నన్ను పుస్తకం పూర్తిచెయ్యనియ్యరా ఏమిటి?

మేజ : అమ్మాయ్- నీవు చెప్పు సంగంవారి వీధి ఎక్కడుందో?

శారద : ఓస్ దీన్ని గురించా, సంగంవారి వీధి పాతసినీమా థియేటరు ఉండే దాని ప్రక్క గుండా వెళ్ళే సందే సంగంవారి వీధి.

మేజ : బాగా కరెక్టుగా చెప్పావ్. అది కాదంటాడు మీ మావయ్య.



శారద : ఆ వూళ్ళో ధాన్య మేమిటో, పంట ఏమిటో అంతేకాని, మావయ్యకు ఏమీ తెలియదండీ నాన్నా మా కాన్వెంటు స్కూలుకు వెళుతుంటే ప్రతిరోజూ మా బండి ఆ వీధి ప్రక్కనుంచే వెడుతుంది. సుబ్బన్నగారి అమ్మాయి ఆ వీధిలోనుంచే వస్తుండేది.

మే.భా : నీకు మహా తెలుసు. పసిపిల్లవు నీవూరుకుందూ.

శారద : బాగుందే అమ్మా. ఏం నాకు మాత్రం తెలియదూ.

మేజ : దాన్ని ఊరుకోమంటావేమిటే. ఏం దానికి మాత్రం తెలియదా?

బావ : బావగారూ, మీరు బాగా ఆలోచించండి. సంగం వారి వీధినే అసలు అష్టవంకర్ల వీధి అంటారు. కోణంగి పేటలోంచి అచ్చు ఆఫీసు వద్ద కలిసే వీధే సంగం వారి వీధి.

మేజ : ఆలోచించేదేమిటండీ. ఆలోచనా సాలోచనాను. మీరన్నది తప్పండీ. సినీమా థియేటరుకు ప్రక్కగుండా వెళ్ళే సందే సంగంవారి వీధి. ఇంత విడదీసి చెప్పినా మీరు కాదంటే ఏమి చేయాలి.

బావ : ఇహ మీతోటి వాదించి ఏం ప్రయోజనం.

ఎమేజ : అయితే నే చెప్పింది కాదంటారా?

బావ : నే చెప్పింది మాత్రం తప్పునెక్కడుంది.

మే.భా : మనకెందుకు వచ్చిన గొడవ ఇది. సంగంవారి వీధి ఎక్కడుంటే ఎవరిక్కావాలి. ముందు అమ్మాయి పెళ్ళి సంగతి ఆలోచించండి.

మే : అయితే నీ వనేదేమిటి?

మే.భా : తాంబూలాలు పుచ్చుకోమని.

మేజ : పుచ్చుకోవచ్చులే... ఇప్పుడు వచ్చిన తొందర ఏమీ లేదు.

మే.భా : మీ ఇష్టం బాబూ. ప్రాణం విసిగి పోతూంది మీతోటి. ఇప్పుడు గాకపోతే మరి ఇప్పుడో. అయినా అమ్మాయిని ఇవ్వకపోతే వాడికి పెళ్ళి జరగదా. వాడు దీన్ని పెళ్ళి చేసుకోకపోతే దీనికి పెళ్ళవదా?

బావ : అమ్మాయి నీవూరుకో. అయితే బావగారు తాంబూలాలు పుచ్చుకోవడం దాకా వచ్చి మళ్ళీ ఇట్లా మాట్లాడుతున్నారె.

మేజ : దాని పెళ్ళికిప్పుడేం తొందరలేదండీ. తరువాత చూచుకోవచ్చు.

మే.భా : పెళ్ళిలేదు - ఏమీ లేదు. కూర్చోబెట్టండి ఇంకా ఎన్ని రోజులు పెళ్ళి చేయకుండా కూర్చోబెట్టాలనుందో.

బావ : నే వస్తానే అమ్మాయి. ఇప్పుడు బండి వుంది. రాత్రి రైలుకే పోతున్నా.

మే.భా : అయ్యో భోజనం అయినా కాలేదు. భోంచేసి వెళ్ళు నా మాట విను.

చంద్ర : భోజనానికేం లేవే. భోంచేస్తే రైలు దాటిపోతుంది. నే వెళ్ళొస్తా. అంటూ వచ్చినదారినే చక్కాపోయాడు చంద్రశేఖరం.

## 4

మరికొన్ని రోజులకు తరచు మేజిస్ట్రేటుగారింటికి వచ్చే సూరిశాస్త్రిగారు ఆరోజు మధ్యాహ్నం ఏదో పనుండి వచ్చారు. వరండాలో కూర్చొని తాంబూలం వేసుకోసాగారు. పోకలు నములుత్తూ శాస్త్రులవారు....

'నా మనస్సుకు ఈ విషయం పట్టినట్టు మరేదీ పట్టలేదు. నాకు అర్థమయినట్లు మరెవరికీ గూడా అర్థమవనే అయి ఉండదు' ధర్మారావును ఉద్దేశిస్తూ గాబోలు - 'అయినా ఈ వృత్తిలో సతతమూ తిరిగే వాళ్ళకూ, ఆ ధారాశుద్ధి, ఆ వాక్శుద్ధి వుండదుమరి. చెడ్డఅలవాటు ఏమంటే కావలసిన సాక్ష్యమూ, పరిశోధనా రుజువూ లేకుండా వితండవాదం చేసినందువల్ల ప్రయోజనం ఏముంటుంది. వెధవది దీన్ని గురించి వెనక కొన్ని ప్రాణాలు పోయాయి'.

శాస్త్రులవారు మరో రెండు తమలపాకులు తీసుకుని నములుతూ -

'ఇంతకీ సంగంవారి వీధిని గురించి జ్ఞాపకం ఉన్నదా?'

మేజ : లేకేం.

సూరి : అదెక్కడ వుందంటారు?



మేజస్ట్రేటుగారు పెన్సిలు తీసుకుని టేబుల్ అట్టమీద వివరంగా గీచి చూపుతూ, 'అక్కడనుంచి మొదలు ఇంతవరకూ ఉన్నదే సంగం వారి వీధి.'

శాస్త్రులవారు బాగా పరికించి తదేక దీక్షతో ఆ మ్యాపును చూచి గొంతు సవరించుకుని,

'మీరు శ్రమపడి మ్యాపు గీయడమైతే గీశారు గాని - అసుల ఈ వీధి ఎక్కడుందన్న విషయలో మీ అభిప్రాయం కూడా తప్పే- ఆరోజు లాయరు ధర్మారావు చెప్పింది తూచాగా సరిపోయింది' అన్నారు కొద్దిగా నవ్వుతూ.

'ఊం అల్లాగ'- అంటూ అంతవరకూ కులాసాగా సంతోషంతో కబుర్లు చెప్పిన మెజిస్ట్రేటు సదాశివరావుగారు ఛీదరించుకుంటూ ఛ్రుమని కుర్చీలోంచి గభాలున అక్కడనుంచి లేచి చక్కా పోయారు.

'ఇదేమిరా బాబు- ఎన్నడూ లేనిది నేను ఈయనకు కోపం తెప్పించాను' అనుకుంటూ మెల్లిగా ఇంటికి జారాడు శాస్త్రులవారు.

కోపం శాంతించి తరువాత మేజిస్ట్రేటుగారు వాకబు చేయగా తేలిన విషయమేమంటే ఈ సంగం వారి వీధిలో సంగం బాపన్న అనే అతడు ఉండేవాడనీ, పిమ్మట అతను చనిపోగా అతని కొడుకు సంగం చలమయ్య క్రైస్తవమతం పుచ్చుకుని తనకు అక్కడ ఉన్న స్థలం, ఆపాటి దొడ్లు అన్నీ పురపాలక సంఘం వారికి అమ్మేసి మరో వూరు లేచిపోయాడనీ, ఇప్పుడు ఆ స్థలంలో పురపాలక సంఘం వారు ఎలిమెంటరీ పాఠశాలను ఇటీవలనే నిర్మించారనీ, కాగా ఇప్పటి పురపాలకసంఘ ప్లానులో అసలు సంగం వారి వీధి లేనేలేదనీ తేలింది.

**✳ మే, 1952**

**భారతి**

# కొత్తగౌను

"యాఁ వండోయ్-కాఫీ చల్లారిపోతోంది.

ఆ పత్రిక అక్కడ పారేసి కాఫీ త్రాగుదురూ"

* * *

"ఇదుగో! మిమ్మల్నే-ఏది వచ్చినా విపరీతమే. వారం రోజుల నుంచి చూస్తున్నాగా ఈ మౌనం నా కర్థం కావటం లేదు. ఏదో ఒకటి దొరక్కపోతుందా ఏమిటి"

"నీకేం కబుర్లు చెబుతావ్! ఇంట్లో కూర్చుని..."

"సరే మీ ఇష్టం బాబు! అయితే కూర్చోండి" వేళపట్టున తిండికూడా తినడం మానేశారు కదా!"

* * *

వేసవి వేడి గాడ్పులకన్న అతని జీవితాన్ని నిరాశా నిస్పృహ వాయువులే ఎక్కువగా వాడచేస్తున్నాయ్! మూర్తి మద్రాసులో కాపరంపెట్టింది లగాయతు అతని జీవితం ఒడుదుడుకులతోనే నడుస్తోంది కాని ఇంకా ఓ బాటలోకి రాకపోవడం అతని దురదృష్టమే! ప్యాసుకావడమైతే బి.ఎ ప్యాసయాడు: అయితే యేం లాభం? కొంతకాలం ఓ కంపెనీలోనూ, మరో సంవత్సరం మరో ఆఫీసులోనూ, ఏదో స్వల్ప జీతం మీద పనిచేస్తూ వచ్చాడు. ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా తనకు తగ్గ రీతిగానే కాపరం దిద్దిపెట్టుతోంది అతని ఇల్లాలు జానకి.

అంతా సుమారు పది నెలల నుంచి ఓ గవర్నమెంటు ఆఫీసులో నౌకరీ చేస్తూ వచ్చాడు మూర్తి. కాలం ఒకలాగే ఉంటుంది. ఆఫీసులో ఉండే తనపై ఉద్యోగికీ, తనకూ కొన్ని విషయాల్లో అభిప్రాయభేదం కలిగింది. కొన్ని మాటలు కూడా పడవలసి వచ్చింది. మరి మూర్తి అభిమానపరుడు. అయినా ఎంతో ఓర్పుతో అలాగే తట్టుకువెళ్ళసాగాడు. అయితే ఏపనైనా సౌమ్యంగా వెళ్ళినంతవరకే సౌమ్యత చెడిన తర్వాత-ఇహ అంతే అనుకోండి. పాపం హఠాత్తుగా అతన్ని ఉద్యోగం నుంచి తీసేశారు. పాపం. మూర్తి యేం చేస్తాడు? ఏవేవో ఆఫీసుల్లోనూ, ఇతర బిజినెస్ ఫరమ్సులోనూ



దరఖాస్తులు పెట్టుకుంటూ వచ్చాడు. తిరిగిన ఆఫీసుకే తిరగడం, చూచిన ఆఫీసర్నే చూడడం, తిరిగి తిరిగి కాళ్లు అరిగిపోయేట్టు తిరుగుతున్నాడు.

మూర్తి కూతురు సీతమ్మ మంచి చలాకీయైన పిల్ల. చాలా చురుకైనదీ, తెలివిగలదని ఆ దంపతులిద్దరికీ వేరే పత్రార్జితమైన ఆస్తి మరేమీ లేకపోగా ఒక్కగానొక్క ఆ పసికందే తమ యావద్భాగ్యంగా చూచుకొంటున్నారు.

సీతమ్మకు తన ఆటవస్తువులంటే ఎంతో సరదా! తన తండ్రి విడిచి మూల పారవేసిన చిరుగు సంచిలో తన ఆట సామానులన్నీ ప్రతిరోజూ ముందు పోసుకుని ఆడుకుంటూంటుంది. మరి ఆ సంచిలో ఇది ఉంది, అది లేదు అని వుండదు-చిన్న పెన్సిలు ముక్కలు, బలపంముక్కలు ఏవో కాగితం బొమ్మలు, రంగురంగుల కొత్త గుడ్డపేలికలు-ఒకటేమిటీ అన్ని అందులోనే.

సామాన్య జీతగాడైన మూర్తి తన కూతురు సీతమ్మకు అంతకంటె వేరే ఆటసామానులు ఏం కొనగలడు గనుక? ఆ పెట్టెలోనే సీతమ్మ తాటాకులతో చేసిన రెండు బొమ్మలు-ఒకడు పెళ్లికొడుకని, రెండో బొమ్మ పెళ్ళికూతురుని-ఇలాగా వాటిని ఓ మూలపెట్టి ఆడుకుంటూంటుంది ఎదురింటి అయ్యరుగారి మీనాక్షితో; వాళ్ళ ఇంటి వసారాలో ఇద్దరూ ప్రతిరోజూ ఆడుకోవడం అలవాటు. అయ్యరుగారు కంపెనీ మానేజరు నెల నెలా వచ్చే ఆ జీతం రాళ్ళతో కాలం గడిపే మూర్తికీ, కొన్ని వందలు సంపాదించే అయ్యరు గారికీ పోలిక ఎక్కడుంటుంది? అందులో మూర్తికి ఇప్పుడు ఉద్యోగమన్నా లేదాయిరి, పైగా ఈ రోజుల్లో కంపెనీ బాగా లాభాలు తీసిందేమో-మానేజరు పని ఇహనేం-పెద్ద ఇంక్రిమెంటు కూడా వచ్చింది. కాగా, తన కుమార్తె ఆడుకొనడానికి రకరకాల బొమ్మలు, మేలైన ఆటవస్తువులు, చిన్న చిన్న మోటారుకార్లు, కఱ్ఱగుఱ్ఱాలు ఒకటేమిటి అన్నీ కొనిపెడుతూండేవాడు. సీతమ్మ పాపం-వాటిని చూచే ఆనందిస్తోంది.

ఆ రోజు మామూలుగా సీతమ్మా మీనాక్షి వరండాలో ఆడుకుంటున్నారు. ఎలాగైనా ధనవంతులవడం వల్ల మీనాక్షి ప్రతిరోజు రంగురంగుల గౌనులు, పరికిణీలు పూట కొకటి చొప్పున మార్చడం కద్దు. అటువంటివి చూచినపుడల్లా తనక్కూడా అంత మంచివి వుంటే ఎంత బాగుండేదా అని అనుకునేది సీతమ్మ. ఇంతకీ అంత క్రితం రోజు మీనాక్షి పుట్టినరోజు. ఆ పిల్లకు ఆమె తండ్రి చక్కటి పువ్వుల గౌను

కుట్టించారు. ఈ వేళ మీనాక్షి ఆ గౌనుతోనే ఆడుకోవడానికి వచ్చింది. ఆ గౌను చూచినప్పటి నుంచీ తనకూ అటువంటి గౌనే కొనుక్కోవాలనిపించింది. అయితే, తన తండ్రి కొంటాడో కొనడో? అయినా ఇంత ఖరీదైన గుడ్డలు తనకు ఇదివరకు ఎప్పుడూ కొనలేదు కూడాను. ఆరోజు ఆట త్వరగా ముగించుకుని ఇంటికి వెళ్ళిపోయింది సీతమ్మ. వంటింట్లో పని చేసుకుంటున్న తన తల్లి దగ్గర గౌనుకోసం మారాం పెట్టసాగింది.

"వాళ్ళ మీనాక్షి తొడుక్కుని వచ్చిన గౌను లాంటిది నాక్కూడా ఒకటి కుట్టించవూ-అమ్మా" అని కూనిరాగం తీయడం ప్రారంభించింది.

"ఏడవకు తల్లీ! మీ నాన్న రానీ, వచ్చిన తరువాత బజారుకు వెళ్ళి కొనితీసుకురమ్మంటాను"

"ఎప్పుడూ ఇంతేనే కొనిపెడతాను అంటావు. అంతేగాని నిజంగా ఎప్పుడు కొనిపెట్టావు చెప్పు" అంటూ మళ్ళీ ఏడుపు.

"లేదమ్మా! ఈసారి తప్పకుండా నాన్నని కొనమంటాను. మరి నాన్నగారు రానీ తెప్పించి పెడతాను"

సీతమ్మ ఏడుపు మాని వాళ్ళ నాన్నగారి గదిలో కూర్చుని ఆయన రాకకు ఎదురుచూస్తోంది. ఆ పసికందుకు తన తండ్రి ఉద్యోగం పోయిందని బాధపడుతున్నాడనీ, డబ్బు లేదనీ ఏం తెలుసు? చిన్న పిల్లలది అదొక ధ్యాస: ఆ ధ్యాసల్లోంచి మరలించడం బహుకష్టం. ఆ వెర్రిపిల్ల ఎప్పుడూ కూడా ఏదీ అడగదు. చివరకు సాయంత్రమయేసరికి మూర్తి తిరిగివచ్చాడు. చీకటి పడుతూవుంది. వారిది చాలా చిన్న ఇల్లు. ఏదో తక్కువ అద్దెకు అందులో ప్రవేశించాడు. చిన్నవసారా వంటిల్లు, ఒక గదీని. ఈ రోజుల్లో ఇళ్లు దొరకడమే కష్టం-ఒకవేళ దొరికినా అద్దెలు, అడ్వాన్సులు చూచేసరికి గుండె బ్రద్దలైపోతుంది.

వసారాలో వ్రేలాడగట్టిన ఆ లాంతరు కూడా దీనావస్థలోనే కనిపించింది. అది ఎంత ఎగసన తోసినా అంతకంటె ఎక్కువ కాంతి రాదు. బహుశః లోపల బర్నరు చెడిపోయి వుంటుంది. తిరిగి తిరిగి వచ్చిన మూర్తికి ఒక పెద్ద నిస్పృహ ఆవహించింది. కళ్లు తిరగడం ప్రారంభించాయి. చొక్కా తీసి కోట్ స్టాండుకు తగిలించాడు మూర్తి. కాళ్ళు కడుక్కోను నీళ్లు పెట్టింది జానకి. ఇంతలోకీ మరి ఎప్పుడు



వచ్చిందో-సీతమ్మ తన తండ్రి చేతులు పట్టుకు వేళ్లాడసాగింది-వెంటనే అడిగితే తన తండ్రికి ఏం కోపం వస్తుందో ఏమోనని గాబోలు-ఆ పసికందు వూహ! ఆయన కాళ్ళు కడుక్కుని లోపలికి వచ్చిన తరువాత 'నానా! నాన్నా! వాళ్లమ్మాయి కొత్త పువ్వుల గౌను కుట్టించుకుంది! అటువంటిది నాక్కూడా కుట్టించవూ! ఊఁ నడు వెళదాం-బజారుకు" అని అతని ముఖంలోకి చూడసాగింది సీతమ్మ-

"ఇపుడు చీకటి పడిపోయిందే అమ్మాయ్! రేపు తీసుకెడతాను. నీకు నేను మాంచి గౌను కొంటానుగా."

"కాదు. నాకు ఇప్పుడే కావాలి. మీరు రాగానే బజారుకు వెళ్లి కొని పెడ్తారని అమ్మ చెప్పింది- నడవండి వెళ్దాం."-

"కాని నా కిప్పుడే కావాలి. అమ్మ చెప్పింది మీరు రాగానే బజారుకు తీసుకెళ్ళి కొనిపెట్తారని. ఊఁ నడునాన్నా-" పనిచేసుకుంటున్న జానకి ఈ సంభాషణ విని బయటకు వచ్చింది.

"ఏమండీ! తలనొప్పిగా ఉందా-అలావున్నారు."

"తలనొప్పి-జీవితమే నొప్పి-"

"అబ్బ! అడిగినా తప్పే, అడక్కపోయినా తప్పే. ఏమీ దొరకలేదా?"

"ఎందుకు దొరుకుతుందే పిచ్చిదానా? ఇదేమైనా డబ్బిచ్చి కొనుక్కునేది గనుకనా"

"ఏం జరిగిందేమిటి చెప్పండి" అంది ఆదుర్దాగా జనకి "ఏం జరగడమేమిటి? ఆయన కూడా ఉద్యోగం లేదన్నాడు. ఇహ పస్తుపడుకోవలసిందే-మరీ బాధ ఇంకా ఎన్ని రోజులో."

"పస్తేనా" అంటూ నిరాశతో అతని ముఖంలోకి చూచింది జానకి.

పాపం-సీతమ్మ! - ఈ సంభాషణ తన మనస్సుకు చాలా కష్టం కలిగించిందో ఏమో-మరి మూతి ముడిచేసుకుని కుర్చీలో కూర్చుని పోయింది.

"రేపటి నుంచి ఏంచేద్దాం మరి?"

"రేపూ! ఎల్లుండీను! నన్ను అడగవద్దు. నాకు తెలియదు."

"ఇంటి ఆయన అద్దెకోసం కాబోలు వచ్చి వెళ్లాడు-రేపు ఉదయం మళ్ళీ వస్తానని చెప్పమన్నాడు"

"అవును-కనపడ్డాడు"

" ఈ సమయంలో ఇంటిపోరు మీతో..."

"వీధిలో ఎంతమంది మనకంటె హీనస్థితిలో ఉన్నారు. మనం వాళ్ళతోపాటే అనుకుంటాం"

"అయ్యో అలా అనకండి. భగవంతుడు ఏదో దారి చూపకపోతాడు గనుకనా?"

"ఏం లాభం పాడు చదువు-చదివీ ఒకటేలా వుంది. చదవకపోయినా వొకలాగే వుంది."

తనకు ఉద్యోగం లేదని విచారించాలా, తన చిట్టితల్లికి మంచి గౌను కొనలేదనే విచారించాలా?

"ఏవండీ అమ్మాయిని చూస్తే నాకు జాలి వేస్తోందండీ. దానికి ఏదో చవకరకంలో పోనీ..."

"తినడానికి తిండిలేనప్పుడు ఇప్పుడు కొత్త గౌను ఎక్కడ నుంచి తీసుకురాను చెప్పు, అయినా డబ్బు ఎక్కడుంది-నీకు తెలియనిదేముంది-జానకి."

'నా చిన్నతనంలో నేనుకూడా ఒక మంచి పరికిణీకోసం ఏడిచా-ఆ రోజులు ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నాయ్. నేను పస్తేనే వుంటాను- ఎలాగోలాగ దానికి కొత్త గౌనొకటి కుట్టిద్దురూ."

"ఇంట్లో ఏదైనా ఉంటే అమ్మేసి కొనిపెట్టు-ఏంచేస్తాం" అన్నాడు. మూర్తి కళ్ళ నీళ్లు త్రిప్పుతూ, అమ్మడానికి మాత్రం ఏముంది!

పాపం మూర్తికి మాత్రం కొనాలని లేదూ? అయితే యేం చేయగలడు? అతని జీవితం ఇట్టి విధమైపోయింది. తినడానికి తిండి కూడా సరిగా లేదుగదా!

ఆ రాత్రి మధ్యాహ్నం తినగా మిగిలిన ఆ రెండు మెతుకులే సీతమ్మ రోజూ తినే ఆ రెండు మెతుకులైనా తినకుండా ఏడుస్తూనే పడుకుంది వెర్రితల్లి! జానకి పడుకుని వున్న తన చిట్టితల్లివంక చూచింది. లేతబుగ్గలు కంది ఎఱ్ఱబారాయి. ఏమిటో కలవరింతలు-ఆ రాత్రి గడిచింది.

మరుసటిరోజు ఉదయం చిట్టితల్లి లేచి తన గౌనుకోసం ఏడవడం మొదలుపెట్టింది. మూర్తి బయటకు వెళ్లాలనుకుంటున్నాడు. బయట గుమ్మంలో అడుగుపెడుతుంటే తన చిట్టితల్లి పరుగున వచ్చింది.



"నాన్నా... సాయంత్రం వచ్చేటప్పుడు గౌను పట్టుకొస్తావుగదూ" అంది. మూర్తికి గుండె ద్రవించింది. ఇంతకీ అతని రోజులు బాగులేవు. పాడు ప్రపంచం-పాడుకాలం-తనవంటి మధ్యతరగతి వాడింకా ఎంతమంది బాధపడుతున్నారో తన తల అటుకేసి త్రిప్పి-"అల్లాగే నమ్మా" అంటూ గబగబా చక్కాపోయాడు.

చిట్టితల్లి ఆరోజు ఆడుకోను వెళ్ళనేలేదు. ఎదురింటి మీనాక్షి సంగతే మరచిపోయింది. తన సామానులు తన తాటాకు బొమ్మలు మూలబడి ఆ చిట్టితల్లి విచారాన్ని పంచుకుంటున్నాయి. అదేమి చిత్రమో-మరి-ఇదివరకు యెన్ని చూడలేదు? ఆ పసిపిల్ల ఏది చూచినా మరచిపోయేది. కాని నేడు మూర్తికి ఇదొక విషమ పరీక్ష.

"అమ్మా-మరి నిన్న కొత్తగౌను కొనిపెడతానన్నావు మరి కొంటావా?"

"ఏడవకు మరి-నీవు ఏడిస్తే నే చూడలేను' మీ నాన్న ఈరోజు తప్పక తీసుకువస్తారు"

తన తండ్రి రాకకై ఎదురుచూస్తూ తిరిగి గదిలోకెళ్ళి కూర్చుంది సీతమ్మ.

సాయంత్రమయింది. తన భర్త రాకకై ఎదురుచూస్తోంది జనకి. ఆమెకు మనశ్శాంతిలేదు. రోజైనా ఉద్యోగం దొరకదా? ఎప్పటికో మరీ బాధలు తీరడం! మూర్తి వచ్చేవేళ-ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది. గుండెవేగం హెచ్చింది.

"ఏమైందండీ?"

"ఈరోజూ అంతే..."

ఇంకా యెన్నిరోజులో ఈ త్రిపట? వెధవ డిగ్రీలు ఉండి యేం లాభం?

"అలా నిస్పృహపడకండి" జానకి అంతకంటె ఏమనగలదు? పలక్కుండా వెళ్ళిపోయింది పొయ్యిమీద పెట్టిన నీళ్ళు మరగసాగాయి. అదొక ప్రశాంతమైన ప్రకృతి పొయ్యిలో పెట్టిన కొరకంచు ముక్క పూర్తిగా మండిపోయింది. పొయ్యి కూడా శూన్యదృష్టితో చూడసాగింది జానకివైపు.

ఆరోజు అంతవరకూ నిద్రపోకుండా జోగుతూ కూర్చున్న సీతమ్మ తండ్రి వచ్చిన అలికిడి విని ఉలిక్కిపడిలేచి "ఏం నాన్నా కొత్తగౌను ఏదీ! తీసుకువచ్చావా?"

"రేపు తప్పకుండా పట్టుకువస్తా తల్లీ"- అన్నాడు.

"రేపు ఎప్పుడు వస్తుంది-నాన్నా" అంటూ నిట్టూర్చింది సీతమ్మ.

"గౌను కొనలేకపోయాను. పసిపిల్లకు గౌను! ఔను - నేను నిరుద్యోగిని-

జానకి పిల్లను చూసింది తిండి తినకుండా నిద్రపోయింది పసిపిల్ల.

వీధిలో ఎక్కడో కీచురాయి ధ్వని జేబురుమంటూ ఉంది. మూర్తికి ఏమీ తోచలేదు పాపం ఆకలి వేస్తోంది. "అబ్బా! ఆకలి తినడానికి ఏమైనా ఉందా?"

".... (ఏడుస్తుంది) ఉద్యోగం పోయినప్పటి నుంచీ మీ వద్దనున్న ఆ కొద్ది పైకంతో ఇన్ని రోజులు గడిపాం. ఇహ అదీ అయిపోయింది. "దుర్భర దీనావస్థ, విసుపు చెందిన అతని హృదయం క్రోధఘూర్జిత రుద్రరూపమయింది..... "తిండిలేదూ, మరి ఏముంటుంది నీ మొహంలో...."

కళ్ళు ఎర్రబడినై-అతని నిస్సహాయస్థితి ఆవేదనగా మారింది-క్షణంలో ఆవేదన ఉద్రేకమయింది-వారం రోజులనుంచి తిండి అయినా పసిలేదేమో-బక్క ప్రేగులలోని నీరసపు కోపం ప్రకోపించింది-

"కొత్తగౌను తీసుకురావాలీ, కొత్తగౌను-తిరిగాను రోజులా-తిండికూడాలేదు" అంటూ ఒక్క చఱుపుచరచాడు ఆమె నా ఉద్రేకంలో. అతను ఏం చేస్తున్నాడో అతనికే తెలియదు కళ్లు చీకట్లు కమ్మాయి. వెళ్ళిపోయాడు బయటకు-బయట అగాధతమోశీథం- ఉలికిపడి లేచి ఏడిచ్చింది సీత! తల్లి ఓదార్చసాగింది. తన తల్లి ఎందుకో ఏడుస్తోంది-మరి పసికట్టింది-ఎలా పసికట్టిందో తన తండ్రి అమ్మని కొట్టాడని ఎందుకు కొట్టాడో ఆ పసిపిల్లకేం తెలుసు? జానకి అలాగే కంట తడిబెడుతూ కూర్చుంది.

అర్ధరాత్రి నడుమువాల్చింది జానకి. ఎప్పుడు వచ్చాడో మూర్తి-వచ్చి ఆమె ప్రక్కనే పండుకున్నాడు. మూలనున్న దీపం మినుకుమినుకు మంటోంది. తన చిట్టితల్లి వేడిఉచ్ఛ్వాసనిశ్వాసాలే అతనికి వినిపిస్తున్నాయి. ఆమె పలకరించలేదు.

"జానకీ..."

"......"

"జానకీ"

"ఎందుకూ!"

"ఎక్కడికీ వెళ్లను? నిన్ను విడిచిపెట్టి? చిట్టి తల్లిని విడిచిపెట్టి నా నిరాశాంధకార హృదయంలోని ఆశాజ్యోతివి కదూ" మళ్ళీ నిశ్శబ్దం.

"దెబ్బ తగిలిందా? అలా కొట్టాలని అనుకోలేదు"

"నాకు తెలుసు-మీరు అనుకోకుండానే పనులు చేస్తుంటారు"



"కాని...చిట్టితల్లికి పసిపిల్లకు ఒక కొత్త గుడ్డ కొనలేని తండ్రి ఉండి ఏం లాభం"

"ఆ మాటే అనవద్దన్నాను ప్రశాంతంగా పడుకోండి..."

తెల్లవారింది. సూర్యభగవానుడు తన లేత కిరణాలతో ఈ దృశ్యాన్ని పరికిస్తున్నాడు.

సీతమ్మ లేచింది. ఆ పసిపిల్లకు తన కొత్త గౌను మాట జ్ఞప్తికి వచ్చింది తిన్నగా తన తండ్రి వద్దకు వెళ్లింది-

"నాన్నా! అమ్మను ఎందుకు కొట్టావు రాత్రి! కొత్తగౌను అడగనులే నాన్నా!" పసిపిల్ల కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయ్. మూర్తి కొక అగ్నిపరీక్ష! తన చిట్టితల్లి తనకు ఒక పరీక్ష. అతని గుండె బ్రద్దలైనట్లనిపించింది. జానకి వచ్చింది-

"చిట్టితల్లి- అమ్మని నాన్న కొట్టారని ఎవరు చెప్పారు? అమ్మని నాన్న ఎప్పుడైనా కొడతారా?"

"మరైతే రాత్రి ఎందు కేడుస్తున్నావ్" అంది సీతమ్మ. ఇంతలో పోస్టుమాన్ వచ్చి ఉత్తరం అందించిపోయాడు. ఉత్తరం చించి చూచుకున్నాడు మూర్తి. అందులో మూర్తికి మేనేజరుగా అప్పాయింట్ చేసినట్లును, వెంటనే డ్యూటీలో జాయిన్ అవ్వాలన్నట్లు ఉంది-

"ఎక్కడ నుంచండీ-జాబు?"

"ఎక్కడనుంచేమిటి- ఉద్యోగమయింది" అంటూ బయటకు వెళ్ళిపోయాడు మూర్తి.

మరి ఎక్కడకు వెళ్ళి ఎప్పుడు వచ్చాడో, వస్తూ ఒక కొత్త గౌను పట్టుకువచ్చాడు. సీతమ్మ ఆ గౌను చూచి మురిసిపోయింది.

సీతమ్మ సంతోషాన్ని చూచి ఆ దంపతులు అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందారు.

**✻ 1962**

**ఆంధ్రప్రభ**

# నచికేతుడు

మునీశ్వరుడైన వాజశ్రవసుడు గొప్ప తపస్సంపన్నుడు. ధర్మపరుడు. దానశీలి. ఆయన కుమారుడే నచికేతుడు. కుశాగ్రబుద్ధి. ఏక సంథగ్రాహి. ఒకరోజున నచికేతుడు తన తల్లితో ఆశ్రమంలోని గోశాలకువెళ్లాడు. ఆమె గోమాతను పూజిస్తోంది.

(గోవుల అంబా అని అరుపులు)

* * *

నచి : అమ్మా గోవును ఎందుకు పూజించాలి?

తల్లి : గోవు తల్లి లాంటిది. అవి మనకు పాలిస్తాయి. వాటిని మనం పూజిస్తాం.

నచి : నీవన్నది బాగుంది. అవి కేవలం పాలిస్తున్నాయి గదా అని పూజించాలా?

తల్లి : వాటిని పూజిస్తే తల్లిని పూజించినట్లే నాయనా! గోమాతకు ప్రదక్షిణ నమస్కారం చేస్తే ఎన్నో తీర్థయాత్రలు చేసినంత పుణ్యం లభిస్తుంది.

నచి : ఈ పుణ్యం వల్ల ఉపయోగమేమిటి?

తల్లి : అవి స్వర్గానికి మొదటి మెట్టు! స్వర్గంలో దేవుళ్ళు, దేవతలు ఉంటారు. పుణ్యపురుషులు అక్కడ సుఖాలనుభవిస్తారు.

నచి : నా స్నేహితుడు సోముడు బీదవాడు. వాని తండ్రికి గోవులు లేవు. మన గోశాలలోని ముసలి గోవును వాడికి దానం చేద్దామా? వాడు కూడా పుణ్యం సంపాదించి స్వర్గసుఖం పొందుతాడు.

తల్లి : ముసలిగోవును దానం చేయడం మహాపాపం. వాళ్ళకెందుకూ అది ఉపయోగపడదు. అటువంటి దాన్ని దానం చేయడం వల్ల మనకు పాపం చుట్టుకుని నరకానికి పోతాం.

నచి : నరకంలో మనకోరికలు తీర్చుకోలేమా తల్లీ!

తల్లి : తీరవు! పాపం చేసినవాడికి సౌఖ్యాలెక్కడివి! అటువంటి వాళ్ళని మృత్యు దేవుడు దండిస్తాడు.



నీవింతకన్న ఎక్కువ తెలుసుకోవాలంటే వేదాలు, ఉపనిషత్తులు చదవాలి. గొప్ప పండితుడవు కావాలి, ఆత్మజ్ఞానం సంపాదించాలి.

నచి : అల్లాగయితే నే నీక్షణం నుంచే అట్టి ఆత్మజ్ఞానాన్ని సంపాదిస్తాను.

(వీణానందం)

(ఒకరోజున పక్క ఆశ్రమంలోని ఒక ముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ పిల్లవాని కిద్దామని ఒక మామిడిపండు తెచ్చాడు. మహర్షి రాగానే నచికేతుడు ఆయనకు సాష్టాంగనమస్కారం చేస్తాడు. ఆమహర్షి బాలుణ్ణి ఆప్యాయంగా చేరదీసి ఆపండును తీసుకోమన్నాడు.)

నచి : ఈ పండు నాక్కర లేదు స్వామీ

ముని : పండక్కర లేకపోతే మరి నీ కింకేం కావాలి?

నచి : నాకు జ్ఞానం కావాలి

ముని : ఏవిధమైన జ్ఞానం

నచి : ఆత్మజ్ఞానం

నచి : చాలా పెద్దకోరికేనే

(తనముని సంభాషణ వింటున్న తండ్రి)

వాజ : పెద్దవారి వద్ద అసంబద్ధంగా మాటాడవద్దు లోపలికిపో!

(నచికేతుడు చిన్నబుచ్చుకుని లోనికి పోతాడు)

ముని : వాడు చాలా బాధపడ్డాడు. వాడడిగింది జ్ఞానాన్నిగురించే గదా! వాడిలో గొప్ప లక్షణాలున్నాయి.

వాజ : తెలివి తేటలకేం-

ముని : ఉపనయనం చేసి గురుకులంలో చేర్పించండి.

వాజ : మీ గురుకులంలోనే జేర్పిస్తాను. వాని విద్యాబాధ్యతలు మీరే స్వీకరించండి స్వామీ!

వాజశ్రవసుడు కుమారునికి ఉపనయనం చేసి గురుకులంలో జేరుస్తాడు.

అతనక్కడ వేదోపనిషత్తులు చదువుకుంటున్నాడు. ఆశ్రమంలో ఒకరోజున ఓ నల్లటి గోవు చనిపోయింది. ఆ గోవంటే నచికేతునికి మహాప్రీతి. దానివద్ద కూర్చొని ఏడవసాగాడు. ఆచార్యులవారు ఆ దృశ్యాన్ని చూచి-

(విచారాన్ని సూచించే సంగీతం)

ఆచార్య : నచికేతా! చనిపోయిన గోవుకోసం ఎందుకు దుఃఖిస్తావు నాయనా. చనిపోయిన వారెవరూ తిరిగిరారు - ఏదో ఒక రోజున ప్రతి ఒక్కరికీ చావు తప్పదు!

నచి : ఈ గోవు చనిపోయింది-దాన్ని ఇక్కడ చూస్తున్నాగా!

ఆచార్య : నీవు చూచేది దాని శరీరమే. యమధర్మరాజు దాని ప్రాణాలను ఇదివరకే తీసుకుపోయాడు-యముడు మృత్యుదేవుడని నీకు తెలియదా?

నచి : తెలుసు. ఇటువంటి సంగతే మా తల్లిగారి ద్వారా తెలుసుకున్నారు. అప్పటి నుంచీ ఆయన్ను చూడాలనే కోరిక ఎక్కువైంది.

ఆచార్య : అదంత సులభంకాదు. యముని కలుసుకోవటమంటే ఈ జీవితం ఇంతటితో అయిపోయిందన్న మాటే.

నచి : అయితే ఆయన దర్శనం అసాధ్యమా గురుదేవా?

ఆచార్య : గొప్ప తపస్సు చేసిన ఏ కొద్దిమందికో తప్ప ఇతరులకెలా సాధ్యపడుతుంది బాబూ! అలా సాహసించి ఆయన దర్శనానికి ఎవరూ పూనుకోలేదు.

(అంటూ ఆచార్యులవారు ఆనాటికి విశ్రమించారు)

నచి : అదేదో చూస్తాను. పర్యవసానం ఏమైనా సరే-ఒకరోజున ఆయన్ను చూచి జ్ఞానం సంపాదిస్తాను.

(వీణానాదం)

(ఇక్కడ వాజశ్రవసుడు. 'విశ్వజిత్' అనే యాగం ఆరంభిస్తున్నాడు. పరిసర ఆశ్రమాల నుంచి మహర్షులందరూ వస్తున్నారు. తనకుమారుడు ఆ గురుకులంలోని ఆచార్యులు, శిష్య బృందం అంతా వస్తున్నారు. దారిలో)



నచి : మా తండ్రిగారు ఈ యజ్ఞం ఎందుకు చేస్తున్నారు?

ఆచార్య : ఈ యాగంవల్ల ఎంతో పుణ్య లభిస్తుంది. పరలోక సుఖాలు పొందుతారు.

నచి : మా అమ్మగారు వెనుక ఈ సంగతే చెప్పారు. యాగంలో ఏం చేస్తారు స్వామీ!

ఆచార్య : యాగం చేసేవారు తమకున్న సంపదనంతటినీ దానం చేసివేయాలి. వందల కొద్దీ గోవులు దానం చేస్తారు.

నచి : తమ సంపదనంతటినీ దానం చేయాలంటున్నారు. మరి ఆ సంపదలో నేడు కూడా ఒక భాగమే - మరి నన్ను కూడా దానం చేస్తారా గురుదేవా?

ఆచార్య : నీవడిగిన ప్రశ్న సమంజసంగా ఉంది. కాని నిన్ను దానం చేయవలసిన అవసరం లేదు. నీవేమీ చింతించకు; నిన్నెవ్వరికీ ఇవ్వరులే.

నచి : ఇంకా దీనికెటువంటి నియమాలున్నాయి-ఇంకా ఏమిస్తారు?

ఆచార్య : చాలా ఉన్నాయి. నీవు చూస్తావుగా. యాగం చేసేవ్యక్తి ప్రశాంతంగా ఉండాలి. కోపం దగ్గరకి రాకూడదు-చెప్పానుగా-తన కున్నది ఏదైనా కావచ్చు. ఆభరణాలు కావచ్చు, చీని చీనాంబరాలు కావచ్చు పుచ్చుకొనే వాళ్ళకు ఉపయోగపడేవిగా ఉండాలి. అతిథులకు అన్నదానం చేసి వాళ్ళందరినీ తృప్తిపరచాలి నాయనా! యాగారంభం సమయమౌతోంది. పదండి పోదాం!

* * *

వాజశ్రవసుని ఆశ్రమానికి అంతా చేరుకున్నారు. యజ్ఞం ఆరంభమయింది. ఆరోజు గోదానాలు నిర్ణయించారు. గోశాలలోని గోవుల్ని తీసుకొచ్చారు. వాటిలో బక్కచిక్కినవీ, నీరసమైనవీ అన్నీ వున్నాయి. యజ్ఞమంటపం వద్ద నచికేతుడిదంతా చూస్తున్నాడు. ఋత్విక్కుల మంత్ర ఘోష వినబడుతుంటుంది.

నచి : అయ్యో! ఏమిటిది-ఉపయోగంలేని గోవుల్ని గూడా దానంగా ఇచ్చేస్తారు గాబోలు-దీనివల్ల మా తండ్రికి నరకం తప్పదు. దీన్నెలాగైనా ఆపాలి-ఆయనకు ప్రియమైన వాళ్ళలో నేనొకణ్ణి.

(తండ్రిని సమీపించి)

తండ్రీ! గోదానం అయిపోతోంది. ఇక మిగిలింది నేను. నన్నెవరికి దానం చేస్తావు? చెప్పు! వేగిరం సెలవీయండి-

వాజశ్ర : పోయి కూర్చోమన్నట్లు సంజ్ఞచేశాడు.)

నచి : తండ్రీ! మాటాడరేం? నన్నెవరికి దానం చేయదలచుకొన్నారో చెప్పండి స్వామీ-

వాజ : (తనలో కోపం పెరిగిపోతోంది)...

నచి : (మరింత దగ్గరగా వెళ్ళి) తండ్రి! నా మాట వినబడ్డం లేదా? చెప్పండి. నన్నెవరికిచ్చేస్తారో ఆజ్ఞాపించండి.

వాజ : (కోపంతో) నిన్ను ఆ యమధర్మరాజుకే దానంచేస్తాను. ఇక్కడ నుంచి వెళ్ళు-

(నిశ్శబ్దం సంగీతం. వినబడాలి. మంత్రోచ్చారణ ఆగిపోయింది. ఆహూతులైన మునులు, ఋత్విక్కులు నిర్ఘాంతపోయారు. అందులో ఒక మునిలేచి)

ఒక ముని : ఓయి! వాజశ్రవా! 'కోపం తెచ్చుకుని యాగనియమాన్ని అతిక్రమించావు. కోపంతో నీవేమన్నావో తెలుసా! నీ మాట మీద నిలబడాలి. నీ కుమారుణ్ణి ఆ యమదేవునికి దానం చేయాలి' తక్షణం లేకపోతే ఈ యాగం ఆగిపోతుంది-

వాజ : అయ్యో! ఏమిటీ విపరీతం-నా సహనం ఏమైంది- ఏదిదిక్కు-

(వాజశ్రవసుడు ఆశ్రమంలో భార్య చెంతకు వెళ్ళి విచారించసాగాడు. భార్య కన్నీళ్ళు పెట్టుకుంటోంది. అక్కడకు నచికేతుడు వస్తాడు)



నచి : జరిగిందేదో జరిగింది. మీరెందుకు చింతిస్తారు. గౌతమాది మహర్షుల వంశానికి చెందిన వాళ్ళం. మన పూర్వీకులు తామన్న మాటలు నిలబెట్టుకున్నారు. మీరేం తప్పుచేయలేదే! నన్ను ఆ యమునికి దానం చేశారు అంతేగా!

వాజ : (కౌగిలించుకుంటాడు) నాయనా నచికేతా! నా మాట మీద 'ఆ మృత్యు దేవుని వద్దకు వెళ్ళు-ఇక ఇక్కడ నీకు స్థానం లేదు-

(నిశ్శబ్ద సంగీతం-వీణానాదం)

(సమయానికి తగిన సంగీతం)

(తన తండ్రి ఆజ్ఞాపించడమే తడవుగా యజ్ఞమంటపం వద్ద పద్మాసనం వేసికొని చేతులు జోడించి మృత్యుదేవతా ధ్యానంలో మునిగిపోయాడు. యాగాన్ని తిలకించవచ్చిన అశేష జనసందోహంకాని, ఋత్వికులు కాని-ఏమీ కనబడలేదు. ఇంతలో తనముందు ఒక దివ్య సౌధం కనబడింది. ధైర్యం తెచ్చుకొని ఆ సౌధం వద్దకు వెళ్ళాడు! సౌధ ద్వారం వద్ద భీకరాకారులై ఇద్దరు ద్వారపాలకులు ఖడ్గపాణులై కాపలాకాస్తున్నారు.)

నచి : అయ్యా! నమస్కారం. ఈ దివ్య సౌధం ఎవరిది? మీరెవరు? నేనిప్పుడు ఎక్కడున్నాను?

ద్వా.పా : ఇది సంయమనము అనే పట్టణం. ఈ దివ్య సౌధం యమధర్మరాజుది. దీన్ని రక్షించే భారం మాది. బాలకా! నీవెవరవు? నీవిక్కడికి ఎలా వచ్చావు?

నచి : అయ్యా-నేను వాజశ్రవసుని కుమారుణ్ణి. మా తండ్రిగారు మీ యమధర్మరాజుగారికి దానం చేశారు. ఆయన వద్దకు నన్ను తీసుకు వెళ్ళండి!

(ద్వారపాలకులు లోనికి వెళ్ళి వచ్చి)

ద్వా.పా : బాలకా! యమధర్మరాజు గారు బ్రహ్మ దర్శనానికి వెళ్ళారు-వారు ఏ క్షణంలోనైనా వస్తారు. ఈ లోగా రాజాంతఃపురంలోకి వచ్చి విశ్రాంతి తీసికోవలసిందిగా రాణిగారి ఆజ్ఞ. లోనికి పోదాం రా!

నచి : నేను ముందుగా యమధర్మరాజునే కలుసుకోవాలి. మా తండ్రిగారి కోరికను అక్షరాలా పాటించాలి-నేనీ ద్వారం వద్దే ఆయన కోసం వేచి ఉంటాను.

(తను లేడి చర్మాన్ని పరచుకొని కూర్చుని ధ్యానంలో మునిగిపోయాడు. ఇలా మూడు రాత్రులు గడచిపోయాయి. తరువాత యమధర్మరాజు వచ్చి జరిగిన సంగతి తెలిసికొని బయటకు వచ్చి)

య.ధ : ఓయి! కుమార! లే నాయనా! లే-నేనే ఆ సమవర్తిని! (నచికేతుడు సంభ్రమాశ్చర్యంతో చేతులు జోడించి)

నచి : కృతానేక శరణుడను! స్వామీ! నా తండ్రి మీకు దానంచేశారు. ఇక మీరు నన్నాజ్ఞాపించండి.

య.ధ : కుమార! మా ఇంటికి అతిథిగా వచ్చిన నీవు ఆ అగ్నిదేవుడని పెద్దలు చెబుతారు. మూడు రోజులపాటు ఇక్కడ నిరాహారివై ఉన్నావు. నా గౌరవాంజలి స్వీకరించి నాకు శుభమయ్యేట్లు దీవించు. నీకు మూడు వరాలిస్తాను కోరుకో.

నచి : నాకు మీ ఆశీర్వచనాలు చాలు. మీరు కోరుకోమన్నారు గనుక మొదటి వరంగా మా తండ్రిగారికి కోపం పోయి ఆప్యాయంగా నన్ను స్వీకరించేట్లు అనుగ్రహించండి.

య.ధ : తథాస్తు: తరువాత రెండో వరం.

నచి : రెండోవరంగా స్వర్గప్రాప్తికి కారణమైన ఆ అగ్నివిద్యను ప్రసాదించండి స్వామీ.

య.ధ : నేనుపదేశిస్తున్న ఈ అగ్ని విద్య మంత్రము పదభ్రష్టం కాకూడదు. జాగ్రత్తగా విని తిరిగి నాకు విశదీకరించు (ఉపదేశిస్తాడు)



నచి : స్వామీ! ఈ యాగక్రమాన్ని వినండి స్వామీ (వినిపిస్తాడు)

య.ధ : నీ గ్రహణశక్తి అపూర్వం. కుమార నాకు చాలా సంతోషంగా ఉంది. నీవు మరో వరం కోరుకో-ఇస్తాను.

ఈ అగ్నిచయనం ఇకమీదట నచికేతాగ్నిచయనంగా లోకంలో ప్రసిద్ధి పొందుతుంది.

నచి : ధన్యుణ్ణి స్వామీ! మూడో వరంగా జననమరణ రహస్యాన్ని తెల్పే ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించండి.

య.ధ : ఆత్మ విషయం అతి సూక్ష్మం-వేరే ఏదైనా కోరుకో.

నచి : ఆత్మజ్ఞానాన్ని బోధించే సద్గురువులు మీకంటే ఎవరున్నారు స్వామీ! ఈ జ్ఞానంవల్లే మోక్షానందం కలుగుతుంది. సందేహించక బోధించండి-

య.ధ : తథాస్తు! అన్నిటికీ ఆత్మే ఆధారం-మానవులు అనుసరించే మార్గాలు రెండు. అవి (1) శ్రేయోమార్గం (2) ప్రేమోమార్గం.

మొదటిది నివృత్తికి దారి; రెండోది ప్రవృత్తికి దారి. ప్రవృత్తి ననుసరించి జననమరణ పరంపరలో చిక్కుకుంటాడు. నివృత్తి ననుసరించి మోక్షాన్ని పొందుతాడు.

నచికేతా! నీకు శుభం కలుగుతుంది. వెళ్ళి మీ తల్లి తండ్రులను కలుసుకో నాయనా!

(ఈవిధంగా ఆత్మతత్వాన్ని సంపాదించి నచికేతుడు భూలోకానికి వెడతాడు.)

దేవతలారా! మేము మీ మంగళకరమైన

ఆజ్ఞలను వినెదము గాక!

పూజ్యులైన యజ్ఞ సంబంధదేవతలారా!

మా నేత్రములచే భవద్విశేషమంగళ

రూపములను చూచెదముగాక

మిమ్ముప్రస్తుతించెదముగాక

ఇంద్రుడు; సర్యుడు మాకెల్లరకు
శుభంబునొసంగెదరుగాక;
గరుత్మంతుడను దేవతల
కాచార్యుడైన బృహస్పతీయు
మాకు మంగళమనోసంగెదరుగాక!

ఓం భద్రం కర్ణేభిఃశృణుయామ దేవా
భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః
స్థిరైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః
పశ్యేమ దేవహితం యదాయుః
స్వస్తిన ఇన్ద్రోవృద్ధశ్రవాః
స్వస్తినః పూషావిశ్వవేదాః
సస్తినస్తార్క్ష్యో అరిష్ఠనేమిః
స్వస్తినో బృహస్పతిర్ధదాతుః

ఓం శాంతి శాంతి శాంతిః

**✻ 12-6-1993**



వ్యాసాలు

# బుద్ధ జయంతి

**బు**ద్ధుడు కరుణామయ మూర్తిగా జన హృదయాలలో వెలుగుతూనే ఉన్నాడు. నేటికీ హృదయతాపాన్ని అణిచేందుకు ప్రేమను పెంపొందించి అహింసను పాటించేందుకు తాగ్యమూర్తి అయిన బుద్ధుని భావము సర్వకాలాల్లోను అనుసరించతగ్గదే కదా! ఆనాడు ఒక శాంతి దీపం వెలిగించి నూతన దృక్పథాన్ని, నూతన దృక్పథమే కాదు, వినూత్న సందేశామృతాన్ని ప్రసాదించిన శాక్యకుల ప్రదీపకుడైన సిద్ధార్థుని జన్మదినం, మహా పర్వదినం; జగత్కల్యాణార్థం ఈ మహనీయుడు ప్రభవించి హింసా ప్రపూర్ణ ప్రపంచానికి తన దివ్య సందేశ సుధాంజనాన్ని అందించి కారుణ్య దీప్తులు ప్రసరించిన అత్యంత పుణ్యదినం; ఇంతేకాదు, ఎన్నో కష్టాలను ఎదుర్కొని బాధా సంతప్త హృదయాలకు దుఃఖ నివారణ మార్గాన్ని బోధించిన ఆ పవిత్ర మూర్తి మహాపరినిర్వాణం చెందిన పూజనీయమైన దినం కూడా వైశాఖ పూర్ణిమనాడే.

కాగా, గౌతమ బుద్ధుని జీవితంలో ఈపై మూడు ప్రధాన సంఘటనలు వైశాఖ పూర్ణిమనాడే అవడంవల్ల అది మూడు విధానాలుగా పవిత్రంగా భాసిస్తోంది అందరికీ. ప్రపంచంలోని బౌద్ధులందరూ శ్రద్ధాసక్తితోనూ, ఆనందోత్సాహాలతోనూ దానాలు ధర్మాలు చేస్తారు. ఈ మహా పురుషుణ్ణి స్మరించి ధార్మిక జీవనానికి పునరంకితులౌతారు.

అది కపిలవస్తు నగర పరిసర ప్రాంతంలోని లుంబినీవనం. అక్కడి మహా భూరుహచ్ఛాయలో మాయాదేవి నోముల పంటగా పరమ తేజోమూర్తి ప్రభవించాడు. బాల్యం నుంచి భూతదయతో ప్రదీప్తం అయింది అతని మనస్సు. శుద్ధోదన సార్వభౌముడు ఎన్నో జాగ్రత్తలు తీసుకొన్నప్పటికీ, ఎన్ని కట్టుదిట్టాలు చేసినప్పటికీ సిద్ధార్థుని దృక్పథంలో దుఃఖదేవత పడనేపడింది. దేన్ని అతడు చూడరాదో అదే అతని కంట పడింది. ఇక నేముంది? అప్పటి నుంచి అతనిలో ఆనందం అంతరించి అతడు ఆలోచనా నిమగ్నుడైపోయాడు. రాను రాను అతని మనస్సాగరంలో భావకల్లోల తరంగాలు చెలరేగిపోయాయి. అతనిలో సత్యాన్వేషణ ప్రారంభమయింది. దుఃఖం

అతన్ని ఆవేశించింది. అంతే, ఇక దుఃఖ నివర్తక మార్గాన్వేషణ కోసం సిద్ధార్థుడు వజ్ర సంకల్పుడయ్యాడు.

ఈ కరుణా సముద్రుని నిరంతర సాధనకు దోహదకారి అయింది దుఃఖమే. లోక కల్యాణం కోసం బుద్ధుడు అనుభవించినట్లు మరెవ్వరూ అనుభవించలేదేమో దుఃఖాన్ని. నిజానికి, సిద్ధార్థునికి వ్యక్తిగతంగా దుఃఖాన్ని అనుభవించవలసిన అవసరం లేనే లేదు; సమస్త రాజభోగాలను, అతిలోక సుందరి అయిన తన యశోధరను, తన రాహులుని, ఇంతెందుకు తన సువిశాల సామ్రాజ్యాన్ని త్యజించి మహాభినిష్క్రమణం చేయవలసిన అవసరం ఏముంది కనక? లోకంలో ఉపాయప్రాప్తియే దుఃఖమంతా తన దుఃఖమే అనుకొన్నాడు. దుఃఖ సంతరణ ఉపాయప్రాప్తియే అతని పరమధ్యేయమైపోయింది అప్పటి నుంచీ.

గయలో అశ్వత్థ వృక్ష చ్ఛాయలో దీక్షా నిమగ్నుడయ్యాడు. దుఃఖ కారణం తెలుసుకోడానికి అతడు కఠోర తపస్సు చేశాడు. ఆయన లక్ష్యం ఎంత మహోన్నతమైందో అది అంత కష్టసాధ్యమైపోయింది. అయినప్పటికీ అతని దృఢ నిశ్చయం సడలలేదు. దేహం శుష్కించిపోయినా, తన తపోనిష్ఠచే సత్యదర్శన రూపమైన మహానుభూతిని సాక్షాత్కరింపచేసుకొన్నాడు. తన మార్గానికి విరాగం, విచారం, భూత దయ ప్రధాన అంశములైనాయి. ఈ మూడింటికీ వినయం, సత్యం, సేవ ఫల రూపాలయినాయి. వంచన, చౌర్యం, ద్యూత క్రియ మొదలైన చెడు మార్గాలు అవలంబించేవారికి, హింస ఆచరించేవారికి, నైతిక ప్రవర్తన లోపించినవారికి పై మార్గాలు సత్య పథాన్ని చూపగల్గుతాయి. సత్య పథాన్ని చూపడమేకాదు వారిని సంస్కరిస్తాయి.

ఆనాడు కళింగ యుద్ధంలో అశోకుడు రక్తపాతానికి పూనుకొన్నాడు. యుద్ధంలో లక్షలాది వీరులు మరణించారు. వేలమంది ఖైదీలుగా పట్టుపడ్డారు. ఎక్కడ చూచినా అసహాయుల హా హా కారాలు, వారి ఆర్తనాదాలు ప్రబలి అశోకుణ్ణి నిర్విణ్ణుని చేశాయి. ఈ దుఃఖం చూచి అతని హృదయం మారిపోయింది. ఈ హఠాత్పరిణామంతో తాను ఇక ఎన్నడూ జీవహింస చేయనని శపథం చేశాడు. ఇక అతనికి బుద్ధుని మార్గమే శరణ్యం అయిపోయింది. ధర్మచక్ర ప్రవర్తనకోసం తన జీవితమంతా సేవచేశాడు.

బుద్ధుని ధర్మ సిద్ధాంత బోధనలు, హిందూ దేశంలోనే కాక, ఖండాంతర దేశాల్లో కూడా వ్యాపించి ఇప్పటికీ నిలిచిఉన్నాయి. ఆయన బోధనల్లో విశ్వాసం



ఉన్నవారు– "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అనే "త్రిరత్నాల్ని" స్మరిస్తూ ధర్మబోధనలు చేస్తుంటారు. ఆనాటి బౌద్ధ సంఘా రామాలెన్నో విద్యాకేంద్రాలుగా విలసిల్లి భారతీయ సాంస్కృతిక పురోభివృద్ధికి దోహదం చేశాయి.

ఐహిక బంధ విముక్తి కోసం పాటుపడి, శాంతి మార్గం చూపి తరణోపాయాన్ని సాధించిన ఈ మహనీయుడు. మానవోత్తములలో ఉత్తముడు. బుద్ధుని నామధేయం విశ్వశాంతికే పర్యాయపదం. ఆయన ప్రవచించిన ధర్మబోధనలు నేటి యుద్ధ భయ సంక్షుభిత ప్రపంచానికి శిరోధార్యమై ఉన్నాయి. ప్రపంచం శాంతిని తృణీకరించినప్పుడు ప్రజాకోటి ఘూర్ణిల్లక తప్పదు. కారుణ్యాన్ని చిలికిన బుద్ధుని అహింసా సందేశమే మన భారతావని దివ్యవాణి. ఆయన అందించిన ప్రేమామృత సందేశం, దుఃఖోద్వేగ భారంతో కంపించిపోయే మానవ లోక కల్యాణ సంధాయకం. అంతర్జాతీయ విద్వేష జ్వాలలు చల్లారి, ప్రజలు నిర్భీకులై బ్రతకాలంటే, ప్రశాంత గంభీరమూర్తి బుద్ధమూర్తి నుంచి ప్రసరించిన శాంతి మార్గమే శరణ్యం. ఈ మార్గాన్ని అనుసరించినపుడే లోక కల్యాణం సాధ్యపడుతుంది.

*** జూన్, 1968**

**ఆంధ్రప్రభ పత్రిక**

# శ్రీకృష్ణ జన్మాష్టమి

అష్టమి రోహిణి ప్రొద్దున
నష్టమ గర్భమున బుట్టి యా దేవకికిన్
దుష్టుని కంసు వధింపవె
సృష్టి ప్రతి పాలనంబు సేయగ కృష్ణా.

అని చిట్టి తమ్ముళ్లు, చిన్నారి చెల్లాయిలూ వల్లెవేసే కృష్ణ శతక పద్యం మనందరికీ తెలిసిందే. శ్రీకృష్ణుని పేరు చెప్పేసరికి ఎందరెందరో మహాభక్తులు తన్మయత్వంలో మునిగిన సన్నివేశాలు కనిపిస్తాయి. జన్మాష్టమి అనేసరికి మనకు ఆ దివ్యమంగళ విగ్రహుడు, సకల కల్యాణ గుణాలకు ఆశ్రయుడు, వేద వేదాంతవేద్యుడు అయిన శ్రీకృష్ణపరమాత్మ మన కన్నులముందు సాక్షాత్కరిస్తాడు.

శ్రీకృష్ణుడు జన్మించినప్పటి పరిస్థితులు చాలా క్లిష్టంగా ఉన్నాయి. భూభారంతో బాటు అధర్మం పెరిగిపోసాగింది. దానవులు పెట్టే ఘోరహింసలు భరించలేక భూదేవి, ఇంద్రాది దేవతలు శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తారు. వారి ప్రార్థనలు ఆలకించి తాను భూలోకంలో అవతరించి దుష్టులను సంహరిస్తానని ఆయన అభయమిస్తాడు.

శ్రీకృష్ణుడి మేనమామ కంసుడు దుర్మార్గుడు. తన చెల్లెలైన దేవకీదేవికి పుట్టిన ఎనిమిదో సంతానం ద్వారా తనకు ప్రాణాపాయం ఉందని తెలుసుకొని దేవకీ వసుదేవుల్ని చెరసాలలో బంధిస్తాడు. ఒకరొకరినే పుట్టిన బిడ్డను పుట్టినట్లు తీసుకపోయి కంసుడు నిర్దాక్షిణ్యంగా చంపేస్తాడు. తరువాత అష్టమ గర్భాన శ్రావణమాసంలో కృష్ణపక్షపు అష్టమినాటి రాత్రి భగవంతుడు శ్రీకృష్ణుడుగా చెరసాలలో జన్మిస్తాడు. ఆనాడు అర్ధరాత్రివేళ, వసుదేవుడు భగవదాజ్ఞానుసారం యమునా నదిని దాటి అక్కడ నందునింటికి చేరి తన బిడ్డను యశోద ప్రక్కలో పరుండబెట్టి, ఆమెకు పుట్టిన ఆడశిశువును తీసుకువచ్చి దేవకీకిస్తాడు. ఈలోగా దేవకీదేవి ప్రసవించినదన్న వార్త కంసుడు తెలుసుకొని, పుట్టినది ఆడపిల్ల అని దేవకీవసుదేవులు చంపవద్దని ఎంత బ్రతిమాలుకున్నప్పటికీ వినకుండా కంసుడు ఆపసికందును సంహరించబోతాడు, కాని ఆ పసిబిడ్డ వెంటనే మాయాశక్తి రూపం ధరించి కంసుని చంపేవాడు ఇదివరకే జన్మించాడనీ, అతనికిక మృత్యువు తప్పదనీ చెప్పి అంతర్ధానమవుతుంది.

బాలకృష్ణుడు రేపల్లెలో పెరిగి విద్యాబుద్ధులు నేరుస్తూనే తన దివ్యలీలల ద్వారా అందరికీ విస్మయాశ్చర్యాలు కలిగిస్తూ ఎన్నెన్నో మహత్కార్యాలు సాధిస్తాడు. పూతన సంహారం, నలకూబరుల శాపవిముక్తి, యశోదకు సకల చరాచరమయమయిన విశ్వరూపాన్ని చూపడం, గోవర్ధనోద్ధరణం, కాళీయ మర్దనం, కంస సంహారం మొదలైన గోపాలకృష్ణుని లీలలు మన అందరికీ వీనులు విందుగొలుపుతూనే ఉంటాయి. ఈ మహనీయుని ఉపాసించిన భక్తులకు ఏ ఇక్కట్టులూ దరికి రాకుండా కాపాడే పరమ కరుణామయ మూర్తిగా ఆయన గోచరిస్తూంటాడు. శైశవావస్థ మొదలు, సర్వకాల సర్వావస్థల్లోనూ బహువిధ సంక్లిష్ట సమస్యలను లోక కల్యాణ సంధాయకంగా పరిష్కరించిన మహానుభావుడు. ఆయనకు అందరూ ఇష్టులే, చివరకు తన శత్రువులకు కూడా ఇష్టుడుగానే భాసించిన పూర్ణపురుషుడు యుద్ధారంభ దశలో, లోకోద్ధరణం కోసం అర్జునునికి భగవద్గీతా రహస్యాన్ని బోధించిన మహర్షిగా భాసిస్తాడు. యుద్ధంలో భీష్ముని ప్రచండ ధాటికి అర్జునుడు అలమటిస్తున్నప్పుడు శ్రీ కృష్ణుడు రౌద్రావతారం దాల్చి చక్రం చేబట్టుతారు. శ్రీకృష్ణుడు ధర్మసంస్థాపన కోసం అవతరించిన అవతార పురుషుడుగా ప్రసిద్ధి కెక్కాడు. సక్కుబాయి, మీరాబాయి మొదలైన పరమ సాధ్వీమణు లెందరెందరో ఆయనను కొలిచి ధన్యులయారు. పాలు, పెరుగు, వెన్న దొంగిలించిన బాలకృష్ణుని చిన్నారి దుడుకు పనుల నిదర్శనంగా కొన్ని ప్రాంతాల్లో జన్మాష్టమినాడు ఉట్ల పండుగలు చేస్తారు. ఉత్తర భారతంలో అందులోనూ ఆయన లీలలకు ఆలవాలమైన యమునా తీరాన గల మధుర బృందావనం ఆదిగాగల ప్రదేశాల్లో ఈ లీలామానుష విగ్రహుని ఆరాధనలు, భక్తిగీతాలు, భజనలతో చూడముచ్చటగా నిర్వహిస్తారు.

✻ **1969**

**ఆంధ్రప్రభ పత్రిక**

# గణేశ చతుర్థి

సద్బుద్ధిని ప్రసాదించి అజ్ఞానాన్ని హరించడానికి, సంపదల్నివ్వడానికి, సర్వవిఘ్నాలను నాశనంచేసి సకల కార్యాల్ని సిద్ధింపజేయడానికి, అనంత శక్తి సమన్వితుడైన శ్రీ మహా గణాధిపతి భారత జాతీయ జీవితంలో అనేక శతాబ్దాల తరబడి ఆరాధ్యదైవంగా భాసిస్తున్నాడు.

సంఘ జీవితంలో ప్రతి ఒక్కరూ ఆయన భక్తులే. గణపతి సర్వ సిద్ధిప్రదుడై ఏపని ప్రారంభించినా అది నిర్విఘ్నంగా కొనసాగేందుకు గణాధిపతిని పూజిస్తున్నాం.

ప్రతి యేడూ భాద్రపద శుద్ధ చవితికి ప్రతి ఇల్లూ కళ కళలాడుతూంటుంది. వినాయకుడు మన నిత్య జీవితంలో పెనవేసికొని పోయిన పవిత్ర మూర్తి, ప్రతి బాలుడు, ప్రతి బాలిక నోట్లో ఈ క్రింది పద్యం వినబడుతూనే ఉంటుంది.

"తుండము నేక దంతమును తోరపు బొజ్జయు వామ హస్తమున్
మెండుగ మ్రోయు గజ్జలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యల కెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ యోయి గాణాధిప నీకు మ్రొక్కెదన్."

మన ప్రబంధాల్లో, కావ్యాల్లో ప్రతి కవీ గణాధిపతికి అంజలి ఘటించి మరీ ఉపక్రమిస్తారు. ఆయన ఆశీర్వాద బలం అంత అమోఘమయింది. ఇలాగే పిల్లలు సంగీతం నేర్చుకునే ముందు హంసధ్వని రాగంలో వాతాపి గణపతిని ఎంతో శ్రవణపేయంగా ఆలాపిస్తారు.

దసరా పండుగ దినాల్లో చూర్ణికలు, పాటలు గణపతి మీద పాడతారు.

"శ్రీగణాధీశాయ శివకుమారాయ
నాగముఖ తుండాయ సృష్టి కర్తాయ
శ్రీకంఠ తనయాయ శివకుమారాయ
మాకు శుభములనిమ్ము మహిత విఘ్నేశ
జయ విజయీభవ దిగ్విజయీభవ."

విఘ్నేశ్వరుని పుట్టుకను గురించి గాథ మనకు సుపరిచితమే, కైలాసంలో



పార్వతీదేవి అభ్యంగన స్నానం చేస్తూ నలుగు బిండితో ఒక బొమ్మను చేసి దానికి ప్రాణం పోసి వాకిలివద్ద కావలి ఉంచిందట. ఇంతలో మహా శివుడు పార్వతి దేవి కోసం అక్కడకు రాగా వినాయకుడు లోనికి వెళ్ళవద్దని అడ్డగిస్తాడు. శివుడు క్రోధోద్రిక్తుడై త్రిశూలంతో ఆ పసిబాలుని శిరస్సు ఖండిస్తాడు. పార్వతి ఈ సంగతి తెలిసికొని చాలా విచారిస్తుంది. ఆ బాలుణ్ణి బ్రతికించవలసిందిగా ప్రాధేయపడుతుంది. శివుడు సమ్మతించి ఉత్తర దిక్కుగా తలుంచి నిద్రపోతున్న ఏ ప్రాణి శిరస్సునైనా తెచ్చి ఈ పిండి బొమ్మకు అతికించవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. ఆలాగున ఒక ఏనుగు కనిపిస్తే దాని శిరస్సు ఖండించి తెచ్చి పిండి బొమ్మకు అతికిస్తారు. అప్పుడు శివుడు ప్రాణం పోస్తాడు. అప్పటి నుంచి వినాయకుడు గజాననుడయ్యాడు. వినాయకుని జన్మదినంగా భావిస్తున్న ఈ చవితినాడే మనం పూజచేసుకుంటున్నాం.

ఈ పండుగ వర్షాకాలంలో వస్తుంది. ఇంకా బాగా వర్షాలు పడుతుంటాయి. ప్రకృతి రమణీయంగా పసిమి పచ్చని పట్టుచీర కట్టుకున్నట్లుంటుంది. పండుగ రోజున పిల్లల సంరంభం ఎక్కువగా ఉంటుంది. వినాయకుని విగ్రహాలు వేలకు వేలు మూర్తీభవించిన తేజోరాసుల్లా అనేక వర్ణాకృతులతో మనకు సాక్షాత్కరిస్తాయి. ఇవి అనేక తరహాల్లో ఉంటాయి. చిన్న చిన్న విగ్రహాల నుంచి నిలువెత్తున విలసిల్లుతూ నేత్ర పర్వంగా భాసిస్తాయి. ఈ పండుగ పేరు చెప్పి వినాయకుని మూర్తులను తయారు చేసి వాటికి రంగులు వేసి విక్రయించుకునే వాండ్లది పైచేయిగా ఉంటుంది. ఫల పుష్పపత్రాదులను ఏర్చి కూర్చి కుప్పలుగా పోసి అమ్మేవారి హడావుడి మరీ ఎక్కువగా ఉంటుంది. గ్రామ పరిసరాల్లోని వారు గణపతికి ఇష్టమైన 21 పత్రాలు ప్రోగుచేసి సమకూర్చుకుంటారు. చవితి మొదలు తొమ్మిది రోజులు అనుదినం వినాయకుని పూజించడం ఆచారమైంది. వీటినే గణపతి నవరాత్రులంటారు. ప్రసిద్ధ దేశ నాయకులు కీ.శే.లోకమాన్య బాల గంగాధర తిలక్, గణపతి ఉత్సవాలకు ఒక ప్రత్యేకతనూ, ప్రాముఖ్యాన్నీ కల్పించారు. శ్రీ ఎం. నరసింగరావు సంపాదకత్వాన వెలువడుతున్న "రయ్యత్" పత్రికలో చేరారు. కాని 'రయ్యత్"ను కూడా నిషేధించారు. అయితే ఈ పరిస్థితులవల్ల అధైర్యపడకుండా షోయబ్, శ్రీ బి.రామకృష్ణరావుగారి వంటి కొంతమంది మిత్రులు సహాయంతో "ఇమ్రోజ్" అనే స్వంత పత్రికను స్వయంగా స్థాపించారు. శ్రీ రామకృష్ణరావుగారి ఇంట్లోనే ఈ పత్రికా కార్యాలయం వుండేది. "ఇమ్రోజ్" పత్రికా

సంపాదకుడుగా అప్పటి నిజాం ప్రభుత్వాన్ని హడలెత్తించాడాయన. రజాకార్ల యొక్క వారి నాయకుడు కాశిం రజ్వి యొక్క మత విద్వేష విధానాలను, ఫాసిస్టు విధానాలను షోయబ్ నిర్దాక్షిణ్యంగా విమర్శించారు.

హైదరాబాదు, భారత యూనియన్‌లో విలీనం కావాలని ఆయన హుందాతనంవుట్టిపడే శక్తివంతమైన భాషలో నొక్కి వక్కాణించారు. అవధులులేని ఆయన పత్రికా వ్యాసంగం రజాకార్లకు కంటకప్రాయంగా పరిణమించింది. తమనూ, తమ విధానాలనూ విమర్శించడం మానుకోకపోతే తీవ్ర పరిణామాలు కలుగుతాయని వారు ఆయనను బెదిరించారు. అయితే ఆయన అటువంటి బెదిరింపులకు లొంగే మనిషికాదు. తన అంతరాత్మ ప్రబోధించిన సిద్ధాంతాలనూ, విధానాలనూ అనుసరించడం ఆయన మానలేదు. ఆయన రచనలో అతిశయోక్తులు ఎంత మాత్రం వుండేవి కావు. తనకు ప్రియమైన లక్ష్యాలను ప్రచారంచేయడానికి ఆయన తన కలాన్ని వినియోగించారు.

1948 ఆగస్టు 21వ తేదీనాడు శ్రీ షోయబ్ తన కార్యాలయం నుండి తిరిగి వస్తుండగా రజాకార్ దుండగీండ్లు ఆయనను కాల్చి, చేతులు నరకివేశారు. అటువంటి పరిస్థితులలో కూడ ధైర్యాన్ని కోల్పోక, గుండెచిక్కబట్టుకుని తన ఇంటివరకూ వచ్చి ఇంటికి కొన్ని గజాల దూరంలో స్పృహకోల్పోయారు. ఆ తర్వాత తన ఆప్తులనూ, అభిమానులనూ దుఃఖసముద్రంలో ముంచి దివంగతుడైనారు. రజాకార్ల విధానాలతో ఏకీభవించని మహమ్మదీయుల జీవితాలకు కూడా ప్రమాదం ఏర్పడడం, షోయబ్ ఉల్లా హత్య జరగడం 'పోలీసుచర్య'ను త్వరితం చేసినట్లు చెప్పవచ్చును.

**గాంధీజీకి ప్రతీక**

షోయబ్ తన తల్లిదండ్రులకు పదకొండవ సంతానం, చివరకు అతనొక్కడే మిగిలాడు. యవ్వన ప్రాయంలోనే ఆయన దారుణంగా హత్యచేయబడడంతో ఆయన తల్లిదండ్రులకు కలిగిన దుఃఖం వర్ణనాతీతం. అయినా వారు ఎంతో గుండెనిబ్బరంతో వ్యవహరించారు. హత్య జరిగిన రాత్రి ఆయన భౌతిక కాయాన్ని గృహానికి తీసుకువచ్చినప్పుడు ఎక్కడా ఏడుపుచప్పుడు వినిపించనీయలేదు. షోయబ్ ఉల్లాను "గాంధీ షోయబుల్లా" అని వ్యవహరిస్తూ ఉండడం ఆసక్తి కలిగిస్తుంది. గాంధీజీ వరంగల్లు జిల్లా మహబూబాబాదు మార్గంగా విజయవాడ వెడుతున్న రోజున షోయబు జన్మించారు. పోలీసుగా పనిచేస్తున్న షోయబుతండ్రి, రైలుస్టేషన్‌లో ఏర్పాట్లు చేయడానికి నియమించబడినాడు. గాంధీ దర్శనం ఆయనను ప్రభావితునిచేసింది. గాంధీజీ దివ్యవిగ్రహం ఆయన నయనాలలో నిలిచిపోయింది. ఆయన గృహానికి వెళ్లగానే కొత్తగా పుట్టిన కొడుకును చూపారు. కుమారుని తలనిమురుతూ "అరే! అతను గాంధీలాగా ఉన్నాడు" అంటూ వర్ణించాడు. అందువల్ల ఆబాలుని షోయబుగాంధీ అనే పిలిచేవారు.

గాంధీ హత్యగావింపబడిన సమయంలో షోయబ్‌ఉల్లా ఖాన్ విపరీతంగా దుఃఖించాడు, తనయుని కన్నీరు చూచి "ఎందుకు విలపిస్తావు, గాంధీజీ మరణం వీరోచితమైనదని" అతని తల్లి అన్నది. "అమ్మా: నాకు కూడ. అటువంటి మరణమే సంభవిస్తే నీవు కన్నీరు పెట్టవద్దు" అని షోయబు సమాధానమిచ్చాడు. అటువంటి మనస్తత్వం అతనిది. ఆయన జీవితం, జర్నలిస్టులకే గాక ప్రజలందరికి ఒక దృష్టాంతం అయింది.

ప్రభుత్వం ఆయన భార్యకు ఒక గృహాన్ని ఇవ్వడమేగాక పెన్షన్ కూడ ఏర్పాటు చేసింది. ఆయన ఇద్దరు కూతుళ్లు ఇప్పుడు వివాహితలు. అటువంటి త్యాగమూర్తుల కుటుంబాలు సంతోషంగా జీవనం గడిపే విధంగా చేసే బాధ్యత సమాజంపై ఉంది. ఏ ప్రభుత్వం గానీ, సమాజం గానీ షోయబ్ ఉల్లా ఖాన్ వంటి అమరవీరునికి యేమిచేసినా ఋణంతీరదు.

*** సెప్టెంబర్, 1969**

**ఆంధ్రప్రభ పత్రిక**

# పాత నుంచి కొత్తకు నిరంతర పరిణామమే ఉగాది సందేశం

నిన్నటితో సాధారణ వెళ్ళిపోయింది. అయితే ఊరికే వెళ్లిపోలేదు. ఒక పెద్దకోలాహలాన్ని రేపి వెళ్లిపోయింది. శీతాచల పర్యంతం దేశ రాజకీయ మైదానంలో ఒక బ్రహ్మాండమైన సంచలనాన్ని రేకెత్తించి వెళ్లిపోయింది.

ఇదిగో-మరొక చైత్రం వచ్చింది. మరొక వసంతం వికసించింది; హిమంకరిగి పోతోంది; తమస్సు విరిగి పోతోంది; ఉషస్సు వెలిగిపోతోంది, వసంత వేళా సుమదరహాసం కనులవిందై భాసిస్తోంది. అత్యంత రహితమైన కాలవాహిని తనతో పాటు ఎన్నెన్నో మార్పులను, చేర్పులను ఇలా తీసుకువస్తూనే వుంటుంది. కాలక్రమానుగత పరిణామం కొట్టొచ్చినట్టు కనబడుతుంది. ఎటుచూచినా కొత్త శోభ ఉత్సాహమూను; ఈనాడు సకల చరాచర ప్రకృతిలో ఒక నవ్యాతినవ్య వాసంత విలాసం గోచరిస్తున్నది. మానవతా నవజీవన వికాసానికి నాందీ చిహ్నమే ఉగాది పర్వం.

పాత నుంచి కొత్తకు ఈ నిరంతర పరిణామం అనుల్లంఘనీయమై సాగిపోతూనే వుంటుంది. చెట్లకో కొత్తచిగురు, కోయిలకో కొత్తపాట-అన్నిటా కొత్తయే రసరాగ ప్రపూర్ణమై భాసిస్తుంది, అశేషజన హృదయాంతరాలలో ఆనందానుభూతిని కలుగజేస్తుంది. ఆశలతో, ఆశయాలతో పయనించే అస్థిపంజరాల గొంతులలో అమృతం పోస్తుంది ఉగాది. వారి వారి గద్గద గళాలలో లోతులలో ఉగాది అడుగుల సందడి శుభాశాసంపూరితమై విలసిల్లుతుంది. మగత నిదురలో కనువిచ్చీ విచ్చని పసిపాపలను మేల్కొల్పి ముద్దులొలుకు మాటలతో తల్లిదండ్రుల చెంత జేర్చి బహుమతుల సంపాదించ సమాయత్త పరుస్తుంది సంవత్సరాది. కనుకనే ఉగాది నవజీవనానికి సంకేతం-ఇప్పటికీ-ఎప్పటికీ- ఏ ఉగాదికా ఉగాది వినూత్నత్వం పుణికి పుచ్చుకుని ఎదురౌతూ వుంటుంది. అందరిని సమ్మోహితులను చేస్తుంది.

ఉగాది పండుగను మనం చైత్రశుద్ధ పాద్యమి నాడు జరుపుకుంటున్నాం, తెలుగుదేశం లోనే కాక, అటు కన్నడ, మహారాష్ట్రాది ప్రాంతాలలో కూడా చైత్రశుద్ధ పాద్యమినే సంవత్సరాదిగా పరిగణిస్తారు. అసలు బ్రహ్మ ఈ విశాలజగత్తును చైత్ర శుద్ధ పాద్యమినాడే సృష్టించినట్టు పండిత ప్రకాండులు చెబుతారు. కాబట్టి, కాలపరిగణన బ్రహ్మ సృష్టితోనే ఆరంభమైంది; ప్రకృతిలో కూడా ఈ మార్పు కనబడుతుంది. కొత్తసృష్టి ఇప్పుడే ఆరంభమౌతుంది. చెట్లు చిగిర్చి కొత్తపూత ప్రారంభిస్తాయి. కొత్త పూతనిస్తాయి. కొత్త పిందెలు తొడుగుతాయి. చెట్లగుబురులలో గుసగుసలు వినిపించి, చిరునవ్వులు చిందుతూ మధుమాసోత్సవ వేళా వాతావరణంతో పులకింపజేస్తుంది. అందువల్ల ఈ వసంత ఋతువులలోనే సంవత్సరాది పరంపరగా వస్తూ వుండడం సముచితం. కాల విభాగసూచకమే ఉగాది. కాబట్టి యుగారంభం కూడా సంవత్సరాదితోనే ప్రారంభమైంది. ఇలాగ ఈ రోజు యుగాది అయి, క్రమంగా ఉగాదిగా మారి, సంవత్సరాదిగా స్థిరపడిపోయింది.

ఈరోజు ఉత్సాహంతోను, ఆనందంతోను వుండేందుకు ప్రయత్నిస్తాము. ఎందువల్లనంటే, ఈరోజు మనం ఉత్సాహంతో వుంటే సంవత్సరం పొడుగునా అదే వుంటుందని, లేదా దుఃఖంతోవుంటే సంవత్సరం పూర్తిగా అదే వుంటుందని మన నమ్మకం. అందువల్ల ఈరోజు ఉత్సాహంగాను, సంతోషంగాను వుండడానికి ప్రయత్నిస్తాము. ప్రతి ఒక్కరిని ఉత్తేజపరచేదిగా భావిస్తాము. ప్రతి ఒక్కరిని ఉత్తేజపరచి భావి కార్యకలాపాల సఫలతకు దీక్షాయుతలను చేస్తుంది-ఇదే ఉగాదిలోని ప్రత్యేకత. ఈ ఆశయే లేనివాడు మానవుడు జీవించడం కష్టసాధ్యం. తనకు ఉన్నంతలోనే సంతృప్తుడై భవిష్యత్తు కల్యాణ ప్రదంకాగలదని వాంఛిస్తాడు".

అయితే, మనమందరం ఎన్నో ఆశలు, ఆశయాలు పెట్టుకొన్నా ఈనాటి ఉగాది "విరోధికృతు"గా సాక్షాత్కరించింది.

విరోధికృద్వత్సరేతు పరస్పర విరోధినః
సర్వేజనో నృపాశ్చైవ, మధ్య పస్యార్ఘవృష్టయః"

విరోధికృతులో రాజులు, ప్రజలు పరస్పరం విరోధంతో వుంటారట, పంటలు మధ్యమంగా ఉంటాయట.

తెలుగుసీమ నాల్గు చెరగులా మామిడి తోరణాలతో, గడపగడపకు పసుపు, కుంకుమలతో, చిత్ర విచిత్ర రంగవల్లీ విన్యాస పరిశోభిత గృహ ప్రాంగణాలతో

విరాజిల్లుతూ వుంటుంది. మరి ప్రకృతి, దాన్ని అంటిపెట్టుకుని జీవితం; సమాజం అంతటిలోనూ సంచలనం ఏర్పడుతుంది. చైతన్యం ప్రతిస్తుంది. పరిపూర్ణత వుంటుంది. పసిపిల్లల సందడి పతాకస్థాయి అందుకుంటుంది. ప్రాతఃకాలాన్నే తలంట్లు, నూత్న వస్త్రాలంకారాలు అన్నీ యథాక్రమంలో సాగిపోతూ దైవ పూజాదికాలు జరుపుకుంటూ అంతా గురువుల ఆశీర్వాదాలు అర్థిస్తారు. వెలుగు నింటి నీడలాగ, సుఖం, దానినంటి దుఃఖం ఉండునట్టు ప్రతి ఒక్కరి జీవితాలలోను ఏవైనా ఆటంకాలు ఉండవచ్చు; మనశ్శాంతి ఉండకనూ పోవచ్చు.

అయినా ఈ సుఖ దుఃఖాత్మకమైన ద్వంద్వ ప్రకృతిని సమన్వయిస్తూ మనమందరం వేకువనే రుచిచూచే ఉగాది పచ్చడిలోనే, జీవిత రహస్యం. లేదా సృష్టి రహస్యమే ఇమిడి వున్నదంటే అందులో అతిశయోక్తి లేదు. ఎంత భగ్న హృదయాలలోనైనా ఎంతటి ఉద్విగ్నులలోనైనా ఉగాది చైతన్యం కలిగిస్తుంది. ఎవరుకూడా సంవత్సరాది ప్రసాదించే చైతన్యాన్ని గుర్తించకుండా నిర్జీవమూర్తులుగా కూర్చోలేరు. ఈనాడు వారిలో కూడా ప్రసన్నత గోచరిస్తుంది.

ఈ క్రొత్త ప్రకృతి ప్రసాదించిన వేపపూవు, కొత్తబెల్లం, పులుపు మామిడి పిందెలు వీటినన్నిటిని కొత్త వర్షపు రాణి అత్యంత ప్రేమతో మేళవించి ఉగాది పచ్చడిని మనందరికీ పంచియిచ్చి ఉగాది సందేశాన్ని స్వీకరించమంటున్నది. ప్రసాదం స్వీకరించడంతో సరిపెట్టుకోక. అది ప్రసాదించే బాధ్యతలను మోసేందుకు సంసిద్ధులం కమ్మంటున్నది. ఈ విరోధికృతు సుధామధుర భాండాల్ని ఇస్తుందో? లేదా హాలా హలకీలికలను వ్యాప్తం చేస్తోందో?

నేటి గ్రామీణ పరిసరాలలో కనీసం ఎక్కడో ఒకచోటనైనా పంచాంగ శ్రవణం వినబడుతూ వుండడం విశేషం. ఆనాటి పంచాంగశ్రవణాలు, శ్రద్ధాసక్తులు అంతంత మాత్రంగానే వుంటున్నాయి, శాస్త్రులవారు లగ్నకాలాది చక్రరాశులలో దాగివున్న నేటి యుగాది రహస్యాన్ని ఛేదించి విశదీకరిస్తారు. పైన చెప్పినట్టు విరోధికృతు వత్సరఫలం నిరుత్సాహకరంగా వుందని నిస్పృహ చెందకుండా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. అభిరుచులు, వ్యక్తిత్వాలు వేరైనప్పటికీ ప్రతి ఒక్కరూ ప్రతి విషయాన్ని ప్రగాఢ పరిశీలన చేసుకోవాలి.

దేశంలో ఎన్నికల కోలాహలం ముగిసింది. ఎవరు నెగ్గినా, ఎవరు



ఓడిపోయినా ద్వేషం సమసిపోవాలి. జయాపజయాలు దైవాధీనాలు. వాటిని విశాల హృదయంతో స్వీకరించాలి. ఎంతో నిగ్రహంతోను, సౌహార్ద సౌమ్యరస్యాలతో వ్యవహరించినపుడే రాగల ఉగాది నాటికి ఆశించిన అభ్యుదయం,, శాంతి లభిస్తాయి. న్యాయబద్ధమైన సాంఘిక వ్యవస్థ రూపొందేందుకు కృతనిశ్చయంతో మనం ముందుకు సాగాలి. జాతీయ జీవన పునరుజ్జీవనానికి ఉగాది మరొక మైలురాయి, అది వెలిగించే చైతన్యమే మనలను క్లిష్టసమస్యల నుంచి విముక్తం చేసి ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చగలదని విశ్వసిద్ధాం. సర్వేజనా సుఖినోభవంతు.

**✻ 27-3-1971**

**ఆంధ్రజ్యోతి దినపత్రిక**

# శ్రావణమాసంలో...

శ్రావణమాసం వచ్చిందనే సరికల్లా ఎన్నెన్నో ఆనందానుభూతులు ఎన్నో మనోజ్ఞమైన దృశ్యాలు మనఃఫలకం మీద ప్రతిబింబిస్తాయి. సామాన్యంగా ఇది వర్షాకాలం కావడం చేత ఆకాశం మేఘాచ్ఛాదితమై ఉంటూ సూర్యభగవానుడు అలా మధ్య మధ్య దర్శనమిస్తూ ఇంతలోనే అదృశ్యమవుతూంటాడు. ఓ పక్కనుంచి చెవులను దూసుకుంటూ గజగజవణికించే చలిగాలి, మరో వైపు నుంచి అలా వచ్చీపోయే వానజల్లును మహానగరాలలోని సిమెంటు కాంక్రీటు రోడ్లూ, తారురోడ్లూ మాదిరిగాగాక, మరీ మారుమూల ఉంటే పల్లెటూళ్లయినట్లయితే ఇపుడు కూడా ఇంకా అడుగు పెట్టనేలేము. సరిగదా దారి అంతా ఒకటే బాడీ బురదగా ఉంటూ నడవడమే కష్టమైపోయి ఇక వర్షాకాలం తన ప్రభావాన్ని అక్కడ బాగా చూపుతుంటుంది. మరి అందుకనే ఏ చింకెగొడుగో వేసుకుని జనావళి వస్తూపోతుండడము మనం చూస్తూంటాము.

ఏడాదికోసారి వస్తూ ఏ తత్కాల సంజనితమైన పరిణామాన్ని తీసుకువచ్చి దానితో బాటు ప్రతి ఒక్కరికీ, విశేషంగా ప్రతి ముత్తైదువు హృదయానికి నవ్యత్వాన్ని ఆపాదిస్తూ నూతన విశ్వాసాన్ని కలుగుజేస్తుంది శ్రావణ మాసం. అందుకనే తెలుగు దేశంలో నేటి ఆధునిక సమాజంలో పూజలు, పునస్కారాలూ అంతంత మాత్రంగానే ఉంటున్నా వాటిని పాటించేవారు ఏ కొద్దిమందో అనే చెప్పాలి.

ముత్తైదువులకు పరమపవిత్రమై భాసిస్తూ భక్తి శ్రద్ధలతో పురుషునితో బాటు సమానత్వం కోసం అలమటిస్తున్న ఈనాటి అత్యాధునిక వాతావరణంలో పరస్పర వైరుధపు ప్రకృతుల్లో నలిగిపోయే స్త్రీ హృదయానికి ఈ చల్లటి వాతావరణం ఎంతో ప్రశాంతినీ, మనశ్శాంతినీ కలుగజేస్తుందంటే అందులో అతిశయోక్తి లేదనే చెప్పాలి. దీనికితోడు స్త్రీలకు సంబంధించిన వివిధ వ్రతాచరణాది కార్యకలాపాలు ఈ మాసానికి ఇంకా వన్నె చేకూరుస్తాయి. ప్రతి శ్రావణ మంగళవారమూ ఏదో ఒక నోమూ, ఏదోఒక పూజ ఆచరించే స్త్రీలకూ, కొత్తగా పెండ్లి అయిన వధువులకు ఎంతో పవిత్రంగా భాసిస్తూ వారికింతో అంతో భక్తినీ శ్రద్ధాసక్తులను ఆపాదిస్తుందీ ఈ



మాసం. తన అభ్యుదయాన్ని కాంక్షించే ప్రతి స్త్రీ కూడా లక్ష్మీ పూజనీ ఐదోతనాన్ని, ఐశ్వర్యంతో బాటు సౌభాగ్యసందాయకమైన మంగళ గౌరీవ్రతాన్ని, నూత్న వధువులు వారితోబాటు ముత్తైదువలూ శ్రద్ధాభక్తులతో ఆచరిస్తుంటారు. దీర్ఘకాలం ఆచరించే నోములూ వ్రతాలూ ఇప్పటి నుండే ఆరంభిస్తారు. మరి పురాతనాచారాదికాలను పాటించే వాళ్లింకా పట్టణ ప్రాంతాల్లో కూడా అక్కడక్కడ ఉంటున్నా గ్రామీణ ప్రాంతాల్లో అయితే ఈ విధమైన పూజాదికాలు మన కెక్కువగా కన్నులకు విందు చేస్తుంటాయి. నిజానికి సమ్మర్దంతో ఉక్కిరిబిక్కిరౌతూ ప్రశాంతతకు, అలమటించే పట్నవాసపు జీవితాల కిసుమంత మనశ్శాంతి చేకూరేది పల్లెపట్టులలోనే అనిపిస్తుంటుంది. ఎక్కడో ఏ పల్లెపొదల మాటుననో మొగలి డొంకలలోంచి సొగసుగా విప్పారిన మొగలి రేకుల గుబాళింపు; చెదురుగా ఏ లోగిలి ముంగిటనో వినబడే కల్యాణ కింకిణీ మధుర మంగళ మార్యవాలు; ఏ బావిచెంతనో తన చిట్టితల్లి ఏ నోముకో ఆయత్తమౌతున్న పాలధారల సవ్వడి, శ్రావణ మంగళవారపు సాయం సంధ్యల్లో శోభావహంగా అలంకృతలై పేరంటానికి వెళ్లి ఫలపుష్ప తాంబూల వాయనాదులతో తారసిల్లే ముత్తైదువుల కలకలం ఇలా ఎంతో మనోజ్ఞంగా ఉంటుంది అక్కడి వతావరణం.

మరో సంగతేమంటే ప్రతిరోజూ సూర్యభగవానుని దర్శనమవకుండా భోజనం చేయకూడదనే దీక్ష వున్న వృద్ధులకూ వృద్ధమాతలకూ ఇంకా ఇతరులకూ ఈ రోజుల్లో చాలా సంకటమైన పరిస్థితి ఏర్పడుతుంటుంది. అసలు ఆరవేసుకున్న మడిబట్టలే ఆరవు. ఇపుడైతే, చాలావరకు గ్యాసుపొయ్యేలూ, గ్యాసు స్టౌలూ వచ్చాయే గాని, గ్రామ వాతావరణంలో అయితే-వంట చెరకు చెమ్మగిల్లిపోయి, త్వరగా అంటుకోక అన్నంత్వరగా తయారవదు-ఇంతలో పిల్లల ఏడుపు, ఏ బడికో పోయే పసిపిల్లల హడావుడి తల్లుల విసుగు, తండ్రుల కేకలు, కోపాలూ తాపాలూను. ఇలా ఏదో చిందులు త్రొక్కినమాదిరిగా చికాకుగా ఉంటుంది. వాతావరణం.

ఇక ఎంతసేపయినా అలాగ సూర్యుని కోసం నిరీక్షించవలసిందే. తెరపిలేకుండా కురిసే వానలుంటే ఇక చెప్పవలసిందేలేదు. ఒకవేళ వానజోరు తగ్గినా, విడవకుండా ఉంటూ మనల్ని చికాకు పెట్టే చిన్న చిన్న తుంపర పడుతుండటమూ ఇలా వచ్చే మబ్బూ, అలాపోయే మబ్బూ అవడంవల్ల సూర్యభగవానుని దోబూచులే కనబడుతుంటాయి మనకు. కనికరించి ఒకవేళ లోకబాంధవుడు దర్శనమిచ్చినా మా

అమ్మమ్మలాంటి వాండ్లు ఏ వంట ఇంట్లోనో, ఏ పని తొందరల్లోనో ఉంటే- 'ఎండవచ్చిందని' ఏమనుమరాలో వెళ్లిచెప్పడము, ఇక ఆమె పెరటిల్లోకి వచ్చేసరికల్లా సూర్యుడు చటుక్కున ఏమబ్బులోకో మాయమవడమూ సాధారణంగా జరుగుతుంటుంది. ఈ విధంగా ఒక్కొక్కప్పుడు, ఆరోజంతా అమ్మమ్మకు భోజనం ఉండనే ఉండదు. మరి ఏ పండోఫలమో భుజించి సరిపెట్టుకోవలసిందే. ఆనాటి వృద్ధుల జీవితాలే వేరు. ఆ మనస్తత్వాలూ, అనుబంధాలు ప్రేమలూ నేడు కానరావు. యాంత్రికమైపోయాయి జీవితాలు. నోరారా పలకరించి, మనస్సు విప్పి మాట్లాడే వ్యక్తిత్వాలే ఇంతకీ వ్రతాలూ, పూజలూ, నోములూ ఇవన్నీ గూడా దైనందిన జీవిత విధానంలో భక్తితోబాటు పుణ్యసాధనకోసం మన పెద్దలు నిర్ణయించిన నియమవిశేషాలే. ఎవరైనా వారికి తగ్గట్టు-ఏమాత్రం కాస్త కాలం అనుకూలించినా-ఈ శుభకార్యాలు ఆచరిస్తూండటం మనకు పరిపాటి. శ్రావణ శుక్లంలో నాగపంచమీ పూజలు చేసుకుంటారు. చవితినాడు ఉపవాసం ఉండి మరుసటి రోజు పంచమినాడు నాగపూజచేసి దానధర్మాలు చేస్తారు. శ్రావణ పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం చాలా పవిత్రమైన దినంగా ఎంచబడుతున్నది. ఈ రోజున ఆ పరమేశ్వరుడే అన్నట్లు

వ్రతానాముత్తమం నామ సర్వసౌభ్యాకారణం
సర్వసమ్పుత్ర్పదం శీఘ్రంపుత్ర పౌత్ర ప్రవర్ధనం
వ్రతమస్తి మనోహరం, శుక్లే శ్రావణికే మాసే
పూర్ణిమో పాంత్య భార్గవేయదాతునారీ వర్తేత
వ్రతే తస్యాఃఫలంశృణు"-

శ్రావణ మాసంలో పూర్ణిమకు ముందటి శుక్రవారము నాడాచరించవలసిన ఈ వ్రతం ద్వారా స్త్రీకి కలిగే పుణ్యఫలం పార్వతీదేవికి పరిచయం చేస్తాడా పరమశివుడు. వరలక్ష్మీవ్రత పూజకై స్నానాదికాలాచరించి పచ్చనాకుల తోరణాలు కట్టి, రంగవల్లులు తీర్చిదిద్ది వరలక్ష్మీదేవిని కలశంలో ఆవాహనంచేసి షోడశోపచారాలతో అర్చించి, తొమ్మిది పోగుల తోరము పూజించి కట్టుకుని ఆ తల్లి అనుగ్రహ ప్రసాద లబ్ధికి చారుమతి అనే భక్తురాలి కథను విని ధన్యులౌతారు-ఇరుగుపొరుగు ముత్తైదువులకు, పెద్దలకు వాయనాల్ని వ్రతాన్ని విడువకుండా ఐదేండ్లు వరుసగా చేస్తుంటారు.

ఇలాగే శ్రావణ పూర్ణిమ కూడా మనకు చాలా పవిత్రమైనదే. నూతన యజ్ఞోపవీత ధారణం ఒక ప్రత్యేకమైన కార్యక్రమంగా కొనసాగుతుంది.



ఉపాకర్మాదికాలు కూడా కొనసాగుతాయి. 'నిత్యకర్మానుష్ఠానాలను సరిగా నిర్వర్తించుకొనవలసిన ఆవశ్యకతను మళ్లీ జ్ఞప్తికి తెస్తుందీ పుణ్యదినం. దేనికైనా అంచంచలమైన విశ్వాసమంటూ ఒకటి ఉంటే ఆయా కార్యాల్లోని పావిత్ర్యం అర్థమవుతుంది. దీన్నే ఇక్కడివారు 'రాఖీ' పున్నమి అని వ్యవహరిస్తారు. ఈనాడు బంధువర్గంతోబాటు మిత్రులూ, హితులూ ఒకరికొకరు చేతికి పట్టుదారము లేక కుచ్చులు కట్టుకుంటారు. పరస్పరం కలసి ఉండేందుకు సమ్మతి సూచకంగా ఈ రాఖీని కట్టుకుంటారు. దీన్నే రక్షాబంధనమని అంటారు. ఈ మహోత్సవం చూడముచ్చటగా సాగిపోతుంది.

ఈ మాసంలోనే శ్రావణ బహుళంలో మరో విశేషం ఉంది. ఈ పుణ్యభూమి యందు తాను అవతరించేందుకు తగిన సమయమని శ్రీకృష్ణ పరమాత్మ జననమంది నది శ్రావణ బ॥ అష్టమినాడే మరి ధర్మసంస్థాపనకోసం ఆవిర్భవించిన అవతార పురుషుడు. కృష్ణాష్టమి వేడుకలు ఎంతో నయనపర్వంగా జరుపుకొంటారు.

ఇదికాక శ్రావణ బహుళ అంత్యమునందు వేరొక విశేషం కూడా ఉంది. దీన్నే పోలాల అమావాశ్య అని వ్యవహరిస్తారు. చిన్న పిలకలతో ఉండే కందదుంపకు పసుపు, కుంకుమలు పెట్టి పూజిస్తారు. కుటుంబక్షేమం కోరి ప్రార్థనలు జరిపి తోరం కట్టుకొంటారు.

ఇన్ని విశేషాలతోబాటు మనకీ నెలలోనే ఆగస్టు పదిహేను సాక్షాత్కరిస్తుంది కూడాను. ప్రతి భారతీయున్ని హర్షపులకాంకితుణ్ణి చేసి చైతన్యం కలిగించే మన త్రివర్ణ పతాకం ప్రతిచోట రెపరెపలాడుతుంది.. స్వాతంత్రోత్సవ వేళా విన్యాసాలు ఆసేతు సీతాచల పర్యంతం గోచరిస్తాయి. ఒక్కసారి గతాన్ని పునర్విమర్శించుకుని భవిష్యత్తును గురించి ఆలోచించుకునేందుకీ శుభచిహ్నాలు ఎంతో ఉపకరిస్తాయి. శ్రావణం ఎటుచూచినా శుభావహమై కొంత ప్రశాంతిని కలుగజేస్తుంది. భారతీయ సాంస్కృతిక జీవిత విధానంలో ఇమిడి ఉండే పరమరహస్యమె ఇది. అట్టి సంస్కృతిని తిరిగి పునరుజ్జీవింప జేసేందుకు మనం పాటపాడదామ-

**∗ 19-7-1982**

ఆంధ్ర పత్రిక

# మల్లంపల్లివారి పాండితీగరిమ



శర్మగారి రచనలన్నీ వారి భాషా ప్రావీణ్యతకు తార్కాణం: మృదుమధురశైలిలో, గంభీరమై, స్వచ్ఛమై ఒక మహాప్రవాహంవలె ప్రవహిస్తుంటాయి. చూడండి ఈ క్రింది పంక్తులు....

"రాగరంజితములయిన సంజవేళల పుష్పసుగంధ
భారాలసము లయిన తెల్ల తెమ్మెరలతో సమానముగ
నాటలాడుచు, గిరికుమారుల యుపలాలనములకు
జొక్కుచు తపోదాస్రవంతి ఆనగరోపాంత
భూమిని తన చిన్ననీడల నొయ్యారము దిద్దు
కొనుచు మందమందముగ నడయాడు చుండును"

—జాగగృహము

ఆరముగ్గెన పండువంటి ముసలి ముత్తయిదువు వేదమాత
ధరించిన పాపట బొట్టువలె పావనమైన గంగానదీతీరమున
విరాజిల్లుచున్నది వారణాసీపురము. క్రతుకర్మ
పరాయణులయిన బ్రాహ్మణుల సంతతయాగ
హెమధూమపంక్తులు సుళ్లు తిరుగుచు పైకెగసి
మేఘమాలికల ననుకరించుచు ఆ నగర రత్నమునకు
ఒక వింతచెవమును దిద్దు చుండెను.

—ప్రశాంత విడ్లవము

నాకింకా బాగా చిన్నతనం. అప్పుడే నేను శ్రీ శర్మ గారి వద్దకు వచ్చి చదువుకుంటున్న రోజులవి. అప్పటికి వీరు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలోనూ, తదుపరి భారతిలోనూ పనిచేస్తూ వచ్చారు.

వారి ఉదార స్వభావం అనేక మందిని ఆకర్షించింది. ఎవరు వచ్చినా సరే వారు చూపే గౌరవమూ, ప్రేమా మరపురానివి. అనుదినమూ వారింటికి వచ్చి అనేక విషయాలను గురించి (చారిత్రకమైతేనేమి, సాంఘికమైతేనేమి) చర్చిస్తూండేవారు. చర్చలు సాధారణంగా వారు ఆఫీసు నుంచి వచ్చిన 7 ఘంటల నుంచి మొదలు తొమ్మిదిన్నర వరకూ సాగుతుండేవి.

శర్మగారి కంట ఏదైనా ఒక క్రొత్త విషయం పడిందన్నా, లేక ఒక కొత్త సంగతి వారి చెవిన బడినా, లేదా ఏదైనా ఒక కొరుకుడువడని సమస్య నిర్ధారణ చేయవలసి వచ్చినా, ఆ అంశాన్ని గురించి కూలంకషంగా తెలుసుకునే వరకూ వారు అహోరాత్రులు, నిద్రాహారాలు మాని కృషి చేసేవారు. వారు ఎక్కడకు వెళ్లినా సరే, ఏం చేస్తున్నాసరే. ఇంటి వ్యవహారాలు తారుమారైనాసరే, వారి ఈ కృషి నిరాఘాటంగా ముందుకు సాగవలసిందే! ఆ కృషికి, ఆ జ్ఞానోపార్జనకు; వారు తహతహలాడుతుండేవారు అనుక్షణమూను–అట్టిది వారి దీక్ష! అట్టిది వారి ఆసక్తి! ఆయా సమస్యలను పరిశీలించి ఆ నిజాన్ని గుర్తించిన తరువాత వారి ఆనందానికి అంతుండేది కాదు. వారి సంతోషం వెల్లివిరిసేది. వారి హృదయం ఉప్పొంగి పోయేది.

వారు పరిశోధించిన విషయాన్ని, వారు గ్రహించిన సత్యాన్ని వెంటనే వ్యాసరూపంలో వ్రాయడమే జరిగినట్లయితే–ఇప్పటికి వారు వ్రాసిన వాటికంటె ఇంకా ఎన్ని వందల వ్యాసాలను ప్రచురించి ఉండేవారో ఊహించుకోవచ్చు. "నిజమేమిటో గుర్తించాం కదా; "ఆ సమస్య పరిష్కరించాంకదా" అనే సంతోషంలో వారు ఆయా

సమస్యలను ప్రచురించుట ఉపేక్షిస్తూ వచ్చారు. కాగా ఈ సమస్యలనే వారి వద్దకు వచ్చి చర్చించి తెలుసుకున్న కొందరు ప్రముఖులు సేకరించి వారే ప్రచురించుకొనేవారు. శ్రీ శర్మగారి జీవితంలో – 'పరిశ్రమంతా వీరిది–ప్రచురణ భాగ్యం; పేరు ఇతరులది అయిన అంశాలు కొల్లలున్నాయి వ్రాయాలంటే

మద్రాసు ఆదెప్ప మొదలి వీధి అంటే వారి పరిశోధనా కాలం జ్ఞాపకం రాకమానదు. రాత్రిళ్లు వేకువ ఝామువరకూ వారు ఎదో ఒక సమస్యను గురించి వ్రాస్తుండేవారు, పరిశోధిస్తూనే వుండేవారు. వారి నిత్య దైనందిన జీవితంలో కానిమార లైబ్రరీగాని, యూనివర్శిటీ లైబ్రరీగాని, ఓరియంటల్ లైబ్రరీ గాని సందర్శించి తమ పరిశోధన సుగమంగా చేసుకుంటూ వచ్చారు–విధిగా ఇది జరిగి తీరవలసిందే. కాలినడకను ఇంతదూరమూ వెళ్లవలసిందే–

ఆంధ్ర పత్రికా ఆఫీసులో పనిచేస్తున్న కాలంలో వారిది రూ.70 ల స్వల్ప జీతం. ఈ జీతంతో ఇంటిలో ఉంటున్న ఇంటెడు మంది పోషణ భారం. మరి ఎలా సర్దుకు వచ్చేవారో ఆ దంపతులిద్దరూ–'ఏమీ లోపం జరిగేది కాదు– జరగనిచ్చేవారు కాదు. అనుదినమూ పురశవాకం నుంచి జార్జిటవును తంబు చెట్టి వీధిలోని ఆంధ్ర పత్రికా కార్యాలయానికి నడచి వెళ్తూ వస్తూండేవారు.

నాకు బాగా జ్ఞాపకం. ఆనాడు వారి వద్ద కొద్ది చిల్లర మాత్రం ఉన్నది. నాకు నాలుగణాలు కావలసి వచ్చింది. వెంటనే పర్సు తెర్చి ఉన్న చిల్లరని నిచ్చారు. 'చాలా' ఇంకా కావాలా అన్నారు. వారు వెళ్లిన తరువాత నా మనస్సు బాధపడ్డది. అయ్యో–మామయ్య నడచి వెడతారు కాబోలునే ఆయన పర్సులో ఈ నాలుగణాలు తప్ప మరి లేవే–నా క్రికెట్ టీమ్ సబ్‌స్క్రిప్షన్ మరో రోజున కట్టుకునేవాణ్ణే అని ఇతరుల మనస్సు కించపర్చడం వారు సుతరామూ ఒప్పుకునేవారు కారు.

ఏవైనా పండుగలు, హడావిడులు వస్తే వారి ఇంట్లో ఆ వేళ ఒక మహాసంతర్పణే. ప్రతివారూ, మిత్రులైతే నేమి బంధువులైతేనేమి అందరూ వారింట్లో సంతృప్తిగా పంచభక్ష్యాలతో భోజనం చేయవలసిందే. ఏమీ లోటు రాకూడదు. ఆ రోజున ఏ విషయంలోనైనా కించెత్తులోటు కనబడితే వారు ఉగ్రులయేవారు–ఆరోజు మా అత్తయ్యకు కేకలు, చివాట్లు తప్పేవికాదు. నిరంతరం నిత్యాన్నదానం వారి గృహం. ఇప్పటికీ అంతే ఏమీ, ఇంతే కాదు వారి ఇల్లు ఒక సాహిత్యరంగమే. వచ్చే వారు



పోయేవారు. వారితో చర్చించేవారు కొంతమంది. వారిని చూడ్డానికి వచ్చేవారు కొంతమంది. విషయాలు నేర్చుకునేందుకు వచ్చే వారు కొంతమంది.

ఒక విషయాన్ని గురించి వారు చర్చ ప్రారంభించారంటే ఒక మహోపన్యాసం ఇచ్చేవారు. ఆ చర్చించే విషయం యొక్క అగాధమైన లోతులకు పోయి–మనలను కూడా అక్కడకు తీసుకుపోయేవారు వారితోకూడా–సమగ్రంగా పూర్వాపరాలతో, వివిధ వర్గాల విభిన్న దృక్పథాలను కూలంకషంగా పరిశీలిస్తూ, అరటిపండు ఒలిచినట్లు సులభంగా తద్విషయాన్ని మనం ఇహ మరచిపోలేని విధంగా విశదీకరిస్తుంటాయి శ్రీశర్మగారు. వారు మాటాడుతున్నప్పుడు, వారు చర్చిస్తున్నప్పుడు, ఒక్కొక్కప్పుడు ఏదైనా అట్టి విషయం వస్తే–వారిలో వీరరసం మూర్తీభవించేది. వారి వాగ్ధాటి సముద్ర తరంగాల వలె పొంగి, ఎదుటివ్యక్తులను పునాదులతో కదిలించి ఒక నవ్య చైతన్యాన్ని కలుగుచేసేది. వారి ప్రబోధానికి అది తార్కాణం. అట్టిది వారి వాగ్గేవి. ఆంధ్ర దేశపు పురాతత్వ చరిత్రలో ఆంధ్ర రాజ్యం మేలిన పూర్వ రాజవంశాల చరిత్రలో ఆంధ్రులకు సంబంధించిన సంస్కృతి లోనైతేనేమి, వివిధ కళలనైతేనేమి, వారి సాహిత్యంలో నైతేనేమి, పురాతన రాజవంశీయుల దానశాసన వాఙ్మయంలో నైతేనేమి, శ్రీశర్మగారు ఒక చారిత్రక నిఘంటువే. ఒక విజ్ఞాన సర్వస్వమే. తీగను కదిలిస్తే డొంకంతా కదిలిన రీతి వారిని ఒక విషయాన్ని గురించి కదిలించామా, డొంకంతా కదిలిందన్న మాటే–అంతే– వారు ప్రారంభిస్తారు. ప్రారంభించడమేమిటి–గోదావరి మంజులగానం వలె, తుంగభద్ర నిర్మల తరంగాలవలె వెంట వెల్లువలై ఒక వాగ్వాహిని సెలయేరై ప్రవహిస్తుంది. వారినోటవెంట దానికడ్డమాకలు లేవు. అఖిలాంధ్ర దేశంలో ఉన్నటువంటి బహుకొద్ది చరిత్రకారులలో వీరు అపూర్వ చారిత్రక ధురీణులు:

తమకు ఏంలోటు వచ్చినా సరే తాము లెక్కచేశావారు కారు. ఇతరులు బాధపడుతుంటే వారు చూడలేరు. చూచి ఊరుకోలేరు. ఇతరుల కష్టాలు చూస్తుంటే వారి హృదయం వెన్నలా కరిగిపోతుంది.

ఇతర ప్రముఖులకు వలెనే లౌక్యంగాను, చాకచక్యంతోనూ వ్యవహరిస్తే ఈనాడు శర్మగారు కూడా ఒక ఉన్నతస్థాయిలో, ఒక గొప్ప ఉద్యోగంలో ఉండేవారని నిస్సందేహంగా చెప్పవచ్చు. అయితే దేశదృష్ట్యా ఇంత సేవ చేసినా, వారికి డిగ్రీయే

లేదాయిరి: ఇక ఉన్నతస్థానం ఎక్కడి నుంచి వస్తుంది.

'అయినా ఒకర్ని ప్రాధేయపడరు-పేరు తెచ్చుకోవడానికి, ఉన్నతస్థానం పొందడానికి అది approach కానేకాదు. అని నిష్కర్షంగా చెబుతూంటారు-ఇప్పటికీని సౌజన్యం మూర్తీభవించిన శ్రీ శర్మగారి జీవితం, వారి నిస్స్వార్థతను, వారి సహన భావాన్ని, వారి ఔదార్యాన్ని ప్రస్ఫుటించే అనేక ఘట్టాలతో పెనవేసికొని ఉంది.

చారిత్రక రంగంలో అప్పటికప్పుడే పునాదులు వేసికొని మద్రాసులో వారు పరిశోధన చేస్తున్న రోజులవి. శర్మగారింటికి అనుదినమూ వస్తూపోతున్న ప్రముఖులలో ముఖ్యులిద్దర్ని తరుచు నేను చూస్తుండేవాణ్ణి.

వీరు బాగా యువకులు. పట్టా అప్పుడే పుచ్చుకున్న వారనుకుంటాను. వీరు ప్రతిరోజూ వచ్చి అనేక చారిత్రకాంశాలను శ్రీ శర్మగారి వల్ల తెలుసుకుంటూ ఉండేవారు. సాయంత్రం 6 గంటలు అయేసరికి వీరు వచ్చి శర్మగారి రాకకు నిరీక్షిస్తూండేవారు. అప్పటికి వీరికి ఇంకా ఎక్కడా ఉద్యోగం లేదు. శర్మగారే వారికి అనేక విషయాలను గురించి తెలియజెప్పుతూ, ప్రోత్సహిస్తూండేవారు. వారిని ఏదైనా చారిత్రకవ్యాసాలను రాస్తుండమనే వారు. ఈ విధంగా ఏదైనా పరిశోధన చేసి కొంత చారిత్రక వస్తువు ప్రకటిస్తేనే తప్ప తమకు ఉద్యోగం దొరకడానికి అనువుగాను, సహాయకారిగాను ఉంటుందని, వార్ని ఒకరోజున కానిమారా మ్యూజియమ్‌కు తీసుకువెళ్లి ఒకేనొకశాసనాన్ని తీసియిచ్చారు. అయితే వారికి ఆశాసనలిపి సరిగా తెలియనైనా తెలియదు కాబోలు. మరి శర్మగారి దానిని చదివి వినిపించి అందుకు సంబంధించిన పూర్వవిషయాలను తెలియపరచి, లైబ్రరీలో ఏయే పుస్తకాలను చదవాలో కూడా సూచించి ఇక వ్యాసం వ్రాయమన్నారుట. యింత విపులంగా చెప్పినపుడు వ్యాసం వ్రాయడం ఒక పెద్ద 'యిది' కాదు. సరే- ఆ ప్రముఖుడు వ్యాసాన్ని తయారు చేసి శర్మగారికి చూపించారు. కాని శర్మగారికి అది నచ్చలేదు. అందుచేత వారిని తిరిగి వ్రాయమన్నారట. ఈవిధంగా ఆ ప్రముఖుడు ఆవ్యాసాన్ని మూడుసార్లు తిరగవ్రాసిన పిమ్మట, ప్రకటించవచ్చునన్న తరువాత దానిని ఒక ఇండియన్ హిస్టరీ జర్నల్‌కు ఇచ్చారట.

కొన్ని రోజులైన తరువాత మద్రాసులోని కానిమారా మ్యూజియంలో ఈ పై ప్రముఖుడు మరో ముగ్గురు ప్రముఖులూ కలుసుకోవడం సందర్భపడింది. ఈ వ్యాసం ప్రకటింపబడిన ఆ జర్నల్‌ను పైనుడివిన ప్రముఖుని స్నేహితుడొకాయన తీసుకునీ చూపారు.

అందరికంటె ఆ సమయంలో శ్రీ శర్మగారి ఆదుర్దా ఎక్కువయింది. తీసి చూడగా ఆవ్యాసం మొదటిపేజీలో ఒక ఫుట్‌నోట్‌లో ఈ క్రింది విధంగా ఉందిట.

"I am very grateful to Mr S.Iyengar, the Editor of the Journal for the valueable suggestions & advise given to me in connection with the publication of this article"

ఇది చూచేసరికి శర్మగారు నిలువునా నీరైనారు. చివరికి ఉండబట్టలేక "ఏమయ్యా! ఈ విధంగా వ్రాశావు-మీకు వ్యాసం తయారు అవడానికి అరటిపండు ఒలిచినట్టు వొలిచిపెట్టి అన్ని హంగులు తయారుచేస్తే ఈవిధంగా వ్రాయడం సమంజసమేనా అన్నారుట.

అందుకు ఆప్రముఖుడు సమాధానం చెబుతూ "ఒకవేళ మీరు నాకు సహాయం చేశారు అని నేను మీ పేరు వ్రాస్తే మీరేస్వయంగా నాచేత ఈ వ్యాసాన్ని రాయించి ప్రచురింపించారు" అని అనుకుంటారేమోనని ఆవిధంగా వ్రాశాను" అని అన్నారట.

శ్రీ శర్మగారు తన పేరు, సూచింపబడకపోయినందుకు వారు ఏమీ అనుకోలేదు గాని అ ప్రముఖుని నిర్మొహమాటంగా ఉండి అతను తన అభిప్రాయం చెప్పినందుకు వారిని చాలా మెచ్చుకున్నారట.

వారి విశాలహృదయానికి, వారి సౌజన్యానికి ఇది ఒక చిన్న నిదర్శనం. ఇటువంటి ఘట్టాలు వారి జీవితంలో అనేకాలు. ప్రస్తుతం పైనుదహరించిన ప్రముఖుడు హైదరాబాదులో ఒక ఉన్నత పదవిలో ఉన్నారు. ఇంకా ఎంతో పరిశోధించవలసియున్న ప్రకటనకాని అనేక శాసనాలు అక్కడి మ్యూజియమ్‌లో ఉన్నాయి. పదవిలో ఉన్న ఆ ప్రముఖుడు చేయాలని అనుకుంటే యెందుకు చేయలేరు. కాని పరిశోధన చేయవలసిన అవసరంకొద్దీ, ఇంకా చీకటిలో వున్న పూర్వపు చరిత్ర వస్తువును వెలుతురులోకి తీసుకురావాలనే జిజ్ఞాసతో శర్మగారే ఏతత్ప్రముఖునివద్దకు వెళ్లి తనకు కొన్ని శాసనాలను పరిశోధించేందుకు ఇవ్వమని అడుగవలసి వచ్చింది. అందుకు అప్రముఖుడు సమ్మతించి కొన్ని శాసనాల పరిశోధించుటకు గాను ఒక కాంట్రాక్టు నొకదానిని పంపారట. పిమ్మట కొన్ని శాసన ప్రతులు కూడా పంపబడ్డాయి. కాని వాటిలో శ్రీశర్మగారు

కోరిన కాలపు నాటివి ఒక్కటి తప్ప తక్కినవన్నీ ప్రకటితమైనవేనట. కాగా శర్మగారు ఈ సంగతులు ఆ ప్రముఖునికి కొన్ని జాబులు వ్రాస్తే సమధానమేవచ్చింది కాదట. శర్మగారు వ్రాస్తూనే వచ్చారు. కొంతకాలానికి తత్ప్రముఖుడు ఉత్తరం వ్రాస్తూ శర్మగారు తె.భా.సాలో పనిచేస్తుండుటవల్ల, వీటిని ఈశాసనాలను పరిష్కరించుటకు కాలవ్యవధి అవుతుందేమోనని వాటిని పంపలేదన్నారట. దీనివలన పాఠకులే ఊహించుకోవచ్చు-సందర్భం యొక్క సంకుచితత్వమూ, శర్మగారి అమాయకత్వమూను. కాని ఈ శాసనాలనే పెక్కింటిని పైనుడివిన ప్రముఖుడు మద్రాసులో మరో పెద్ద ప్రముఖునికి పంపి తద్పరిశోధనకు అవసరం వస్తుందని కొంత డబ్బు పంపిస్తూ, వారు పరిశోధించిన దానికి పేజీకు ఇంత ఇస్తామని కూడా వారి జాబు వ్రాసినారట:

ఇంతకీ పైనుడివిన ప్రముఖుని విమర్శిస్తున్నానని పాఠకులకు తెలియజెప్పడం కాదు నా ఉద్దేశం, శ్రీ శర్మగారి సౌజన్యాన్ని ఎత్తిచూపుటే ఈ ప్రధానోద్దేశం.

ఇదే స ందర్భంలో మరొక సంగతి కూడా ఇక్కడ వ్రాయడం సముచితం.

ఆరోజులలో మరో పెద్ద మనిషి (ప్రముఖుడు) ఒకానొక విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా ఉంటున్నారు. ఈ పెద్ద ప్రముఖుడు తాము తమ విద్యార్థులకు విజయనగర చరిత్రను గురించి బోధిస్తూ వచ్చారట. అప్పుడు సాధారణంగా ఆ చరిత్రకు సంబంధించిన, అప్పటికి ప్రచురణ అయిన పుస్తకాలను కన్సల్ట్ చేస్తూ పిల్లలకు బోధిస్తూ వచ్చారట ఆ ప్రముఖుడు. కాని ఆ పెద్ద ప్రముఖుడు ఈ పుస్తకాలన్నీ సమగ్రంగా లేకపోవడం అందలి చారిత్రకాంశాలు పరస్పర విరుద్ధంగానుస, సత్యదూరంగాను, అందలి గ్రంథకర్తల అభిప్రాయాలు విభిన్న దృక్పథాలతో ఉండటాన్ని చూచి ఒక రోజున శ్రీ శర్మగారి వద్దకు వచ్చి విజయనగర చరిత్ర సమగ్రంగా పరిశీలించి వ్రాయడం చాలా అవసరమంటూ చెప్పారట. శర్మగారు కూడా ఈ విషయమై బాగా ఆలోచించి వ్రాయాలని పూనుకుని విషయాన్ని సేకరిస్తూ వచ్చారట. ప్రతిరోజూ ఈ పెద్ద ప్రముఖుడు తాను మామూలుగానే శర్మగారింటికి వస్తూండడం చర్చిస్తూండడం పరిపాటి. వీరు వచ్చినప్పుడల్లా శర్మగారు తాను పరిశోధించే విజయనగర చరిత్ర అంశాలను ఏవిధంగా వ్రాస్తున్నది, తాను ఏవిధంగా ఇతర రచయితలతో ఏకీభవించలేకపోతున్నదీ, తరచితరచి వ్రాసిన కొద్దీ తను ఒక నూతన రీతిని వ్రాయవలసి వస్తోందనీ-ఆ విషయాలన్నీ వీరితో పూసగుచ్చినట్లు చెపుతూ వచ్చారు. పాపం చాలా బెలహృదయాలూ, అమాయకులూను-ముందు మరో విధంగా



జరుగుతందని వారికేం తెలుసు! ఈ పెద్ద ప్రముఖుడు అప్పుడు 'కంపిలి' అనే మరో వంశచరిత్రను పరిశోధిస్తున్నారట: శర్మగారు ఆ వంశాన్ని గురించి ఈ పెద్ద ప్రముఖుడు పరిశీలిస్తున్నారు కదా అని అనుకున్నారట. విజయనగర చరిత్రలోని మొదటిరాజుల కాలంనాటి చరిత్ర పూర్తిచేశారు శర్మగారు, సమగ్రంగా పరిశోధించారు. వ్రాయడం కూడా మొదలెట్టారుకూడా. హఠాత్తుగా అప్పుడు ఈ పెద్ద ప్రముఖుడు "Kamili and Vizianagar" అని ఒక వ్యాసం ప్రచురించేశారట. ఇది చూచిన వెంటనే శర్మగారు చాలా ఆశ్చర్యపోయినారు. ఈ పెద్ద ప్రముఖుడు వేరే మరొక వస్తువును గురించి వ్రాస్తున్నారని అనుకున్నారే కాని తాను వ్రాసే విజయనగర చరిత్రను గురించి వ్రాస్తారని అనుకోలేదు. ఇంతకీ సదరు వ్యాసం చూస్తే, శర్మగారు చెప్పినటువంటి విషయాలే, వారు చర్చించిన సమస్యలే, వారు Note చేసి పరిశోధించాలన్న అంశాలే-ఆ ప్రముఖుడు వ్రాసిన ఆవ్యాసం శర్మగారు వ్రాసిన విజయనగర చరిత్ర యొక్క ప్రతిబింబమే ఆ ప్రముఖునిది ఇంగ్లీషులో వుంది-శర్మగారిది తెలుగులో వుంది.

ఇలా వుంటుండగా మద్రాసు విశ్వవిద్యాలయంలో రీడర్స్ పోస్ట్ వచ్చిందిట. ఈ ప్రముఖుడు ఆ ఉద్యోగానికి ప్రయత్నించసాగినారట: అయితే తమ పరిశోధనకు నిదర్శనం చూపితేనే గాని ఆ ఉద్యోగం రాదుగనుక ఈ పెద్ద ప్రముఖుడు తాను వ్రాసిన ఈ రచనను పుస్తకరూపంలో ప్రచురించుటకు ఉద్యుక్తులయ్యారట.

శ్రీ శర్మగారికి ఈ విషయం తెలిసి ఈ వ్యాసాన్ని గూర్చిన సంగతి సందర్భాలను మరో ప్రముఖునితో విశదీకరించారట. ఒకనాడు వారు రాయబారం సలిపి ఈ పెద్ద ప్రముఖుడు ప్రచురింపబోయే పుస్తకంలో శర్మగారి పేరు కూడా అంటే వీరిద్దరూ కలిసి వ్రాసినట్లు-వేయడానికి గాను ఈ ప్రముఖుడు ఒప్పుకున్నారట. కాని శర్మగారు ఇందుకు ఒప్పుకోలేదు. తన పేరు అందులో ప్రచురింపనక్కర్లేదనీ, తాను స్వయంగా వ్రాసిన ఈ వస్తువునే ప్రచురించిన తరువాత ఆ ప్రముఖుడు తన వ్యాసాన్ని పుస్తక రూపంలో ప్రచురించుకోవచ్చుననీ మాత్రం కోరారట. కాని ఆ పెద్ద ప్రముఖుడు ఇది పాటింపక తమ పుస్తకాన్ని అచ్చువేయించేశారట!

శర్మగారి విశాల హృదయం, వారి అమాయకత్వం పాఠకలోకమే ఊహించుకోవచ్చు. అప్పటి నుంచీ పెద్ద ప్రముఖునికీ శర్మగారికి మాటలు లేవట.

కాని ఆంధ్రదేశంలో చారిత్రక రంగంలో పరిశోధన చేసే వారు బహుకొద్దిమంది. వీరిలో వీరే ఇక ఆవేశాలకావేశషాలు పెంచుకుంటే అది దేశచరిత్ర దృష్ట్యా నష్టదాయకమని, తమ పరిశోధనలు సాగిస్తూ వచ్చారు.

ఇటువంటి నిదర్శనాలు ఎత్తి చూపాలంటే అనేకం వున్నాయి.

వారు పరిశోధించిన శాసనాలే యే ఐదు వందలలో వుంటాయి. వారు ప్రచురించిన ఇంగ్లీషు వ్యాసాలే సుమారు రెండు వందలపైన ఉంటాయి. ఇవన్నీ గాక ఆల్ ఇండియా రేడియోలో వారిచ్చిన రేడియో ప్రసంగాలు వారు రచించి ప్రసరితం కాబడ్డ చారిత్రక నాటకములు సుమారు 50 పైన ఉంటాయి. వీరి ఈ రచనలన్నీ సమగ్రమైన పుస్తక రూపంలో ప్రచురించుట ఆంధ్రులందరూ శ్రద్ధవహించవలసిన విషయం.

వారి రచనలను క్రింది విధంగా విభజించవచ్చు:

(i) Historical Articles in English
(ii) Articles (in Telugu) on Andhra Culture
(iii) Articles in Copper plate in criptions
(iv) Articles on Telugu Literature
(v) Radio Dramas Broadcast
(vi) Radio Talks Broadcast
(vii) Articles of General interest

వీటినన్నిటినీ ఒక్కొక్క సంపుటం క్రింద సమగ్రంగా అచ్చు వేయించడం వారికి ఆంధ్రులు చేయగల సత్కారం.

ఈ విధంగా ఆంధ్రదేశానికి సేవచేయడమే కాకుండా, ఒక సమగ్ర పుస్తక రూపంలో చూడగలుగుతాం. ఇది ఆంధ్రులకు మహాద్భాగ్యం కదా.

ఆంధ్రరాష్ట్రోద్భవ శుభసమయంలో ఇట్టి సమగ్ర రూపంలో ఆంధ్ర చరిత్ర ప్రకటించుట ఎంత అవసరమో పాఠకలోకం, ఆంధ్ర మహాజనులు గుర్తించక తప్పదు.





కుడి నుంచి ఆచార్య కొలకలూరి ఇనాక్, డా॥ ఏటుకూరి ప్రసాద్, శ్రీ బాపిరెడ్డి, ఆచార్య బద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య కాకర్ల వెంకట నరసింహం, ఆచార్య గంటి జోగి సోమయాజి, శ్రీ దువ్వూరి వెంకట రమణశాస్త్రి, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆచార్య ఎస్వీ జోగారావు, డా॥రాజేశ్వరిగారు.

# సోమశేఖర సంస్మరణ

(కీ. శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి మూడవ పుణ్యవర్ధంతి సందర్భంగా)

సుమాంజలి సుహృదంజలి, నవ్య భవ్య కుసుమాంజలి, ఓ ప్రసన్న గంభీరమూర్తి సుప్రసన్న మంగళకీర్తి. పూర్వాంధ్ర చరిత్ర సాగరాన్ని మథించిన నీ అపూర్వ మేధ, మహాంధ్రంలో తెలియనివారెవరు?

తీయనిమాటలు తేనెలువారె, మహాంధ్రం మట్టి కాదని ఉజ్వలాంధ్ర మది, విశాలాంధ్రమనీ, విజయశంకం పూరించావ్ విజయదుందుభి మ్రోగించావ్. అడుగడుగున విఘ్నాలైనా పరుగుపరుగున నిర్విఘ్నంగా పూర్వ భూమిశుల శాసనాలు దిద్దితీర్చిన నీ వ్యాసాలు దేశచరిత్రకైన పుటలు దివ్వెలెత్తిన సంపుటులు! నీ హృదయం హిమశిఖరం నీధిషణ మేరునగం నీపల్కినపల్కుది నవనీతం నీచూచిన చూపది సునిశితం సకలాంధ్రం మహాపునీతం.

తామ్రఫలకాలు శోధించి, తాళపత్ర కైఫియతులు సంతరించి మందిర గోపుర ప్రాకారాదులు వెదకి, మథించి వెలుగు కెత్తిన లిపిశాస్త్రచణా! చరిత్రరచనాధురీణా! అమృతమూర్తివి, నీవు ఆంధ్రశిల్పివి కావ!

**✻ 9-1-1966**



# ఆత్మపరిశీలన ప్రభావం

## (ఉద్యోగ విరమణ సందర్భంగా...)

నేను సర్వీసు నుంచి రిటైరైన సందర్భంలో మీ కందరికీ నా హృదయపూర్వక నమస్కారాలు సమర్పించుకుంటున్నాను. మిమ్ముల నందరినీ విడిచివెడుతున్నందుకు నాకు ఓ వైపు విచారంగానూ సర్వీసు భారాన్నీ బాధ్యతనూ తగ్గించుకున్నందుకు సంతోషంగానూ ఉంది. అయితే జీవితానికి ప్రశాంతి ఎప్పుడు అని ప్రశ్నించుకుంటే అది పోయెప్పుడే అని జవాబు వస్తుంది. సర్వీసు నుండి రిటైరు కావడమనే ఘట్టము సర్వీసులో ఉండే ప్రతిఒక్కరూ ఎదుర్కొనక తప్పదు గదా!

జీవితం అనేక సంఘటనలతో కూడుకొని ఉంటుంది. ఆ సంఘటనలు అనేక విధాలుగా ఉంటాయి. ఆ సంఘటనలో విచారం, సంతోషం, ఆవేశం; ఆనందం, ఆశ్చర్యం, కోపం మొదలైన వన్నీ వివిధ రసాల్లో జీవితాన్ని పెనవేసుకొని ఉంటాయి. ప్రతి ఒక్కరూ ఈ విభిన్న భావరససముదాయాన్ని అధిగమించి విజయం సాధించేందుకు కృషిచేస్తాడనే సంగతి మీ కందరికీ తెలిసన విషయమే.

నా సర్వీసులో ఆరంభంనుంచీ అనే అనేక సంక్లిష్టమైన సమస్యలను నేను ఎదుర్కొనక తప్పిందికాదు. ఉద్యోగాన్వేషణ ప్రతి ఒక్కరికీ సామాన్యమైన సంగతే అయినా నేను కూడా ఈ ఉద్యోగ సంపాదనలో అనేక విషమ పరీక్షలను ఎదుర్కొనక తప్పిందికాదు. కాని జీవితంలో మన కాళ్లమీద మనం నిలబడాలి. సంసారాన్ని పోషించాలి, వీలైనంత వరకు మనకున్నంతలో ఇతరులకు సాయపడాలి అనే దృఢ సంకల్పం ఒకటి వెన్నంటి, నన్ను ముందుకు తోస్తూండడంవల్ల చివరికి మిగిలింది నాకు ఈ UDC పోస్టు మాత్రమేనని మనవి చేస్తున్నాను. ఈ సర్వీసులో నేర్చుకుంది నేను సహనం ఓర్పు: నే నిది నా అనుభవాన్ని బట్టి మనవి చేస్తున్నాను. గుమాస్తా జీవితం కత్తిమీద సాములాంటిది. నెలజీతం తప్ప ఇంకేముంటుంది? తనకిచ్చిన పని బాగా అర్థం చేసుకుని ముందుకు పోతూండాలి. ఈ UDC పోస్టులోనే 15 ఏళ్లుగా ఫైలూ, రిఫరెన్సూ మరచిపోకుండా నడుచుకుంటూ వచ్చాను. నాలో ఏవైనా లోపాలు ఉండవచ్చు. ప్రమాదాలు ఉండవచ్చు. 'ప్రమాదో ధీమతామపి' అన్నారు–అందుకే

'ఏమైనా సరే మనకు ఇచ్చిన పనిని శీఘ్రగతిని ముగించాలన్న ధ్యేయాన్ని నేనెన్నడూ విడనాడలేదు. ఆరోజు ఇంట్లో తిండిలేకపోయినా, ఆరోగ్యం బాగులేకపోయినా జేబులో డబ్బులు లేకపోయినా చక్కగా పనిచేయాలి, మంచిపేరు తెచ్చుకోవాలి అనే సంకల్పం దినదిన ప్రవర్ధమానమై నిస్సహాయ పరిస్థితిలో కూడా ఆశాజ్యోతిగా వెలుగుతూ వచ్చింది. అయితే నా మెత్తదనాన్ని ఆసరాగా తీసుకొని కొందరు పెద్దమనుషులు నన్ను తిప్పలు పెట్టిన సంఘటనలు నా జీవితంలో అనేకం ఉన్నాయి. నా పూర్వ చరిత్రంతా తిరగదోడి మీకు బోరు కొట్టించదలచుకోలేదు. కాని ఈ సందర్భంలో నా ఆత్మీయుల వద్ద నుంచి శెలవు తీసుకొంటున్న ఈ తుది ఘట్టంలో కొన్ని ప్రధాన సంఘటనలను మాత్రం సంగ్రహంగానైనా చెప్పాలనుకుంటున్నాను. మీరంతా ఓపికతో వింటారని నేను నమ్ముతున్నాను.

అవిభక్త మద్రాసురాష్ట్ర Board of Revenue Office నేనొక చిన్న వేకెన్సీలో జూలై 1943లో ఎల్.డి.సి.గా 37/- జీతం మీద మొదటిసారిగా ఎల్.డి.సి.గా పోస్టులో సుమారు 2 నెలలు పనిచేశాను. ఆ వేకెన్సీ అయిపోవడంవల్ల మళ్లీ ఉద్యోగాన్వేషణ ఆరంభమైంది. అప్పట్లో టైప్ నేర్చుకున్నా పాస్ కాలేదు. అయినా American Consulate General ఆఫీసులో టైపిస్టుగా వేసుకున్నారు. నాకు 15 రోజులకొకసారి జీతం ఇచ్చేవారు. నెలకు రూ.400 వచ్చేవి. బాగానే ఉందనుకున్నాను. రాత్రిపూట భోంచేసి మౌంట్ రోడ్డు G.K Wale Photo studio కి ఎదురుగా ఉండే కాన్సులేట్‌లో అడిషనల్ టైప్ వర్క్ చేస్తూ మరికొంచెం సంపాదిస్తూ ఉండేవాణ్ణి. ఆ సమయంలో లైబ్రరీ సైన్స్‌లో ట్రైనింగ్ కూడా అయినాను. కాని కథ అడ్డం తిరిగింది. రోజులు సాఫీగా జరిగితే కథే లేదు గదా! అప్పటి అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవరు విదేశాలలోని Consulates లోని బడ్జెట్ తగ్గించడంతో సుమారు 20 మంది టైపిస్టులను ఆఫీసునుంచి తీసివేశారు. నా ఉద్యోగం పోయింది. నాలో నిస్పృహ ఏర్పడింది. మళ్లీ నాకు ఉద్యోగాన్వేషణ తప్పలేదు. తరువాత జూన్ 11, 1945లో డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ ఆఫీసులో ఎల్.డి.సిగా రూ.30 జీతం మీద వేశారు. అప్పుడు డా. బి.వి.నాథ్ గారు డైరెక్టర్‌గా ఉంటున్నారు. శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ గారు పాడిపంటలు అసిస్టెంట్‌గా ఉండేవారు. శ్రీ కె.భూషణమ్ మాకు ఆఫీసరు. శ్రీ కాంతి రాజుగారు డిప్యూటీ డైరెక్టర్‌గా ఉంటుండేవారు. అక్కడ వేర్వేరు సెక్షన్‌లో పనిచేస్తూ వచ్చాను. ఆ



రోజుల్లో బ్రహ్మాండమైన NGO Strike జరిగింది. శ్రీ జగదీశ్ అయ్యరు గారి ఆధ్వర్యంలో చెపాక్ ఆవరణలోని ఆ దృశ్యం నేనిప్పటికీ మరవలేను. తరువాత శ్రీ శివరామన్‌గారు డైరెక్టరుగా వచ్చారు. శ్రీ ఎం.టి.రాజుగారు మరువలేదు. అప్పుడు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారు ముఖ్యమంత్రిగా ఉన్నారు. రూ.5/- జీతం పెంచారు. యిలా జీతం తక్కువైనా జీవితం గడచిపోసాగింది. ఆరోజుల్లో కాబోలు నాకు వివాహంకూడా జరిగింది. అయితే పరిస్థితులు మళ్లీ మారిపోసాగాయి. Communal G.O ప్రకారం Staff visition లో Proportiante percentage లేదని, నాతోబాటు 10, 15 మందిని ఉద్యోగంలోంచి తీసేశారు. కాని శ్రీ ఎ.వి.సుబ్రహ్మణ్యం, అవధాని మొదలైన కొందరు మిత్రులు తమతమ ఉద్యోగాలను నిలుపుకోవడంలో విజయాన్ని పొందారు. కాని నేను మాత్రం వీధిలో పడ్డాను. నా జీవితంలో అది ఒక టర్నింగ్ పాయింట్ అనిపిస్తోంది. అది కంటన్యూ అయి వుంటే ఈనాడు నేను Super. గా రిటైర్ అయి ఉండేవాణ్ణి. అయితే శ్రీయుతులు కృష్ణమూర్తి అయ్యరు, సుబ్బరత్నం అయ్యరు, మొదలైన వారిని పట్టుకుని ప్రాధేయపడ్డా ఏమీ లాభంలేకపోయింది. శ్రీ కాంతిరాజుగారు (DDA) నా గోడువిని Fidoman గా పోరా అని సాయం చేశారు. మౌంట్ రోడ్డులోని గవర్నమెంట్ హౌస్ ఎస్టేట్‌లోని Agrl. Ves.... Farm లో వేశారు. ఒకనెలలో రెండు నెలలో పనిచేశాను. నన్ను అక్కడ ఉంచకుండా శ్రీ Perambudur కు ట్రాన్స్‌పర్ చేశారు. అక్కడ నా ఆరోగ్యం సరిగా లేకపోయింది. క్లెర్క్‌కి అలవాటుపడ్డంవల్ల ఈ తిరుగుడు బాధపడలేక రిజైన్ చేశాను. అప్పుడు శ్రీ ఇ.జి.శివస్వామిగారు DAO గా ఉంటుండేవారు వారు. నన్ను పిలిచి మళ్లీ ఒకసారి అడ్వయిజ్ ఇచ్చారు. రిజైన్ చేయవద్దని కాని లోగడనే చెప్పినట్లు జీవితంలో సంఘటను జరుగుతుంటాయి. జనవరి 31, 1950లో మళ్లీ వీధిన పడ్డాను. అప్పటికే నా వయస్సు 27 దాటింది. ఏమి చేయదానికీ పాలుపోలేదు. మా మేనమామ శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారి వద్ద ఉంటున్నందువల్ల వారి సాహిత్య రచనా ఛాయలు నామీద ప్రసారం కాజొచ్చాయి. మద్రాసులో శ్రీ ఖాసా సుబ్బారావుగారి తెలుగు స్వతంత్ర వార పత్రిక వస్తుండేది. అందులో శ్రీ గోరా శాస్త్రి గారు ఉంటుండేవారు. ఏవో చిన్న ఆర్టికల్స్, కథలూ గేయాలూ రాస్తూ పదిరూపాయలు సమకూర్చుకుంటూ ఉండేవాణ్ణి. అయితే సంసారం నిర్వహించడం కష్టమైపోయింది.

'ఏమైనా సరే మనకు ఇచ్చిన పనిని శీఘ్రగతిని ముగించాలన్న ధ్యేయాన్ని నేనెన్నడూ విడనాడలేదు. ఆరోజు ఇంట్లో తిండిలేకపోయినా, ఆరోగ్యం బాగులేకపోయినా జేబులో డబ్బులు లేకపోయినా చక్కగా పనిచేయాలి, మంచిపేరు తెచ్చుకోవాలి అనే సంకల్పం దినదిన ప్రవర్థమానమై నిస్సహాయ పరిస్థితిలో కూడా ఆశాజ్యోతిగా వెలుగుతూ వచ్చింది. అయితే నా మెత్తదనాన్ని ఆసరాగా తీసుకొని కొందరు పెద్దమనుషులు నన్ను తిప్పలు పెట్టిన సంఘటనలు నా జీవితంలో అనేకం ఉన్నాయి. నా పూర్వ చరిత్రంతా తిరగదోడి మీకు బోరు కొట్టించదలచుకోలేదు. కాని ఈ సందర్భంలో నా ఆత్మీయుల వద్ద నుంచి శెలవు తీసుకొంటున్న ఈ తుది ఘట్టంలో కొన్ని ప్రధాన సంఘటనలను మాత్రం సంగ్రహంగానైనా చెప్పాలనుకుంటున్నాను. మీరంతా ఓపికతో వింటారని నేను నమ్ముతున్నాను.

అవిభక్త మద్రాసురాష్ట్ర Board of Revenue Office నేనొక చిన్న వేకెన్సీలో జూలై 1943లో ఎల్.డి.సి.గా 37/- జీతం మీద మొదటిసారిగా ఎల్.డి.సి.గా పోస్టులో సుమారు 2 నెలలు పనిచేశాను. ఆ వేకెన్సీ అయిపోవడంవల్ల మళ్లీ ఉద్యోగాన్వేషణ ఆరంభమైంది. అప్పట్లో టైప్ నేర్చుకున్నా పాస్ కాలేదు. అయినా American Consulate General ఆఫీసులో టైపిస్టుగా వేసుకున్నారు. నాకు 15 రోజులకొకసారి జీతం ఇచ్చేవారు. నెలకు రూ.400 వచ్చేవి. బాగానే ఉందనుకున్నాను. రాత్రిపూట భోంచేసి మౌంట్ రోడ్డు G.K Wale Photo studio కి ఎదురుగా ఉండే కాన్సులేట్‌లో అడిషనల్ టైప్ వర్క్ చేస్తూ మరికొంచెం సంపాదిస్తూ ఉండేవాణ్ణి. ఆ సమయంలో లైబ్రరీ సైన్స్‌లో ట్రైనింగ్ కూడా అయినాను. కాని కథ అడ్డం తిరిగింది. రోజులు సాఫీగా జరిగితే కథే లేదు గదా! అప్పటి అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవరు విదేశాలలోని Consulates లోని బడ్జెట్ తగ్గించడంతో సుమారు 20 మంది టైపిస్టులను ఆఫీసునుంచి తీసివేశారు. నా ఉద్యోగం పోయింది. నాలో నిస్పృహ ఏర్పడింది. మళ్లీ నాకు ఉద్యోగాన్వేషణ తప్పలేదు. తరువాత జూన్ 11, 1945లో డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ ఆఫీసులో ఎల్.డి.సిగా రూ.30 జీతం మీద వేశారు. అప్పుడు డా. బి.వి.నాథ్ గారు డైరెక్టర్‌గా ఉంటున్నారు. శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ గారు పాడిపంటలు అసిస్టెంట్‌గా ఉండేవారు. శ్రీ కె.భూషణమ్ మాకు ఆఫీసరు. శ్రీ కాంతి రాజుగారు డిప్యూటీ డైరెక్టర్‌గా ఉంటుండేవారు. అక్కడ వేర్వేరు సెక్షన్‌లో పనిచేస్తూ వచ్చాను. ఆ



రోజుల్లో బ్రహ్మాండమైన NGO Strike జరిగింది. శ్రీ జగదీశ్ అయ్యరు గారి ఆధ్వర్యంలో చెపాక్ ఆవరణలోని ఆ దృశ్యం నేనిప్పటికీ మరవలేను. తరువాత శ్రీ శివరామన్‌గారు డైరెక్టరుగా వచ్చారు. శ్రీ ఎం.టి.రాజుగారు మరువలేదు. అప్పుడు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారు ముఖ్యమంత్రిగా ఉన్నారు. రూ.5/- జీతం పెంచారు. యిలా జీతం తక్కువైనా జీవితం గడచిపోసాగింది. ఆరోజుల్లో కాబోలు నాకు వివాహంకూడా జరిగింది. అయితే పరిస్థితులు మళ్లీ మారిపోసాగాయి. Communal G.O ప్రకారం Staff visition లో Proportiante percentage లేదని, నాతోబాటు 10, 15 మందిని ఉద్యోగంలోంచి తీసేశారు. కాని శ్రీ ఎ.వి.సుబ్రహ్మణ్యం, అవధాని మొదలైన కొందరు మిత్రులు తమతమ ఉద్యోగాలను నిలుపుకోవడంలో విజయాన్ని పొందారు. కాని నేను మాత్రం వీధిలో పడ్డాను. నా జీవితంలో అది ఒక టర్నింగ్ పాయింట్ అనిపిస్తోంది. అది కంటన్యూ అయి వుంటే ఈనాడు నేను Super.గా రిటైర్ అయి ఉండేవాణ్ణి. అయితే శ్రీయుతులు కృష్ణమూర్తి అయ్యరు, సుబ్బరత్నం అయ్యరు, మొదలైన వారిని పట్టుకుని ప్రాధేయపడ్డా ఏమీ లాభంలేకపోయింది. శ్రీ కాంతిరాజుగారు (DDA) నా గోడువిని Fidoman గా పోరా అని సాయం చేశారు. మౌంట్ రోడ్డులోని గవర్నమెంట్ హౌస్ ఎస్టేట్‌లోని Agrl. Ves.... Farm లో వేశారు. ఒకనెలో రెండు నెలలో పనిచేశాను. నన్ను అక్కడ ఉంచకుండా శ్రీ Perambudur కు ట్రాన్స్‌పర్ చేశారు. అక్కడ నా ఆరోగ్యం సరిగా లేకపోయింది. క్లెర్క్‌కి అలవాటుపడ్డంవల్ల ఈ తిరుగుడు బాధపడలేక రిజైన్ చేశాను. అప్పుడు శ్రీ ఇ.జి.శివస్వామిగారు DAO గా ఉంటుండేవారు వారు. నన్ను పిలిచి మళ్లీ ఒకసారి అడ్వయిజ్ ఇచ్చారు. రిజైన్ చేయవద్దని కాని లోగడనే చెప్పినట్లు జీవితంలో సంఘటను జరుగుతుంటాయి. జనవరి 31, 1950లో మళ్లీ వీధిన పడ్డాను. అప్పటికే నా వయస్సు 27 దాటింది. ఏమి చేయడానికీ పాలుపోలేదు. మా మేనమామ శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారి వద్ద ఉంటున్నందువల్ల వారి సాహిత్య రచనా ఛాయలు నామీద ప్రసారం కాజొచ్చాయి. మద్రాసులో శ్రీ ఖాసా సుబ్బారావుగారి తెలుగు స్వతంత్ర వార పత్రిక వస్తుండేది. అందులో శ్రీ గోరా శాస్త్రి గారు ఉంటుండేవారు. ఏవో చిన్న ఆర్టికల్స్, కథలూ గేయాలూ రాస్తూ పదిరూపాయలు సమకూర్చుకుంటూ ఉండేవాణ్ణి. అయితే సంసారం నిర్వహించడం కష్టమైపోయింది.

శ్రీ సోమశేఖరశర్మగారు నన్ను ఎంతకాలం పోషించగలరు? ఆయన చివరికి నార్ల వెంకటేశ్వరరావుగారికి చెప్పి నాకు ఆంధ్రప్రభలో సబ్ ఎడిటర్ పోస్ట్ ఇప్పించారు. టెలిప్రింటర్ పేపర్సు ఇచ్చి ట్రాన్స్‌లేట్ చేస్తూండేవాణ్ణి. రూ. 300/- తో ప్రస్తుతం చేయనీయండి తరువాత రూ. 500/- ఇప్పిస్తామన్నారు. కాని ఎంతకీ రూ. 500 ఇవ్వలేదని విసిగి అందులో నుంచి రిజైన్ చేశాను.

ఆంధ్రరాష్ట్రంకోసం ప్రయత్నాలు జరుగుతున్న రోజులవి. అలజడులు బయలుదేరినై. శ్రీ పొట్టి శ్రీరాములుగారు 53 రోజుల ఉపవాస దీక్షానంతరం ఆయన భౌతికకాయాన్ని మౌంటురోడ్డు గుండా మోసినవాళ్లలో నేనొకణ్ణి. ఎట్టకేలకు అక్టోబరు ఫస్టున 1953 సం॥లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆఫీసులన్నీ మద్రాసులోనే ఉన్నాయి. సెక్రటేరియట్ వగైరా కొన్ని ఆఫీసులు మాత్రం కర్నూలు తరలివెళ్లాయి. తిరిగి అగ్రికల్చరు డైరెక్టర్ ఆఫీసులో ఉద్యోగం ఇవ్వకపోతారా అని ఆశానిరాశల మధ్య ప్రయత్నం చేశాను. అప్పుడు ఆంధ్ర రాష్ట్ర అగ్రికల్చర్ డైరెక్టర్‌గా శ్రీ కాంతిరాజుగారు నియమింపబడ్డారు. ఒకరోజున అడయారులో, ఆయన నాగోడు అంతా విని నన్ను ఎల్.డి.సి.గా వేశారు. అయితే నాకు సంక్లిష్ట పరిస్థితులు ఇంకా తప్పలేదు. బి.ఎస్.ఆర్ గారు Est. లో ఉండేవారు. శ్రీనివాసరావుగారు మేనేజర్. నేను ఎస్.ఎస్.ఎల్.సి. పాస్ అయినా MGE లేదని ఉద్యోగంలోంచి తీసేస్తామని నన్ను బెదిరించారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాత ఎక్కడా లేని Rules strickt గా enforece చేయడతం చూస్తే నాకు పట్టరాని దుఃఖం వచ్చింది. అటెండర్‌గా కావలిస్తే పనిచెయ్యమన్నారాయన. ఆంధ్రులు ఆంధ్రులకు సాయం చేయడానికి వెనుకాడతారనీ, లేక చేయనే చేయరని నాకప్పుడు తెలిసింది. గత్యంతరం లేక అందులో రూ. 47/- జీతంమీద 2 1/2 సం॥ గడుపుతూ వచ్చాను. తక్కువ జీతమైనా నా భార్య దాంతోనే ఎలాగో గడుపుతూ నాకు ధైర్యం చెబుతూ వచ్చింది. యింతలో శ్రీకాంతిరాజుగారు రిటైర్ అయారు. తరువాత (ప్రస్తుతం చీఫ్ సెక్రటరీగా ఉంటున్న) శ్రీ I.J.Naion గారు డైరెక్టర్‌గా ఉన్నారు. ఓరోజు, ఆ మహానుభావుడు నా గోడు అంతా విని నన్ను సముద్ధరించాలని సంకల్పించారు. వారి సంకల్ప బలమే లేకపోతే నేనెక్కడ వుండేవాడినోమరి. శ్రీ బి.ఎస్.ఆర్., సోమన్నగార్ని పంపించి చివాట్లు పెట్టిన్లు చెప్పారు. నా విషయంలో ఏజ్ రిలాక్స్ చేయమని ఎస్.సికి కోరడానికి ఆర్డర్స్ వేయమని గవర్నమెంట్‌కు కర్నూలుకు



వ్రాశారు. ప్రభుత్వం దయ దలచినందువల్ల ఆర్డర్స్ వచ్చాయి. ఎస్.సి. పరీక్షకు కూర్చుని ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయాను. 1.7.1956 నుంచి రెద్యులర్‌గా నాకు LDC జీవితం ఆరంభం అయింది. 1956 నవంబరు 1వ తేదీన ఆంధ్రదేశ్ అవతరణతో అంతా గుంటూరు వచ్చేశాం.

రెండు నెల్ల తరువాత 1957 జనవరిలో ఆఫీసును హైద్రాబాదు తరలించారు. గత 21 సం॥ నుంచి హైదరాబాదు నివాసమైంది. నాకు అందరితోబాటు ఎల్.డి.సిగా జీవితం కష్టసాధ్యమైంది. అప్పటికి నాకు ముగ్గురు పిల్లలు. వీళ్ళ చదువులు చెప్పించడం చాలా కష్టమైపోయింది. ఆడపిల్లల వివాహమెలా చేయాలి? ఉద్యోగంలో కాస్త నిలదొక్కుకున్నా బ్రతుకుభారమనిపించింది. ఏవో గేయాలూ, రేడియో డ్రామాలు టాక్స్ ఇస్తూ ఉండేవాణ్ణి. సాయంత్రం ట్యూషన్స్ చెబుతూ ఉండేవాణ్ణి. కాని ప్రతిరోజు ఒక అవస్థగా ఉండేది. కష్టకాలపు యిలాంటి సమయాల్లో నేను వ్రాసిన కొన్ని చిన్న గేయాలు ఈ సందర్భంలో వినిపిస్తా' వినండి.

ఎప్పటికి వచ్చు చావంచు నిరీక్షించనేల
ఎప్పటికప్పుడె వెన్నంటి మృత్యువుండ
అప్పుచేసి పప్పుకూడు తినెడివారల
కెప్పుడైన నేమి మృత్యువు సిరిసిరి మువ్వ'

కూజాలో నీళ్లుంటే యేం
గాజుగళాసులేక మరి
బజారున కొల్లలు కరుభూజాలున్నా
మజాగా ఎలా తినడం
జేబులో శని ఉంటే సిరిసిరిమువ్వా.

మాటలె కోటలు దాటా
మాటలె బీటలు దీయ హృదయ
కవాటము తెరచు మాటలలె
కోటికోటి ముత్యాలమూటలు సిరిసిరి మువ్వా.

గడ్డితిని మధురక్షీర మిచ్చు ఆ
గడ్డియె అన్నమిచ్చు, నానా విధమైన
గడ్డి తినెడు మనుడు అయ్యో
గుడ్డి గవ్వంత చేయరు సిరిసిరిమువ్వ

చీటికి మాటే ప్రాణము నే
చీటికి మాటికి పిల్చిన విసు
గేటికి వధూకీ ! పోటీయే లుదు నీ
మాటకు, మాటలేల సిరిసిరిమువ్వ

పిల్లల యల్లలి ఓపని
తలిదండ్రులు దండింతురా
పల్లలె యెదుట లేకున్న
తలిదండ్రుల గోడు వర్ణించు చెట్లు సిరిసిరి మువ్వ

ఈవిధంగా వ్రాస్తూ మనస్సును ఈ సంక్లిష్టాత్మక మస్యల నుంచి మళ్లించుకుందికి ప్రయత్నం చేసేవాణ్ణి. LDC గా జీవితం కష్టమైపోతూ వచ్చింది.





# రాయలసీమ : ఆంధ్రరాష్ట్రం

శ్రీకృష్ణదేవరాయల పాలనలో అష్టైశ్వర్యాలు అనుభవించిన రాయలసీమ చిరకాలం నుంచీ వెనుకబడివుంటూ తరచు క్షామానికి గురి అవుతోంది. ఇంతకాలంగా పరిపాలిస్తున్న ఆయా రాష్ట్ర ప్రభుత్వాల పరిపాలనా పటిమకు నిజంగా ఇది ఒక కళంకమే అనక తప్పదు.

సుమారు 73 లక్షల జనాభా గల ఈ అనంతపురం, బళ్ళారి, కడప, కర్నూలు, చిత్తూరు గల రాయలసీమ గత రెండు శతాబ్దాల నుంచి అనావృష్టికి లోనై ఉక్కిరిబిక్కిరౌతోంది.

కొన్ని సంవత్సరాల నుంచి రాయలసీమ ఆర్థికాభివృద్ధి సంఘం అనే సంస్థ వీరి సమస్యలను గురించి పరిశీలిస్తోంది. అయితే ఇది కేవలం సలహానిచ్చేది మాత్రమే కాని ఆయా సమస్యల పరిష్కార మార్గాలను క్రియారూపంలో పెట్టడానికి దీనికి తాహతులేదు. ఇప్పుడు శాసన నిర్మాణం ద్వారా దానికి తగు అధికారాన్ని కల్పించాలని ఆందోళన సాగుతోంది. కేంద్రప్రభుత్వం క్షామ నివారణ నిధి నేర్పర్చి ప్రభుత్వాలు మారుతున్నా రాయలసీమ పురోభివృద్ధికి భంగం కలుగకుండా ఏటేటా ఈ క్షామ నివారణ నిధిలోని ధనం సహాయంతో ఆయా ప్రణాళికలను అమలు జరిపి వారి అభివృద్ధికి తోడ్పడ వలసిన అవసరం ఎంతైనా ఉందని పలువురు ప్రముఖులంటున్నారు. ప్రజాసంస్థలు, ఉద్ఘోషిస్తున్నాయి. తుంగభద్ర ప్రాజెక్టు కోసం గత ఎన్ని సంవత్సరాల నుంచో ఆందోళన చేయగా చేయగా చివరికి 1938వ సంవత్సరంలో అది క్రియారూపం దాల్చింది.

రాయలసీమ ప్రజలకు, సర్కారుజిల్లా ప్రజలకు భాషా విషయంగా గాని, సంస్కృతి విషయంగా గాని, వారి ఆచార వ్యవహారాలలో నైతేనేమి ఎట్టి భేదమూ లేదు. కాని వారి వారి ప్రయోజనాలు వేరవడం వల్ల వీరి దృక్పథాలు తరచు బేధిస్తున్నాయి.

ఇటువంటి విభేదాలకు అలజడులకు తావు ఉండరాని ఉభయ ప్రాంతాల ప్రతినిధులు 1937వ సంవత్సరంలో ఒక పరిష్కారానికి వచ్చి ఒడంబడిక చేసుకున్నారు.

దీనిపై కీ.శే. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు మొదలైన ఇతర ప్రముఖులు వారి ఆమోదముద్రవేసి యున్నారు.

దీని ప్రకారం భావి ఆంధ్ర రాష్ట్రపు రాజధానిని గాని, హైకోర్టును గాని, రాయలసీమలో నెలకొల్పబడాలో, లేక సర్కారు జిల్లాలలోనే నెలకొల్పబడాలనో నిర్ణయం చేసే అధికారం రాయలసీమ వాసులకున్నది.

కాని అక్కడి నాయకులు, కొందరి కార్యకర్తల ధోరణి విపరీతంగా ఉంది. ఇది చాలా ఆశ్చర్యాన్ని కూడా కలుగజేస్తోంది. శేషించిన మద్రాసు రాష్ట్రంలోనే ఉండాలని కొందరు అసలు ఆంధ్రరాష్ట్రం ఇప్పుడు వద్దని చెప్పేవారు కొందరు, రాబోయే ఆంధ్రరాష్ట్రానికి మద్రాసు రాజధానైతేనే రాష్ట్రం కావాలని వేరొకరు. బళ్ళారి జిల్లా భవితవ్యం ఏమిటి? అది ఆంధ్రరాష్ట్రంలో చేర్చకూడదని ప్రధానికి తంతిమీద తంతి పంపేవారు కొంతమంది. ఈవిధంగా అనేక విధాలుగా తమ అభిప్రాయాలు వెలిబుచ్చుతూ సమావేశాలు, సభలు జరపడం చూస్తుంటే, రాయలసీమ ప్రజలు అసలు ఆంధ్రరాష్ట్ర అవతరణకు వ్యతిరేకులా అని కూడా సందేహించవలసి వస్తోంది. ఈ విధమైన విభిన్న పథాల అభిప్రాయాలను చూస్తే ఆంధ్రులు తమ నెత్తిని తమ అనైక్యతను చాటి చూపుతున్నారే కాని మరొకటి కాదు.

సమైక్య సుహృద్భావ వాతావరణం కల్పించి రాబోయే ఆంధ్రరాష్ట్ర ప్రతిష్ఠ నిలబెట్టడం, ఆంధ్రరాష్ట్రాన్ని పటిష్టం చేయడం మన నాయకులు బాగా గమనించివల్సి వుంది. రేపోమాపో ఆంధ్రరాష్ట్రం రాబోతోంది. ఈ ఆంధ్రరాష్ట్రోద్భవ శుభసమయంలో, ఆంధ్రదేశంలోని వివిధ రాజకీయ పక్షాలు, రాయలసీమ వాసులు కూడా తమతమ భేదాలను విస్మరించి ప్రస్తుత సమయంలో సమైక్య వాతావరణం కల్పించడం సముచితం.

ఏటేటా ఇక్కడ కరువుల వల్ల ప్రజలకు పురోభివృద్ధి లేకుండా వుంది. ఎక్కడ చూచినా నిస్పృహ నిరాశలు అధికమయ్యాయి. రైతాంగం ఆర్థిక స్తోమత నశించింది. పంటలనష్టం పశువుల నష్టం ప్రబలమైంది. అనావృష్టి వల్ల రైతుల జీవనపు పునాదులే కదిలిపోయాయి. అనేక కుటుంబాలు చిన్నాభిన్నమైపోయాయి. గ్రామాలలో పరపతి పుట్టడంలేదు. అప్పులభారం అధికమయింది. కరువుకాటకాల శాశ్వత పరిష్కార మార్గాలు, ఆకును అందని పోకకు పొందని విధంగా వున్నాయి. మొదట ఓమండూరు, పిమ్మట కుమారస్వామిరాజా నేటి రాజాజీ ప్రభుత్వాలు పార్టీ విభేదాలలో మునిగి కక్షలు ఎక్కువయి ప్రజాభివృద్ధిని విస్మరించి చెప్పుకోతగ్గదేదీ చేయలేక పోయాయి.



న్యాయానికీ, సత్యానికీ తావు లేకుండా పోయింది. క్షుధార్తుల ఆర్తనాదాలు వినేవారెవరు? పదవుల వ్యామోహంలోపడి, మంత్రిగద్దె నెక్కి అధికారం చెలాయించ జూడడమే నాయకులకు పరమలక్ష్యమై పోయింది. సామాన్య ప్రజాకోటి అభివృద్ధికి వారి జీవన ప్రమాణం హెచ్చింపుకు ఏం చేయాలి? దారిద్ర్య నిర్మూలనకు ఎట్టి ప్రణాళికలు అవసరం? పూజ్యబాపు కలలు గన్న సర్వోదయం ఎలా సమకూర్చకలం? అన్న జిజ్ఞాసే మృగ్యమయింది. దైనందిన ప్రజా జీవన సమస్యల లోకి తొంగిచూసే అధినాధుడు లేకపోయె. ప్రజాబాహుళ్యంలో నేడు కొనుగోలుశక్తి కూడా క్షీణించి నైరాశ్యం తాండవిస్తోంది.

కేవలం మంత్రి పదవుల కోసమే వచ్చిన మంత్రులందరూ ముఖ్యమంత్రుల చేతిలో కీలుబొమ్మలౌతూ వచ్చారు. వీరందరికీ ముఖ్యమంత్రి ఎంత చెబితే అంత, అందుకు విరుద్ధంగా పోకూడదు. కాగా తమతమ ప్రాంతాల అభివృద్ధికి వారేది చేయాలన్నా వారికి స్వేచ్ఛ ఎక్కడిది? నూటికి కోటికి ఒకవేళ ఏమంత్రి అయినా తెగించి ఏదైనా చేద్దామని ముందుకు వస్తే ఆర్థిక శాఖా మాత్యులు అందుకు తగిన డబ్బులేదని త్రోసి వేస్తుంటారు.

ఎప్పటికప్పుడు ఏవేవో సాకులు చెబుతూ రాయలసీమలో నిర్మింపబడవలసిన గండికోట, సిద్ధేశ్వరం మొదలైన ఇతర ప్రాజెక్టులు ఏవీ కూడా నిర్మింపబడలేదు. అసలు రాష్ట్ర సమస్యకు నిర్మింపబడవలసిన ప్రాజెక్టులకు చాలా దగ్గర సంబంధం ఏర్పడింది. రామపాద సాగరం సర్వే చేయడం మొదలుపెట్టారో లేదో వెంటనే దాన్ని ఆపుచేశారు. కృష్ణా పెన్నారు కొంతకాలంగా విపరీత ప్రచారం జరిగింది. పిమ్మట నందికొండ అన్నారు, తుంగభద్ర నేటికింకా పూర్తి కాలేదు. ఈ సందర్భంలో ఆవేశాలు, కావేషాలు పెచ్చుపెరిగి పోతున్నాయి. కాని ఆవేశాలు కార్యసాఫల్యానికి ఎప్పటికీ ఉపకరించవని ఇకనైనా నాయకులు గుర్తించాలి.

సర్కారు జిల్లాల స్థాయికి రాయలసీమ కూడా రావాలంటే ఆర్థిక పారిశ్రామిక విద్యారంగాలలో రాయలసీమను అభివృద్ధి పరచటం అత్యావశ్యకం. నాయకులందరూ వారి భయాందోళనలు, అనుమానాలు తొలగింపజేసి వారిలో నూతన దృక్పథము, చైతన్యం కలుగచేయాలి...

అక్కడ కొన్ని కాలేజీలు, హైస్కూళ్ళు ఉన్నాయి. కాని ఇవి రాయలసీమకు సంపూర్ణంగా తోడ్పడుట లేదు. లోగడ ఆంధ్ర విశ్వవిద్యాలయ రజతోత్సవ సందర్భంలో పేర్కొన్నట్లు ఆంధ్ర విశ్వకళా పరిషత్ ఆధ్వర్యాన రాయలసీమలో మరొక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పి వారి అవసరాలను తీర్చడం సముచితం.

తుంగభద్ర హైలెవెల్ కాలువ, నందికొండ సిద్ధేశ్వరం, ఇతర మైనరు ఇరిగేషన్ ప్రాజెక్టులు కూడా త్వరలో నిర్మించి రాయలసీమను తిరిగి రత్నాలసీమగా మార్చి సస్యశ్యామలం చేస్తేనే రాయలసీమకు న్యాయం చేసినవాళ్ళమౌతాం. ముఖ్యంగా ఈ విషయం ప్రజాప్రతినిధులు గుర్తించి తగురీతిగా ప్రవర్తించి రాయలసీమ వాసులకు ధైర్యం, నమ్మకమూ కలిగించాలి. ఆంధ్రరాష్ట్ర ఆవిర్భావ సమయంలో ఇది మిక్కిలి అవసరం, రాయలసీమ పురోభివృద్ధి జరగాలంటే వారు సర్కారు ప్రజలతో కలిసినప్పుడే అది జరుగుతుందని గమనించాలి గూడా.

**✻ 13-3-1953**

**తెలుగు స్వతంత్ర**




ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంగా మద్రాసు నుంచి కర్నూలులో అడుగుపెడుతున్న సందర్భంగా గ్రంథకర్త, తదితరులు



# ఆంధ్రరాష్ట్రం : మద్రాసు సమస్య

**ఆం**దోళన చేయగా చేయగా, ఆంధ్రరాష్ట్ర సత్వర అవతరణకు కఠోర నిరాహార దీక్ష పూని అఖిలాంధ్రాన్ని జాగరితం చేసి చివరికి ఆ ఆశయసిద్ధికి తమ ప్రాణాన్ని సైతం శ్రీరాములుగారు ఆత్మార్పణం చేయగా, కేంద్రప్రభుత్వం ఓ నిర్ణయానికి వచ్చింది. జె.వి.పి. రిపోర్టును ప్రాతిపదికగా చెన్నపురి లేకుండా నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగగలదని నెహ్రూ ప్రకటించారు.

జె.వి.పి. రిపోర్టులో చెన్నపురి భవితవ్యం విషయమై ప్రస్తావిస్తూ బొంబాయి నగరం గురించి మహారాష్ట్రులు ఆందోళన చేస్తున్నట్లే మద్రాసులో కూడా ఆంధ్రుల ఆందోళన బయలుదేరదీసినా, బొంబాయి నగర విస్తీర్ణమును బట్టి, ఇతర పారిశ్రామికాది సంస్థలను బట్టి దానిని ప్రత్యేక రాష్ట్రంగా నిర్మించవచ్చుననీ కానీ, మద్రాసు విషయం అట్టిది కాదనీ జె.వి.పి. రిపోర్టులో పేర్కొనబడింది. ఇది ఇలా ఎండగా 1949వ సంవత్సరం నవంబరులో ఆంధ్రప్రదేశ్ కార్యవర్గం కూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గురించి ఒక తీర్మానం చేస్తూ, జె.వి.పి. రిపోర్టును అంగీకరిస్తూ చెన్నపురిపై గల హక్కులను వదులుకున్నట్లుగా ప్రకటించింది. కాని శ్రీటంగుటూరి ప్రకాశం పంతులుగారు మాత్రం చెన్నపురి విషయంలో అంగీకరించక, దాన్ని కనీసం ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచాలని పట్టుపట్టగా రాష్ట్ర నిర్మాణం జరిగేముందు తిరిగి, చెన్నపురి సమస్య ముందుకు వచ్చింది.

ఒకానొక సందర్భంలో శ్రీపట్టాభి సీతారామయ్యగారు మద్రాసుపై ఆంధ్రులు హక్కును వదులుకున్నంత మాత్రం చేత అది అరవవారికి చెందుతుందని జె.వి.పి. రిపోర్టులో ఎక్కడా సూచింపబడలేదని, ఇందుగురించి భయపడనవసరం లేదనీ అన్నారు. అసలు జె.వి.పి. రిపోర్టులో మద్రాసు భవితవ్యాన్ని గురించి అసందిగ్ధంగా వదలివేయడమే ఒక గొప్ప పొరబాటు. అసలు మద్రాసుపై ఆంధ్రులు హక్కు వదులుకోవడానికి జె.వి.పి నిర్మాతలెవరు? ఇందు మూలంగా అనేక సమస్యను ఏర్పడడమే కాకుండా వివిధ రకాల ఊహాగానాలు బయలుదేరి ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. నిష్కర్షగా మద్రాసు భవితవ్యాన్ని గురించి తేల్చలేక పోవడం వల్ల ఇన్ని చిక్కులు వచ్చాయి. కేంద్ర ప్రభుత్వంగాని, శ్రీ నెహ్రూ గాని, ఇట్టి అలజడికి

తావివ్వకుండా, ఊహాగానాలకు చోటివ్వకుండా ప్రకటన చేసియుంటే ఇంత మిడిసి పడకపోదురు. ఎంతసేపటికీ, ఆంధ్రులు మద్రాసు వదలుకోవాలనడమే కాని, ఆంధ్రేతరులకు, అరవలవనీయండి, మలయాళీలవనీయండి మద్రాసుపై వారికుండే భావి ప్రతిపత్తి సూచింపబడటం లేదు. కాగా అరవమూకంతా మద్రాసు తమదేనంటే ఆఖరికి తెలుగు వారికి పాతిపెట్టే స్థలం కూడా లేదనీ, ఆంధ్రులు మద్రాసుపై హక్కుందనడం పెళ్ళాన్ని పంచిపెట్టమనడం వంటిదనీ, విపరీతధోరణికి వచ్చింది. కేవలం విష్ణుంశ సంభూతుడైన శ్రీ ఆచార్యులవారి చక్రాన్ని అరికట్టే అధినాధుడు లేక విర్రవీగిపోతుంటే అసంతృప్తి ఎందుకుండదు? రాష్ట్ర నిర్మాణం దృష్ట్యా, ఆర్థిక సమస్యలు, గవర్నర్ ఏర్పాటు, రాజధాని హైకోర్టు ప్రభుత్వ కార్యాలయాల ఉనికి మొదలైన విషయాలను సమగ్రంగా పరిశీలించి నివేదించేందుకు రాజస్థాన్ చీఫ్, జస్టిస్ శ్రీకైలాసనాధ వాంఛూను నియమిండం, వారు ఇక్కడి మంత్రులతోనూ వివిధ రాజకీయపక్ష నాయకులతోను, పలువురు ప్రముఖులతోనూ సంప్రతించి వారి అభిప్రాయాలను సేకరించడం ఆంధ్రదేశంలో వివిధ పట్టణాలను సందర్శించి, వారీ నివేదికను పూర్తిచేసి కేంద్రానికి అందజేయడం మొదలైన అంశాలన్నీ శీఘ్రగమనంలో సాగిపోయాయి. ఇప్పుడు అది కేంద్రంలో బుట్టదాఖలు కూడా అవుతోంది.

కేంద్రప్రభుత్వం వీరి నివేదికను పరిశీలిస్తున్న సందర్భంలో ప్రకటింపబడిన వార్తల ప్రకారం అతిథి హోదాలో కనీసం అయిదేళ్ళ వరకు ఆంధ్రరాజధానిని తాత్కాలికంగా మద్రాసులో ఉండవచ్చునని వాంఛూచే సూచింపబడినట్టు ప్రకటింపబడింది. ఇది చూడగానే తమిళులో అలజడి, కలకలం బయలుదేరింది. ఈ సమస్య కాశ్మీరు సమస్య కంటే, భారత ప్రధాని నెహ్రూకు గడ్డయి కూర్చుంది. కాదు మరీ! రాజాజీ లాంటి కఠోర దీక్షాదక్షులు, నాడార్, భక్తవత్సలం లాంటి హేమాహేమీలు పంతం పట్టి తాత్కాలికంగానైనా సరే ఆంధ్ర రాజధాని ఇక్కడ వుండకూడదని బెదిరించి బుసలు కొడుతుంటే నెహ్రూ లాంటి అపూర్వ నాయకుడగు గజగజా ఒణికి దాసోహమంటున్నాడు. ఆ యువ రాజనీతిజ్ఞత ఈవిధంగా తెల్లవారుతుందనుకోలేదు. చెన్న నగరం మీద, ఆంధ్ర అరవ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీలు ఆధ్వర్యం వహిస్తున్నప్పుడు, చెన్నపురి అందలి పౌరుల ఉమ్మడి సొత్తని వేరే బుజువు చేయవలసిన పనేముంది? ఇంతెందుకు 1917లో కాంగ్రెసు అధ్యక్షురాలు డాక్టరు బిసెంట్ వీరుభయులకు సమానమయిన హక్కు లున్నాయని తీర్మానించింది



చూపారంటే నిదర్శనాలకేంలోటు? ఈ విషయంలో తమిళమంత్రులు నాయకుల వైఖరి ఎంతమాత్రం బాధ్యతాయుతంగా లేకపోవడం శోచనీయం. ఒక మంత్రి తిరుపతి మాదేనంటే మరొకరు చిత్తూరంతా మాదేనంటున్నారు. తమిళ ప్రతిఘటనలకు భయపడి ఆంధ్ర రాజధాని సమస్యపై చర్చించేందుకు రాజాజీ, నాడార్లను ఢిల్లీకి ఆహ్వానించాడు. శ్రీ నెహ్రూ ఇక్కడ తాత్కాలికంగా నైనా రాజధాని ఉండరాదని తమ ప్రాతికూల్యం చూపుతూ, అలా ఒకవేళ ఏర్పడిన పక్షంలో తాను ముఖ్యమంత్రి పదవి నుంచి తప్పుకోవలసి వస్తుందని శ్రీ రాజాజీ బెదిరించారు. సర్వజన సమాదరణీయభావం లేకుండా, ప్రాంతీయ పక్షపాతం చూపుతుండడం చేత ఇంతటి ప్రచండ అంతర్యుద్ధం బయలుదేరింది. ఇటీవల జరిగిన హైదరాబాదు కాంగ్రెసు మహాసభలోనే కాకుండా! అనుదినమూ మద్రాసు అసెంబ్లీలో కూడా, అసలు భాషారాష్ట్ర పునర్విభజనే అనాగరీకమనీ, ఆంధ్రుల రాజధాని మద్రాసు గడ్డలో ఉండరాదనీ శ్రీ రాజాజీ భగవద్గీతాపారాయణం చేసినట్టు ప్రతిరోజూ ఉద్ఘాటిస్తున్నారు. కేవలం వీరు ముఖ్యమంత్రి హోదాలో కాకుండా, తమిళనాయకుని వలెనే, ప్రగల్భాలు కొడుతుంటే-ఇది వారిలోని అనాగరికతను తెలియజేస్తోందనడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

సమిష్టి రాష్ట్ర కుటుంబానికి ముఖ్యమంత్రి అయివుండి ఈ విధంగా ద్వేషపూరిత దావానలం రేపి, ఆంధ్రులను రెచ్చగొట్టి, విపరీతపు ధోరణిలో మాట్లాడే శ్రీ రాజాజీ ఏ అనాగరిక జాతికి చెందుతాడో ప్రజలే నిర్ణయించవలసి వుంటుంది. సుహృద్భావంతోనూ, సంతోషంతోనూ విడిపోవడం వాంఛనీయంగాని రాష్ట్రావిర్భావ శుభసమయంలో దానికి అన్ని విధాలా చేదోడువాదోడుగా వుండకుండా శ్రీ రాజాజీ అనుసరిస్తున్న మార్గం కేవలం అనాగరికం గాక మరేమిటి? స్వతంత్ర భారతావని అంతిమ గవర్నర్ జనరల్ అయియుండి కేంద్రప్రభుత్వంలో బాధ్యతాయుత మంత్రిపదవులు నిర్వహించి, గీతాపారాయణకోసం మద్రాసు వచ్చిన రాజాజీ ప్రజల కోరికమీద మద్రాసు ముఖ్యమంత్రిగా ప్రతిష్టింపబడి, అసహనంతో, ప్రాంతీయ చాపల్యంతో, నిరంకుశంగా వ్యవహరించే వీరు ఎంతటి ఉన్నత పదవి నుంచి ఎంతటి హీనస్థాయికి దిగిపోయినారో ప్రజలే ఊహించుకోవాలి.

మన నాయకులు గూడా "కైలాసంబందుండి, శంభుని శిరంబందుండి" వలె, ఆంధ్రులు చెన్నపురి తమదేనన్న వాదన విడిచి పుచ్చారు. చెన్నపురిని చెరిసగం చెయ్యాలన్న పట్టులను కూడా సడలించారు; చివరకు చీఫ్ కమిషనర్ రాష్ట్రం చెయ్యాలన్న

వాదనకూడా క్రమేపీ వీగిపోతోంది. చెన్నపురి విషయంలో కనీసం ఎంత నష్టపరిహారం ఇస్తారన్న సంగతి కూడా ఏమీ తేలలేదు గదా? ఈ విధంగా ఒక్క ఒక్క త్రాటిమీద నిలవకుంటే తమిళులు మనలను రెచ్చగొట్టక జోకొట్టుతారా?

1928 సంవత్సరంలో సైమను కమిషను బహిష్కరణ సందర్భంలో ఈ తమిళనాయకులు ఎక్కడదాక్కున్నారు? మద్రాసు గౌరవ ప్రతిపత్తిని కాపాడిందెవరు? అట్టి వారికి సూదిమోపే స్థానంలేదని గొంతుక చించుకుంటున్నారు; శ్రీ వాంచూయే అతిథిహోదాలో ఆంధ్రరాజధాని ఉండవచ్చు నన్నప్పుడు , కేంద్ర ప్రభుత్వం దాన్ని ఇపుడు త్రోసిపుచ్చడం, రాజాజీ మాట పాలించడానికే అని తెలుసుకోవచ్చు. అసలు వాంఛూ నివేదిక తెలుగువారి కళ్ళుతుడవడం కోసమేనని అనిపిస్తోంది.

మద్రాసు విషయంలో ఆంధ్రులకు అన్యాయం జరగకుండా కనీసం దాన్ని చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా చేయడం సమంజసం: కాని ప్రస్తుతం ప్రకటితమౌతున్న వార్తలను బట్టి తాత్కాలిక రాజధాని ఇక్కడ వుండదని నిర్ధారణ అవుతోంది. రాజాజీ రథచక్రాలు విజయయాత్ర సాగించాయి: ఆంధ్రదేశంలో ఆంధ్ర ప్రజయావత్తూ మద్రాసు భావిప్రతిపత్తిని గురించి ఏమనుకున్నాసరే–మద్రాసులో నివసించి మద్రాసులో స్థావిరాలు ఏర్పరుచుకుని, మద్రాసులో వ్యాపారం చేసుకుని, మద్రాసు ఆంధ్రులకు ఇది ఒక సవాల్! ఇది ఉమ్మడినగరమని, ఇది ఉమ్మడి సొత్తని ఇది ప్రతి ఆంధ్రుడికి ప్రతి తమిళుడికి, ప్రతి మళయాళీకి, ప్రతి ఇతరజాతి జనులకు చెందుతుందని అందరూ ముందుకు రావాలి, అప్పుడు గాని ఈ సమస్య తేలదు.

ఇప్పుడు కాకపోయినా మరోకొంత కాలానికి ఆంధ్రరాష్ట్రపు శాశ్వత రాజధాని హైదరాబాదు కాక తప్పదు. హైదరాబాదు రాజధాని అయే వరకూ ప్రతి తెలుగుబిడ్డ ఇప్పటి నుంచీ మేలుకొని గట్టి ప్రయత్నం చేయాలి. హైదరాబాదును దక్కించుకుంటే మద్రాసును దక్కించుకున్నంత ఫలితం.

**✳ 27-3-1953**

**తెలుగు స్వతంత్ర**



# ఆంధ్రరాష్ట్రం : వివిధ రాజకీయ పక్షాలు

పార్లమెంటులో ఆంధ్ర రాష్ట్రావతరణను గురించిన ప్రకటన కూడా జరిగిపోయింది. ఇక అక్టోబరు ఒకటవ తేదీన రాష్ట్రం అవతరించడమే మిగిలింది. శ్రీ నెహ్రూ ప్రకటనలో కొత్త ఏమీ లేకపోయినా, ఆంధ్రజాతి మెడలువంచి, ఆంధ్ర ప్రజావాంఛను ఎంతవరకు నిరసించడానికి అవకాశం వుంటుందో అంతవరకూ నిరసించి, మన ఆంధ్రనాయకులకు కేంద్రంలో అసలు పలుకుబడి అనే పదార్థం ఏదైనా ఒకటి ఉంటే దాన్ని తృణీకరించి, కేవలం రాజాజీ లాంటి తమిళనాయకుని చెప్పుడు మాటలనూ, ఆయన సలహాలనే పాటించి రాజస్థానపు న్యాయపతి శ్రీ కైలాసనాథ వాంఛూ నిష్పాక్షిక నివేదికను త్రోసిరాజని శ్రీ నెహ్రూ తన ఇచ్చవచ్చిన రీతిని ఆంధ్ర రాష్ట్రాన్ని కాదు కాదు పదకొండు తెలుగు జిల్లాలను, ఆంధ్రుల చేతుల్లో పెట్టాడు యేలుకోండని, చాలా సంతోషంగా వుంది.

అసలు ఈ విషయంలో జె.వి.పి. రిపోర్టు మొదలుకొని ఇటు శ్రీ వాంఛూ నివేదిక వరకూ ఆంధ్రాన్ని, ఆంధ్రప్రజాభీష్టాన్ని అధఃపాతాళానికి అణగద్రొక్కివేయడం అటు కేంద్ర ప్రభుత్వానికైతేనేమి, ఇటు మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ రథచోదకులకైతేనేమి గూటీ బిళ్ళాట అయిపోయింది. ఇప్పుడు మనం ఏమనుకుంటే మాత్రం ప్రయోజన మేముంది న్యాయానికి తావులేనప్పుడూ, విజ్ఞత నశించినపుడూను.

ఈ సందర్భంలో ఆంధ్రదేశంలో వివిధ రాజకీయపక్షాలు కాంగ్రెసులో విలీనం కాజాలకపోయినప్పటికీ కనీసం సహకార సమైక్యతలతో వ్యవహరించడం ఇప్పుడుండే పరిస్థితులలో ఎంతైనా అవసరమూ, ఆవశ్యకరణీయమూను. అలా జరిగినపుడే నూతన రాష్ట్రంలో సుస్థిర ప్రభుత్వంలో స్థాపనకు వీలు ఏర్పడగలదు. ఇటీవల పత్రికాముఖాన వెలువడిన వార్తలను బట్టి వివిధ రాజకీయపక్షాలకు, కాంగ్రెసుకూ సమాలోచనలు జరుగుతుండడం గమనార్హం. ఈ సమాలోచనల ననుసరించి ప్రజాస్వామిక శక్తుల నన్నింటినీ సమన్వయపర్చుటకు కృషి జరగడం ప్రశంసింపదగిన

విషయం. ప్రజాస్వామ్య పార్టీలు ఇన్ని ఉంటున్నప్పుడు, ప్రథమంలోనే ఆంధ్ర రాష్ట్రానికి ప్రెసిడెంటు పరిపాలన ఊహా మాత్రంగా నైనా ఆంధ్రులు సుతరామూ ఒప్పుకోరు. ఇది ప్రజాస్వామ్యానికే విరుద్ధం కాగలదు. విధిగా ప్రత్యేక గవర్నరు, ప్రత్యేక హైకోర్టు ఉండి తీరవలసిందే. కాబట్టి కాంగ్రెసుతో శాసనసభ్యుల మెజారిటీని సమకూర్చుకోవడం ఇప్పుడు చాలా ముఖ్యం. ఇందుకోసం ముందుగా కాంగ్రెసు చాలా శ్రద్ధతీసుకొని యత్నించవలసి వుంది.

ఆచార్య ఎన్.జి.రంగా గారు, శ్రీ నెహ్రూ గారితో సంభాషణలు జరిపి కాంగ్రెసులో తమ పార్టీ విలీనం కాదనీ, సహకరించగలదనీ పేర్కొన్నారు, కమ్యూనిస్టు ప్రాబల్యం హెచ్చుకుండా ఉండడానికి ఈ సహకారం తోడ్పడగలదనీ వీరు భావిస్తున్నారు. ఇటీవల వెలువడిన వార్తలనుబట్టి వీరు కాంగ్రెస్‌లో అసోసియేట్ మెంబర్స్‌గా ఉంటూ, తమ పార్టీ ప్రతిపత్తికి భంగం కలుగకుండా వ్యవహరించగలరని తెలుస్తోంది. ఈ పార్టీ వారు మరికొంతమంది స్వతంత్రులు కాంగ్రెసులో చేరగల పక్షంలో, 140 మంది సభ్యులు ఉండేవరకూ వుండగలదని ఇటీవల శ్రీ సంజీవరెడ్డి గారు పేర్కొన్నారు.

ప్రజా సోషలిస్టులుకూడా నెహ్రూతో సమాలోచనలు జరిపారు. అయితే తాము నిర్ణయించుకున్న చతుర్థశసూత్ర ప్రణాళికను ఆమోదింపబడినపుడు దేశంలో మిశ్రమ మంత్రివర్గాలు జయప్రదంగా సాగినపుడు రాబోయే ఎన్నికలలో కాంగ్రెసు టిక్కెట్లు మీదే తాము పోటీచేయడం కూడా సాధ్యపడగలదని ప్రజాసోషలిస్టులు అభిప్రాయపడుతున్నారు. నూతనాంధ్ర రాష్ట్ర అవతరణ దృష్ట్యా ఆంధ్రదేశంలో ఆంధ్ర ప్రభుత్వ స్థాపనకు అనువుగా తమ పార్టీ కర్తవ్యాల్ని శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారికి వదలివేస్తూ ప్రజాసోషలిస్టు కార్యవర్గం వీరికి సర్వాధికారాలను ఇచ్చింది.

సంప్రదింపులను బట్టి చూస్తే ఆయా పార్టీల లక్ష్యాలు, సిద్ధాంతాలు యథాతథంలో ఉంటున్నప్పటికీ, కార్యావిధానం, కమ్యూనిస్టు వ్యతిరేక దృక్పథంలో వుండడం సంతోషింప దగినవిషయం ఈ సంప్రదింపులు ఇలా జరుగుతుండగా కె.ఎమ్.పి.పార్టీకి చెందిన ఆరుగురు సభ్యులు లెజిస్లేచర్‌లో వేరొక పార్టీగా వ్యవహరించగలందులకు తీర్మానించుకున్నట్లు వింటున్నారు. ఇటు వంటి హఠాన్నిర్ణయానికి గల కారణమేమిటో మరి ఆలోచించదగిన విషయం.

ఆంధ్రదేశంలో ప్రజాస్వామిక శక్తులు దిగజారుతూ కమ్యూనిస్టుల ప్రాబల్యం హెచ్చిందంటే పార్టీ చీలికలు, ముఠాకక్షలే కారణం. పరిపాలన అంతా ముడివిడని రాజకీయాల్లో చిక్కుకోవడంవల్ల, ఎవరికివారే నాయకులై రోజుకోపార్టీ ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క నాయకుడూ ఏర్పడ్డం సంభవించింది. ప్రజాస్వామిక శక్తుల కతీతమైన ఇట్టి కల్మష వాతావరణం ఏర్పడినందువల్ల ప్రజలకు ప్రభుత్వం మీద ఉండవలసిన గౌరవం కూడా నశిస్తూ వచ్చింది. ఆయా ముఖ్యమంత్రుల ప్రాంతీయ సదుపాయాలకు, ముఖ్యమంత్రుల ప్రాంతీయ సదుపాయాలకు, ప్రాంతీయ అభిమానాలకు లోనై వారి వారి పదవులకు కారణభూతములైన వివిధ రాజకీయ పక్షాల మనస్తత్వాలకు వైరుధ్యం కలుగకుండా తమ తమ ప్రాంతాలను అభివృద్ధి పరచుకుంటూ తద్వారా తమ ఉనికిని బలపర్చుకుంటూ వచ్చారింతవరకూ, కాని ఇప్పుడు రాష్ట్రం విభజించే కాలం ఆసన్నమైంది. నాయకులు ఇక ఇట్టి ఆటలకు స్వస్తి చెప్పాలి. కాంగ్రెసు సంస్థ పునీతం కావాలి. కేవలం రాజకీయాధికారం చేజిక్కించుకునేందుకే ప్రాకులాడకుండా జాతియొక్క నైతికాభ్యున్నతికి నిర్విరామ కృషిచేయాలి అప్పుడే కాంగ్రెసు సంస్థ పటిష్టం కాగలదు.

ఇప్పటికప్పుడే అలజడీ కలకలం, బయలుదేరడం, కొందరు కొన్ని గ్రూపులుగా ఏర్పడుతూండడం, కొందరు వాటిని బలపర్చడం, ఇవన్నీ మనం వింటున్నాం. ఏప్రిల్ మాసారంభంలో విజయవాడలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై తమ విధానాన్ని, నెహ్రూ ప్రకటనకు సంబంధించిన ఇతర సమస్యల పరిశీలనను చర్చించగలరని శ్రీ సంజీవరెడ్డిగారు ఒక ప్రకటన చేశారు.

ఆంధ్రదేశంలోనే కాక, ఆంధ్ర రాజకీయ రంగంలో ప్రజానాయకుడనిపించుకున్న ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు రాష్ట్ర నిర్మాణం విషయంలో నైతేనేమి ప్రస్తుత సమయంలో, చాలా ప్రశాంతతతో, ఏమీ మాట్లాడకుండా వుండడం సంభ్రమాశ్చర్యాలను కలుగజేస్తోంది. చెన్నగర భావిప్రతిపత్తి విషయంలోనూ, లేదా దాని నష్టపరిహార విషయంలోనూ, ఆంధ్రప్రజల తరపున, హుంకరించి గర్జించిన మన ఆంధ్రకేసరి భావికార్యక్రమం, ఆయన ఎలా నిర్ణయించుకోవాలనుకున్నా, అది యెలా వుండగలదో ప్రజలు ఊహించుకోవడం కష్టం కాదేమో!

ప్రజాస్వామ్య పక్షాలు సమైక్య సమాలోచనల దృష్ట్యా నూతనాంధ్ర రాష్ట్రవ్యవస్థలో మిశ్రమ మంత్రివర్గ ప్రభుత్వ స్థాపన కనువైన వాతావరణం ఏర్పడుతున్నట్టు గోచరిస్తోంది.

యేది ఎలా వున్నా మున్ముందు నిర్మాణం కానున్న ఆంధ్ర మంత్రివర్గం భవిష్యదాంధ్ర రాష్ట్రపురోభివృద్ధి నిరంతరాయంగా జరుగుతూ ఆంధ్రదేశంలో నిర్మాణికై వేచియున్న నదీజలాల వివిధ ప్రాజెక్టుల సత్వరనిర్వహణకు పూనుకుంటూ రాష్ట్రాన్ని సర్వతోముఖంగా చేయడమే నాయకులకు ఏకైక లక్ష్యం కావాలి. ఇదివరకటిదాకా రాష్ట్రం రాలేదని మారాంచేశాం. రాష్ట్రం ఏర్పడిన తరువాత నాయకులు సాకులుచెపితే ప్రజలు ఊరుకోరు. రాష్ట్రావతరణ ప్రాథమికదశలో ప్రభుత్వం అనేక గడ్డుసమస్యలను ఎదుర్కోవలసినమాట నిజం. వీటినన్నిటినీ జయప్రదంగా అధిగమిస్తూ ప్రజాజీవన ప్రమాణాన్ని హెచ్చరించేందుకు పూనుకోవాలి. సామాన్య ప్రజాబాహుళ్యానికి ఏ పార్టీ అధికారంలోకి వచ్చిందనే విషయం అప్రస్తుతం. కడుపునిండా తిండి, కట్టుకునేందుకు గుడ్డ, కొంపా వారి ముఖ్యావసరాలూ అత్యావశ్యకాలూను. ఇప్పటివరకూ నిర్వహిస్తున్న కాంగ్రెసుపాలన ఎటువంటిదో వీరికి తెలిసిపోయింది. ప్రజానాయకులనుకునే వారందరికీ ఇది ఒక దీక్షాసమయం-పరీక్షా సమయం కూడాను. వివిధ పార్టీలు తమ విభేదాలను విస్మరించి అవసరమైన త్యాగమునకు గూడ వెనుదీయక సుస్థిరప్రభుత్వం ఏర్పర్చుకుని, ఆంధ్రజాతిని సముద్ధరించి, ప్రజాస్వామ్యాన్ని ఆంధ్రంలో చిరస్థాయిగా వర్ధిల్లేట్లు చేయాలి.

మరొక్కవిషయం ఆంధ్రదేశపు భూభాగాలు చెల్లాచెదరై పరాయి పంచలలో కలసివున్నాయి. ఈ భూభాగాలనన్నిటిని ఏకంచేసే బాధ్యత కార్యభారం మన నాయకులదే. విశాలాంధ్ర ఏర్పడిననాడే ఆంధ్రజాతికి మహోజ్వల భవితవ్యం వుంది. ప్రతి ఆంధ్రుడు ఏమూలకున్నా సరే, ఆంధ్రజాతి సంపూర్ణతకు ఘట్టి ప్రయత్నం చేయాలి. ఇప్పటివరకూ రాష్ట్రం లేక ఆంధ్రజాతికి పురోగమనం లేదు. ఇందుకు కేంద్రప్రభుత్వం కూడా ఆంధ్ర మీద చిన్నచూపు చూడడం ఒక కారణం. ఇందుకు నిదర్శనంగా తమిళ ప్రాంతంలో కేంద్రప్రభుత్వ అజ్మాయిషీలో ఉన్న భారతీయ సంస్థలే చాటుతున్నాయి. ఉదాహరణకు చూడండి అక్కడ నెలకొల్పబడిన -

(1) న్యూట్రిషనల్ రిసెర్చి లేబొరెటరీ కూనూర్.

(2) పాశ్చర్ ఇనిస్టిట్యూట్ కూనూర్

(3) సెంట్రల్ ఎలక్ట్రో కెమికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ - కర్రైక్కుడి

(4) ఇండియన్ వెదర్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ - క్రోంపేట (మద్రాసు)



ఆంధ్రదేశంలో వేలుమడచి చెప్పుకొనేందుకు ఒక్క సంస్థ కూడా లేదు. కేంద్రప్రభుత్వ పక్షపాతం దీనిని బట్టి చులాగ్గా గ్రహించవచ్చు. ఇవి గాక సంస్థానాలలో ఇంతే వున్నవి. ఆంధ్ర నాయకులకు విశాలదృక్పథం లేకపోవడం వారి అనైక్యత మొదలైన ఇతర కారణాల వల్లనే ఇట్టి పరిస్థితి ఏర్పడింది.

కాగా ఇక ముందైనా ఇట్టి అన్యాయం జరగకుండా విశాలాంధ్ర ఏర్పడేందుకు సర్వవిధాలా ప్రయత్నం జరుపుతూ, హైదరాబాదు మన రాజధానిగా ఏర్పడేటందుకు ప్రతి తెలుగు యువకుడు, యువతి కంకణం కట్టాలి. మన వాంఛా ఫలసిద్ధికి అటు కోస్తా ఆంధ్రం, రాయలసీమ, ఇటు వీర తెలంగాణయే కాకుండా లక్షలాది ప్రవాసాంధ్ర ప్రజానీకం,ముక్తకంఠంతో ఘోషించాలి. అందరూ ఏకీకృత దృఢనిశ్చయంతో ఒక్క త్రాటిమీద ముందుకు సాగాలి. ఇది మన పరమ లక్ష్యం. మన వివిధ పార్టీల కర్తవ్యం.

**✳ 13-4-1953**

**తెలుగు స్వతంత్ర**

# కన్నడ సోదరుల వితండవాదం

**అ**క్టోబరు ఒకటవ తేదీన పదకొండు తెలుగు జిల్లాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతుందనీ, బళ్ళారిజిల్లా ద్విభాషానుప్రాంత మయినందువల్ల, దానినంతటినీ ఏ ఒక్క రాష్ట్రంలోగాని చేర్చవీలుండదనీ, ఈ జిల్లాలోని హర్పణహళ్ళి, హడాగళ్ళి ఉత్తర – దక్షిణ హొస్పేట, సొండూరు, సెరిగుప్ప తాలూకాలయందు కన్నడిగులు అధికమవడం వల్ల వీటిని మైసూరు సంస్థానంలో చేరుస్తామనీ, ఆదోనీ, ఆలూరు, రాయదుర్గం తాలూకాల్లో తెలుగువారు అధికులు కాబట్టి వీటిని ఆంధ్రరాష్ట్రంలో కలుపుతున్నామనీ, బళ్ళారి భవిష్యత్తు త్వరలో ఆలోచించి నిర్ణయింపగలమనీ శ్రీనెహ్రూ పార్లమెంటులో ప్రకటించారు.

ఈ విషయంలో శ్రీ వాంఛూ తమ నివేదికలో కర్ణాటక రాష్ట్రం ఏర్పడేవరకు బళ్ళారినంతటినీ ఆంధ్రరాష్ట్రంలో చేర్చడం మంచిదని పేర్కొన్నారు. కాని కేంద్ర ప్రభుత్వం ఈ సూచనను పాటించకుండా పై నిర్ణయం చేసింది.

శ్రీనెహ్రూ ప్రకటన వెలువడినప్పటి నుంచి మన కన్నడసోదరులలో అలజడి బయలుదేరి ఇప్పుడు బాగా తీవ్రరూపం దాల్చడం చాలా శోచనీయం. కన్నడ తాలూకాలను మైసూరులో చేర్చివేయడం ఆంధ్రులకు ఎట్టి అభ్యంతరం లేదు. తమ చిరకాల లక్ష్యమైన మహాకర్ణాటక సంస్థాపనకు మొదట మెట్టుగా కేంద్ర ప్రభుత్వమే దోహదమిస్తోంది వారికి. తమ వాంఛాఫలసిద్ధికి ప్రయత్నం జరుగుతుంటే ఇది ఆంధ్రులకు మాత్రం సంతోషదాయకం కాదా!

ఖచ్చితంగా తెలుగు మెజారిటీ తాలకాలై కేల్కార్ అవార్డ్ ప్రకారం ఆంధ్రదేశ కాంగ్రెసు అధీనంలో ఉన్న ఆదవాని, ఆలూరు, రాయదుర్గం బళ్ళారి తాలూకాలన్నీ కూడా తమవేనని బుకాయించడం అవివేకం తప్ప మరొకటి కాబోదు. ఇంతటితో వూరుకోకుండా మన కన్నడ సోదరులు మడకశిర, ధర్మవరం, కళ్యాణదుర్గం, కర్నూలు తాలూకాలు తమకే చెందాలని అంటుండడం కేవలం నిరాధారమైన విషయం. ఇట్టి వితండావాదం విస్మయాశ్చర్యాలను కలుగజేస్తోంది.



భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతాన్ని ఏనాడో ఆమోదించిన కాంగ్రెసు ఇంతకాలంగా ప్రభుత్వములో ఉన్నప్పటికీ భాషారాష్ట్ర పునర్విభజనకు ఎట్టి చర్యలూ తీసుకోలేదు. కాని న్యాయబద్ధమైన ప్రజాభీష్టాన్ని మన్నించకపోవడం వల్ల, ప్రజాబలాన్ని ఎదుర్కొనడం ప్రభుత్వానికి దుస్సాధ్యమైంది. ఏతత్ఫలితమే ఆంధ్రావతరణ, ఆంధ్రరాష్ట్రంతో పాటు ఇతర భాషా రాష్ట్రాల సంస్థాపనకు మార్గదర్శకమైంది ఆంధ్రం. కాగా మనతో ఇప్పుడు సహకరించవలసినది పోయి మన కన్నడ సోదరులు ఇటువంటి బెదిరింపులకు దిగడం చాలా తప్పు. కన్నడిగులు తెలివితెచ్చుకుని తమ బూకరింపులకు వెంటనే స్వస్తి చెప్పవలసి వుంటుంది.

భాషావిషయకంగా, సాంస్కృతికంగా, ఆర్థిక చారిత్రక దృష్ట్యా కూడా బళ్ళారిలో తెలుగే ప్రధానం. కన్నడిగులకంటే ఆంధ్రులే అధికంగా ఉన్నారు. మునిసిపల్ కౌన్సిల్‌లో కూడా ఆంధ్రులే మెజారిటీలో ఉన్నారు. ప్రస్తుత మునిసిపల్ కౌన్సిల్ అధ్యక్షుడు కూడా ఆంధ్రుడే.

ఇలా వుండగా, బళ్ళారినంతటినీ, మైసూరులో కలపకపోతే రాజీనామా ఇస్తామని హైదరాబాదు అసెంబ్లీ కర్ణాటక సభ్యులు శ్రీ నెహ్రూకు ఒకలేఖ వ్రాశారట. ఇది మరీ విపరీతమైన విషయం. ఈ జిల్లా విషయమై శ్రీ నెహ్రూ ప్రకటనను విమర్శిస్తూ బళ్ళారి నిర్వివిదామైన కన్నడ ప్రాంతమని బొంబాయి కన్నడ సోదరులు మరొక తీర్మానం చేశారట. బళ్ళారి జిల్లాను ఆంధ్రరాష్ట్రంలో చేరిస్తే కర్ణాటక రాష్ట్రం తలతీసినట్లే భావిస్తానని బొంబాయి లెజిస్లేచర్ పార్టీ కార్యదర్శి శ్రీవి.వి.పాటిల్ అంటున్నారు. ఆంధ్రుల మంచితనాన్ని చూచుకొని వీరీవిధంగా చెలరేగుతున్నారు. ఈ విధంగా కేంద్రప్రభుత్వంమీద ఒత్తిడి కలుగజేయాలని చూస్తున్నారు. ఈ సమయంలో వారికి ఇది తగినపని కాదు. మన కన్నడసోదరులు ఇంకా వూరుకోక వ్యతిరేక ప్రదర్శనాలకు జరుపుతూ నినాలు చేస్తూ, రైలుబండ్లనాపుతూ, పోయేరైళ్ళ మీద రాళ్ళురువ్వుతూ, రైలుపట్టాలను పీకివేస్తుండడం కేవలం అమానుషచర్యలు కాక మరేమిటి?

ఆంధ్రరాష్ట్రం ప్రథమంగా అవతరించబోతోంది గనక మైసూరులోని తెలుగుప్రాంతాలయిన చితల్‌దుర్గం తుంకూరు, కోలారం, బెంగుళూరు మనరాష్ట్రంలో ముందు కలిపివేసి, కర్ణాటక రాష్ట్రం ఎప్పుడేర్పడుతుందో అప్పుడే బళ్ళారిలోని వారి

కన్నడ తాలూకాలను మైసూరులో కలిపేట్లు నిర్ణయిస్తే బాగుండేది. కేంద్ర ప్రభుత్వం, అలా కాకుండా కన్నడ తాలూకాలను ముందే ఇందులోంచి విడదీసేసి మైసూరులో కలుపుతున్నా మనేసరికల్లా వీరికి ఎక్కడలేని ధైర్యం వచ్చి, కన్నడ సోదరులు ఓ మెట్టు పైకెక్కి ఆంధ్రుల నెత్తిమీద కాలు వెయ్యాలని చూస్తున్నారు. ఇట్టి వివాదగ్రస్త సమస్యకు ప్రజావాక్య నిర్ధారణకేనా వదలి వేయబడవలసింది. ఇట్టి సమయంలో సామరశ్యంతో సంప్రతించి, ఉభయరాష్ట్రాలకు లాభదాయకంగా, సానుకూల్యంతో పరిష్కరించుకోవలసినది పోయి, కన్నడులు కేవలం ఆంధ్రులను రెచ్చగొట్టడం నిందార్హం కాక మరేమిటి?

ముందుముందు ఆంధ్రులకూ కన్నడ మహాజనులకూ సుహృద్, సౌభ్రాతృత్వాలు పెంపొంది నిరాటకంగా కొనసాగాలంటే అవసరమైనట్టి నిరాధారమైనట్టి ఆందోళన చేయడం తక్షణం కట్టిపెట్టాలి. కర్నాటక కాంగ్రెసు అధ్యక్షుడైన శ్రీనిజలింగప్పంతటివారే శ్రీ నెహ్రూ మీద ఈ విషయంలో ఒత్తిడి కలుగజేస్తున్నారు. బాధ్యతాయుత పదవిలో ఉన్నవారు నిష్పాక్షికంగా వ్యవహరిస్తేనే వారి పదవికి న్యాయం చేయగలిగినవారౌతారు. ఇది వారు ఎంత త్వరగా గుర్తిస్తే ఉభయులకు అంత మంచిది.

బళ్ళారిలో వర్తక వ్యాపారాది పలు రంగాలలో ఆంధ్రులకు అవినాభావ సంబంధం ఏర్పడ్డది. అక్కడి పెక్కు సంస్థలలో ఆంధ్రుల ద్రవ్యం పడకపోలేదు. నేడు ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా నిర్ణయం జరిగితే ఇది మరింత అలజడికి తావివ్వగలదనడంలో సందేహం లేదు. ఒకవేళ దీనిని ఆంధ్రంలో చేరిస్తే కన్నడ ప్రాబల్యం తగ్గుతుందని, వారికి ఆంధ్రులు తగు ప్రాతినిధ్యం సరిగా ఇవ్వరనీ కన్నడులు అపోహ పడుతున్నట్లయితే వారు చాలా పొరపాటు పడుతున్నారు. ఆంధ్రులు త్యాగశీలురు కాని వేరు కారు. ఆంధ్రులు దానశీలురుకాని వేరొకరు కారు. ఇప్పటి వరకూ వారికి జరిగిన అన్యాయాలే ఇందుకు అచ్చమైన నిదర్శనాలు. ఒకరి సొత్తు వారి కనవసరం. వారికి న్యాయంగా చెందవలసినది వారికివ్వడం నాయకులు గుర్తించవలసిన కనీసధర్మం. అంకెలను, ఇతర ఆధారాలను, బళ్ళారిజిల్లా జనాభాలెక్కల విషయంలో అసలు మద్రాసు ప్రభుత్వమే ఆ మాయిగారడీ చేసి అందించింది శ్రీవాంఛూకు.

ఆంధ్ర నుంచి కొరాపుట్టి, గంజాం ప్రాంతాలను ఒరిస్సాలో కలిపారు. బస్తరు మధ్యప్రదేశ్‌లో లీనమై ఉంది. తెలంగాణా నైజాము నవాబుల పరంలో ఉన్నది. మద్రాసులో మరికొన్ని తెలుగు ప్రదేశాలు కలిసి ఉన్నాయి. ఈవిధంగా చిన్నాభిన్నమైంది ఆంధ్రదేశం. వీరి విషయంలో ఆంధ్రులకు త్వరలో న్యాయం జరగకపోతే ఒక మహోద్రిక్తమైన ప్రచండోద్యమం బయలుదేరితీరుతుంది. దాన్ని అరికట్టడం ప్రభుత్వానికి దుస్సాధ్యం.

లోగడ వచ్చిన వార్తలను బట్టి బళ్ళారిని మైసూరులోనే కలిపేందుకు కేంద్రప్రభుత్వం సుముఖత్వం చూపుతున్నట్టు తెలుస్తోంది. ఆంధ్రుల ప్రజాభీష్టాన్ని వ్యతిరేకిస్తే ఇప్పుడు కాకపోయినా ముందు విపరీతమైన అలజడి రేగడం తథ్యం. అసలు మొదటి నుంచి ప్రజావాంఛకు వ్యతిరేకం జరుగుతోంది. కాగా బహిరంగంగా ప్రజాస్వామిక వ్యతిరేకశక్తులను కేంద్రప్రభుత్వమే ప్రోత్సహిస్తున్నట్లు కనబడుతోంది. ముందు ఇది నాలా ప్రమాదాన్నాపాదించగలదు.

కాబట్టి కేంద్రప్రభుత్వం ఇప్పుడైనా మేలుకుని ఒక "హైపవర్ బౌండ్రీ కమీషన్ను" నియమించి ఇతర భాషా రాష్ట్రాల సమస్యలతో పాటు భవిష్యదాంధ్ర రాష్ట్రంలో కలుపబడవలసిన తెలుగు భూభాగాలను, వాటి సరిహద్దులకు, నిష్పాక్షికంగా తేల్చివేయడం తక్షణం జరపాలి. కేంద్రప్రభుత్వం విజ్ఞతతో నిర్ణయాలను చేయకుండా ప్రతివిషయం ఇలా నానుస్తుంటే పరిస్థితులు ఇంకా విషమించి కొరుకుపడని అనేక సమస్యలు ఏర్పడగలవు.

**✻ 17-4-1953**

**తెలుగు స్వతంత్ర**

# శ్రీబాగ్ ఒడంబడిక : ఆంధ్ర రాజధాని

కొన్ని తెలుగు ప్రాంతాలను రాయలసీమ అనీ మరికొన్నింటిని కోస్తా ఆంధ్ర అనీ, హైదరాబాదు నవాబుల పరంలోనున్న తెలుగు మండలాన్ని తెలంగానా అనీ వ్యవహరిస్తుండడం వల్ల ఇదంతా సంపూర్ణ ఆంధ్రదేశమనే దృక్పథమూ, ఏకైక ఆంధ్రజాతి అనే విశాలదృష్టి సన్నగిల్లుతే వేటికవే సంకుచితత్వానికి లోనై ఆయా ప్రాంతాల నాయకులు, సంస్థలూ విభిన్న వైఖరులను, భిన్న భిన్న మనఃప్రవృత్తులను ప్రదర్శించి అనుసరిస్తుండడం వల్ల తెనుగు ప్రజలలో సుహృద్భావన సౌహార్ధాలు క్రమేపీ క్షీణించి ఆకుకు అందని పోకకు పొందని విధమైనాయి. తెలుగుజాతి అంతా ఒకటి. తెలుగుదేశం అంతా ఏకైక దేశం, తెలుగు సంస్కృతి, చరిత్ర అంతా ఏకైక మహోజ్వల జీవనస్రవంతి అనే విశాలదృష్టి ముఖ్యంగా నేటి నాయకులలో పిమ్మట ప్రజలలో సమసిపోసాగింది.

ఇప్పటికి పదహారేండ్లక్రితం అనగా 1937 నవంబరులో రాయలసీమ వాసులకూ ఉత్తరాంధ్రులకూ మధ్య ఇట్టి సౌహార్ద్ర సామరస్యాభివృద్ధి కోసం చెన్ననగరంలో దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్వగృహమైన 'శ్రీబాగ్'లో పలువురాంధ్ర ప్రముఖుల సమక్షంలో ఈ ఒడంబడిక జరిగిన మాట వాస్తవమే.

ఈ ఒడంబడిక ననుసరించి వెనుకబడివున్న దత్తమండలాలను సస్యశ్యామలంగా మార్చగల వివిధ ప్రాజెక్టుల సత్వర నిర్వహణకు పూనుకోవడం, విద్యా విషయకంగా ఈ ప్రాంతాన్ని విజ్ఞానవంతం చేయడం, భావి ఆంధ్రరాష్ట్రపు రాజధాని హైకోర్టుల ఉనికియొక్క నిర్ణయం రాయలసీమ వాసులకే వదలివేయడం జరిగింది.

నాటికి నేడు మనకు ఆంధ్రరాష్ట్ర అవతరణ కనుచూపుమేరలో ఉంది. ఈ సమయంలో వీటి విషయం ఆంధ్రులు సత్వరం తేల్చుకోవలసి ఉంది.

లోగడ శ్రీవాంఛూ ఆంధ్రదేశపు ప్రధాన నగరాలకు సందర్శించినపుడు తలొకరు తలొక విధంగా తమతమ ప్రాంతంలోనే రాజధాని వుండాలనీ, తమ నగరమే



రాజధానికి తగి ఉన్నదంటూ విజ్ఞప్తిమీద విజ్ఞప్తులు, మెమొరాండాలు ఆయా ప్రజాసంస్థలు నాయకులు కుప్పలు తిప్పలుగా అందజేసి వారిని ఉక్కిరిబిక్కిరి చేశారు. బాధ్యతాయుతంగా కాక, ఐకమత్యం లేకుండా ఇట్టి ప్రధాన సమస్యలో ఏకీకృత నిశ్చయాన్ని తెలుపక తమ వెల్తిని చాటుకోవడం కాదా ఇది? ఎవరి వూరు మీద వారికి అభిమానం ఉండడం సహజం. వీరందరూ తమ సొంత అభిప్రాయాలను వెల్లడించుకోవడం మన ప్రజాస్వామిక సిద్ధాంతం ప్రకారం వారివారి జన్మహక్కు. దాన్ని ఎవరూ కాదనలేరు. కాని రాష్ట్రానికి సంబంధించినటువంటి , రాజధాని నగర, హైకోర్టుల యొక్క వునికి యావదాంధ్ర దేశానికి అతి ప్రాముఖ్యమైనట్టి, ప్రధానమైనట్టి సమస్యలు. వీటి విషయంలో నాయకులు కూరగాయల బేరంలా వ్యవహరించడంలో వీటి యొక్క ప్రాధాన్యం, ప్రాముఖ్యం కించపరిచడం కాదా?

ఆంధ్రుల రాజధాని నగరం ప్రజా బాహుళ్యానికి అందుబాటులో ఉండేట్లు నెలకొల్పబడడం సమంజసమూ వాంఛనీయమూను, అటు రాయలసీమకూ, ఇటు కోస్తా ప్రాంతాలకూ ఇంచుమించు సరిసమాన దూరంలో విజయవాడ అనువైనదిగా కనిపిస్తోంది. ఇది అందుబాటులో ఉండేసంగతి అలా వుండగా కనీసపక్షం బాగా అభివృద్ధి చెందినదిగా నైనా ఉండాలి. రాజధాని ఇక్కడ వుంటే విజయవాడ నుంచి మచిలీపట్నం వరకూ బాగా అభివృద్ధి చెంది ఒక బ్రహ్మాండమైన పెద్ద కేంద్రం కాగలదు. మచిలీపట్నం ముందు ముందు పెద్ద ఓడరేవు కాగలదు. అసలు మనకు వుండే బహు కొద్ది నగరాలలో అన్నిటికంటే విజయవాడ అనువుగా వున్నదని గుర్తిస్తే శ్రీబాగ్ ఒడంబడికను త్రోసి రాజని అయినా రాయలసీమ వాసులు తమ సంపూర్ణ సహకారాన్ని ఇవ్వగలరనడంలో సందేహము లేదు.

రాజధాని ఇక్కడ నెలకొల్పినంత మాత్రంచేత శ్రీబాగ్ ఒడంబడికను తిరస్కరించినట్లు అవగలదా? హైకోర్టు అనంతపురంలో ఎలాగు వుంటుంది? రాయలసీమ ప్రజలకు తెలుగుదేశపు నడిగడ్డలో రాజధాని వుండడం వారికి మాత్రం సంతోషం కాదా?

పైగా హైదరాబాదు నగరాన్ని ఆంధ్రులు భవిష్యద్విశాలాంధ్ర శాశ్వత రాజధానిగా ఏర్పర్చుకోవడం తథ్యం. హైదరాబాదు నిస్సందేహంగా నిర్వివాదమైన ఆంధ్రనగరమని శ్రీరామానంద తీర్థ ఇటీవలనే ఉద్ఘాటించారు. ఈ విషయంలో

కాంగ్రెసువాదులు అంతా అంగీకరించినట్టు వీరు స్పష్టపరిచారు. కాగా ఇప్పుడు నిర్ధారణ చేయబోయే రాజధాని నగరపు స్థల నిర్ణయం తాత్కాలికమైనదే కాదా? అటువంటప్పుడు నాయకులందరూ విజ్ఞతను సమయస్ఫూర్తిని ప్రదర్శించవలసి వుంది. రాయలసీమ వాసులు కేవలం శ్రీబాగ్ ఒడంబడిక వున్నది కదా అని ఈ సమస్యలను క్లిష్టతరం చేయకుండా సౌజన్యంతో, సుహృద్భావ పూరితమైన సమ్మతినిచ్చి ఉభయులకు గౌరవం ఆపాదించగలరని ఆశించడం సమంజసం కాదా? అసలు విషయం చెప్పాలంటే రాజకీయ నాయకులలోనే పార్టీలూ, కలతలూ వుంటాయి. కాని ప్రజలలో అట్టివి లేవు. వారు ఇది న్యాయమైనది అని అంటే అందుకు తప్పక అంగీకరించగలరనడంలో సందేహం లేదు.

కాని మన నాయకులంతా ఒట్టి తుందుడుకు పిల్లల్లా వ్యవహరిస్తుండడం బాగులేదు. శ్రీఎన్.జి.రంగాలాంటి నాయకులు రాజధాని విషయంలో ప్రకటనల మీద ప్రకటనలు జారీచేస్తూ, తిరుపతి ఆంధ్ర రాజధాని కావాలని ఉద్ఘాటిస్తున్నారు. ఇంత తొందర ఎందుకోమరి? వీరి దృష్టిలో ఆంధ్రప్రభుత్వాన్ని తిరుపతి కొండల మీద పెట్టుకోవచ్చునని కాబోలు. లేక తాము ఒక పార్టీ నాయకులు కనుక ఆ పార్టీకి రాజధాని ఇది ఉండాలని తోచింది కాబోలు. తిరుపతి మీద వీరికి ఇంత మోజు కలగడం మరి ఏడుకొండల వానిమీద వీరికుండే అపారమైన భక్తేనా అయివుండాలి.

వీరు ఇలా అంటుంటే మరొక రాజకీయ వర్గం వారు విశాఖపట్టణంలో రాజధాని నేర్పర్చాలని అనుకుంటున్నట్లు అతి విశ్వసనీయంగా తెలుస్తోంది. విశాఖపట్టణంలో కూడా తగినన్ని సౌకర్యాలు, సదుపాయాలు లేవు. రాజధాని ఆంధ్రదేశానికి ఒక మూల విసిరేసినట్టుంటుంది. బళ్ళారి, అనంతపురం, కర్నూలు, కడప పట్టణాలకు సగటున సుమారు 520 మైళ్ళ దూరంలో వుంది విశాఖపట్టణం.

అసలు రాజధానికై అనువైన పట్టణం ప్రస్తుతం మనకేదీ లేదు. కాని ఇప్పుడేర్పడిన పరిస్థితులలో రాజధాని నేర్పర్చుకోవలసిన వుంది. మరి రాయలసీమ వాసులు రాజధాని ఉనికికై తగవులాటలకు దిగకుండా తాము చాలాకాలం నుంచి అనుభవిస్తున్న క్షామ దారిద్ర్య నిర్మూలనకై ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం నుంచి ఆశించవలసిన తరుణం ఇది. రాయలసీమకు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆధ్వర్యంలో మరొక యూనివర్శిటీ ఉండాలనన్న విషయం నిర్వివాదమైనదే గదా! సాధ్యమయినంత త్వరలో నెలకొల్పబడేట్టు చేయడమే మిగిలినదల్లా.



పోతే ప్రాజెక్టుల విషయంలో తుంగభద్ర నిర్వహణం అవసరమైన ఆలశ్యానికి గురి అవుతోంది. సత్వర పరిసమాప్తికి, ప్రజలూ రైతాంగం పూనుకోవాలి. దీనితోబాటే ఇతోధిక వ్యవసాయాభివృద్ధికి నిర్మింపబడవలసిన సిద్దేశ్వరం, గండికోట, నందికొండ మొదలైన ప్రాజెక్టులను ఆంధ్రప్రభుత్వం ఎలాగూ నిర్వహించగలదు. కావాలంటే ఒక నిర్ణీతమైన కాలవ్యవధి ఏర్పరుచుకుని ఉభయుల సామరస్యంతో, ఆంధ్ర ప్రభుత్వం వాటిని ఆచరణలో పెట్టేట్టు చూచుకోవాలి.

రాజధాని నగర నిర్ణయ సమస్య ఆంధ్ర శాసనసభ్యులకు వదిలివేయబడింది. మే నెలాఖరున జరిగే శాసనసభ్యుల సమావేశంలో ఈ సమస్య తేలిపోగలదు. శ్రీ సంజీవరెడ్డిగారు కాంగ్రెసు అధిష్టాన వర్గం నుంచి, ఆంధ్ర లెజిస్లేచర్ కాంగ్రెసు నాయకుడు చెప్పినట్లే అంగీకరించాలనీ తద్వారా కాంగ్రెస్ డిసిప్లిన్ అనుసరించ వలసిందిగా కోరినట్లు తెలుస్తోంది. ఇది ఏమీ సమంజసంగా కనుపించుటలేదు. రాజధాని నగర నిర్ణయ గురుతర బాధ్యతను నూటికి నూరుపాళ్ళు నిష్పాక్షికంగా వాస్తవిక పరిస్థితులలో తేల్చవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**✻ 1-4-1953**

**తెలుగు స్వతంత్ర**

# కర్నూలు నిర్ణయం :
# మన నాయకుల పతనం

ఆంధ్రరాజధాని నగర స్థల నిర్ణయంతో రాష్ట్రావతరణం అంతిమ ఘట్టంలో పడింది. రాజధాని నిర్ణయం ఆంధ్ర శాసనసభ్యులే నిర్ణయించుకొని భారత ప్రభుత్వానికి జూలై 1వ తేదీలోగా తెలియజేయవలసిందని శ్రీ నెహ్రూ ప్రకటించారు. ఈ సూచన మేరకు అయిదు రోజులుగా ఆంధ్ర లెజిస్లేటివ్‌కు చెందిన వివిధ పార్టీల సభ్యులు సుదీర్ఘమైన చర్చలు జరిపి, తర్జనభర్జనలు పడి చివరకు కర్నూలు రాజధానిగా నిర్ణయం చేశారు. విజయవాడ రాజధాని కావాలన్న ప్రతిపాదన 26 ఓట్ల మెజార్టీతో వీగిపోయింది.

యావదాంధ్ర దేశానికి సంబంధించిన అతి ప్రధానమైన ఈ విషయంలో ఏకాభిప్రాయం లేకుండా ఈ అయిదురోజులుగా వివిధ పార్టీల మధ్య ఒక బ్రహ్మాండమైన తుఫాను చెలరేగింది. దేశంలో అలజడి కూడా బయలుదేరింది. చర్చల ధోరణి, వివిధ పార్టీల వైఖరులు బాధ్యతాయుతంగా కాక అందుకు విరుద్ధంగా జరగడం చూస్తుంటే ఆంధ్రాభిమానం కుంటుపడి పరస్పర సుహృద్‌సౌహార్ధ వాతావరణం రేఖామాత్రంగానైనా ఉన్నట్టు కనిపించ లేదు.

అశేషాంధ్ర ప్రజానీకం తమ ప్రతినిధుల మీద కొండంత ఆశ పెట్టుకుని ఉన్న ఈ తరుణంలో రాజధానిని ఆంధ్రసీమ నడిగడ్డలో నిర్ణయించాలన్న వారి నిశ్చితాభీష్టాన్ని నాయకులు తృణీకరించి మారుమూల కర్నూలును ఎన్నుకోవడం వల్ల రాయలసీమకు –సర్కార్లకూ మరింతగా వైషమ్యాలను రెచ్చగొట్టి మనఃక్లేశాన్ని కలుగజేయడమే గాక ఆంధ్రజాతికి తీరని అపకారం చేశారు. కాలదోషం పట్టిన ఒకానొక ఒడంబడికను పురస్కరించుకొని రాజధానిని మారుమూల ఏర్పరచుకోవడం వల్ల రాయలసీమకు సర్కార్ల మీద నమ్మకం కుదిరిందా? ఆర్థికంగాను, ఆ ప్రాంతపు కాటకనివృత్తికీ, విద్యావ్యాప్తికీ తగు హామీని కోరుకోవలసిందిపోయి, రాయలసీమవారు



కనీసం రాష్ట్ర పరిపాలనా సౌలభ్యం దృష్ట్యా విజయవాడను రాజధానిగా ఎన్నుకొనకపోవడం రాష్ట్రావతరణ ప్రథమదశలో ఆంధ్రప్రభుత్వ సౌమ్య పరిపాలనా నిర్వహణకు ఒక గొడ్డలిపెట్టు కాదా?

శ్రీబాగ్ ఒడంబడికను ఒక కవచంగా అడ్డుబెట్టుకొని ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు శ్రీప్రకాశం పంతులుగార్కి భవిష్యదాంధ్ర రాష్ట్ర ప్రభుత్వంలో కనీసం ముఖ్య మంత్రిగానైనా పట్టాభిషేకం చేయనుద్యుక్తులై ఈ విధంగా ప్రజాశ్రేయస్సును, పరిపాలనా సౌలభ్యాన్ని విస్మరించి వికృతంగా వ్యవహరించడం ఆంధ్రజాతిని అందరి చేతా అపహాస్యం చేయించడం వారి పదవికి ఎంతమాత్రం తగినపని కాదు. ప్రజలనెత్తిమీద ఇటువంటి బలవంతపు నిర్ణయాన్ని ప్రకాశంగారి ద్వారా రుద్దించి ఆంధ్రదేశంలో ప్రకాశంగారికుంటున్న ఆదరగౌరవాభిమానాలను తుడిచి పారేయాలని సంకల్పించారు శ్రీసంజీవరెడ్డిగారు. వారి పాచిక పారింది. అసభ్యమైన నిర్ణయం జరిపించి వీరు చేసిన ఈ అఘాయిత్యాన్ని ఆంధ్రజాతి ఎప్పటికీ మరువలేదు. ప్రజాభీష్టాన్ని వంచించి ఈ ఏర్పడబోయే ఆంధ్ర ప్రభుత్వం ఎలా పరిపాలించగలదో ఊహించుకోవడం కష్టం కాదు.

చేయెత్తి నమస్కరించిన ఆంధ్రసీమ, నేడు ఆంధ్రకేసరిని కర్నూలు రాజధాని కాగల ప్రతిపాదన విన్నంత మాత్రం చేతనే దుయ్యబట్టి నిందించడం ప్రారంభించారు ఊరూరా. "ప్రజావాణే ప్రకాశం" అనిపించుకున్న ప్రకాశం పంతులు గారు కూడా ఈ తాత్కాలిక రాజధాని విషయంలో పప్పులో కాలేశారు. కాకపోతే ఎన్నడైనా ఊహామాత్రంగానైనా కర్నూలును రాజధానిని చేస్తామని అపని ఈయన కూడా ఇందుకు సై అనడం చూస్తే ప్రజలు ఆయన్ని కించపర్చడం మాట అటుంచి తన్ను తానే కించపరుచుకున్నారు. వీరి బాటలోనే శ్రీతెన్నేటి విశ్వనాథంగారు నడవడం మరీ ఆశ్చర్యం. కాస్త నిజాయితీపరులైన విశ్వనాథం గారు ఇటువంటి నిర్ణయానికి సంసిద్ధులయ్యారంటే చాలా ఘోరంగా వుంది.

రాజధానిని ఆంధ్రదేశ పరిపాలనా సౌలభ్య దృష్టిలోనూ, 70వేల చదరపుమైళ్ళ వైశాల్యం గల తెలుగుదేశపు నడిగడ్డ అయిన ప్రదేశంలో విజయవాడ ఉందనే దృష్టిలోనూ, అది ప్రస్తుత సమయంలో అన్ని విధాలా తగి ఉన్నదనే భావంతోనూ రాయలసీమవారు తమ సంపూర్ణాంగీకారాన్ని తెలుపుతూ నిఖిలాంధ్ర శ్రేయస్సు కోరిన

వారైతే ఈ విధమైన సంకుచితాభిమానాలకు తావివ్వక కాలదోషం పట్టిన ఈ ఒడంబడికపై పట్టుబట్టకపోదురు. ప్రజాశ్రేయస్సే లక్ష్యమైనట్లయితే నాయకులు కూడా ఈ పాతకాలపు ఒడంబడికను తిరగదోడకపోదురు.

రాయలసీమలో ఏ పట్టణమైనా ఆంధ్రదేశానికి మధ్య ప్రాంతంలో ఉన్న సమక్షంలో సర్కార్ల వారందరు మహదానందంతో ఆ పట్టణాన్ని తాత్కాలిక రాజధానిగా తప్పక అంగీకరించి ఉందురు. కాని అట్టి అనువైన ప్రదేశం లేనప్పుడు రాయలసీమ ప్రతినిధులు ఈ విషయంలో విజ్ఞతను ప్రదర్శించి రాజధానిని విజయవాడ, లేక గుంటూరులోనే ఏర్పాటు చేయగలందులకు సమ్మతించి తద్వారా కీర్తి ప్రతిష్ఠల నాపాదించికొని యుండి వుందురు. విజయవాడ రాజధాని కావాలని అంటున్నామని ఇక రాయలసీమ వారిమీద చిన్న చూపు చూస్తున్నామనడం కేవలం భ్రమ. అట్టి ఆరోపణ వారు తెచ్చి పెట్టుకున్నదే కాని మరొకటి కాదు.

కాంగ్రెస్ కృషికర్ లోక్‌పార్టీ, ప్రజా సోషలిస్టులు వీరంతా కలిసి ఇట్టి అసదృశమైన నిర్ణయం చేయడం వల్ల తమతమ నియోజకవర్గాలలో ప్రజా సహకారాన్ని కోల్పోవడం ఇక తథ్యం. ప్రజాస్వామికానికి, బహిరంగంగా తిలోదకాలు విడిచిపెడుతున్నారు ఈ నాయకులు. ఆంధ్రదేశంలో కాంగ్రెసు పునాదులు కదిలిపోయాయి. యావదాంధ్ర ప్రజానీకం అంతులేని మహాసముద్రమైతే ఉవ్వెత్తుగా నురుగులు గ్రక్కుకుంటూ ఎగసే తరంగాలే ఈ నాయకులు అట్టి నేటి నాయకులు స్వప్రయోజనాల కోసం, స్వార్థం అనే నిచ్చెనలమీద సోపానాలు కట్టుకుంటూ ఎంత మిట్టిపడినా మహాసముద్ర తరంగాల వలె క్రిందపడకపోరు. కాని మహాసముద్ర ఘోషను అరికట్టలేరు ఈ ప్రజానాయకులు. ఈ విషయం గుర్తించకుండా అంతా రోజుకో పార్టీ లేవదీశారు. ఆంధ్రజాతిని ఏకచ్ఛత్రంగా పరిపాలించగల సమర్థత నేటి మేటి నాయకులలో శూన్యం.

కేవలం కమ్యూనిస్టులు ఒక పేరును సూచించారని శ్రీ సంజీవరెడ్డిగారు తమకూ, తమ అనుబంధీయులకు ఎక్కడ న్యూనత కలుగుతుందోనని విజయవాడను తిరస్కరించి "ఏ విపినభూమినో, ఏ దూరసీమనో" అన్న విధంగా రాజధానిని కర్నూలుకు విసిరికొట్టారు. ప్రజల సులువు బరువులు ఎలాగైతే వారికెందుకు? వారికి కావలసింది మంత్రి పదవులు. పదవీ వ్యామోహపిశాచం వికటాట్టహాసం చేస్తోంది వీరి ముందు.



పదవుల పంపిణీని దృష్టిలో బెట్టుకొని ఈ ప్రజాస్వామ్య పార్టీల మధ్య తాత్కాలికంగా తాము సాధించామనుకుంటున్న ఈ అనన్యమైన సహకారాన్ని శ్రీనీలం సంజీవరెడ్డిగారు ఎంతకాలం నిలబెట్టుకోగలరో రేపోమాపో తేలిపోతుంది.

సౌహార్ద, సౌజన్య పూర్వకంగా రాయలసీమను ఒప్పించి వారి నెదుర్కొంటున్న కరువు కాటక సత్వర నివారణకు తగు హామీనిచ్చి రాజధానిని ఆంధ్రదేశ మధ్యస్థంగా స్థాపించేందుకు ప్రయత్నించకుండా భవిష్యదాంధ్ర ప్రభుత్వ కార్యభారాన్ని వహించిన శ్రీసంజీవరెడ్డిగారు తదాశయాన్ని సఫలీకృతం చేయవలసిందిపోయి – ఈవిధంగా వ్యవహరించడం ఆంధ్రజాతిని మోసం చేయడం కాక మరేమిటి?

ఓం ప్రథమం నుంచీ కూడా రాష్ట్రావతరణ విషయంలో ఆంధ్రులకు జరిగిన అన్యాయాలు వ్యతిరేకంగా జరుగుతున్న నిర్ణయాలు అన్నీ చూస్తుంటే దుర్భరమైన స్థితి ఏర్పడింది. ఆంధ్రప్రజాభీష్టాన్ని చిల్లిగవ్వకు లెక్కచేయకుండా ఎక్కడికక్కడ తీసిపారేస్తుంటే నాయకుల దౌర్బల్యము విరదమౌతోంది. ఈనాడు కాకపోయినా మరొకప్పుడైనా కుమిలి రగిలిన ఆంధ్ర హృదయం ప్రజ్వలింపకపోదు. ఆంధ్రుల చిరకాల వాంఛితమైన రాష్ట్రాన్ని తన మహత్తర ప్రాణాహుతితో సంపాదించి పెట్టిన శ్రీరాములుగార్ని కనీసం మొన్నటి అసెంబ్లీలో జ్ఞాపకానికైనా తెచ్చుకోకపోవడం అపహాస్యంగా ఉంది.

ముఠా రాజకీయాలలో మునిగిన ఆంధ్రదేశంలో కాంగ్రెసు పునాదులు ఇదివరకే కదిలిపోయాయి. ప్రజాస్వామ్య పక్ష సభ్యులందరు ప్రజా ప్రతినిధుల బురఖాలను తొడుక్కుని ఆంధ్రజాతిని రచ్చకీడ్చి నవ్వులపాలు చేయడమే వీరి కొక ఘనవిజయం లాగుంది. ఈ కర్నూలు నిర్ణయానికి ఆశాభంగం చెందవలసిన పనిలేదనీ హైకోర్టు వగైరా ఇతర ప్రభుత్వ కార్యాలయాలెన్నో సర్కార్లలో నెలకొల్ప వచ్చునని ఘనత వహించిన శ్రీసంజీవరెడ్డిగారు సర్కారు ప్రజలను ఓదార్చడం మరింతగా వారిలో రోషానలజ్వాలను ప్రజ్వలింపజేయడమే. ఎంతటి ఔదార్యం! కాని లోలోపల శ్రీరెడ్డిగారి సంతోషానికి మేరలేదు తమ పాచిక పారిందని!

ఇటు మద్రాసునగర భవిష్యత్ ప్రతిపత్తి విషయంలో నైతేనేమి; బళ్ళారి పట్టణ భవిష్యనిర్ధారణలో నైతేనేమి, మైసూరులోని తెలుగు ప్రాంతాల విషయంలోనైతేనేమి, రాజధాని నగర నిర్ణయంలోనైతేనేమి, ఘనత వహించిన ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు శ్రీసంజీవరెడ్డిగారు గాని, వీరి అనుబంధ ప్రజాస్వామ్య పక్షీయులుగాని, ఆంధ్రులకు

అన్యాయం జరుగుతుంటే, ఆంధ్రజాతిని కాళ్ళు చేతులు కట్టి నోరుమూస్తుంటే వీరంతా నోలికి తాళం వేసుకొని, నిర్వీర్యులై, చేతగాని జేజెమ్మలవలె నిస్సహాయులై వెర్రి మొహాలు వేసుకొని వ్యవహరించడం - వారు మహత్తరమైన ఘనవిజయం సాధించామనుకోవడం అభూతకల్పన. పైనుడిచిన సందర్భాలలో ఆంధ్రులకు నైతికంగా న్యాయం జరగలేదు. కాని శ్రీబాగ్ ఒడంబడికలో మాత్రం నైతికంగా న్యాయం కావలసి వచ్చింది శ్రీసంజీవరెడ్డిగారికి.

ప్రస్తుతం కర్నూలు రాజధాని అని నిర్ణయం జరిగినప్పటికీ కేంద్రప్రభుత్వం నిష్పాక్షికంగా పరిపాలనాదృష్టిలో పునఃపరిశీలించి, అశేషాంధ్రం ముక్తకంఠంతో ఘోషిస్తున్న ఆంధ్రదేశపు నడిగడ్డలోనే ఉన్న పట్టణాన్ని రాజధానిగా ఏర్పాటు చేయగలందులకు తగుచర్య తీసుకొని ఆంధ్రజాతిని తృప్తిపరచడం వారి తక్షణ కర్తవ్యం, కనీస ధర్మం.

దేశభక్తి అనే బీజాలు నాటి స్వాతంత్ర్య సముపార్జనా సమరంలో భారతజాతిని కార్యశూరులను చేసిన కాంగ్రెస్ అనే ఈ మహావృక్షం పదవీవ్యామోహ ప్రళయ ఝుంఝుమారుతపు తాకిడికి ఊగిసలాడియాడి నిశ్శబ్దమై స్తంభించిపోయింది. తిరిగి ఆ మహావృక్షాన్ని సాకి, బలిష్టంగా పెంచి, తద్వారా ప్రజాబాహుళ్యానికి సశీతల ప్రవాంతచ్ఛాయల నాపాదింపజేయాలంటే, ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఈ ముఠారాజకీయాలు సంపూర్ణంగా దగ్ధం కావాలి. అపుడు కాని కాంగ్రెసుకు మోక్షం లేదు. లేదా ఆంధ్రజాతి భవిష్యత్తు సర్వతోముఖంగా కాక ఊహామాత్రంగానే ఉంటుంది. పోరాడి సంపాదించుకున్న ఆంధ్రరాష్ట్రాన్ని “ఇలా మార్చేస్తాం, అలా మార్చేస్తాం” అని నాయకుల ఇక ప్రగల్భాలు కొడతారు. ఇప్పటికైనా ప్రజలు తెలివి తెచ్చుకొని తమ ఓటుకున్న విలువ గుర్తించాలి. మురిపించి, లాలించి అరచేతిలో వైకుంఠం చూపించి మోసపుచ్చే నాయకుల కెవ్వరికీ వచ్చే ఎన్నికలలో ఒక్క ఓటు కూడా పడరాదు; ప్రజలు ఈ విషయాన్ని గుర్తిస్తేనే ప్రజాస్వామ్యం నిలుస్తుంది.

**✱ 12-6-1953**

**తెలుగు స్వతంత్ర**



# మిశ్రా తీర్పు : పునర్నిర్ణయావశ్యకత

**జస్టిస్** కైలాసనాథ వాంఛూ ప్రముఖ ప్రజానాయకులను వివిధ ప్రజాసంస్థలను, మద్రాసు ప్రభుత్వ వివిధ మంత్రులను తదితరులను సంప్రదించి ఆంధ్రదేశం పర్యటించి అందినంతవరకు జనవాక్యాన్ని సేకరించి తాత్కాలిక రాజధాని ఉనికితోబాటు అనేక సబబైన సూచనలను, సముచితమైన నిర్ణయాలను న్యాయదృష్టితో విశదీకరిస్తూ తన నివేదికను అందజేస్తే కేంద్ర ప్రభుత్వం దాన్ని పరిశీలించి తిరస్కరించి వేయడానికి సుమారు రెండు నెలలు కావలసి వచ్చింది.

ఆ సందర్భం అట్టిది.

సత్యదూరమైన మిశ్రా నివేదిక కేంద్ర ప్రభుత్వం మక్కికి మక్కీ తమకు అందీ అందడం తోటే నిరాఘాటంగా ఠపీమని అంగీకరించడానికి ఒక రోజు కూడా పట్టలేదు. అంగీకరించడమే కాదు. జస్టిస్ లక్ష్మీశంకర మిశ్రా తన నివేదికను బహుస్వల్ప వ్యవధిలో సమగ్రంగా చర్చించి నివేదించినందుకు వారిని అభినందించారు కూడా.

ఈ సందర్భం ఇట్టిది. నిజంగా అభినందనీయులు జస్టిస్ లక్ష్మీశంకర మిశ్రా.

ఆనాటి బ్రిటిషు ప్రభుత్వం నూటికి నూరుపాళ్ళు తెలుగు మండలాలైన గంజాం, కోరాపుట్టి జిల్లాలను ఒరిస్సాలో విలీనం చేసివేసింది. అది ఒరిస్సా తాతగారి సొమ్ము అనుకుంది బ్రిటిషు ప్రభుత్వం.

నేడు వారి అడుగుజాడలలోనే మన నెహ్రూ ప్రభుత్వం బళ్ళారిని మైసూరుకు ధారాదత్తం చేసి వేసింది. ఇది మైసూరు తాతగారి సొమ్ము కాదా మరి? ఆంధ్రులకు జరిగే న్యాయం, ఆంధ్రులకు జరుగుతున్న ధర్మమూ, ఆంధ్రదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది.

ప్రతి ఆంధ్రుడూ ఈ చరిత్ర చదివి ఆనందించక మానడు. అసలు ఇట్టి నిర్ణయావసరాలకు ఇపుడు ఏం పుట్టి మునిగిపోయింది? ముందు ఏర్పడబోయే సరిహద్దు నిర్ణాయక సంఘం అచిరకాలంలోనే ఎలాగూ ఇట్టి సమస్యలను పరిశీలించవలసిన అగత్యము వున్నప్పుడు హడావిడిగా ఈ విషయాన్ని నిర్ణయించడం వల్ల ఇప్పుడు మనకు ఏర్పడినవి లేనిపోని చిక్కులే కాని లాభమేం కలిగింది?

కాబట్టి అప్పటివరకూ బళ్ళారిని పూర్తిగా ఆంధ్రరాష్ట్రంలో తాత్కాలికంగా విలీనం చేయడము చాలా కాలానుకూలంగా ఉండేది కదా.

బళ్ళారిలోని కన్నడ తాలూకాలు మైసూరులో జేర్చగలందులకు కేంద్రప్రభుత్వం ఆతురత పడినట్లే, అక్కడ వున్న తెలుగు ప్రాంతాలను కూడా ఆంధ్రరాష్ట్రంలో చేర్చివేయడంలో కూడా అంతే ఆతురత చూపవలసిందిపోయి ఇటువంటి తెగచనే విషయాలలో కాలహరణం చేయడం శ్రీనెహ్రూ రాజనీతిజ్ఞతకు ప్రజలు నిదర్శనము.

మైసూరు సంస్థాన ముఖ్యమంత్రి శ్రీహనుమంతయ్య తుంగభద్ర జలాశయాన్ని అపోశన చేయాలని, తత్ఫలితంగా ఉద్భవించగల అపార విద్యుత్తును మూటగట్టుకోవాలని ఉరకలు వేయడం గమనార్హం.

మాతృదేవి, శ్రీరామచంద్రుని పట్టమహిషి, అయిన సీతమ్మను లంకాద్వీపంతో సహితం పెకలించి శ్రీరాముని పాదాలముందు పెట్టుతానని హుంకరించిన హనుమంతుని శక్తి సామర్థ్యాలు నేటి ఆంధ్రనాయకులలో ఉంటే సీతమ్మ తల్లిని రావణబ్రహ్మ దొంగిలించకేపోను.

1945 నుంచీ బళ్ళారి అంతా నిరీక్షించగా నిరీక్షించ అకస్మాత్తుగా తుంగభద్ర ప్రాజెక్టు నేడు మైసూరు ప్రభుత్వ ఛత్రచ్ఛాయను తలదాచుకుంటోందంటే అంతా సంతోషించక మానదు.

ఇంతకీ బళ్ళారి అక్కడ నుంచి ఎక్కడికీ పారిపోదు. అందలి ప్రజలు కూడా మరోచోటుకి తరలి పోనూపోరు. ఎటొచ్చీ రాష్ట్ర ప్రభుత్వపు గొడుగులు మాత్రం మారుతున్నాయి. అక్కడి ఆంధ్రులకు వారి నిశ్చితాభిప్రాయానుసారం తమ సొంతరాష్ట్రంలో కలసిపోవాలన్న వారి ఆశలు అడియాసలై మనఃక్లేశంమాత్రం జరుగుతోంది. అంతే!

న్యాయాన్యాయ నిర్ధారణలో ప్రజాభీష్టం అనవసరం కాబోలు. లేకపోతే ఈవిధంగా జరిగే వుండదు. ప్రజల అభీష్టాన్ని వ్యతిరేకించిన ప్రభుత్వం ప్రజాస్వామ్య ప్రభుత్వమా, లేక నిరంకుశ ప్రభుత్వమా అని అనుమానం కలుగక మానదు.

చిత్రమేమిటంటే ఈ ఉన్నతన్యాయమూర్తి నిర్ణయం అంగీకరించినప్పటి నుంచి, అట్టి నిర్ణయం సముచితమైనది కాదని, న్యాయవిరుద్ధమని బళ్ళారి ప్రజల ఆందోళన నానాటికీ బలపడి తీవ్రమై, తీవ్రతరమైన ఉద్యమమై, ప్రళయరూపం దాల్చింది. ఇంకా ఎటువంటి పరిణామాలకు దారితీయగలదో అనే విషయం కేంద్రప్రభుత్వం ఇంకా ఆలోచించలేదు.



మనకు చెందవలసిన, ఒరిస్సాలోని కొంత భాగము, హైదరాబాదులోని తెలంగాణా విషయం తీవ్రప్రయత్నం చేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

అయితే అచ్చమైన తెలుగు బళ్ళారి విషయంలో ప్రథమదశలోనే ఇట్టి అన్యాయం జరుగుతుంటే ముందుముందు పైనుదహరించిన తెలుగు భూభాగాల విషయంలో - తద్వారా సమగ్ర విశాలాంధ్ర విషయంలో నాయకులు ఇక చేయగలిగింది ఏమీ వుండదని బళ్ళారి సమస్యను బట్టి ఊహించుకోవడం ఎవ్వరికీ కష్టం కాదు.

వడ్డించేవాడంటూ వుంటే ఇక దెబ్బలకు కొదవా అన్నట్లుంది. పరిపక్వాహారంతో నిండిన ఆంధ్ర భాండాన్నుంచి కేంద్రప్రభుత్వం ఒక్కొక్క కెరడే మద్రాసు ద్వారా, బళ్ళారి ద్వారా మన ఇరుగుపొరుగులవారికి వడ్డిస్తోంది. ఆంధ్రుల దానశీలాన్ని కేంద్రప్రభుత్వం దూబరా చేయడం చాలా ఘోరంగా ఉంది.

న్యాయమూర్తి మిశ్రా తన పదవికి ఎట్టి భంగం కలగకుండా, తనకెట్టి అపవాదు రాకుండా, ఆంధ్రులకే బళ్ళారి అధిక సంఖ్యాకులని తెలిసి కూడా, ఆంధ్రులు బళ్ళారి తమదని నిరూపిస్తున్న కారణాలను తాను సమ్మతించి కూడా ధర్మబద్ధమైన వాస్తవిక దృక్పథంతో నిర్ణయం చేయవలసిందిపోయి - మైసూరు ప్రభుత్వ సలహాలకు వారి అభిప్రాయాలకు అనుగుణ్యంగా తీర్పు చేయడం పక్షపాతంతో చేసినట్టుగా గుర్తించక తప్పదు.

ఒక్క బళ్ళారిలోని ఆంధ్రులే కాదు, ఆంధ్రదేశంలో ప్రతి ఆంధ్రుడు కూడా ఈ నిర్ణయాన్ని నిరసిస్తున్నారు. ప్రతిరోజూ బళ్ళారిలో ఆందోళన అధికమౌతోంది. కాబట్టి కేంద్రప్రభుత్వం బళ్ళారి విషయంలో ప్లెబిసైట్‌కు పూనుకొని సక్రమంగా ఈ విషయం తేల్చవలసిన సంగతి వెంటనే గుర్తించి న్యాయం జరపవలసి వుంది. అట్టి న్యాయం కోసం బళ్ళారిలోనే కాదు, ఆంధ్రదేశం అంతా ఎదురుచూస్తోంది.

*** 19-6-1953**

**తెలుగు స్వతంత్ర**

# నవ్యాంధ్రలో ప్రజాస్వామ్య పునరుద్ధరణ

కర్మణ్య కర్మయఃపశ్యే
దకర్మణి చకర్మయః
నబుద్ధి మాన్మనుష్యేషు
నయుక్త కృత్స్న కర్మకృత్.

ఆంధ్రరాష్ట్రావతరణ మహోత్సవం తేదీ ఒక్కొక్కరోజు దగ్గరపడినకొద్దీ ప్రజాస్వామ్య పక్ష నాయకుల కార్యకలాపాలు శరవేగంతో సాగిపోతున్నయ్. నవ్యాంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిత్వ కిరీటాన్ని "నేనా- నువ్వా" అన్నట్లు ఆంధ్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీసంజీవరెడ్డిగారు ధరిస్తారా లేక భారత స్వాతంత్ర్య సముపార్జనా సమరంలో అశేషాంధ్రజాతినే ఉగ్రూతలూగించి కార్యశూరులను చేసిన ఆంధ్ర ఆంధ్రకేసరీ ఆంధ్రోద్యమ మూలపురుషులలో ఒకరూ అయిన శ్రీటంగుటూరి ప్రకాశం పంతులుగారు ధరిస్తారా అన్న ప్రశ్న నేడు ఆంధ్రదేశం నలుచెరగులా - ప్రతిఒక్క ఆంధ్రుని హృదయంలోనూ ప్రతిధ్వనిస్తోంది. మూడుకోట్ల ఆంధ్రప్రజలు తహతహలాడిపోతూ సుస్థిర ప్రభుత్వలక్ష్యం కోసం గంపెడాశ పెట్టుకుని ఉన్న సమయంలో ప్రజాస్వామ్యపక్ష నాయకులు తమ బాధ్యతలను గుర్తించుకొని సమయస్ఫూర్తితోనూ, దూరదృష్టితోనూ వ్యవహరించవలసిన సమయం ఆసన్నమైంది.

ఆంధ్రరాష్ట్రం బిల్లు భారత ఉభయసభలలోను ప్రజాప్రతినిధుల ఏకగ్రీవ ఆమోదాన్ని బడసిన తరువాత సెప్టెంబరు 14న రాష్ట్రపతి తమ ఆమోదముద్రను గూడ వేయడంతో ఇది చట్టమైనది. మిగిలిందల్లా నిర్ణయింపబడిన తేదీకై నిరీక్షిస్తోంది ఆంధ్రరాష్ట్రం - అంతే.

దీనికితోడు కర్నూలులో రాష్ట్రావతరణ మహోత్సవానికి సమస్తమైన ఏర్పాట్లు జరిగినవి. ఆంధ్రరాష్ట్ర గవర్నరుగా రాజభవనంతో సహా అన్ని హంగులతోను సర్వసిద్ధంగా ఉన్నది. ఆంధ్రవ్యవహారాల ప్రత్యేకోద్యోగిగా వచ్చిన శ్రీత్రివేదీ బహుస్వల్ప వ్యవధిలో ప్రభుత్వ సిబ్బంది విభజన, వివిధ శాఖలకు అధికారుల నియామకం ఆదిగా గల వివిధ సమస్యలను శరవేగంతో ఫలప్రదంగా కొనసాగించి తమ అపూర్వ పరిపాలనా నిర్వహణ చాకచక్యాన్నేగాక, అకుంఠిత కార్యదీక్షను సామర్థ్యాన్ని ఆంధ్రులకు



చవి చూపించారు. అధికార రీత్యా వీరు మన ఆంధ్రరాష్ట్ర గవర్నరుగా నియమించ బడినట్లు గూడా ప్రకటన వచ్చేసింది. ఆంధ్ర సెక్రటేరియట్ వివిధ శాఖలకు కుర్చీబల్ల దగ్గర నుంచి కావలసిన సమస్తసరంజామా అప్పుడే స్పెషల్ రైళ్ళలో కర్నూలుకు చేర్చబడినది.

ఈవిధంగా రాష్ట్రావతరణకు వేదిక అమర్చబడి సిద్ధంగా నాయకుని రాకకై ఎదురుచూస్తున్నట్లున్నది.

ఇట్టి మహారసవత్తర సమయంలో ప్రజాస్వామ్య పక్షములు తర్జనభర్జనలు పడుతూ ఉక్కిరిబిక్కిరౌతున్నారు. కాంగ్రెసువాది మాత్రమే ఆంధ్రప్రభుత్వ ముఖ్యమంత్రి అయి రాష్ట్రమంత్రివర్గ ప్రతిష్ఠాపన జరపాలని ఆంధ్రదేశ కాంగ్రెసు కార్యవర్గం తీర్మానించింది.

వేరొకవైపున ఆంధ్ర ప్రజాసోషలిస్టు కార్యవర్గం శ్రీప్రకాశం పంతులుగారిని తమ బాధ్యతల నుంచి విడుదల చేస్తూ ఆమోదించిన సూచనను మొన్న ఢిల్లీలో సమావేశమయిన అఖిలభారత ప్రజా సోషలిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం శ్రీపంతులుగారి సమక్షంలోనే పై సూచనను తిరస్కరిస్తూ తీర్మానం చేసింది.

కృషిక్‌లోక్ పార్టీ సభ్యులు కాంగ్రెసులో అసోసియేట్లుగా చేరి తమ వ్యక్తిత్వం మాత్రం కోల్పోకుండా చేరి మంత్రివర్గ నిర్మాణంలో సమయానుకూలంగా ప్రక్క తాళం వేయడానికి సన్నాహపడుతున్నారు. స్వతంత్రసభ్యులు కూడా ఇదే విధంగా సమయం కోసం వేచి ఉన్నారు. ఇక పోతే మేము మాత్రం తక్కువ తిన్నామా అన్నట్లు ఆంధ్రలో ఒక కనీస కార్యక్రమాన్ని ప్రాతిపదికగా ప్రజాస్వామిక సభ్యులందరు కలిసి కాంగ్రెసు వ్యతిరేక మిశ్రమ మంత్రివర్గం ఏర్పర్చాలని ఆంధ్రకమ్యూనిస్టు పార్టీ తీర్మానించి శ్రీప్రకాశం పంతులుగార్ని సమీపిస్తోంది. కాగా, నేటి ఆంధ్రరాజకీయ రంగంలో నాయకత్వం కోసం విభిన్న దృక్పథాలు గల క్లిష్ట వాతావరణం ఏర్పడింది.

ఈవిధంగా ఒకవైపు నుంచి కాంగ్రెసు, వేరొక నుంచి ప్రజాసోషలిస్టులు, మరొక వైపునుంచి కమ్యూనిస్టులు భిన్న భిన్న వైఖరులను ప్రదర్శిస్తూ తదనుకూలంగా అధికార ప్రాబల్యాన్ని చేజిక్కించుకొనేందుకు పునాదులు వేసుకొంటే, తంత్ర ప్రతితంత్రాలు పన్నుకుంటూండడం రాష్ట్రావతరణలో సుస్థిర మంత్రివర్గం ఏర్పడుతుందో లేక ముందు ప్రెసిడెంటు పరిపాలనే వస్తుందో అని ప్రతి ఆంధ్రునికీ దిగులు ఏర్పడుతున్నది. ఆంధ్ర రాజకీయ సాగరమధనంలో నాయకులందరు తరచుగా పుట్టేది హాలాహలమో

లేక అమృతమో! గాని ఒక అనిర్వచనీయమైన నిస్తబ్దత, ఉద్రిక్తత ఏర్పడినది. ఏమైనా ఆంధ్రజాతి ఆతురతతో వేచియున్నది. విస్తరిలో వడ్డించిన ప్రసాదాన్ని ప్రజాస్వామ్య నాయకులు కాలదన్నుతారా?

ఆంధ్రనాయకులే చెప్పినట్లు ముందుగానే ప్రెసిడెంటు పాలన శుభప్రదం కానేరదు. ప్రజాస్వామిక శక్తులు ఇతోధిక కృషి సల్పివిశాల దృష్టితో, ఆంధ్రప్రజ యోగక్షేమాలను దృష్టియందుంచుకుని ఆచరణ యోగ్యమైన విధానాన్ని అవశ్యం అనుసరించవలసిన అమూల్యమైన అవకాశం ఏర్పడ్డది. ఈ సమయంలో రాజకీయ విద్వేషాలకుగాని ఆవేశకావేషాలకు గాని తావులేదు. నవ్యాంధ్రలో ప్రజాస్వామ్య వ్యవస్థను బలీయం చేసి పటిష్టమైన సుస్థిర ప్రభుత్వ స్థాపనకు పోటీపడకుండా నిస్వార్థ సేవా వ్రతులవాలి.

నలభయ్యేండ్ల ఆంధ్రోద్యమాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటే, మహోత్కృష్టమైన రాష్ట్రావతరణ లక్ష్యం కోసం ఏభయ్యెనిమిదిరోజుల కఠోర దీక్షానంతరం ఆత్మబలిదానం గావించిన మహా తపస్వి, అమరయశస్వి శ్రీపొట్టిశ్రీరాములుగారిని తల్చుకుంటే నాయకులు నేటి ఆంధ్రరాష్ట్ర రాజకీయ నాయత్వానికి ఏర్పడ్డ పోటీ విడిపోయి సంగమమైన మార్గమేరర్పడి అనుభవజ్ఞులు, అఖిలాంధ్ర ప్రజానాయకులయిన ప్రకాశం పంతులుగారే ముఖ్యమంత్రి కాగలరనే ఆశాభావం కలుగుతోంది. ఇందుకు అనుగుణంగా కాంగ్రెసు అధిష్ఠానవర్గం కూడా కొంత అవకాశాల్ని కల్పించింది. ఇక కేవలం నిర్ణయించుకొనవలసింది. ఈ ఇద్దరు నాయకులే, వీరి మీదే ఆధారపడివున్నది భవిష్యత్తు.

ప్రజాహృదయాన్ని చూరగొన్నట్టి ఏకైక ఆంధ్రనాయకుడు రాష్ట్ర సారథ్యం వహిస్తేనే నవ్యాంధ్రలో ప్రజాస్వామ్య పునరుద్ధరణ జరుగుతుంది. ఇదే ఆంధ్రజాతి మహద్ఘోష. అశేషాంధ్ర ప్రజ అపూర్వవాంఛ. వీరి ఆశయం సఫలత్వసిద్ధి పొంది అచిరకాలంలోనే ప్రజా మంత్రివర్గం ఏరర్పడుతుందని ఆశిద్దాం.

*** 25-9-1953**

**తెలుగు స్వతంత్ర**



# ఆంధ్రలో మద్యనిషేధం రద్దౌతుందా?

అవిభక్త చెన్నరాష్ట్ర చరిత్రలో 1946 అక్టోబరు 1వ తేదీ చారిత్రాత్మక దినం. పూజ్య బాపూ ప్రియతమమైన ఒకానొక అపూర్వ లక్ష్యం యొక్క కార్యసాఫల్యానికి పునాదిపడింది ఆనాడు. ఇంతేకాదు, భారతదేశంలో అన్ని రాష్ట్రాలకన్నా ముందుగా చిన్న రాష్ట్రమే ఈ ఉత్తమ సంస్కరణను అమలు జరిగింది. ఆనాడు నాయకులు మహోపన్యాసాలిచ్చారు. కాంగ్రెసు బావుటా రెపరెపలాడింది. గీతాలాపనలు శ్రుతిమించాయి. రేడియోలుద్ఘోషించాయి. పత్రికలు పతాకశీర్షికలలో వార్తలు ప్రకటించాయి. 1946 అక్టోబరు 1వ తేదీన మద్యం నిషేధించబడి శాసనం అమలు జరుపబడింది. రాగల అక్టోబరు నాటికి మధ్యనిషేధం అమలుపరిచి 7 సంవత్సరాలౌతుంది. అటువంటిది ఆంధ్రరాష్ట్రం అవతరించిన ఆరు నెలలలోనే ఈ మద్యనిషేధ శాసనాన్ని తిరగదోడివేయాలని-ఒకవైపు శ్రీ రామమూర్తి కమిటీ నివేదిక, కల్లుగీత పనివారు జరుపనుద్యుక్తులౌతున్న సత్యాగ్రహమూ, పలువురాంధ్ర శాసనసభ్యుల పట్టుదలా, వివిధ పార్టీల ప్రయత్నము-జరుగుతోంది. ఈ చట్టాన్ని ఏమైనాసరే అమలుజరిపి తీరాలని తన జీవితాన్నే పణంగా ఒడ్డి ఆమరణ ప్రయోపదేశ దీక్షాకంకణధారణ వహించారు-స్వామి సీతారాంగారు. బేలన్స్ ఆఫ్ జడ్జిమెంట్ మరి ఎటు మ్రొగ్గుతుందో గాని ఇటు ఆంధ్ర ప్రభుత్వం నెహ్రూజీవైపు తిరిగి సాగిలపడి నిరీక్షిస్తోంది, ఆయన సలహాకోసం. నేడు ఈ మహా ప్రమాదం నుండి రక్షించమని. చిత్రంగా ఉన్నదీ పరిస్థితి; ఉండదూమరి?

సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకులు శ్రీ హెచ్.ఎమ్.రెడ్డిగారు ఆనాడు తమ గృహలక్ష్మిలో శ్రీ చిత్తూరు నాగయ్యగారి ద్వారా ఈ సమస్యనే ఒక మధురసందేశాన్నిస్తూ ప్రబోధించారు. అది-

"లెండు భారతవీరులా నిదురలేంవండోయ్ మీరూ! ఇళ్ళు
వళ్లూ కూలదోసే కల్లుమానండోయ్ బాబూ!
కళ్లు తెరవండోయ్, కుడువకూడూ తొడుగు వలువా

లేని పిల్లలగోడూ చూచీ-నిలువునీరౌ సతినిగాంచి
తాగకండీ-మీరు తాగే కల్లది వారి రక్తమేనుండీ
బీదల పీల్చితినే మహమారీ-ప్రభువులు కొల్చుకునే
పింజారీ-దేశ దరిద్రతకే రహదారీ పానపిశాచము
పారదోలీ భారత కీర్తిని నిల్పగరండూ లెండు॥

శ్రవణానందకరమైన ఆ ప్రబోధం ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నది-నేటికీ ఈ పాటా-ఈ గొంతును. అయితే ఆరోజులు వేరు. ఈరోజులువేరూను. కాలం మారింది. ప్రభుత్వంతోపాటు వాటి దృక్పథం. కూడా మారుతూ వచ్చింది.

1938లో శ్రీ రెడ్డిగారు "గృహలక్ష్మి" ద్వారా కలలుకన్న ఈ మహదాశయ సాధనం మరో పదేళ్ళ అనంతరం-అంటే భారతదేశం పారతంత్ర్యం విసర్జించి స్వాతంత్ర్య సముపార్జనానంతరం సఫలీకృతమనగా చూచారు; నాటికి నేడు ఈ మద్యనిషేధాన్ని ఎత్తివేయాలనే సంకల్పం ప్రబలతరమవగా మనమంతా చూస్తున్నాం (ఆనాటి ఆ ప్రఖ్యాత నటి శ్రీమతి కాంచనమాల చలనచిత్ర ప్రపంచంలో మెరుపులా మెరిసిపోయింది) ఎంతలో ఎంతమార్పు! ఏతత్ మద్యనిషేధ సమస్యే ఇప్పుడు మన ఆంధ్ర ప్రభుత్వాన్ని బహుసంక్లిష్ట స్థితిలోకి దింపింది. రాజకీయ వర్గాలలో ఆందోళన అదికమైంది. శ్రీరామమూర్తి కమిటీ ఈ సమస్యను మద్యనిషేధం విఫలమైపోయినట్లుగా విశదీకరించింది. ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు మద్యనిసేధం తొలగింపరాదని ఉద్ఘాటిస్తున్నారు. ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు మద్యనిసేధాన్ని కట్టుదిట్టంగా అమలు జరిపించలేకపోతే దాన్ని ఎత్తివేయడానికి ప్రభుత్వానికెంత మాత్రం అభ్యంతరం లేదని హూంకరిస్తున్నారు. ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుల సలహాకోసం నిరీక్షిస్తున్నామంటున్నారు.

మద్యనిషేధాన్ని రద్దుచేయరాదని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ శ్రీ స్వామీ సీతారాం నినయాశ్రమంలో ఆమరణ పాయోపవేశ దీక్ష ప్రారంభించి నేటికి బహుప్రమాదస్థితిలో నున్నారు. మద్యనిషేధం తొలగించగా వచ్చిన ఎక్సైజు రాబడివల్ల ఆంధ్ర బడ్జెటు లోటు భర్తీ కాగలదనీ, తద్వారా ఎన్నెన్నో ప్రజోపయోగ ప్రణాళికలను అమలుపర్చుకోవచ్చునని ఆంధ్ర అసెంబ్లీలో పలువురు పెద్దమనుషులు తమతమ



అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నారు. శ్రీరామమూర్తి కమిటీ సిఫార్సులను పాటించైనా పాటించాలి లేదా నిషేధాన్ని తొలగించనైనా తొలగించాలి అని మరికొందరు భావిస్తున్నారు. మద్యనిషేధాన్ని రద్దు చేయని పక్షంలో సత్యాగ్రహమే శరణ్యమని మాజీమంత్రి సర్దార్ శ్రీ గౌతు లచ్చన్న సర్వసన్నద్ధులౌతున్నారు-గీతపనివార్ల నాయకత్వాన.

దేశంలో మహోద్రిక్తపరిస్థితి ఏర్పడింది. మద్యనిషేధం మహారసవత్తరఘట్టంలో పడింది. ఇందరు ఇన్ని విధాల అంటుంటే ఆంధ్రప్రభుత్వం బహుసంకటావస్థలోపడి ఉక్కిరి బిక్కిరౌతూంది. "ముందునుయ్యి, వెనుక గొయ్యి"లా ఉన్నది. "ఎవరికివారే యమునాతీరే". ఐక్యతాయుత వాతావరణం పోయింది. ఈ సమస్య విడివడ్డం ఏలాగ? ఇటువంటి సమయాలలో ప్రభుత్వం దూరదృష్టితో వ్యవహరించాల్సి ఉంది. గాంధీగారు ఏమైనారు? ఆయన సిద్ధాంతాలేమైనాయి? సర్వోదయం ఎంతవరకూ వచ్చింది? కాంగ్రెసు నియమావళి ఏమైంది? సంఘువ్యవస్థ అభివృద్ధికి ఏం జేశాం? ఏం చేయాలి.-ఇదంతా బాగా ఆలోచించాలి. ప్రస్తుతం ఎవరికీ వ్యవధి లేదు. బ్రతుకే వ్యథ. శరీరం మాయ-అంతా మిథ్య. అటువైపు ఒక నిండుప్రాణం ప్రాయోపవేశంలో నిమగ్నమై తాను నమ్మిన ఆ లక్ష్యసాధనకోసం అటాఇటా అని ఊగిసలాడుతోంది.

మద్యనిషేధంవల్ల లక్షలాది కల్లుగీత పనివారలకు జీవనోపాధి పోవడంమాట వాస్తవమే. ఈ విషయంలో ఎవరికీ అభిప్రాయభేదాలు లేవు. గత యేడు ఏళ్ళ నుంచీ వారి సహాయార్థం ఏదో జరుగుతునే వచ్చింది. కానీ వీరి పునరావాస సమస్య భారత పాకిస్తాన్ కాందిసీకుల సమస్యకంటే గడ్డైకూర్చుంది. మద్యనిషేధం ఆంధ్రప్రభుత్వ హయాంలో ఈనాడు ప్రవేశపెట్టింది కాదు, జస్టిస్ కైలాసనాథవాంచూ ఆంధ్రబడ్జెటులో ఏర్పడగల లోటును భర్తీ చేయాలంటే మద్యనిషేధం తొలగించడమే తమకు తోస్తోందని సూచించారు. వారి సూచనలన్నీ అమలు జరిపారా? దీన్ని అమలుజరపడానికి, తాత్కాలిక రాజధాని కనీసం తాత్కాలికంగా ఐదు ఏళ్ళపాటు మద్రాసులోనే వుంచితే బాగుంటుందన్నారు. అట్లా ఏర్పర్చగలిగారా? ఇంతకీ లోటు భర్తీ చేయడానికి ఇతర మార్గాలు అన్వేషించుకోవాలిగాని ఒక ఉత్తమసంస్కరణను ఉల్లంఘించడం సబబుగా కనిపించడంలేదు. అమలు జరపలేకపోవడంలో ప్రభుత్వం చేతకానితనం

బైటపడుతోంది-లేదా కేవలం కల్లుగీతపనివార్లకు తమ వృత్తిని తిరిగి వారికి అప్పజెప్పేయాలనా దీన్ని రద్దు చేయడం? భారతదేశంలో ఏ రాష్ట్ర బడ్జెటులో లోటు లేదు?

శ్రామికవర్గాలచే ధారాళంగానైతేనేమి, రేషనింగుగానైతేనేమి బహిరంగంగా కల్లు త్రాగించి అందువల్ల సంపాదించే డబ్బుతో ప్రాజెక్టులూ, భవంతులు కట్టి ఆంధ్రదేశాన్ని ఉద్ధరించ నుద్యుక్తులౌతున్నారు.

కల్లుగీత పనివారల సమస్య గత ఏడు సంవత్సరాలనుంచీ ఏమైనది? నిషేధాన్ని కట్టుదిట్టంగా అమలు జరపడంలో ప్రభుత్వానికి ఎంతటి బాధ్యత ఉన్నదో దానివల్ల దెబ్బతిన్న గీత పనివారలకు జీవనోపాధి కలిగించడంలో కూడా అంతే బాధ్యత ఉన్నది. వీరి జీవనోపాధి సదుపాయాలలోనూ వీరికి ఇచ్చే సహాయం లోనూ సంతృప్తికరంగా లేకపోవచ్చు. వివిధ సహకార సంఘాల ద్వారాను, ఇతర కుటీర పరిశ్రమలద్వారానూ బెల్లంతయారీ మొదలయిన వాటివల్లను వీరికి కొంతవరకైనా సహాయం అందిందనే చెప్పాలి. అయితే ఈ సహాయం చాలదు. వీరి పునరావాసానికి ఇతర మార్గాలను అవశ్యం చూపాలి-ఇందుకు ప్రజలు ప్రభుత్వం కూడా తోడ్పడాల్సి వుంది.

బంజర్లను పంచి వాటిని వ్యవసాయయోగ్యంగా చేయుటకనువైన వివిధవ్యవసాయ పరికరాలను, పనిముట్లను, రసాయనికపుటెరువులను, గొట్టపు బావులద్వారాను, బుల్‌డోజర్ల ద్వారాను, భూములను, వసతులను ఇంకా తదితర అవకాశాలను చూపాలేగాని, సంఘజీవితాన్ని పాడుచేసే ఈ దుర్వ్యసనానికి, ఈపానపిశాచానికి రేషనింగ్ పెడతాం, చట్టాన్నే పెరికి పారేస్తామనడంలో అర్థం లేదు. మద్యనిషేధం ద్వారా సాంఘికాది ప్రయోజనాలు ఈనాడు కాకపోయిరనా క్రమక్రమంగానైనా తప్పక సిద్ధించగలవు. దీన్ని విమర్శించినవారు దీనివలన గ్రామ ప్రజాజీవితంలో ఏదోఒక కొత్త వెలుగు, ఒక కొత్త ఉత్సాహం కలుగుతోందని తెలుసుకోలేకపోతున్నారు. చట్టం సడలిపోయిందంటే అందుకు ఎవరు కారకులు? ఇందులో ఎవరెవరు సంఘద్రోహులు? చట్టాతిక్రమణవల్ల ప్రభుత్వ పటిష్ఠత బలహీన పడడమేకాక, స్వార్థపరులైన ప్రజలు కూడా ఇందుకు తోడ్పడడం జాతిదౌర్భాగ్యంకాక మరేమిటి? ప్రభుత్వానికైనా అసలు ఆత్మవిశ్వాసం అనేది కలుగజేయాలి. ఒకానొక



చట్టాన్ని పెట్టినపుడు దాన్ని సాధ్యమైనంతవరకు కష్టనిష్ఠురాలకు ఓర్చి అమలు జరిపితీరాలి. అందులో ఇటువంటి సామాజిక జీవితాభ్యున్నతికి దోహదమిచ్చే సంస్కరణలను తీసివేయడమంత హాస్యాస్పదమైన విషయంకంటె మరొకటి ఉండబోదు. మానవదౌర్బల్యాన్ని, చపలత్వాన్ని విసర్జించి అధిగమించే వాతావరణం కల్పించినప్పుడే ఈ పానపిశాచం తరిమికొట్టబడుతుంది. ఒకానొక దుర్వ్యసనానికి అసలు రేషనింగేమిటి? అసలు వ్యసనమనేదే చెడ్డది. అందులో రేషనింగువల్ల బ్లాకుమార్కెటులో వలె మద్యం మరింత ధారాళంగా చలామణీ అవుతుందేగాని తగ్గదు.

సమూలంగా పానపిశాచాన్ని పెకలించి, బీదసాదలను ఈ దుర్వ్యసనాన్నుంచి తప్పించి శాంతి సౌఖ్యాలను, ఆరోగ్య ఐశ్వర్యాలను అందజేయడమే ఆవశ్యకరణీయమైన విధానం. ఇందుకు తోడుగా వివిధ కాంగ్రెసు కమిటీలు వివిధ పార్టీలు, ఇతర ప్రజాహితైక సంస్థలు, ప్రభుత్వంతో సహకరించి మద్యనిషేధాన్ని విజయవంతం చేయగలందులకు మరొకసారి తీవ్రతరకృషి జరిపితీరాలి. ఈ బాధ్యత చాలవరకు ప్రభుత్వాధికార్లమీదను, ప్రలజమీదను కూడా ఉన్నది.

భారతదేశంలో మొదటిసారిగా, ఆంధ్రప్రభుత్వమే ఒకసారి ప్రజాహిత శ్రేయస్సుకోరి, అమలుజరిపిన మద్యనిషేధ చట్టాన్ని తొలగించి వైచిందనే చెడ్డపేరును తెప్పించుకోకుండా వుంటుందనే ఆశిద్దాం. అతిత్వరలో ఆంధ్రప్రభుత్వం సబబైన నిర్ణయం చేస్తుందని ఆశిద్దాం. సాస్వమీ సీతారాం తమ కఠోరదీక్షను విరమించి, ప్రభుత్వానికి ఈ సమస్యను శాంతియుతంగా పరిశీలించడానికి వ్యవధి నివ్వగలరని ఆశిద్దాం. స్వామి సీతారాం తమ అమూల్యజీవితాన్ని ఆంధ్ర ప్రజా శ్రేయస్సుకై వినియోగించేందుకు వారికి పూర్ణాయుష్షు చేకూర్చమని భగవంతుని ప్రార్థిద్దాం.

*** 19-3-1954**

**తెలుగు స్వతంత్ర**

# నవ్యాంధ్ర నిర్మాత : దివ్యస్మృతి

"ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైన,
భృవోర్మధ్యే ప్రాణ మావేశ్యసమ్యక్
సతం పరం పురుష ముపైతి దివ్యమ్"

పొట్టి శ్రీరాముల ఆత్మబలిదానంతో పదిహేనవ డిసంబరు 1952 ఆంధ్రదేశ చరిత్రలో నవశకం ప్రారంభమైంది. 58 రోజుల పాటు కఠోర దీక్షను సాగించి ఈ ఆదర్శమూర్తి పరమపదించారు.

ఆంధ్రప్రజలు నిస్సహాయతను సహించలేక, వారికి ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితేనే గాని దేశాభివృద్ధి కలగదనే దృఢ సంకల్పంతో ఏతదపూర్వలక్ష్యం కోసం పూర్ణాహుతులై స్వరాష్ట్రాన్ని మనకు సాధించిపెట్టిన నిస్వార్థ తపస్వి వీడి తృటిలో రెండేళ్ళు గడిచిపోయాయి.

ఇంతమంది ఆంధ్ర జీవన్నాయకులుండి కూడా ఈ మహాపురుషుణ్ణి మనం దక్కించుకోలేక పోవడమే కాకుండా నేడు మన రాష్ట్రాన్ని ప్రెసిడెంట్ హస్తగతం కూడా చేసేశాం. ఈవిధంగా మహామహుణ్ణి దక్కించుకోలేక పోయామంటే అందుకు గల ప్రబలాతిప్రబలమైన కారణాలు సూక్ష్మదృష్టికి తెలిసినవే. ముఖ్యంగా ఇందుకు మన నిస్సహాయతే కారణం. మనలో ఐకమత్యం లేకపోవడం -తదుపరి ఆంధ్రరాజకీయ రంగంలో ఏర్పడిన చీలికలు, కలతలు తద్వారా ఏర్పడిన అనైక్యతాయుత వాతావరణం, రాష్ట్రం కోసం అప్పటివరకు చేసిన విఫలయత్నాలు – వీటన్నిటికి పైన పీడిత సర్వజనాంధ్ర సముద్ధరణ – మొదలుగా గలవన్నీ సమకూడి, రూపందాల్చి శ్రీరాములు గారిలో రాసీభూతమై చివరకు ఆయన్ని సైతం పూర్ణాహుతి తీసుకుంది.

వీటికి తోడు పార్టీల నైతిక శక్తి , విచక్షణ విజ్ఞతల స్థాయి సన్నగిల్లింది. ఆంధ్రప్రజా నాయకులలో ఏదో ఒక లోటు, ప్రజాప్రతినిధులలో ఏదో ఒక మానసిక దౌర్బల్యం, ఏదో ఒక సంకుచితత్వం; ఏదో ఒక స్వార్థం, ఏదో ఒక ప్రాకులాట - ఇవన్నీ ఈ అపరిపూర్ణతలన్నీ సెగలు పొగలుగా రగిలి రగిలి ఒక్కసారిగా ఒక మహాజ్వాలయి తత్‌జ్వాలా జ్వలితకీలలు శ్రీపొట్టి శ్రీరాములుగారి ప్రాణాన్ని పొట్టను



పెట్టుకున్నాయ్. నిస్వార్థంతో మహత్తర త్యాగం చేసిన ధన్యజీవి అయారు శ్రీరాములు.

స్వర్గీయ శ్రీదేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, దేశోద్ధారక కళాప్రపూర్ణ శ్రీకాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, బయ్యా నరసింహశర్మ, మొదలయిన ఆంధ్రజాతీయోద్యమ పితామహుల పవిత్ర కృషి వల్ల ఆంధ్రరాష్ట్రోద్యమం అనే ఈ మహావృక్షం గత నలభైయేండ్లుగా వేళ్ళుతన్ని చిలవలతో పలవలతో పెరిగి పెద్దదై, జవసత్వాలను సంతరించుకొని చివరకు పొట్టిశ్రీరాములు గారి ప్రాణత్యాగంతో పూచి ఫలించింది. ఆయన పూర్ణాహుతితో జాగరితమైన ఆంధ్రజాతి నవ్యచైతన్యవిలసితమై అప్రతిహత పురోగమనంతో ఉరకలు వేసింది. ప్రజలది అది ఒక మహద్ఘోష. ఆంధ్రప్రజలు ఉత్సాహం, ఆవేశమై పట్టపగ్గాలు లేక పోయింది. ప్రబలమైన మన రాష్ట్ర వాంఛను ఇంకా ఎవరు అడ్డుపెట్టగలరు? జాతిపురోగమనాన్ని ఆపుటకు ఎవరి తరం? ప్రజాభీష్టానికి తల ఒగ్గిన శ్రీనెహ్రూ హుటాహుటి ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తక్షణ చర్యలు తీసుకొన్నారు. ఇన్నేళ్ళుగా కలలు కన్న ఆంధ్ర రాజ్యలక్ష్మీ స్వగృహ ప్రవేశం నట్టింటికొచ్చింది. – మందహాస వదనంతో. ఆనాడు యే ఇల్లు చూచినా పచ్చని తోరణాలే. దేశంలో ఎక్కడ చూచిన ఆనంద కోలాహలమే. ఆనాడు ప్రతి ఆంధ్రుని ముఖమూ కలకల్లాడుతూ సంతోషంతో వెల్లివిరిసింది. వేదఘోషలు మిన్నుముట్టాయి. కవులు కవితా కుసుమాలు చల్లారు. గాయకులు రాష్ట్రగానం చేశారు. దివికేగిన మన ఆంధ్ర పితామహులు ఆనందాశ్రువులు రాల్చి, ఆశీస్సులు కురిపించారు. సభలు సమావేశాలు జరిగాయి. మన భారత ప్రధానమంత్రి శ్రీనెహ్రూ ఆంధ్రలక్ష్మికి ప్రాణ ప్రతిష్ఠాపనోత్సవం చేశారు. సంరంభం ప్రతిధ్వనించింది. బ్రహ్మానంద సంభరితమైన ఆంధ్రమాత పూర్ణకుంభంతో తన బిడ్డలను చల్లగా చూడసాగింది. ఇంతలో ఎంతమార్పు? ఏమిటిదంతా? ఇదంతా ఆంధ్రజాతికి శ్రీపొట్టిశ్రీరాములు గారి బలిదానంతో పెట్టిన రాష్ట్రభిక్ష. భారతదేశంలో భాషా రాష్ట్రాలకు వెలుగు చూపిన అనన్య త్యాగశీలుని అకుంఠిత దీక్షా సంకల్పం.

ఈ మహనీయ త్యాగధనుడు మద్రాసు నగరంలో అన్నాపిళ్ళ వీధిలో 1901లో జన్మించారు. ఇక్కడనే విద్య నభ్యసించారు. తదుపరి రూ. 250 వచ్చే రైల్వే నౌఖరీని తృణీకరించి అప్పటికప్పుడే తీవ్రరూపం దాల్చిన అసహాయోద్యమం లోకి దూకారు. గాంధీజీవద్ద శిక్షణ పొందుతూ స్వరాజ్య సమరంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. 1938లో వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆగస్టు ఉద్యమంలో కారాగారవాసం

అనుభవించారు. అతి నిరాడంబరజీవి. హరిజన సేవకై వీరు చేసిన సేవ, కృషి అనన్యమైనవి. ఇటువంటి ప్రయోపవేశాలు వారికదివరకే కరతలామలకాలు. తన పేరుప్రతిష్టల కోసం ప్రాకులాడక కేవలం ప్రజాజీవితాభ్యున్నతికి కంకణం కట్టుకొని సేవచేస్తూ, బాపూజీ అడుగుజాడలలో తుచ తప్పకుండా నిర్మాణ కార్యక్రమ సేవాతత్పరులయారు. ఆంధ్రుల అభ్యున్నతి కోసమైతేనేం, ఆంధ్రదేశంలో గాంధీజీ ప్రతిపాదించిన నిర్మాణ కార్యక్రమ సక్రమ నిర్వహణకైతేనేం దేశంలో భిన్నాభిన్నమైన ఆంధ్రుల ఐకమత్య సాధనకోసమైతేనేం, ప్రత్యేక రాష్ట్ర సత్వర నిర్మాణావశ్యకతను గుర్తించి, ఈ లక్ష్యం కోసం ఆన ఆమరణ ప్రాయోపవేశం చేసి ఈ మహాదీక్ష కొనసాగిస్తూ మహా మహుడు వెళ్ళిపోయాడు. చిరస్మరణీయమైన వీరి మహాప్రస్థాన ఘట్టాన్ని ఈనాడు మనం జ్ఞప్తికి తెచ్చుకోవడమంటే ఆయనలో మూర్తీభవించిన ఆంధ్రజాతిని గౌరవించుకుంటున్నాం. జ్ఞప్తికి తెచ్చుకోవడమే కాదు, ఆయన పవిత్రలక్ష్యాలను కొనసాగించవలసిన గురుతర బాధ్యత ప్రతి ఆంధ్రుని మీద ఉన్నది. ఈయన పవిత్ర ఆత్మకు చిహ్నంగా స్మారక చిహ్నంగా ఇప్పటికైనా ఏర్పర్చాలి. మద్రాసులో ఆయన జన్మించిన స్థలాన్ని ఆంధ్రప్రభుత్వం కొని దానిని పవిత్రస్థలంగా ఏర్పాటుచేయాలి. ప్రజలు కూడా ముందుకు వచ్చి ధనాన్ని సేకరించి ఏదైనా ఒక చిహ్నం ఏర్పాటు చేయాలి.

రాష్ట్రం వచ్చింది. ఆనాడు ఆంధ్ర ప్రజానాయక శిఖామణి – ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు, పండుముదుసలి – ఆంధ్రుల గుండెకాయ– అతిక్లిష్ట రాజకీయ పరిస్థితులలో శ్రీనెహ్రూగారి చేయూతతో రాష్ట్ర సారధ్యాన్ని వహించి – హేమాహేమీలయిన మన నాయకులు ఆయనకు అండయై నిలవగా ఒక మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకుని పరిపాలన సాగించారు. శైశవావస్థలోనున్న ఆంధ్రశిశువు బాల్యారిష్టాలను నలుదిశలనుంచి ఎదుర్కొంటూ కాలప్రవాహపు కెదురీదుకుంటూ వచ్చింది. కానైతే నేటి ప్రజాస్వామిక శక్తులలో అనుశ్రుతంగా ఘనీభవించియున్న విభిన్న మనస్తత్త్వాల సంఘర్షణ వల్ల నైతేనేం మంత్రివర్గం చేజేతులా చేసుకున్న వివిధ కార్యకలాపాల బాగోగుల వల్ల నైతేనేం , పడిశ పారిపోయిన ప్రాంతీయ వ్యామోహం అనే మహాపిశాచం వికటాట్టహాసం వల్లనైతేనేం – ఏ తదితర కారణాంతరాల వల్లనైతేనేం రాష్ట్రం ఏర్పడిన పదమూడు నెలల్లోనే ఇవన్నీ చివరకు ఆంధ్ర అసెంబ్లీ ప్రతిపాదించిన అవిశ్వాస తీర్మానరూపం దాల్చి ఫలించడంతో



మంత్రివర్గం పతనమై రాష్ట్రపాలన ప్రెసిడెంట్ హస్తగతమై పోయింది. ప్రజాప్రతినిధుల నైతికశక్తికి ఇది తీరనికళంకం. ఇంతకీ పోయిందేమీ లేదు. వీరిస్థానే గవర్నరు పరిపాలన నిర్వహిస్తారు. అంతే.

చిత్రమేమిటంటే రాష్ట్రం ఏర్పడిననాడు ఆంధ్రరాజకీయ వాతావరణం ఏ స్థాయిలో వుందో ఈనాడు కూడా ఇంచుమించు అలాగే వుండవొచ్చు. ఎటొచ్చీ పెద్దలన్నట్లు శ్రీ ప్రకాశం, సాంబమూర్తి ప్రభృతులు తిరిగి ఈనాడు సుమారు 7 సంవత్సరాల అనంతరం కాంగ్రెసు సంస్థతో చేరడం ద్వారా, పరకాయ ప్రవేశం నుంచి స్వకాయ ప్రవేశం చేశారు. అంతే తేడా. మిగిలిన వారందరూ యధాతథంగానే వున్నారు. రేపు ఎటువంటి మార్పు వస్తుందో నిర్ణయించవలసిన బాధ్యత అశేషాంధ్ర ప్రజానీకం మీద వున్నది. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీనెహ్రూ రాగల ఎన్నికల సందర్భంలో ఆంధ్రప్రదేశ పర్యటన కూడా సంకల్పించారు. కాగా భవిష్యత్తు ఆశాజనకంగా ఉన్నా ప్రజలు జాగరూకులై వుండాలి. నూటికి నూరుపాళ్ళు ప్రజాప్రతినిధులనే, ప్రజాహితైషులనే ముఖ్యంగా – ప్రాంతీయ మనస్తత్వాలకుగాని, కులమత, వర్గవైషమ్యాలకుగాని , అతీతులైన వారినే ఎన్నుకొనడం ప్రజలవిద్యుక్తధర్మం, ఓటు అధికారం చేతిలో పెట్టుకొని సరియైన తీర్పు చెప్పాలి ప్రజలు. నిజాయితీ పరులనే ఎన్నికలకు నిలబెట్టవలసిన బాధ్యత ప్రజాస్వామిక పార్టీలమీద ఉన్నది అని కూడా ఆయాపార్టీలు గమనించాలి. ప్రజలు ఈ నాటికైనా తెలివి తెచ్చుకుని తమ ఓటు విలువను గుర్తించి, దృష్టి పథంలో ఉంచుకొని, ప్రజలను మోసపుచ్చి మభ్యపెట్టే ప్రతినిధుల కెవ్వరికీ రేపటి ఎన్నికలలో ఒక్క ఓటు కూడా వేయరాదు.

తన రక్తమాంసాలను ధారపోసి, ఏభయ్యొనిమిది రోజుల పర్యంతం, స్థిరచిత్తంతో, మృత్యుముఖ గహ్వరంలోకి పయనం కట్టిన ఈ అమరయశస్విని జ్ఞప్తికి తెచ్చుకుని, వారి ఆశయ సిద్ధాంతాలను మననం చేసుకుని మన రేపటికాబోయే నాయకులు కార్యోన్ముఖులవాలి. అప్పుడే స్వర్గీయ పొట్టిశ్రీరాములు గారికి ఆత్మసంతృప్తి, శాంతీని, ఆయన గావించిన నిస్వార్థసేవా త్యాగం ఫల ప్రదమవుతుంది.

**✱ 17-12-1954**

**తెలుగు స్వతంత్ర**



**శ్రీ ఇవటూరి కామేశ్వరరావు**

**జననం : 12.08.1923 లింగైక్యం : 13.10.2003**

పశ్చిమగోదావరి జిల్లా, నరసాపురం తాలూకా మినుమంచలిపాడు అగ్రహారంలో నైష్ఠిక లింగధారి నియోగి కుటుంబంలో వీరి జననం.

తండ్రి శివపూజాదురంధరులు, శ్రీ వీరేశలింగ భూషణరావు గారు, తల్లి సుందరమ్మగారు.

మదరాసులో వారి మేనమామ దగ్గర మెట్రిక్యులేషన్ వరకు చదువుకున్నారు. వీరు Directorate of Agriculture (Hyderabad) లో ఉద్యోగం చేసి పదవీవరణ చేసారు.

వీరికి తెలుగుసాహిత్యం పట్ల అభిరుచి, ప్రేరణ కలగడానికి వీరి మేనమామ గారైన **శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ** గారే కారణం.
(A great Epigraphical and Historical Research Scholar)

భారత్, పాకిస్తాన్, శ్రీలంకతో పాటు వివిధ దేశాల తపాల బిళ్ళల సేకరణ (Philatalist).

ఆత్మీయులు, బంధువులతో కలిసి వివిధ ప్రదేశాలలో ఛాయాచిత్రాలు (Photography) తీయడం వీరి అభిరుచులు.

ఇవటూరి కామేశ్వరరావు రచనలు

# ఇవటూరి కామేశ్వరరావు రచనలు

